అట్ట లోపలి వైపున అచ్చువేసిన శిల్పచిత్రంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిషికులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారత దేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనతమమైనది.

నాగార్జున కొండ క్రీ. శ. 3వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ, వారి సౌజన్యముతో).

# సింధీ సాహిత్య చరిత్ర

అంగ్ల మూలం :

ఎల్. హెచ్. అజ్వానీ

తెలుగు అనువాదం :

వాడ్రేవు పురుషోత్తం



సాహిత్య అకాడెమి

*Sindhi Sahitya Charitra* — Telugu translation by VADREVU PURUSHOTAM of History of Sindhi Literature, in English by L. H. Ajwani Sahitya Akademi, New Delhi (1994) Rs. 75/-


First Published : 1994
I S B N 81 - 7201 - 571 - 21

సాహిత్య అకాడెమీ

రవీంద్ర భవన్, 35, ఫిరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ–110 001.

'స్వాతి' మందిర మార్గ్, న్యూఢిల్లీ–110 001.

109, జె. సి. రోడ్, బెంగుళూరు–560 002.

గుణా బిల్డింగ్స్, 304, 305, అన్నాసాలై, తేనాంపేట, మద్రాసు–600 018.

జీవన తార భవనము, డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా–700 053.

172, ముంబయ్ మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్, బొంబయి–400 014.

**Rs. 75.**

ముద్రణ :

శ్రీ సేవా మందిర్ ప్రెస్, సాలిగ్రామం, మద్రాసు-93.

# ముందుమాట (ప్రథమ సంపుటి)

ఇది మూల గ్రంథమని గానీ, పరిశోధన గ్రంథమనిగానీ అనుకో నవసరం లేదు. ఇది సింధీ భాషను సాహిత్య చరిత్రను క్రమబద్ధంగా, ఆంగ్లంలో చెప్పడానికి చేసిన మొదటి ప్రయత్నం మాత్రమే.

అయితే మహమ్మద్ సిదిక్ మెమొన్ మొట్టమొదటి 'సింధీ సాహిత్య చరిత్ర,' లత్‌ఫల్లా బద్వీకి 'సింధీ పద్య వాఙ్మయ చరిత్ర' వ్రాసిన ఘనత దక్కుతుంది. కాని యీ రెండు గ్రంథాలు సింధీ భాషలోనే వున్నాయి; ప్రస్తుత గ్రంథానికి భిన్నంగానూ ఉన్నాయి. ఇతర కవుల గురించిపై రెండు గ్రంథాల నుండీ యీ రచయిత విస్తృతంగా సమాచారాన్ని గ్రహించినప్పటికీ, దృక్పథం మాత్రం స్వతంత్రమేనని మనవి. ఈ ఇద్దరు గ్రంథకర్తలకు ప్రస్తుత రచయిత ఋణపడి వున్నాడని ఎంత చెప్పినా తక్కువే అవుతుంది.

సాహిత్య ఎకాడమీ అధికారుల ప్రోత్సాహం, సలహా సంప్రదింపులు లేక పోయినట్లయితే యీ రచయిత ఈ చరిత్ర గ్రంథాన్ని పూర్తి చేయలేక పోయే వాడు. అందుకు వారందరికీ రచయిత ఎంతో కృతజ్ఞుడు.

ఆచార్య డి. కె. మాన్‌షర్మానీ తమ సింధీ వాఙ్మయ గ్రంథా లయాన్నంతటినీ యీ రచయితకు అందుబాటులో ఉంచారు. హిజ్రీ సంవత్సరా లను క్రీస్తు శక సంవత్సరాలకు మార్చేందుకు వీలైన సూత్రాన్ని కూడా వారే అందజేశారు. కె. ఆర్. భాటియా (Assistant Collector, Excise) తమ అముద్రిత గ్రంథం 'మధ్య యుగపు సింధ్‌ను' యీ గ్రంథకర్త ఉపయోగార్థం అందించారు. ఈ ఇద్దరు మిత్రులకూ గ్రంథకర్త ఎంతో ఋణపడి ఉన్నాడు.

ఈ చరిత్ర అనేక కష్టాల అవరోధాలమధ్య వ్రాయవలసి వచ్చింది. సింధుకూ సింధీ గ్రంథాలయాలకూ చాలా దూరంగా ఉండడం, ముదిమి వ్యాధి వంటివి ముఖ్యమైనవి. తమ పొరపాట్లను, తప్పులను యీ గ్రంథకర్త పూర్తిగా అవగాహన చేసుకున్నాడు. తానే యీ తరహా గ్రంథ రచనలో మొదటివాడని అడుగడుగునా స్ఫురింపచేస్తే అందుకు పాఠకులను మన్నించ ప్రార్థిస్తున్నాడు. ఒక దశాబ్దానికి పూర్వం 'సమకాలీన భారత సాహిత్యం' లో ఈ రచయిత వ్రాసిన వ్యాసాన్ని పాఠకులు సహృదయతతో స్వీకరించిన మీదట యీ చరిత్ర వ్రాయడానికి గ్రంథకర్తకు ఉత్తేజం కలిగింది.

—ఎల్. హెచ్. అజ్వానీ

# విషయసూచిక


| అధ్యాయం | | | పుట |
|---|---|---|---|
| 1. | సింధు, సింధీయులు | .... | 1 |
| 2. | సింధీ భాష, దాని ప్రాచీన చరిత్ర | .... | 11 |
| 3. | సింధీ సాహిత్యానికి సాధన సామగ్రి | .... | 23 |
| 4. | సూఫీ సిద్ధాంతం, సింధీ జీవన విధానం | .... | 53 |
| 5. | షాకు ముందున్న కవులు | .... | 66 |
| 6. | భిట్‌వాసి షా అబ్దుల్ లతీఫ్ | .... | 80 |
| 7. | షా రచించిన రిసాలో | .... | 109 |
| 8. | బ్రిటిష్ శకానికి పూర్వమున్న ఇతర కవులు | .... | 135 |
| 9. | సచల్ : విప్లవ కవి | .... | 145 |
| 10. | సమీ, వారి శ్లోకాలు | .... | 161 |
| 11. | ఆంగ్లేయుల కాలంలో పద్య వాఙ్మయం | .... | 174 |
| 12. | ఆంగ్లేయుల కాలంలో సింధీ వచన, నాటక సాహిత్యం | .... | 210 |
| | ఉదహరించిన గ్రంథాలు | .... | 264 |
| | కొన్ని ముఖ్య గ్రంథాల వివరణ పట్టిక | .... | 269 |
| | సూచిక | .... | 279 |

# 1

# సింధు - సింధీయులు

సింధురాష్ట్రం ఉత్తర అక్షాంశం 23°35'నకు. తూర్పు రేఖాంశాలు 28°31,' 67° నుండి 70° మధ్యభాగంలో ఉంది. భారత ఉపఖండంలో బాగా పశ్చిమదిశగా ఉన్న రాష్ట్రం. సింధునది లేక ఇండస్ నది (పంజాబుకు చెందిన అయిదునదుల నీటిని తనలో కలుపుకున్న తర్వాత) వల్ల ఏర్పడిన ఒండ్రుమన్ను మైదాన భూమి ఇది. ఆ మైదాన భూమికితోడు ఆ నది యొక్క డెల్టా కూడా అందులో చేరి ఉన్నది. పశ్చిమ దిశలోనున్న పర్వతశ్రేణి బలూచిస్థాన్‌కు సరిహద్దు. తూర్పుదిక్కుగా వ్యాపించిన ఎడారి రాజస్థాన్ నుండి వేరు చేస్తున్నది. కచ్‌కు, సింధుకు సరిహద్దుగా 'రాన్ ఆఫ్ కచ్' ఉత్తరదిశగా పంజాబ్ ఉన్నాయి. సాధారణంగా ఇండస్‌నది దిగువ లోయప్రాంతంగా దీన్ని పరిగణిస్తారు. ఈ నది సింధు రాష్ట్రాన్ని 360 మైళ్ల మేరకు మధ్యగా చీల్చుకుంటూ ప్రవహిస్తూంటుంది. ఈ రాష్ట్రవైశాల్యం 57,000 చదరపుమైళ్లు. సౌలభ్యంకోసం రాష్ట్రాన్ని మూడు భాగాలుగా చేశారు. 'శిరో' లేక శిరస్సు 'విచోళ' లేక మధ్య భాగం, 'లర్' లేక దిగువభాగం. ఇవిగాక దూరంగా ఉన్న ప్రాంతాలు రెండు - పశ్చిమంగా కొహిస్తాన్ (కొండప్రాంతం) తూర్పున రేగిస్తాన్ లేక థార్‌ఎడారి ఉన్నాయి.

ప్రాచీన కాలంలో సింధు రాష్ట్రం ఇంకా విశాలంగా వుండేది. ఉత్తరాన కాశ్మీర్, ఖండహార్ కనోజ్‌లవరకూ, దక్షిణాన సౌరాష్ట్రవరకూ విస్తరించి వుండేది. అక్కడి వ్యాపారస్థులు ఆనాటికి తెలిసిన ప్రపంచంలోని అన్నిప్రాంతాలకూ వెళ్లి వర్తకం చేసేవారు. సిరియా తీరప్రాంతంలో ఉండే ఫినీషియన్ వర్తకులను ఒకప్పుడు సింధీయుల సంతతివారేనని వర్ణించారు; వారికి సింధుతో చాలా సంబంధాలు వుండేవి. సింధువాసులకు మధ్య ఆసియాతో సుదీర్ఘమైన వ్యాపార సంబంధ బాంధవ్యాలున్నాయి. సముద్రయానం వంటి సాహసకృత్యాలు చేసే సాంప్రదాయమూ వుంది. ఈ నాడు కూడా సింధీ వ్యాపారస్థుల శాఖలు నాగరిక ప్రపంచంలోని చాలా ప్రాంతాలకు విస్తరించి ఉన్నాయి. ఈ రాకపోకల సన్నిహిత సాంగత్యాల ఫలితంగా భారతదేశంలోనూ ఇతర ప్రాంతాలలోనూ ప్రబలివున్న చాలా

ఆంక్షలు సింధీయులు పాటించరు. అస్పృశ్యత సింధీయులలో దాదాపుగా లేదనే చెప్పాలి.

సింధీయులకు అత్యంత ప్రేమ పాత్రమైన వాటిలో సింధునది ప్రధాన మైన స్థానం వహిస్తుంది. ఈజిప్టును నైలునది బహూకరించిన దనడం కన్నా సింధురాష్ట్రాన్ని సింధునది బహూకరించినదనడం ఇంకా సముచితంగా ఉంటుంది. సుమారు నలభైఏళ్లక్రితం హైదర్ బక్స్ జటోయ్ సింధు రాష్ట్రాన్ని ప్రశంసిస్తూ ఇలా అన్నారు. " 'దర్యాషా' అంటే ఆ గొప్పనది వుందిగనుక సింధురాష్ట్రం వుంది, ఆ గొప్ప నది లేకపోతే సింధురాష్ట్రం లేదు," అన్నారు ఆనందపారవశ్యంతో సింధునది గురించి. సింధీయుల జీవితంలో, సాహిత్యంలో ఈ మహానది ప్రేరణను భక్తి భావాన్ని అందిస్తుంది. ప్రాచీనకాలంలో దేవతామూర్తులపై ఉండేటంతటి భక్తిభావం సింధునది పైన కూడా ఉండేది. ఈనాడు కూడా అది అలాగే కొనసాగుతూ ఉంది. ఋగ్వేదంలో ఈవిధంగా చెప్పబడినది :-

త్యాగానికి ప్రత్యామ్నాయంగా కవి యిక్కడ వ్రాస్తున్న 'మీ విశిష్టము లైన మహిమలగురించి చెప్పనివ్వండి. ఆ సప్తనదులు మూడుదిక్కుల నుండి వచ్చాయి. వీటిలో సింధునది తక్కిన నదులన్నిటికన్నా మిన్న. ఉర్వతశ్రేణినుండి సాగరం దాకా వరుణుడు ఏర్పరచిన మెత్తని దోవగుండా పరకలు వేస్తూ, పరుగులు తీస్తూ నదులన్నిటిలోను మొదటి బహుమతిని అందుకోవాలన్న కోరికతో అన్నిటినీ అధిగమించి ఈనది ముందుకు, మునుముందుకు సాగింది. ధరాతలంపైన, స్వర్గలోకంలో కూడా యీ నదీ ప్రవాహఘోష వినబడుతున్నది. కాంతిపుంజాల తళుకులు మెరుపులు సువిశాలమైన దాని పరీవాహ ప్రాంతమంతటా మిలమిల మంటున్నాయి. మేఘాల నుండి ఉరుములతో పొంగుతూ వుండే వర్షపు నీటివలె ఆ సింధు నది పర్వతశ్రేణులనుండి శరభంలాగా చిందులు తొక్కుతూ సాగుతున్నది. తక్కిన నదులన్నీ తమ తమ జలాలను సింధునదిలో చేర్చడానికి పరుగులు తీస్తున్నాయి.

తనవెంట సేనానులు, ఆ వెనుక సైనికులు తనను అనుసరించగా ముందుకు సాగుతున్న విజేతయైన మహారాజులాగా నీవు రెండుప్రక్కల నుండి ఉపనదులను ఆకర్షిస్తున్నావు. ఓ గంగా, యమునా, సరస్వతీ, సట్లెజ్, రావీ, నీవుకూడా, ఓ అస్క్రీ, మరుద్వృధ ఆలకించండి ఓ విటస్త, సుషోమ సహిత అర్జికియా యీ నా ప్రశంసా వాక్యాలను వినండి. తళతళ మని, మిలమిలమని మెరపులవలె, మెరసి, అజేయమైన ప్రభావంతో

వాహినులన్నిటిలో అతి విస్తారమైన సింధునది తన జలములతో భూమండలముపై నర్తిస్తున్నది ; అందమైన కనులకింపైన చుక్కలగుఱ్ఱంలాగ.

ఉత్తమాశ్వములు పూన్చిన రథానికి రాణిలాగా, విలువైన దుస్తులతో బంగారు అలంకరణలతో విలసిల్లుతున్నది సింధునది. అధికంగా అహారాన్ని, పుష్కలంగా ఉన్నినీఇస్తున్నది. యౌవనంతో నాజూకుగా నడయాడుతూ, నేల నాలుగు చెరగులనూ మధుర సంభరితం చేస్తున్నది సింధునది.

ఝూలే లాల్ లేక హల్లేలుజీ అన్ననదీ దేవతకు సంబంధించిన మంత్రం, సింధీయుల మనస్సులను పూర్తిగా ఆకట్టుకుంది. ఝూలే లాల్ అనే పేరుతో ఒక చలనచిత్రం కుడా రూపొందించబడింది.

సింధియుల జీవన విధానంపైన, వారి సంస్కృతిపైన సింధునదీ ప్రభావం చాలా గాఢంగా ఉన్నది. ఈనదీ ప్రవాహ అస్థిర స్వభావంవల్ల సింధీ జీవన విధానం, నాగరికత కూడా అనిశ్చిత రూపంలోనే ఉన్నవి. తరచుగా అవి మార్పులకు గురి అవుతూ ఉన్నాయి. 'తరతరాల వెంబడి ఇండస్‌నది తన మార్గాన్ని తూర్పు లోయలో నుండి పడమరకు తోసు కుంటూ, క్రమంగా తీరాన్ని హరింపజేస్తూ ముందుకు పోవడంచేత నదీ తీరాన వుండే గ్రామాల పట్టణాల ఆనవాలైనా నిలవకుండా తుడిచిపెట్టుకు పోతూవుంది ; కాని కొన్ని సందర్భాలలో నదీప్రవాహం కొత్త మార్గాలలో ప్రవహించడంవల్ల అంతవరకూ సుభిక్షంగా సారవంతంగా వున్న విశాలమైన ప్రదేశాలు క్రమంగా బీడునేలలుగా మారిపోయాయి. అందువల్ల అక్కడి వారు తమ ఇళ్ళు ఆస్తులు వదలుకొని కొత్త నివాసస్థలాలు వెదుక్కుంటూ పోవలసివచ్చింది. సింధీయుల ఉనికిలోనూ జీవనవిధానంలోనూ ఏర్పడే యీ అనిశ్చిత తను గురించి పోస్టన్స్ యీ విధంగా వ్యాఖ్యానించారు. 'అలాంటి ప్రాంతాల భౌగోళిక పరిస్థితులు చాలా వింతగా ఉంటాయి. ఒకప్పుడు వ్యాపారపరంగా ప్రాముఖ్యత వున్న నగరాలు యిప్పుడు రాకపోకలకు వీలు పడని మార్గాలుగా తయారయ్యాయి. ఒకప్పుడు ఈనది ఎన్నో సదుపాయాలను అందజేసింది. అవన్నీ యిప్పుడు లేవు. ఆ సదవకాశాలన్నీ కోల్పోయాయి. ఒకనాడు సంపూర్ణ వ్యాపార కేంద్రాలుగా ప్రసిద్ధికెక్కిన రేవుపట్టణాలు యిప్పుడు శిధిలాలై నిర్జన ప్రదేశాలుగా మారిపోయాయి. కొంత భాగం సుక్షేత్రాలుగా మంచిపంటలు పండుతూ ఉండే పొలాలు కొద్దికాలంలోనే ఎడారులుగా మారిపోతూండేవి. సింధీయుల సహజగుణమైన సోమరితనం కారణంగా, వారు తమ నివాసాలను నదులకు ప్రక్కగా ఉండేలా ఎంచు

కుంటారు. అక్కడ జీవనోపాధి సులువుగా లభించినప్పటికీ వారు బాలా బాధలకు గురి అవుతూ వుంటారు. ఆ నదీమతల్లి ఆగ్రహానికి ఒక్కొక్క ఋతువులో మొత్తంగా గ్రామాలకు గ్రామాలే తుడిచి పెట్టుకుపోయే ప్రమాదం ఉంది.'

అకారణంగానే సింధుకు ప్రత్యామ్నాయ నామం మొహెర్ - జో - దరో గా స్థిరపడింది. 'మొహెర్ - జో - దరో' అంటే మరణించిన వారి దిబ్బలు. లర్కానాలో డొక్రీవద్ద త్రవ్వకాలలో బయటపడ్డ ప్రదేశాల పేరిది. 1920 ప్రాంతాలలో రాఖాల్‌దాస్ బెనర్జీ యీ త్రవ్వకాలు సాగించి, యీ శకానికి నాంది పలికే చారిత్రక విశేషాలను కనుగొన్నారు. దీనిప్రకారం సింధీయులు క్రీ. పూ. 3240 - 2750 మధ్యకాలంలో సుమర్ లేదా ఈజిప్టు నాగరికతకన్నా మించినదైన నాగరికతను కలిగి ఉండేవారని ఋజువయింది. అతి ప్రాచీనమైన స్థలమైనప్పటికీ, సింధునాగరికత స్వరూపం ఆ కాలంలో యిలా వుండేదని రేఖా మాత్రంగానైనా మనకు తెలియజెయ్యడానికి ఒక్క కట్టడంగాని కనీసం ఒక్క ప్రాచీన శిధిలసౌధంగాని ఇప్పుడు లేదు. ఆనాటి నాగరికతను గురించి ఇప్పుడు తెలుసుకోవాలంటే భూగర్భంలోంచి శిధిలాలను వెలికితీసి చూడవలసి వస్తోంది. సింధీ వాఙ్మయం యీ పాతాళపు మరపు మడతలలో అంతర్ధానమైపోయింది. క్రీ. శ. 16వ శతాబ్దపు పూర్వపు సాహిత్యచరిత్ర ఇలా ఉంటుంది, అన్న సూచనలుకూడా మనకి యీ త్రవ్వకాలలో దొరకవు. సిందు అంటే సింధు నది, లేకపోతే విశాలమైన ఇసుకపర్రలు, గుట్టలు, ఎడారీ. సింధు వాసులంటే నదిఒడ్డున వాసంచేసేవాళ్ళు, లేదా నావికులు, ఎడారి నివాసులు, ఒంటెలు నడిపేవారు. ఎడారిని ఛేదించుకుంటూ ప్రయాణంచేస్తూ, జీవించే వారు. ఒంటె - ఎడారి ఓడ - అన్న పదానికి ఉన్నన్ని పర్యాయ పదాలు సింధీ శబ్దకోశంలో మరేపదానికీ లేవు. అత్యుత్తమ సింధీ సాహిత్యంలో మిగిలివున్నది ఎడారి సంగీతం మాత్రమే అనడం కద్దు.

సింధీ జీవనవిధానం, అలవాట్లు వీటిలోని అనిశ్చితకు మరొక కారణం సింధీ చరిత్రయొక్క వింతస్వరూపం. భౌతిక, చారిత్రక పరిస్థితులు రెండూ కలిసి సింధీ జీవనవిధానాన్ని ఒక కొత్తమలుపు తిప్పాయి. ఒక అనిశ్చిత పరిస్థితిని తీసుకువచ్చాయి. సరిహద్దురాష్ట్రం కావడంచేత విదేశీ మూకలదాడులకు రాకపోకల తొక్కిళ్లకు సింధు - గురిఅవుతూ వచ్చింది. ఏ ఒక్క జాతి ప్రభావమూ స్థానికులమీద గాఢంగా ప్రసరించలేదు. సింధు చరిత్రలో అది ఒక పెద్ద ప్రశ్నగానే నిలిచిపోయింది. మొహెర్ - జో -

దరో కాలంనాడు సింధువాసులెవరో నిర్ధారణగా చెప్పడం కష్టమే. ఆర్యులు, ద్రవిడులు, కొండజాతులవారు. సితియనులు, గ్రీకులు, అరబ్బులు, యూరోపియన్లు, ఇరానియన్లు, తురానియన్లు, మంగోలులు, పఠానులు, వీరందరూ సింధును దాటివెళ్లినవారే. తమ రాకను సూచించే చిహ్నం ఏదో విడిచివెళ్లినవారే. ఒక్కొక్కప్పుడు భారత ద్వీపకల్పంనుంచి సింధుప్రాంతం వేరుగా మధ్యఆసియా ప్రాంతంలాగ విడిపోయి వుండేది. ఇప్పుడు సింధు పూర్తిగా పశ్చిమ పాకిస్తాన్‌లో అంతర్భాగం అయిపోయి 'సింధు' అన్నమాటే లుప్తమైపోయినట్లు తోస్తుంది. తరచుగా సింధుపైనా సింధీయులపైనా జరుగుతూవుండే చర్యల ప్రభావం వారి నడవడిక మీద గాఢంగా ప్రసరించింది. అది కారణంగా ఇప్పుడు ఊసరవెల్లిలాగ తయారయింది. ఇతరుల దుస్తులను, అలవాట్లను, ఆదర్శాలను అనుసరించే స్వభావం సింధీయులలో ఉన్నంతగా మరియే ఇతర ప్రాంత భారతీయులలోనూ లేదు. పొరుగునే వున్న పంజాబీలవలెకాక, వారి చరిత్ర మరోలాగ ఉంటుంది. సింధీలు తమపై దాడి జరిపిన వారిని, తమ భూగాగం ఆక్రమించుకున్న వారిని, అడ్డుకోడానికై ఎదిరించి నిలిచి పోరాడినట్లు నిదర్శనాలు లేవు. సింధీయుల అతిధి సత్కారాలు లోక ప్రసిద్ధం అయినప్పటికీ వారిని బాధలనుండి, దాడులనుండి ఇవి రక్షించ లేక పోయాయి.

అందుకు మారుగా ఎలాటి పరిస్థితులలోనూ తాము సర్వనాశనం కాని విధానాన్నీ వెంటనే కోలుకొనగలశక్తినీ తమలో పెంపొందించు కున్నారు. ఒక విశాలదృక్పథాన్ని అలవరచుకున్నారు. మతసహనం అలవరచుకున్నారు. ఇవి రెండూ వారిని స్వపక్షంలోని దురభిమానం నుండీ మతోన్మాదం నుండీ కాపాడాయి. సింధీయుల విషయంలో ఓగొప్ప సుగుణం యేమిటంటే వారు సూఫీ సిద్ధాంతాన్ని నమ్ముతారు. సూఫీ అంటే (La Kufi) అంటే 'ఎ మతమూ లేనివారు' అని అర్థం. పూజాది కర్మ కాండలలో ఎప్పుడూ అంతగా ప్రవేశంలేని సింధీయులు మానవునిలోను. ప్రకృతిలోను, భగవద్దర్శనానికై ప్రయత్నిస్తారు. వైవిధ్యంతో కూడిన 'కసత్' యీ ప్రపంచం వెనుక ఒక ఏకత (వాహదత్) ఉన్నదని వారి విశ్వాసం. అదే జీవిత పరమార్థంగా వారు భావిస్తారు. గోచర ప్రపంచం వెనుకకు, మాయతెర చీల్చుకుంటూ చొచ్చుకుపోతూ ఏకైక సత్యాన్ని చేరుకోవాలన్న గాఢమైన ఇచ్ఛ వారిలో ఉన్నది. ఈ దైవత్వాన్ని, సాధించ డానికీ, ఆత్మజ్ఞాన సాధనకూ వేరు వేరు మార్గాలు లేవు. ఒకే మార్గం అదీ క్రమశిక్షణ, ప్రేమ. వీటిద్వారా మాత్రమే అది సాధ్యపడుతుంది.

సింధీ గేయాలు చాలావరకు ప్రేమ ద్వారానే దైవత్వసాధన ప్రాప్తి జరుగుతుందన్న అంశంతో నిండి ఉంటాయి. సూఫీ సిద్ధాంతం ప్రకారం ఆధ్యాత్మిక ప్రేమ అందుకోడానికై దైహికమైన ప్రేమ ఒక వారధి లాటిది. గతకాలంలోనూ, ఇటీవలి కాలంలోనూ వారు ఎదుర్కొంటున్న అనేక కష్టసుఖాలను, సమస్యలను తట్టుకుని దృఢంగా నిలబడడానికి సింధీ హిందువులకూ, ముస్లిములకూ కూడా యీ సూఫీ సిద్ధాంతమే పట్టు కొమ్మగా నిలిచింది.

ఒకప్పుడు సారవంతమై, గొప్పనాగరికతతో వెలుగొందిన భూమి క్రమంగా వన్నె తరిగి బీడునేలగా, మరుభూమిగా మారింది. తిరిగి ఆంగ్లేయులు దానిని పునరుద్ధరించారు. ధనధాన్యాలతో తులతూగే ప్రదేశంగా మార్చారు. దానికో గౌరవాన్ని కల్పించారు. ఇదే యుగయుగాలుగా సింధు రాష్ట్రకథ. ఋగ్వేదం అంటుంది. 'సింధు చాలా సంపన్నమయినది. గుఱ్ఱాలు, రథాలు, వస్త్రాలు, సౌందర్యాలను విరజిమ్మే స్వర్ణాభరణాలు. నవ నవ లాడుతున్న ఉన్ని, వృక్ష సంపద సమృద్ధిగా ఉన్న దేశం- తేనెలూరే పూలు ధరించే శుభప్రదమైనది సింధు. 'దురదృష్టకరమైన లోయ' అని బర్టన్ ఒకప్పుడు ఈ సింధు ప్రాంతానికి పేరు పెట్టారు. చక్కని శీతోష్ణస్థితి సుందరమైన ప్రదేశం, సారవంతమైన మైదానాలతో, సౌభాగ్య సంపదలు చిప్పిల్లే నగరాలతో, సుందర వనాలతో నిండిన ప్రదేశాలు ఇరాంలోనివో లేక స్వర్గధామంలోనివో అనిపిస్తాయి. "సింధులోని మొహెర్ - జొ - దరొ నాగరికత 3250 క్రీ. పూ. - 2750 క్రీ. పూ." అన్న గ్రంథంలో సర్‌జాన్ మార్షల్ అనే సుప్రసిద్ధ రచయిత సింధులోయ నాగరికతను గురించి చెబుతూ "అది ఒక అద్భుతమైన నాగరికత. చాలా విషయాలలో ఈజిప్టు, మెసొపొటోమియాల ఔన్నత్యాన్ని సైతం మించి వుంది. ఇక్కడి నాగరికత ఒక విషయాన్ని మనకు స్పష్టంగాను, నిర్దుష్టంగాను చెబుతోంది." మొహెర్ - జొ - దరొ, హరప్ప : ఈ రెండు చోట్లా ఇప్పటివరకూ జరిగిన త్రవ్వకాలను బట్టి చూస్తే అది ఒక నూతన మైన, స్వతంత్రమైన నాగరికతగా గోచరించడం లేదు. యుగయుగాలుగా భారతీయ భూభాగంమీద విలసిల్లిన పురాతన నాగరికతతో ఇది పోలిఉంది. మానవుని శతాబ్దాల పరిశ్రమ ఫలితంగా పరిఢవిల్లిన విశిష్టమైన నాగరికతలాగా గోచరిస్తోంది, అన్నారు. మొహెర్ - జొ - దరొ త్రవ్వ కాలలో బయల్పడిన "సింధు లోయ నాగరికత" విభ్రమాన్ని కలుగచేస్తుంది. నిర్దుష్టమైన ప్రణాళికాబద్ధంగా ఆధునిక ఆరోగ్యపద్ధతులలో ఉన్న ఆనాటి వారి జీవన విధానమూ, నాగరికత మొదలైనవన్నీ పురావస్తు శాస్త్రజ్ఞులకూ చరిత్రకారులకూ ఆశ్చర్యాన్ని కలుగచేస్తున్నాయి. మొహెర్ - జొ - దరోలో

బయల్పడిన నాణెముల మీది చిత్రాక్షరాల అర్థాలను యిప్పటికీ మనం గుర్తించలేకపోవడం దురదృష్టం. ఐనా సింధుదేశం ఐదువేల ఏళ్లక్రితం నుండీ ప్రగతిశీలమైన అద్భుతమైన నాగరికతతో తులతూగుతూ ఉండేదని ఋజువుచెయ్యడానికి కావలసినన్ని సాక్ష్యాధారాలున్నాయి.

భారతదేశంలో వెలసిన రెండు గొప్ప గ్రంథాలు - రామాయణ మహాభారతాలలో సింధు ప్రాముఖ్యత అట్టే లేదు. అప్పటికే భారతీయ జనజీవన కేంద్రం సింధునదీ తీరాన్నించి గంగా యమునా తీరాలకు చేరుకుంది. అయినా సింధీయులు అందరితో కలసికట్టుగా ఉండేవారని, వారి గుఱ్ఱాలు ప్రశంసా పాత్రమైనవని చెప్పబడింది. మహా భారతంలోని సింధుదేశపు రాజు జయద్రథుడు. అతని బావమరది దుర్యోధనుని పక్షాన యుద్ధంలో పాల్గొన్నాడని, పాండవ వీరుడైన అర్జునుని చేతిలో మరణించాడని చెప్పబడి ఉన్నది. క్రీ. పూ. 512 లో సింధురాష్ట్రాన్ని హస్తగతం చేసుకున్న డారియస్. ది. గ్రేట్, అతనికి ముందు ఆశాపరుడైన పర్షియారాజు సైరస్. ది. గ్రేట్. (క్రీ. పూ. 558-530) వీరంతా సింధు దేశపు అశ్వసంపదకు, పశుసంపదకు, వస్త్రాలకు, పలుచని మస్లిన్ బట్టలకు ఆకర్షితులయ్యారు. సాలీనా సింధుదేశం పర్షియా ఆధిపత్యం క్రింద వున్న చిన్న రాజ్యాలలో అత్యధిక మొత్తంలో కప్పం 360 బంగారు నాణాలు చెల్లించేది. భూమార్గాన అలెగ్జాండరు మక్రాన్ మీదుగా బేబిలోన్ తిరిగి వెళ్లినప్పుడు సింధునుండే వెళ్లినప్పటికీ అతని రాకవలన యేప్రభావమూ స్థానికంగా కలుగలేదు. మౌర్యులకాలంలో వారి సామ్రాజ్యంలో సింధు ఒక భాగంగా వుండేది. తద్వారా బౌద్ధమతం సింధుదేశం ప్రవేశించింది. మౌర్యులు క్షీణించిన వెనుక బాక్ట్రియన్లు, గ్రీకులు, (యవనులు), పార్థియన్లు వీరందరికన్నా ముఖ్యులు శకులు లేక _ధియన్లు, సింధీయులలో ఎంతగా కలిసి పోయారంటే 'ఇండోసైథిక్' అయిపోయినంతగా కలసిపోయారు. అరబ్బులు వచ్చేదాకా, గుప్తులకాలం నుంచీ సింధు చాలా అభివృద్ధి చెంది, ముందుకు కొనసాగింది. Languages and Literatures of India అన్న పుస్తకంలో డాక్టర్ సునీతికుమార్ ఛటర్జీ 349, 50 పుటలలో యీ విధంగా అన్నారు. '8వ శతాబ్దం తొలిదశలో అరబ్బులు రాకముందు తక్కిన రాష్ట్రాలన్నిటి కంటే సింధు ముందంజవేస్తూ, వున్నట్లు తోస్తుంది.... ప్రాచీన సింధు ప్రజలు, శేషభారతీయ సామాన్య సాంస్కృతిక జీవనంలో పాల్గొనేవారు.... హిందూ నాగరికతకు దృష్టాంతాలు సింధు ప్రాంతపు ఉపరితలంలో దొరికే అవకాశం ఉంది. కాని దురదృష్టవశాత్తు మానవుని యొక్క, ప్రకృతి యొక్క విధ్వంసక చర్యలవల్ల అవి రూపుమాసి పోయాయి. అయినప్పటికీ సింధులోని బ్రాహ్మణ బౌద్ధసాంస్కృతిక స్థలాల

లోని త్రవ్వకాల నుండి వెలువడిన వస్తుసంచయాన్ని చూస్తే సింధీయులు ఎంత ఔన్నత్యానికి ఎదిగారో, ఎంత కళాత్మకతను సాధించారో చెప్పవచ్చు.

మహమ్మద్ బిన్ ఖాసిమ్ నాయకత్వాన క్రీ. శ. 772 లో అరబ్బులు సింధుపై దాడి జరిపారు. అప్పటి సింధీయులు మూఢనమ్మకాలతోనూ, కులాల తోనూ, సుఖలాలసులై ఉన్నారు. పిరికివారుగా తయారయ్యారు. మోకా బస్సాయియా వంటి దేశద్రోహులు దండెత్తి వచ్చిన శత్రువులకు త్రోవచూపించారు. అహంలో హసావంటి పిరికిపందలైన గవర్నర్లు 'అహింస' అన్న పేరున పిరికి ముసుగు వేసుకొని పోరాడకుండా వెన్నిచ్చారు. అరబ్బులు సింధును సులభంగా జయించి ఇస్లాంమతాన్ని సింధుకు (భారతదేశానికి) తీసుకువచ్చారు. వారిసైనికాధికారం కొద్దికాలమే నిలువ గలిగినా, సింధు ప్రాచీన సంస్కృతి మాత్రం పునాదులతో సహా కదిలిపోయింది. అదో పెద్ద గొడ్డలిపెట్టుగా అయింది. 713 నించీ 1843 వరకు సింధు మహమ్మదీయుల పాలనలోనే వుంది. మొదట అరబ్బులు, తరువాత సింధీలలోని రెండు తెగలవారు సుమ్రలు (1050-1350) తరువాత సమ్మలు (1350 -1520) అటు తరువాత పరిపాలించిన అర్ఘున్లు, తుర్ఖన్లు (1520-1590) ఔరంగజేబు మరణించే దాకా మొఘల్ చక్రవర్తులు పరిపాలించారు. ఆ తరువాత 1783 ప్రాంతాల వరకూ 'కల్హోరా' లు అనబడే ఒక భిక్షుక జాతివారు పాలించారు. ఆ దరిమిలా అరవైఏళ్ల పాటు బలోచ్ తల్‌పుర్ లేక మీర్‌ల పాలన గాక 1843 లో బ్రిటిష్‌పాలన మొదలయింది.

ఈ వెయ్యేళ్ల పైబడిన ముస్లింల పాలన సింధు ప్రాంతాన్నీ, సింధీయులనూ క్రమేపి క్షీణింపచేసింది. అరబ్బులు సింధుదేశాన్ని జయించినప్పటికీ వారు సింధీయుల వంటి నాగరికులు కారు. సింధీ వైద్యులను, మేధావులను అరబ్బులు బాగ్దాదు తీసుకు వెళ్లేవారు. సింధుపై అరబ్బులు విజయాన్నే సాధించారు. దాని తాలూకు సాంస్కృతిక ప్రభావం హెన్రీ సెన్స్ మాటల్లో క్లుప్తంగా ఇలా చెప్పవచ్చు. 'అరబ్బులు నాశనం చేశారు కాని నిర్మించలేదు'. అన్నారాయన. సింధుచరిత్రపై తమవ్యాఖ్యలో మహమ్మదీయుల పాలనాకాలం గురించి పోస్టన్స్ సరిగ్గా వ్యాఖ్యానించారు. 'ఆ కాలంలో సింధు చరిత్ర గురించి వ్యాఖ్యచేసేటప్పుడు ఒక అభిప్రాయం దానంతటఅదే ఏర్పడి తీరుతుంది - హిందువులు పాలకులుగా వున్నన్నాళ్లు సింధుదేశం సుసంపన్నంగా, ధనధాన్యాలతో తులతూగుతూ సువిశాలమై ఏకచ్ఛత్రాధిపత్యం క్రింద వున్నరాజ్యంగా ఉండేది. కాని అదే శత్రువుల వాతబడి దురాక్రమణలకు గురి అయినాక వారిలో వారు తమ అధిపత్యం

నిలబెట్టుకోడానికి నిత్యం పోరాడుకుంటూ వుండేవారు. అంతేగాని దేశాన్ని బాగుచెయ్యడానికి గాని, దేశంలో సుస్థిరాధికారం నెలకొల్పే ప్రయత్నాలు గాని చెయ్యలేదు. తత్ఫలితంగా ఒక సుబా (పరగణా) గా మాత్రం మిగిలి పోయింది. మహమ్మదీయులు జయించేనాటికి సింధు చాలా అభివృద్ధి చెందిన దేశంగా వెలుగొందుతున్న దనడానికి చరిత్రకారుల కథనమే సాక్ష్యం'.

మధ్యయుగపు సింధు అనగా పదహారవ శతాబ్దపు మొదటి పాతిక సంవత్సరాలకు పూర్వమున్న సింధు, భారతదేశంతో పూర్తి సంబంధం కోల్పోయినట్లు కనబడుతుంది. ఆ కాలంలోనే మహాభక్తులను, సమాధులను ఆరాధించే వివిధ శాఖలతో కూడిన ఇస్లాంమతం, పర్షియాదేశం నుండీ, పశ్చిమఆసియా ప్రాంతాల నుండీ వచ్చిన ఫలితంగా, సింధు ఆ ప్రభావానికి గురి అయి వుండవచ్చును. చనిపోయిన వారి గుట్టలకే కాక సమాధులకు కూడా అది ఆలవాలమయింది. అవును - నిజానికి నివాసయోగ్యమైన గుడిసెలు, ఇళ్లుకంటె సమాధుల, గోరీలసంఖ్య - సింధులో ఎక్కువగా వున్నాయి. చాలామంది హిందువులకు ఇస్లాంమతం నచ్చక పోయినప్పటికీ, అక్కడి సమాధుల కోసం, ఆ సమాధులలో ఉంచబడిన ధార్మిక పురుషులకోసం, స్వమత ధర్మాన్ని విడనాడడానికి కూడా వెనుకాడ లేదు. తమ 'భారతదేశ చరిత్ర' లో ఎలియట్ మధ్యయుగపు సింధుదేశంలో ఇస్లాం భిన్నమతావలంబకుల ఉనికి గురించి, హిందువుల మనసులపై వారి దుష్ప్రభావాలను గురించి ప్రస్తావించారు. "ఆ మహమ్మదీయ భిన్న మతావలంబకులు మహమ్మదు ప్రవక్తను దూషించడం; దేవతా మూర్తికి వారు వివిధమానవ రూపాలు ఇవ్వడం; వారి గురుతులు, భాషాచమత్కారాలు; తత్త్వజ్ఞానాన్ని వారు బాహాటమైనదిగాను, నిగూఢమైనదిగాను రెండు విధాలుగా విభజించిన తీరు, సంఖ్యలపట్ల వారికున్న ప్రీతి - ముఖ్యంగా ఏడు, పన్నెండు సంఖ్యలంటేగల గౌరవం; వివిధ స్థాయిలలో ఉపదేశాలను వారు అందించడం; నిగూఢాలైన వారి ఉదాహరణలు; కాల్పనికాలైన వారి అన్వయాలు; విశ్వమే దైవం అన్నవారి ఈశ్వరీయ జ్ఞాన తేజస్సు; ఇవన్నీ ఇదివరకటి నుంచే నమ్ముతూ వున్న వారి శిష్యుల విశ్వాసాలకు సరిగ్గా సరిపోతూ ఉండడంవల్ల యీ అనుకూలపద్ధతి అప్రత్యక్షమైన వైచిత్ర్యాన్ని ఆమోదింపచేయడానికి వారిని అట్టే బలవంత పెట్టవలసిన అవసరం లేకపోయింది".

పదహారవ శతాబ్దంలో, ముఖ్యంగా మొగలాయి సామ్రాజ్యంలో సింధు ఒక భాగంగా ఏర్పడిన తరువాత అది భారతీయ ప్రభావానికి గురి

కావడం మొదలయింది. ఆ కాలంలో ఉత్తర భారతదేశంలో బాగా ప్రచారంలో ఉన్న భక్తికవుల ఉద్యమం సింధీయుల మనస్సులను, ఊహలను ఆకట్టుకుంది. కబీర్, తులసీదాస్, మీరాబాయ్, సూర్‌దాస్ - ముఖ్యంగా గురునానక్, ఆయన తరువాత వచ్చిన సిక్కు గురువుల ప్రవచనాలు, అసంఖ్యాకులైన యోగుల, విరాగుల, సన్యాసుల బోధలు మొదలైనవన్నీ సింధీకవుల ఆలోచనాసరళిని, వారి రచనలనూ ప్రభావితం చేశాయి. భారతీయ భావధార పర్షియా, పశ్చిమఆసియా ప్రాంతాలనుంచి వచ్చిన విశ్రుంఖల భావుకులైన ఇస్లాంమత ప్రియుల ఆలోచనలు, వీటిరెండింటి సంయోజనం నుంచీ సింధి సూఫీతత్త్వం ఉద్భవించింది. ఇది సింధీజీవనంలోనూ, సాహిత్యంలోనూ ప్రధానాంశం. ఇదే ముఖ్యభూమికను ధరిస్తోంది. సింధీ సూఫీలలో అగ్రగణ్యుడైన షేక్‌కు చెందిన షాఇనాయత్‌ను చంపిన కల్లోరాల మతోన్మాదంగానీ, అవకాశం దొరికినప్పుడల్లా హిందూ ప్రజలను బలవంత పెట్టి ముస్లింలుగా మార్చడానికి ప్రయత్నించిన తల్పురుల మతోన్మాదంగానీ సూఫీతత్వ విజయ విహారాన్ని అరికట్టలేక పోయాయి. రాం, రహీంలు ఇద్దరూ ఒకటేననీ, భగవంతుని దివ్యతత్త్వం యొక్క సారాన్ని సాధించడానికి మానవుని ఆ మార్గంలో నడిపించడానికి ఏ ఒక్క జాతి, మతం అవసరం లేదనీ సూఫీయులు నమ్ముతారు.

1843 లో బ్రిటిష్ వారు సాధించిన విజయం నిజానికి దురాక్రమణే! కానీ నిరంకుశత్వం నుండీ దౌర్జన్యకాండనుండీ విముక్తికోసం సింధీయులు బ్రిటిష్‌పాలనను సంతోషంగా స్వీకరించారు. వెయ్యి సంవత్సరాలకు పైగా చీకటిలో చిక్కుకొని వెనుకబడిన తరువాత బ్రిటిష్ పాలనలో సారవంతంగాను, సుభిక్షంగాను, ప్రగతిపథంలో ముందుకు సాగుతున్న ప్రాంతంగా రూపొందింది. బ్రిటిష్‌రాజ్యానికి పూర్వం సింధురాష్ట్రంలో మూడవవంతు దేశభాగం పాలకుల వేటకోసం 'షికార్ గాహ్' గా భద్రపరచబడేది. ఇంగ్లాండు అంతటి విశాలమైన దేశంలోనూ సుమారు పదిలక్షల మంది ప్రజలు మాత్రం, దేశంలో అక్కడా అక్కడా చెదురు మదురుగా ఉండేవారు. బ్రిటిష్‌పాలనలో ముఖ్యంగా సుక్కూర్ ఆనకట్ట కట్టిన తరువాత సర్వ సమృద్ధి గల ప్రాంతంగా మారి ఎంతోమంది బయటివారిని ఆకర్షిస్తోంది. అల్పసంఖ్యాకులైన హిందువులు, నిరంకుశ హింసా ప్రభుత్వపాలన నుండి విముక్తి పొంది, భారతదేశంలో అత్యున్నత విద్యావంతులుగా తయారయి చాలా విద్యాసంస్థలను సంక్షేమ కేంద్రాలను స్థాపించారు. కాని సాంప్రదాయకంగా వారిలో వున్న దుర్బలత్వం, రాజకీయ హ్రస్వదృష్టి ఇవే సింధీయుల పతనానికి, మరొకసారి కారణభూతాలయ్యాయి. ముస్లింలీగ్‌కు

చెందిన విచ్ఛిన్నకరవాదులను సింధులో తమ ప్రధాన కార్యాలయాన్ని స్థాపించుకోవలసిందిగా సింధీయులు ఆహ్వానించారు. దేశంలో మహమ్మదీయులు హెచ్చుగా వున్న ఏ రాష్ట్రమూ ఇలాటి ఆహ్వానం వీరికి యివ్వలేదు. తత్ఫలితంగా మతకలహాలు చెలరేగాయి. హిందూ సింధీయులు మొట్టమొదట తమ రాష్ట్రంవదలి పారిపోయి భారతదేశంలోని ఇతర ప్రాంతాల్లో శరణార్థులుగా తలదాచుకోవలసి వచ్చింది. ఒక్క దశాబ్దకాలంలోనే మహమ్మదీయ సింధీయులు తమతలలు వంచి స్వతంత్ర జీవన విధానానికి స్వస్తి చెప్పాల్సివచ్చింది. సింధు, సింధీభాష, సింధుభూమి మీదా - అదేవిధంగా భారతంలోనూ - అటక మీదికి ఎక్కించాల్సిన పరిస్థితికి చేరుకుంది. భారతదేశంలో సింధీ ఒక ప్రధాన భారతీయ భాషగా, అంగీకరింపబడింది. దానికి ఉజ్జ్వల భవిష్యత్తు ఉందని ఆశింపబడుతోంది.

# 2

# సింధీ భాష, దాని ప్రాచీన చరిత్ర

సుమారు ఒకశతాబ్దం క్రింద డాక్టర్ ఇ. ట్రంప్‌గారు "సింధీ అక్షరమాల వ్యాకరణం" (Sindhi Alphabet and Grammar 1872) అన్న గ్రంథంలో సింధీ భాషను గురించి కూలంకషంగా పరిశీలించారు. తరువాత జరిగిన పరిశోధనల మూలంగా వారు చెప్పిన విషయాలు యీనాటికీ మార్పు లేకుండా నిలిచివున్నాయి." సింధీ ఒక శుద్ధమైన సంస్కృత జన్యమైన భాష. ఉత్తర భారతీయ భాషలన్నిటికంటె, అతి తక్కువ అన్యదేశ్యపదములున్న దేశీయభాష. ఆధునిక సింధీభాష ఉత్పత్తికి సరాసరి మూలమైన అపభ్రంశ భాషను ప్రాకృత భాషలన్నిటిలోను అతి అధమమైనదిగా ప్రాచీన వైయాకరణవేత్తలు గుర్తించడానికి బలమైన కారణాలు ఉన్నాయి. అయితే ఇప్పుడు వ్యాకరణపరమైన దృష్టితో పోలిస్తే సింధీని ఇతర సోదర భాషలన్నింటికన్నా ప్రథమస్థానంలో ఉంచక తప్పదు. ఈనాటి మరాఠీ, హిందీ, పంజాబీ, బెంగాలీ భాషలన్నిటినీ మించి, సింధీభాష ప్రాకృతానికి చాలా దగ్గర సంబంధం కలిగి వుండడమేకాక, ఈ భాషలన్నీ అసూయ చెందేటంతగా సింధీ భాషలో వ్యాకరణరూపాలు అత్యధికంగా పరిరక్షింపబడి ఉన్నాయి. ఇప్పటికే తక్కిన భారతీయ భాషలన్నీ శిథిలావస్థలో ఉన్నాయి. మాతృభాషా స్వరూపాన్ని గుర్తించడానికి వీలులేనంతగా యీ భాషలు శిథిలమయ్యాయి. ఐతే సింధీభాష మాత్రం ఇందుకు భిన్నంగా అతి ముఖ్యమైన భాషారూపాలను పరిరక్షించుకుంటూ, నియమాలతో బంధింప

బడకుండా సోదరభాషలకంటె ఎంతోమిన్నగా అంతరంగ శ్రావ్యత, ప్రయోగసౌందర్యమూ పెంపొందించుకుంటూ ఒక విశిష్ట వ్యాకరణరూపాన్ని నిర్మించుకున్నది.

"సింధీభాష ప్రాచీన ప్రాకృతికభాష తర్వాత శిథిలావస్థలోని ప్రథమ దశలో స్థిరంగా నిలచి ఉన్నది. కాని తక్కిన భాషలన్నీ అధోగతిపాలయ్యాయి. ప్రాకృత వ్యాకరణకర్త క్రమదీశ్వరుడు అపభ్రంశ భాషకు సంబంధించి రూపొందించిన సూత్రాలు ప్రస్తుత సింధీభాషలో ఇప్పటికీ కనబడుతున్నాయి. కాని తక్కిన భాషల విషయంలో అలా చెప్పటానికి వీలుగాలేదు. కనుక తక్కిన సోదరభాషలతోపాటు ఒకే ఉత్పత్తి స్థానంనుండి వచ్చినప్పటికీ, తక్కిన భాషలనుండి వస్తుతః వేరుగా ఉంటూ ఒక స్వతంత్ర భాషగా రూపొందింది."

ఇండో ఆర్యన్ భాషల (సంస్కృతానికి చెందినవి) బాహ్య ఉపశాఖలోనిదిగా సింధీభాషను గుర్తించి, పశ్చిమ పంజాబ్, సింధు కలసిన ఉత్తర పశ్చిమ సముదాయానికి చెందినదిగా లహన్డాతో చేర్చి సింధీభాషను గొప్ప భాషా శాస్త్రవేత్త సర్ జార్జ్ గ్రెయిర్ సన్ నిర్ణయించారు. ఈ భాషా సముదాయం ఉత్తర, పూర్వోత్తరాలతో దార్దిక భాషల ద్వారా సంబంధాలు ఉన్నట్లు చెప్పబడుతోంది. "పశ్చిమాన ఇరానియన్ పుష్తో ఉన్నది; దక్షిణాన అది అరేబియా సముద్రాన్ని కలుస్తున్నది. తూర్పున మాత్రం ఇతర ఇండోఆర్యన్ భాషలతో సంపర్కం కలిగి వున్నది. ఈ భాషలు ఉత్తరంనుండి దక్షిణానికి క్రమంగా పంజాబీ, రాజస్థాన్‌కు చెందిన మార్వాడీ వాడుకభాష, గుజరాతీభాషలు అంతరంగ ఉపశాఖకు చెందినవి. ఈ భూభాగమంతటా ఒకానొకప్పుడు దార్దిక భాషలు మాట్లాడుతూ ఉండేవారు. అందుచేత ఆ భాషా ప్రభావం సింధీ, లహన్డా భాషలపై కనబడుతుంది. దార్దిక వాడుకభాష ప్రభావం అంతగా ఉన్నప్పటికీ యీ రెండు భాషలూ నిశ్చయంగా బాహ్య భాషలే. తూర్పు బాహ్య భాషలతోగల సంబంధాన్ని సూచించే అంశాలు పంజాబీ, రాజస్థానీ భాషలలో లోపించి ఉన్నవి."

లహన్డా గురించి వర్ణిస్తూ అది దాదాపు దార్దిక భాషయేననీ, అయితే పశ్చిమ హిందీతో కలగలసి పోయినదనీ, పంజాబీభాష దార్దిక కలగలుపుతోనున్న పశ్చిమ హిందీ ఒక రూపమనీ, సర్ జార్జి గ్రెయిర్ సన్ అన్నారు. సింధీ భాష గురించి చెబుతూ 'ఇందుకు భిన్నంగా ప్రధానంగా పాక్షికంగా దార్దిక భాషల మౌలిక లక్షణాలన్నీ చాలావరకూ సింధీభాష

నిలుపుకోగలిగింది. తూర్పుదిశను పంజాబీకాక రాజస్థానీ ఉంది. అయినా తూర్పుదిశనే పశ్చిమ రాజపుటానా ఎడారి రూపంలో ఒక స్వభావ సిద్ధమైన అవరోధంగా ఉండటంచేత దండయాత్రలనుండి రక్షించబడింది. ఆధునిక లహన్డా పంజాబీతో తెలియనంతగా కలిసిపోతుండగా, సింధీభాష రాజస్థానీతో కలియడంలేదు. ఒక నిశ్చితరూపంలో దానినుండి వేరుగానే ఉంటున్నది. అతి ప్రాచీనకాలంనించీ ఉత్తర పశ్చిమాలకు చెందిన ఇండో ఆర్యన్ భాషలు మాట్లాడే ప్రాంతమంతా విదేశీ ప్రభావానికి గురి అవుతున్నప్పటికీ యీ బాహ్య, దార్దిక సమ్మిశితమైన వాడుక భాష ప్రభావం ఈ భాషలపై అతి తక్కువగా ఉండడం ఆశ్చర్యమే. ఒక్క ముసల్మానుల ఆధిక్యతలో మాత్రమే భాషాపదజాలంలో పర్షియన్ [అరబీతోసహా] మాటలు చొప్పుకున్నాయి.

సింధీభాష పూర్వచరిత్ర గురించి చెబుతూ గ్రెయిర్ సన్ యీవిధంగా అన్నారు. "సింధీభాషకు అతిసన్నిహితంగా వున్న పూర్వభాష వ్రచ్చద మన బడే అపభ్రంశ ప్రాకృతం. దీనిని గురించి భారతీయ వ్యాకరణ కర్త మార్కండేయుడు కొన్ని వివరాలను అందించారు. అంతేకాకుండా ఆ ప్రాంతాలలో వ్రచ్చద ప్రాకృతభాష ప్రధానంగా వాడుకలోనున్నదనీ ఈ ప్రాకృతభాషకు ప్రధానరూపం దేశీయపైశాచి అనీ వక్కాణించారు. ఈనాటి దార్దుల పూర్వీకులకు వాడుకభాష అయిన పైశాచి ఈ ప్రాంతాలలో ఒకప్పుడు మాట్లాడేవారు, అన్న సాక్ష్యాన్నిబట్టి ఉత్తర పశ్చిమాలకు చెందిన భాషలపై దార్దిక ప్రభావం ఉన్నది అని తెలియవస్తున్నది." సింధీభాషలో చాలా తక్కువ సంఖ్యలో గ్రంథాలు వ్రాయబడ్డాయనీ లహన్డా అక్షరమాలయే సింధీభాషకు సరియైనదనీ అయినా గురుముఖీ నాగరీ అక్షరమాల కూడా వినియోగిస్తారనీ, ఇప్పుడు పర్షియన్ అక్షరమాల వాడుకలో ఉన్నదనీ గ్రెయిర్ సన్ అంటారు. అంటే సింధుదేశంలో ఆంగ్లేయుల పాలనాకాలంలో వందసంవత్సరాల క్రిందట వారి ఆదేశానుసారం అరబిక్ సింధి లిపి రూపొందించబడిందనీ వారి అభిప్రాయం.

తక్కిన భాషలన్నింటిలోను లుప్తమైపోయిన శబ్ద సంబంధమైన, వ్యాకరణ సంబంధమైన అనేక అసామాన్య లక్షణాలు సింధీభాషలో పరిరక్షింపబడ్డాయనీ, బాహ్యాభాషలకు సింధీ ఉదహరణాత్మక మైనదనీ గ్రెయిర్ సన్ పేర్కొన్నారు. 'ప్రాచీనకాలంలో వ్రచ్చద దేశంకూడా సింధులో భాగంగానే ఉండేది. వ్రచ్చద అపభ్రంశనుండి ఉత్పత్తి అయినసింధీ భాష వందల సంవత్సరాల క్రిందట, ప్రాచీన అపభ్రంశ భాషలో స్వాభా వికంగా ఉండవలసిన లక్షణాలుగా గుర్తించినవి ఈనాటికీ సింధీ భాషలో

నిలిచి ఉన్నాయి.' కాని అధస్సూచిలో సింధీ భాషపైశాచి లేదా దార్దిక భాషల నుండి రూపొందినదిగా తాము ఎంతమాత్రమూ చెప్పడంలేదనీ, పైశాచీయులు సింధువాసులు కారని, వారు విదేశీయులనీ గ్రెయిర్ సన్ దృఢంగా చెప్పారు.

జాన్ బీమ్స్ సింధీభాషను గురించి ఒక విషయం ఒప్పుకొనక తప్పలేదు. 'అది ఒక క్లిష్టమైనభాష. దానికి కంటక మార్గాలు ఉన్నాయి గట్ల వెంబడిపూచే వన్య కుసుమాలలో ఉండే మనోహరత్వం, పూలతోటలలో క్రమబద్ధంగా కనబడే శోభకంటే, విచ్చలవిడిగా పెరిగే యీ పూవుల విశృంఖలత, అందం, ఆ భాషలో ఉన్నాయి - అని నాకు తోస్తున్నది. అతి ప్రాచీనకాలంనుండీ సింధులోయలో మాట్లాడే భాష అన్ని రకాలైన సంకెళ్ళ నుండీ విడివడి సూత్రాభాష్యాలకు కట్టుబడి వుండే డాంబిక పండిత ప్రకాండుల నుండి అపభ్రంశ అనే గుణవాచకాన్నికూడా పొందింది. పంజాబీ, సింధీ భాషలలో ఒకవిధమైన గోధుమ పిండివాసనల కమ్మదనం, గుడిసెల నుండి వెలువడే పొగవాసనల కమ్మదనమూ ఉన్నాయి. శాస్త్రబద్ధమై పండితుల బంధాలలో చిక్కుకున్న భారతదేశపు తూర్పుప్రాంతాల భాషలు ప్రదర్శించే దానికంటె, వీటిలో అపారమైన సహజ సౌందర్యము, మనసును ఆకర్షించే గుణమూ ఉన్నాయి. సింధుదేశాన్ని 'అశాంతిలోయ' గానే భావిస్తూవచ్చిన బర్టన్ 1851లో యీవిధంగా ఒప్పుకొనక తప్పలేదు. 'సింధీభాషలో సాహిత్య సంపద గురించి ప్రస్తావించవలసి వస్తే, మనం ఆదేశాన్ని స్వాధీనం చేసుకున్న నాటికి మరి ఏ ఇతర దేశీయభాషలలోను సింధీలో కంటే హెచ్చు సాహిత్యంలేదు. అతి తక్కువ భాషలలో మాత్రమే సింధిభాషతో సమమైన స్థాయిలో మూల రచనలు ఉన్నాయి,' అని చెబుతూ ఇంకా ఇలా అన్నారు. "సింధీ వచన వాఙ్మయం కంటె పద్య వాఙ్మయం వైవిధ్యంతోకూడి మహత్వపూర్వకమై ఉన్నది. మరాఠీగాని, హిందీ, బ్రజభాషలలోని మూలరచనలకుగానీ ప్రాధాన్యతలో తీసిపోదు."

భారతదేశ విభజన అనంతరం సింధీభాష యొక్క ప్రాచీనతను గురించి చాలా వివాదాలు జరిగాయి. సింధీభాష నిజంగా సంస్కృతం యొక్క రూపమైన వ్రచ్చద అపభ్రంశ ప్రాకృతమునుండి పుట్టినదా అని ప్రశ్నించడమూ జరిగింది. సంస్కృతం లేని, వేదాలు లేని, కాలంలో సింధీ అనే భాష ఒకటి వుండేది. అన్న ఊహకారణంగా ఈ సందేహం ఉత్పన్న మయింది. మొహెన్-జొ-దరోలో నివసించే ప్రజలకాలానికి వందల సంవత్స రాల తరువాతనే ఆర్యులు భారతదేశం ప్రవేశించారనీ, వేదాలు ఐదువేల

సంవత్సరాల నాటి సింధులోయ నాగరికతకు తరువాతవేననీ వాదిస్తారు. సింధీభాషకు ప్రత్యేకంగా ఉన్ననాలుగు అక్షరాలను, ఇతర భాషలతో అంతమయ్యేమాటలు సింధీభాషలో 'ర'తో అంతం అవడం, యిలాటివే మరికొన్ని కారణాలు చూపికొందరు పండితులు సింధీభాష సంస్కృతం కన్నముందు పుట్టినదనీ, సంస్కృతంనుండి ఉత్పత్తికాలేదనీ, సంస్కృతం కంటే పూర్వం ఉండినభాష అనీ తొందరపడి నిర్ణయానికి వచ్చారు. మరి కొందరు ఒకేభాషనుండి పుట్టిన తరువాతది కానప్పటికీ, సంస్కృతం సింధీ నుండి పుట్టినదనవచ్చును - అంటారు! ఇంతకంటె అసత్యం వేరేవుండదు. సింధీభాష ఒకసెమెటిక్‌భాష అనడం, లేదా సెమెటిక్‌భాష నుండి పుట్టినది సింధీభాష అనడం యీ అసంగతానికి పరాకాష్ఠ.

సింధీభాష ప్రాకృత సంస్కృతభాష యొక్కవ్రచ్చద అపభ్రంశము నుండి పుట్టినది అన్నవాదనను ప్రతిఘటిస్తూ శ్రీజయరాందాస్ దౌలత్‌రాం వంటివారు కూడా సందేహంతోనే వ్యవహరిస్తున్నారు. 'ఎన్‌సిస్ట్రీ ఆఫ్ సింధీ' (Ancestry of Sindhi) (1957) అన్నపేరున జయరాందాస్ దౌలత్ రాం, మార్కండేయుడు ప్రాకృత సర్వస్వం 18వ భాగంలో చెప్పిన 'వ్రచ్చద అపభ్రంశం సింధుదేశంలోనే పుట్టినది' అన్నవిషయాన్ని పరిశీలిస్తూ దానిని శంకించడానికి గలకారణాలను ఉటంకించుతూ, ఇలా ప్రశ్నించారు. 'సింధీ అని పిలువబడుతూ మనకు తెలిసినభాష వ్రచ్చద అపభ్రంశంనుండి పుట్టినదికాక దిగువసింధులోయలో ప్రచారంలోనున్న ప్రాకృతం యొక్క స్థానిక స్వతంత్రస్వరూపంగా, దానికేంద్రం బ్రాహ్మణకంగా, అంటే అరబ్, పర్షియన్ చరిత్రకారులు గుర్తించిన బ్రాహ్మణాబాద్‌గా జీవించి ప్రచారంలో ఉన్న భాషయేమో. ఇండో ఆర్యన్‌భాషల పరిణామగతి .... పైన పేర్కొన్న అభిప్రాయాన్ని బలపరుస్తూ, సింధులోయవాసులు మాట్లాడుతూ ఉండిన వేదకాలపు పూర్వప్రాకృతానికి ప్రాచీనరూపాంతరం అయివుండ వచ్చునని సూచన. అది అభివృద్ధి చెందుతూ రెండవశ్రేణి ప్రాకృతం యొక్క అవస్థగా పూర్వసింధీ అవతరించి ఉండవచ్చును. పండితులు విద్యావంతుల మధ్య ప్రచారంలో సంస్కృతం ఉండివున్న సమయంలో వ్రచ్చదరూపంలో అంతర్ప్రాంతీయ సారస్వత నాగర అపభ్రంశభాష కూడా తనవైవిధ్యరూపాన్ని ప్రచారంలో ఉంచినప్పుడు, ప్రస్తుత సింధు ప్రాంతంలో ఎక్కడో ఉత్తరానసింధీ ప్రాకృతంకూడా ఏకకాలమందే వికసిస్తూ దిగువసింధులోయ ముఖ్యప్రదేశాలలో మధ్యకాలపు సింధీగా ఒక నిర్దుష్ట వ్యావహారిక, సాహిత్యభాషగా స్వతంత్ర పరిణామం పొందుతూ రూపొంది ప్రాచీనకాలపు సింధీభాషకు, అపభ్రంశకాలం తరువాతి అధునిక భాషకు

భిన్నంగా క్రీస్తుశకంలో మొదటి వేయిసంవత్సరాల చివరిదశలో వికసిల్లిన దేమో ? ప్రస్తుతసింధీ ప్రాంతవాసుల స్థానిక వాడుకజభాష వ్రచ్చద కాదా ? ఉత్తర, ఉత్తర పశ్చిమ ప్రాంతప్రజల రాజకీయ, సామాజిక, సాంస్కృతిక ప్రాబల్యం సింధుదేశంపై ఉండటం వల్లను, వ్రచ్చదభాష ప్రభావంవల్లను ఆభాషనుండి కొన్నిమాటలు, ఉచ్చారణ ప్రత్యేకతలు ఉత్తరానఉన్న ఒక భాషలో చోటుచేసుకొని, ప్రస్తుత సింధీభాషకు నూతనవర్ణం ఆపాదించి ఉండవచ్చునా ? 'వేదకాలమునకు ముందటి ప్రాకృతము' అన్నమాటలు చేర్చడంవలన వారి వాదమంతా దుర్బలమయి పోయింది. కాని జయ రాందాస్ దౌలత్‌రాంగారి సందేహాలు న్యాయసమ్మతమైనవే కావచ్చు. వేద కాలమునకు పూర్వం ప్రాకృత మన్నదేలేదు. సింధులోనున్న భాషలన్నీలేక ప్రాకృతభాషలన్నీ, మొహెన్ - జొ - దరోకాలం నాటివీ, దానికిముందటివీ అన్నీవేదకాలానికి పూర్వమున్న ప్రాకృతములే. జయరాందాస్ దౌలత్‌రాం గారి వాదనపూర్తిగా అంగీకరించినప్పటికీ దానిఫలితం అపభ్రంశ ప్రాకృత సంస్కృతానికి పూర్వం 'వ్రచద' లేక వ్రచ్చద అన్నపదం తీసివేయడం మాత్రమే అవుతుంది. అంటే అన్యాయంగా సింధీభాషకు మూలంలేదా సింధీభాష పుట్టడానికి మూలస్థానం అని అంగీకరించడమే అవుతుంది. జయరాందాస్ దౌలత్‌రాంగారి వాదనను ప్రతిఘటిస్తూ సింధీభాష దిగువ సింధులోయలో పుట్టి అభివృద్ధిచెందిన దేశీయభాష అన్న ప్రతివాదనచేసి నిలబడ్డవారు సింధు విశ్వవిద్యాలయ, సింధీభాగం ముఖ్యాధికారి డా.॥ నబబిక్స్ బాలోక్. ఇది మిహ్రాన్‌లోనూ, 'ప్రాచీనకాలం నుండి సమస్‌ల వరకూ సింధీభాష చరిత్ర' (1962) History of Sindhi Language from Ancient Times to the times of the Samas (1962) అన్న గ్రంధంలో వారు వ్రాశారు. మార్కండేయులు, వ్రచ్చద అపభ్రంశభాష సింధుదేశంలో పుట్టినది (పుట16) అని చెప్పినది జయరాందాస్ దౌలత్‌రాం గారితో పాటు ఖండిస్తూ 'వేదకాలానికి పూర్వం అనడానికి మారుగా అపభ్రంశానికి మూలస్థానం ఆదిప్రాకృతమని వారు వాడారు. అంతేకాక సింధుదేశపు ప్రాచీనభాష నిశ్చయంగా ఒక సెమిటిక్ భాష అనీ, తరువాత కాలంలో ఆర్యభాషల ప్రభావానికి అదిగురిఅయిందనీ ఎలాంటి కారణాలూ చూపకుండానే వారు ఊహాగానం చేశారు.

ఇంకా వారిలా అభిప్రాయపడ్డారు. ప్రాచీన సింధీభాష ఇరానియన్ దార్దిక భాషల వల్లనే ఎక్కువగా ప్రభావితమయిందనీ అంటారు. మరు క్షణం సంస్కృతంనుండి వెలువడిన పాలీ ప్రాకృతము వల్ల ప్రభావిత మయిందనీ అంటారు. సింధీభాష సంస్కృతం నుండి పుట్టినదన్న

నమ్మికను వారు ఖండించారు. సంస్కృతంమీద పాశ్చాత్యభాషా వేత్తలకు ఉన్న పక్షపాత వైఖరియే యీనమ్మికకు కారణం అంటారు. అవెంటనే సింధుగురించి వ్రాసిన హిందూరచయితలే కారణం అంటారు. సింధుదేశంలోని మొట్టమొదట నివసించినవారు పశ్చిమమునుండి వచ్చినవారేననీ వారి నాగరికతయే ఉచ్చస్థాయికిచేరి మొహెన్ - జొ- దరో నాగరికతగా వెలసిందనీ, ఈ నాగరికత యూఫ్రేటిస్, టైగ్రిస్ నదీతీరాలపై విలసిల్లిన సుమర్, బాబిలోన్ నాగరికతలనుండి పొందినదేననీ వారు అభిప్రాయపడ్డారు.

ఆతరువాత వారు, ఓడించి నిస్సారవంతంగా చేసిన సింధీయుల కంటే అరబ్బులు అతి అధమమైన స్థాయిలో ఉన్నారనీ, ఏది ఏమైనా, అరబ్బుల 'వినాశనము' నే ఎరుగుదురు గాని, 'నిర్మాణము' ఎలా చేయాలో తెలియని వారు అన్నసత్యాలను కనుమరుగుచేసి సింధీయుల నాగరికత, సంస్కృతులకు అరబ్బులే కారకులనీ అంటారు. ఐదింట నాలువంతులు సింధీభాషలోని మాటల ప్రాతిపదిక శబ్దాలు సంస్కృతములోనివే అని అంగీకరించిన జమత్ మల్ నరుమల్, డా. హెచ్. ఎం. గుర్బక్సానీ లేక అబ్దుల్‌కరీం సండెలో వంటి వ్యక్తుల పరిశోధనలను డా. నబిబక్స్ లక్ష్యపెట్టలేదు. దేశవిభజనానంతరం కొందరు మహమ్మదీయులు వారిమతాను క్రమంలోనో వారియొక్క పుత్రుడో పౌత్రుడో ఉండినట్లూ, వారి వంశచరిత్ర ఏదో సెమెట్‌కు చెందినదనీ చెప్పుకోవడం ఒక అలవాటుగా పరిణమించింది. అందుచేత సింధీభాష ఉత్పత్తికి మూలమేదో సెమెటిక్ లేక పశ్చిమాసియా స్థానాన్ని వారు వెదకడంలో ఆశ్చర్యంలేదు.

కాని, కారణరహితమైన ఊహాగానాలు, చరిత్రను వక్రీకరించడానికి ప్రయత్నించడం వంటిది యీ వాదం ; మహమ్మదీయులలో కూడా అందరికీ సమ్మతం కాదు. సిరాజ్ - ఉల్ - హక్ సింధు ముస్లిం యువకుడు విద్యావంతుడైన నబీబక్స్ బలోక్‌ను, వారి విజ్ఞతను గుర్తిస్తూ ఇటీవల వెలువడిన 'సింధీబోలీ' 1964 (Sindhi Boli) అనే వారి గ్రంథంలో డా॥ నబీ బక్స్‌బలోక్ వెలువరచిన అభిప్రాయాలను ఖండించారు. సింధుదేశం, ప్రజలు, వారి భాషపై వారికి ఉన్న మక్కువ కొద్దీ సీరాజ్ అరబిక్, సంస్కృతం యీ భాషలు సింధీకి గాని, వారి సంస్కృతికి గాని చెప్పుకోతగినది ఏదీ చెయ్యలేదని చెప్పారు. వారి పరిశోధనా వ్యాసంలోని అంశం (ఉపోద్ఘాతంలో వారు చెప్పినట్లు) 'సింధీ చరిత్ర సంస్కృతం కంటె చాలా ప్రాచీనమైనది. ఒకవిధంగా సంస్కృతం, దానికి సంబంధించిన నాగరికత లేదా సంస్కృతి ఇవి సింధునుండి, సింధీ భాష నుండి పొందినవే ....

సంస్కృతానికీ సింధీకి సంబంధాలు ఉన్నాయి. కాని అందరూ అనుకుంటున్నట్లు మాత్రం కాదు. నిజానికి అది సరిగ్గా వ్యతిరేకం (ఇప్పుడున్న భావాలకు). సింధీభాష కొన్ని శబ్దాలకు సంస్కృతానికి ఋణపడి వున్నట్లయితే సంస్కృతం ఎన్నోరెట్లు సింధీకి ఋణపడి వుండాలి. సరాసరి కాకపోయినా, వేరుమార్గం లోనైనా సింధీ నుండి సంస్కృతం పుట్టినది.'

ఈ పరిశోధన సందర్భంగా డా॥ నబీబక్స్బలోక్ గారి 'అరబ్బీ అచ్చులు, వ్యాకరణ సూత్రాలు వీటి నుండి సింధీభాష వ్యుత్పత్తి చెందింది' అన్న వాదనలు అర్థంలేనివని తన సహపరిశోధకులు మహమ్మద్ ఇబ్రహిం చోయోతో సహా ఖండించారు. అరబిక్ సౌధాన్ని బలవంతంగా కూలదోయడానికి ఒక సింధీ మహమ్మదీయునకు చాలా ధైర్యం కావాలి. అరబ్‌లకు, అరబ్‌భాషకు వ్యతిరేకంగా సింధు దేశ నాగరికులుగా, ఆధునిక సింధీ, సంస్కృతము అంతేకాక అన్ని ఇండో పాకిస్తాన్ భాషలు, దానిని సింధీ అనిగాని, సింధీ లాంటిదే అనిగాని, ఇండిక్ లాంటిది అని గాని అది సింధు లోయలో పుట్టి అక్కడి నుండి భారతదేశంలో వివిధ ప్రాంతాలకూ, పాకిస్తాన్‌కు, ఇతర విదేశాలకూ వెళ్లిన ఒకే ప్రాచీనభాష నుండి పుట్టాయనీ చెప్పడానికి ఒక మత యుద్ధం చేసే సైనికునివంటి వ్యక్తి కావాలి.

ఇలాటి మూలాధారమైన భాష వున్నదన్న విషయం నిరూపించడానికి సిరాజ్ మొహన్ - జొ - దరో, హరప్ప ముద్రికలపై వ్రాతలను విడదీసి అర్థం చెప్పడానికి ప్రయత్నించారు. తత్ఫలితంగా ఇప్పుడున్న సింధీభాష అతి ప్రాచీన భాషల యొక్క వికాశం పొందిన భాషనీ, అదికూడా సింధీయేననీ వారు కనుగొన్నారు. ఈ యువ పరిశోధకులు విస్తృతపఠన సునిశితమైన పరిశీలన కనబరుస్తూ తమ పరిశోధన వ్యాసాన్ని పొందుపరచి, సింధీ సంస్కృతము నుండి పుట్టకపోవడమే కాక, యీ రెండిటికీ మూలమైన భాష ఒకటేననీ, బహుశ సింధీ సంస్కృతం కంటె ముందు పుట్టి ఉండవచ్చుననీ, అందుచేతనే సంస్కృతం యొక్క ప్రభావం సింధీభాషపై ఉన్నదనడం కంటె సింధీభాష యొక్క ప్రభావం సంస్కృతంపై ప్రసరించిందనీ, ఈరెండు భాషలకూ మూలం ఒకటే కావడంచేత రెండిటిలోను కొన్ని లక్షణాలు ఒకేలాగున కనిపించుతాయనీ అంటారు. ఒకే మూలం నుండి వ్యుత్పత్తి చెందుటచేత ఈ రెండు భాషలు (సంస్కృతం సింధీ) రెండిటికీ ఒకే రకమైన ఆధారాలూ, వ్యత్యాసాలూ కూడా ఉన్నాయి. ఈ గ్రంథకర్తకు సింధీ సంస్కృతం కంటె పురాతనమైనదీ, సంస్కృతమును సింధీ ప్రభావితం చేసినదీ అనడానికి సింధీభాషలో 'ర్'తో అంతమయ్యే మాటలు అట్లే నిలిచి ఉండగా, ఆ ప్రాచీన అంత్యము సంస్కృతములోను, సంస్కృతము నుండి

పుట్టిన భాషలలోను 'ల్' తో అంతం అవుతున్నాయి, అన్న ఒక్క ఉదాహరణ చూడడానికి దొరికింది.

సర్ జాన్ మార్షల్, ఫాదర్ హెరాస్‌లు సాధించలేని కార్యం అంటే మొహన్-జొ-దరో ముద్రికలపై వ్రాతలను విడదీసి అర్థం కనుగొనడం యీ యువ సింధీ మహమ్మదీయ పరిశోధకుడు తాను సాధించాను అన్నవాదనను సరియని విజ్ఞులెవరైనా ఒప్పుకున్నప్పుడు సిరాజ్ ఉల్‌హక్ గురించి ఆలోచించవలసి వస్తుంది. 'సింధీబోలీ' లో సిరాజ్ సాధించిన గొప్ప విషయం, స్వచ్ఛంగా భారతదేశంలోనే పుట్టి వికసించిన యీ భాషకూ సెమెటిక్ భాషలకూ, యీ భాషపుట్టుక, అభివృద్ధి వంటి వాటిని యేవిధమైన సంబంధమూ లేదని డా॥ నబిబక్స్‌బలోక్ గారు అతికష్టం మీద ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని విత్తుగా తునాతునకలు చెయ్యడం. సురాజ్ ఉల్‌హక్ సెమెటిక్ భాషలకు సింధీ లేక సంస్కృతం లేక ఇండో ఆర్యన్ భాషలకు మధ్య గల వ్యత్యాసాలకు చాలా ఉదాహరణ లిచ్చారు. సెమెటిక్ భాషలలో కొన్ని వ్యాకరణ సూత్రాల ననుసరించి మూడక్షరాల ప్రాతిపదిక శబ్దంతో మరికొన్ని అక్షరాలు చేర్చడంవల్ల అనేక ఇతర మాటలు రూపొందుతాయి. ఇండో ఆర్యన్ భాషలలో అట్టిదేమీ లేదు.

ట్రంప్, గ్రెయిర్ సన్‌లు ప్రతిపాదించిన వాదాన్ని సింధుకు చెందిన గొప్ప అరబ్బీ పండితులు డా॥ యు. ఎం. దౌడ్ పోతా ఆమూలాగ్రం అంగీకరించడం గమనార్హం. 'సింధీ చాలా పురాతనమైన భాష. అది ప్రాకృతం యొక్క వ్రచ్ఛద వాడుక భాష నుండి పుట్టినది. 'సంస్కృతం'ను 'ప్రాకృతం' కు చేర్చడంలో డా॥ దౌడ్ పోతా చాలా జాగ్రత్త పడ్డారు. కాని సంస్కృతం అన్న పదం ఊహించు కొనవచ్చును. సంస్కృతం ఒక పరిపూర్ణమై నాగరికతతో ఉట్టిపడే భాషకాగా, ప్రాకృతం దేశీయమైన స్వభాష. సింధీ సంస్కృతీయ భాషగా గుర్తించడానికి కష్టంగా వున్న కారణాలలో ఇటీవలి ఆ భాషయొక్క అరబిక్ సింధీ లిపి. ఇది బ్రిటిష్ ప్రభుత్వపు ఉత్తరువులు పైన కృత్రిమంగా రూపొందించబడింది. 1843 లో ఆంగ్లేయులు సింధు దేశాన్ని జయించిన నాటికి దేశంలో ఏ ఒక్క లిపి వాడుకలో లేదు. బ్రిటిష్‌వారికి ముందర రాజ భాషగా పర్షియన్ వ్యవహరించబడుతూ ఉండటంవల్ల విద్యావంతులందరూ పర్షియన్ భాష, లిపి తెలిసినవారే! సింధీ వ్యాకరణం 1849 అన్న కెప్టెన్ జార్జిస్టేక్‌గారి మార్గదర్శకమైన గ్రంథంలో పేర్కొనిన కారణాల దృష్ట్యా మొట్టమొదటి సింధీ వ్యాకరణములు నిఘంటువులు దేవనాగర లిపిలోనే ఉన్నవి. పాతిక సంవత్సరాల తరువాత వాథెన్ రూపొందించిన వ్యాకరణం పర్షియన్ లిపిలో ఉన్నది. కాని సమర్థ

లైన పండితుల అభిప్రాయ ప్రకారం అది వ్యాకరణమే కాదు. కెప్టెన్ స్టేక్ ఇలా అంటారు.

'ఈ కార్యం చేపట్టే ముందు స్థానిక పదాలు ఏ అక్షరాలలో వ్రాయాలా అన్నది నామొదటి సమస్య.

సింధీ (దాంట్లో వుండే అనేక సంజ్ఞలలో ఏవైనా) రోమన్, పర్షియన్ గురుముఖి, దేవనాగరి యివన్నీ నా ఎదురుగా ఏదో ఒకటి ఎన్నుకోవడానికి ఉన్నాయి.

మొట్టమొదటిది పనికిరాదని వెంటనే తోచింది. అర్థం పూర్తిగా గ్రాహ్యం అయ్యేలాగున మాటలను వర్ణించేటట్లు రూపొందించ తగినంత సంఖ్యలో హల్లులు లేకపోవడం వల్లనే అది ఎంతమాత్రమూ పనికిరాదు.

రోమన్ లిపి కుడా పనికిరాదు అని నిర్ణయించాను. తూర్పుదేశపు భాషను రోమన్ అక్షరాలు, గుర్తులతో వ్యక్తీకరించడంవల్ల కలిగే ప్రయోజనం ఏమిటో నాకు అవగాహన కాలేదు.

పర్షియన్ కూడా పనికిరాదని చాలా ఆలోచించిన తరువాతగాని నిర్ణయించలేదు. దీనికి దృష్టాంతంగా నాకెదురుగా వాథెన్ గారి వ్యాకరణం, ఆ లిపిలో అప్పటికే వెలువడిన కొన్ని సింధీగ్రంథాలు వున్నాయి. వీటిల్లో కుడా పర్షియన్ భాషకు విజాతీయాలైన శబ్దాలను గుర్తించడానికి అదనపు గుర్తులు చూపవలసి వచ్చింది.

ఇక నా ఎంపిక గురుముఖి, దేవనాగరలిపుల మధ్యమిగిలి ఉంది. గురుముఖి లిపికి సింధీ భాషను సమానస్థాయిలో వ్యతిరేకించే అవకాశం వుంది. అంతేకాక అధిక సంఖ్యలో సింధీ హిందువులకు అందరికీ తెలిసినదిగా వుంటుంది. కాని నేను దేవనాగరి లిపియే సరియైనదిగా నిర్ణయించాను.

పాశ్చాత్యులందరకూ యీ లిపితో పరిచయముండడం మొదటి కారణం. సింధీభాషకే పునాది కావడంచేత వేరు అక్షరం అవసరమైన సందర్భాలలో, సంబంధితమైన, ఒకే పోలిక వున్నవైనప్పటికీ ఇతర లిపులలో కంటె దేవనాగరలిపిగానే వ్రాయడం సముచితంగా ఉంటుందనిపించడం రెండవదీ, అతిముఖ్యమైనదీ అయిన కారణం. 'సింధీ భాషలోని కొన్ని ప్రత్యేక శబ్దాలను పూర్తిగా వ్యక్తం చెయ్యడానికి కొన్ని సంజ్ఞలను దేవనాగరి అక్షరాలకు ఉపయోగించాను, అది గమనార్హం. అయితే అవి అధిక సంఖ్యలోలేవు. ఆ గుర్తులు ఉంటేనే గాని శబ్దాలను ఉచ్చరించడంలో గల భేదం చాలా ఉంటుందని కూడా అనలేము.'

ఇవే కారణాలను దృష్టిలో ఉంచుకొని కెప్టెన్‌స్టేక్ తమ ఇంగ్లీషు - సింధీ నిఘంటువు (1849) సింధీ - ఇంగ్లీషు నిఘంటువు (1855) లలో ఈ గుర్తులను వినియోగించారు. ఇప్పుడు ఆంగ్లేయుల ఆధ్వర్యంలో అరబిక్ - సింధీ లిపి వాడుకలో ఉండడంచేత అరబిక్‌కు, సింధీభాషకు ఏదో సంబంధం ఉండిఉంటుందన్న భావనకు అవకాశం ఇచ్చింది.

సుమరుల పరిపాలనకు ముందర సింధీభాష స్వరూపాన్ని చూపే నమూనా లేవీ లభ్యంకాకపోవడంవల్ల మరింత ఇబ్బంది కలుగుతోంది. అరబ్ పాలన తొలికాలంలో సింధీ గ్రంథాలు ప్రచారంలో ఉన్నట్లు ఆధారాలు కనబడుతున్నాయి. ఎందుకంటే క్రీ. శ. 1000 కు పూర్వం తొలి సింధుచరిత్ర, మహాభారతకథలు వంటి గ్రంథాలు సింధీభాష నుండి అరబీ భాషలోనికి అనువదించబడ్డాయి. కాని సుమరుల పాలనకు ముందర సింధీ పద్య, వచన వాఙ్మయంయొక్క నమూనాలు మనకు లభ్యంకావు. హిందువుల కాలం, సుమరులకు పూర్వం సింధీసాహిత్యం ఊహించడానికి వీలులేనంతగా కాకపోయినా నామమాత్రంగానైనా లేకుండా క్షయమైపోయింది. పీర్‌హసముద్దీన్ రష్దీ హిజరా రెండవ శతాబ్దం అంటే క్రీ. శ. 8 వ శతాబ్దానికి చెందినదిగా కనుగొన్న సింధీ పద్యవాఙ్మయంయొక్క నమూనా, వారి ఊహలలో మాత్రమే అది సింధీ. అంతేగాని, ఆ కాలంలో సింధీభాష ఎలా వుండేదో యీ నమూనా నుండి మనకు ఎంతమాత్రమూ గ్రాహ్యంకాదు.

వారు చేసిన విస్తృత పరిశోధనల ఫలితంగా సుమరుల పాలన (క్రీ. శ. 1050-1350) కు పూర్వపు అసలైన సింధీభాషలో ఒక్క వాక్యమైనా డా॥ నబిబక్స్‌బలోక్ చూపించలేక పోయారు. భారతదేశంలో పన్నెండు లిపులు వాడుకలో ఉండేవనీ వీటిలో మూడు - అర్ధనాగరి, సైంధు, మాల్వారీ - యివి సింధులో వాడుకలో ఉండేవనీ, క్రీ. శ. 1017-1030 మధ్య సింధు హిందువులను దర్శించిన తారీఖ్-అల్- హింద్ గ్రంథకర్త అల్ బెరూనీ పేర్కొన్నారనీ 5-5-1957 హింద్ వాసిలో వ్రాసిన ఒక వ్యాసంలో జయరాందాస్ దౌలత్ రాం పేర్కొన్నారు. డా॥ యు. ఎం. దౌడ్ పోతా కూడా యిదేవిధంగా అన్నారు. దక్షిణ సింధు సముద్రతీర భాగాలలో మాల్వారీలిపి వాడుకలో ఉండగా కొన్ని ఇతర ప్రాంతాలలో అర్ధనాగర లిపి వాడుకలో ఉండేది, అని అల్ బెరూనీ (క్రీ. శ. 973 - 1048) వారికి తాబుల్ - హింద్‌లో సింధుదేశంలో వాడుకలో ఉండే లిపిని గురించి వ్రాస్తూ అన్నారని. కాని యీ లిపులలో సింధీభాష వాడినట్లుగా ఒక్కపంక్తి కూడా మనకు లభ్యంకాదు. జైన

మందిరాలలో భద్రపరుపబడిన వ్రాతప్రతులను వెలికితీసి మునిరామసిన్హాగారి దోహాలలోను, మరికొన్ని ఇతర రచనలలోను సింధీ పద్యాలను గురించి ఉదాహరణలు ఉన్నాయని కొందరు రచయితలు వాటికోసం ప్రయత్నించారు ; కాని వీటిలో మనకు రాజస్థానీ లేక గుజరాతీ లక్షణాలే కనబడతాయి తప్ప ... మనకు తెలిసిన సింధీభాష ఎక్కడా కనబడదు. లేకపోతే సింధీ భాషను అంతజాగ్రత్తగా అధ్యయనం జేసిన డా॥ దౌడ్ పోతా వంటి వ్యక్తి అతి కష్టంమీద గాని ఇలా చెప్పడానికి అంగీకరించరు. "సింధీపద్యవాఙ్మయం మొట్టమొదట ఎప్పుడు ఉత్పన్నమయిందో చెప్పడానికి సరియైన సమాచారం లేదు." మొట్టమొదటి సింధీభాషలోని రచనలకు నమూనాలు హిజరీ 8వ శతాబ్దం అంటే క్రీ. శ. పదునాల్గవ శతాబ్దం నాటికి బయల్పడ్డాయి.

ఆచార్య భేరూమల్ మహిర్ చంద్ వాదించినట్లు మనకు తెలిసిన సింధీభాష క్రీ. శ. 1100 లో మాత్రమే రూపొందినది, అన్నవాదం ఇప్పటివరకూ తప్పు అని ఎవరూ అనలేదు. డా॥ నబీబక్ష్ బలోక్ గారి సింధీభాష చరిత్ర (History of Sindhi Language) లో సమరులు లేక సమ్మల కాలంనాటి సింధీభాషకు చెందిన వ్రాతప్రతులు అని ఇచ్చిన వాటిలో ఒక ఆశ్చర్యమైన పొందిక కనబడుతుంది. భోజా ప్రజలవంటి వారి భక్తి వాఙ్మయంలో కూడా పర్షియన్, అరబి మాటల సమ్మిశ్రితం ఎక్కడా కనబడదు. బరకత్ (అనుకంప) వంటి ఒకటి రెండు మాటలు అరుదుగా కనబడడం తప్ప తక్కిన మాటలు అన్నీ సంస్కృతం లేక ప్రాకృతం నుండి పుట్టినవే. ఈ నమూనాలు చూసే సింధీభాష సంస్కృత ప్రాకృత భాషలనుండి రూపొందినదనడానికి ఎట్టి సందేహమూ లేదు.

అందువలన సింధీభాష జననం సందేహాస్పదం కానేకాదు. అది అతి ప్రాచీనమైన సంస్కృత ప్రాకృత భాషలలో ఒకటి. అయితే అరబిక్, పర్షియన్ భాషలద్వారాను, ప్రాచీనద్రావిడభాషా సంపర్కము యొక్కఛాయలు సింధీభాషను సుసంపన్నం చేసినవి. సింధీశబ్ద సంగ్రహం విస్తారమైనదీ, ప్రాపంచిక విజ్ఞానం పెరిగిన యీ కాలానికి సరితూగ గలిగిన అన్ని హంగులూ కలిగి ఉన్నది. ఎడారి ఓడ - ఒంటెకు సింధీలో పదిహేను మాటలు ఉన్నాయి ; సింధీభాషలో దేహంలోని ప్రతిభాగాన్ని, దేశప్రకృతిని, ప్రాణికోటిని, వృక్షకోటిని, మరే ఇతర భారతీయ భాషలలోను వర్ణించలేని రీతిలో సింధీభాషలో వర్ణించవచ్చును. కుటుంబంలో విభిన్న వ్యక్తులమధ్యగల సంబంధాలను చెప్పడానికి భారతదేశంలోని ఇతర భాషలలో ఒకటికంటె హెచ్చుమాటలు కావలసి వస్తుంది. కాని సింధీభాషలో ఈ సంబంధాలను గురించి ఒక్క మాటతో చెప్పవచ్చును.

కోటుమల్ అద్వాని వారి చిన్న పుస్తకంలో పేర్కొన్నట్లు పంటల పేర్ల విషయంలో సింధీభాష సుసంపన్న మయినది. అట్లే పచ్చికల విషయం (డి. జె. సింధీకాలేజి మిసెలెనీలో ఎస్. సి. షాహానీ, రాందాస్, లఖానీ గార్ల వ్యాసాలు) మత్స్యసంబంధమైన పదసంపద సింధీభాషలో అపారంగా ఉన్నది. అరవైసంవత్సరాల క్రిందట పరమానంద మేవారం సింధీభాషకు విస్తృతమైన నిఘంటువు సమకూర్చే సాహసోపేతమైన ఒక ప్రయత్నం తల పెట్టారు. కాని అనేక కొత్తశబ్దాలు వచ్చి భాషలోస్థిరపడి పోయిన యీ నాడు ఆ నిఘంటువు యథారూపంలో ఉపయుక్తం కాదు. దానిని పునర్ముద్రించడం ఎంతైనా అవసరం.

# 3

# సింధీ సాహిత్యానికి సాధన సామగ్రి

సింధీ సాహిత్యం ప్రధానంగా మతంమీదా, బహుళ ప్రచారంలో వున్న కథలు, గాథలుమీదా ఆధారపడి జీవించి వుందనవచ్చు. సింధీయుల మతం - హిందువులదైనా, మహమ్మదీయులదైనా సరే, అది సదాచార సంపన్నమైన హిందూమతమూ కాదు, సదాచారసంపన్నమైన ఇస్లాంమతమూ కాదు. అది వివిధమత సమ్మిళితమైన మతం. మహాత్ములను, పవిత్ర వ్యక్తులను పూజించడం, మూఢనమ్మకం అని త్రోసిపారవేసే కొన్ని కర్మ కాండలను పాటించే మతం. లెఫ్ట్. బర్న్ తమ (Travels of Bokhara) బొఖారాపర్యటనలు అన్నగ్రంథంలో సింధు జాలరులు లేదా పల్లెకారులు మొట్టమొదటి సింధువాసులు, వీరు మూఢనమ్మకాలు గలవారు. "హైదరాబాద్‌కు దిగువగా ఉన్ననదిలో మొసలికనబడితే అది అశుభసూచకంగా భావిస్తారు. వారు పడవలను నడిపేటప్పుడు పాడేపాటలలోనూ, ఉచ్చరించే ప్రతి ఊతపదంను మహాత్ముల, పుణ్యపురుషుల పేర్లులో దొరలుతూనే ఉంటాయి."

సింధులో ప్రగాఢంగావున్న మతవిశ్వాసం కానివ్వండి, అనుశ్రుతంగా వస్తున్న గాథకానివ్వండి, అది నదీదేవతను గురించే అయివుంటుంది. ఏబాట్ తమ గ్రంథం Sind. - A Reinter Pretation (సింధు, ఒక పునర్వివరణ) లో నదీదేవత ఖ్వాజా ఖిజ్రి గురించినగాథ వర్ణించారు. ఈనదీదేవత దేవాలయం నదిలో రోహ్రీకి అవలి ప్రక్కగా వున్నది. షాహుస్సేన్ అనే

వర్తకుని కూతురి గౌరవాన్ని కాపాడడంకోసం, ఖ్వాజీఖిజ్రి నదీ మార్గాన్ని ఆలోర్ నించి ప్రస్తుతం అది ప్రవహిస్తున్న సుకుర్ ప్రాంతాలకు మళ్ళించారనీ ఆ దేవాలయం వెలసిన స్థానానికి వెలుగుతున్న దివ్వెను తీసుకువచ్చారనీ ప్రతీతి. ఇంకొక ప్రాచీనగాధ ప్రకారం ఒక పసులకాపరి, అతనిభార్య రోహ్రినించి సింధునది మధ్యలో ప్రస్తుతం గుడికట్టిన స్థలందాకా ఒకవింత జ్యోతిని వెన్నంటివచ్చారని, ఆ గుడిని అక్కడవారే కట్టించారని అంటారు. ముఖ్యంగా గమనించవలసిన దేమిటంటే సుక్కూర్‌లో జిందాపీర్ (జీవించి వున్న మహాత్ముడు) అని ప్రసిద్ధికెక్కిన, ఖ్వాజాపీర్ ఆలయం హిందువులకూ, మహమ్మదీయులకూ కుడా పూజనీయమైనదే. అక్కడ నిత్యంవుండే పూజారులు హిందువులూ, ముస్లింలుకుడా ఖ్వాజాపీర్ సింధునదీ జలాలలో సుక్కూర్ దగ్గర మునిగి నీటిబయటికి తేలేసరికి వారు ఒడెరోలాల్ (హైదరాబాద్) దగ్గర కనబడ్డారనీ ఆస్థలాన్ని నదీదేవత స్మృతి చిహ్నంగా వారిపేరనే నామకరణం చేశారనీకూడా ప్రతీతి.

హిందూగాధల ప్రకారం నదీదేవత గాధలకు కొంత చారిత్రకమైన ఆధారంకుడా వుంది. హిందువులు ఆరాధించే నదీదేవత అవతారం అయిన అమర్‌లాల్ (అమరవీరుడు) లేక ఒడెరొలాల్ (పరమోన్నత వీరుడు) చారిత్రక పురుషుడు. వారు నసర్‌పుర్ వద్ద 1007 సంవత్ అనగా 950 లేక 951 సంవత్సరాలలో జన్మించేనాటికి తట్టావద్ద మిర్కుషా అనే చిన్న నాయకుడు హిందూపౌరుల జీవితాలను దుర్భరం గావించాడు. కత్తిచూపి హిందువులను మహమ్మదీయులుగా మారమని బలవంత పెట్టాడు, హింసించాడు. అణగి మణగి వున్నహిందువులంతా మమ్ముకాపాడమని కరుణ దేవుని ప్రార్థించారనీ, నసర్‌పూర్‌లోనే రతన్‌రావ్‌లోహన్, అతనిపత్ని దేవకికి నదీదేవత పుత్రుడుగా అవతరించాడనీ చెబుతారు.

ఒడెరొ అనే ఆబాలుని జననంతో అద్భుతమైన సంఘటనలు జరగడం, తట్టా భయభ్రాంతుడై ఆమతోన్మాదుని దుష్టచర్యలు అరికట్టడం జరిగాయి. ఒడెరొ లేక అమర్‌లాల్ పసిప్రాయంనించే వేదవిద్యలలో పారంగతుడై, హిందూమత సాంప్రదాయాలకు ప్రధానసూత్రాలైన మతసామరస్యము, అందరియందు ప్రేమ, బోధిస్తూ ఉండేవాడు. అతను పవిత్రమూర్తి మాత్రమేకాక, యోధుడు కూడా. అతని అశ్వం, ఖడ్గం, మూఢవిశ్వాసాలతో ఉన్నమతోన్మాదుల గుండెలలో భయోత్పాతాలు కల్పించేవి. అతను ఆర్థర్ చక్రవర్తి, సెయింట్‌జార్జి, అగస్టయిన్ కలిసిన ఒకవ్యక్తిగా రూపొందాడు; క్రుంగిపోతున్న హిందువుల మనస్సులకు ధైర్యాన్ని అందించాడు. వారిలో ఒక వీరత్వాన్ని ఉత్తేజింపచేశాడు. వారిమతంలోవున్న శాశ్వతమైన ఔన్న

త్యాలను చూపించాడు. హింసాకాండకు పాల్పడిన మహమ్మదీయుల హృదయాలలో పవిత్రమైన అనుకంపను నింపేశాడు. బలవంతంగా మతం మార్చడం విరమించవలసినదని మహమ్మదీయ మతోన్మాదులను హెచ్చరించాడు. అది కొరాన్‌సూత్రాలకు విరుద్ధమనీ భగవంతునికే అవి అవమానకరములైనవనీ, ఆ భగవంతుడు మహమ్మదీయులకు మాత్రమేకాక హిందువులకు కుడా భగవంతుడేననీ ఉద్బోధించాడు. తాను చేయవలసిన పని పూర్తి కావించి, ఆ మహాత్ముడు గుఱ్ఱంతోపాటు సింధుజలాలలోనే మాయం అయిపోయాడు.

వారిని గురించి అనేక అద్భుతాలను చెబుతారు. అందులో ఒకటి నసర్‌పుర్‌వద్ద నదిలో ప్రవేశించి సుకుర్‌వద్ద నీటినుంచి బయటికి రావడం. ఇదే అద్భుతచర్యను ఖ్వాజాఖిజ్రి గురించి తలక్రిందుగా మార్చిచెబుతారు. వారు తమ లాంఛనాలను, వస్తువులను, ఆభరణాలను తమ దాయాది పాగర్‌కు విడిచిపెట్టి, ఆయనను తమ కర్తవ్యాన్ని నిర్వహించడానికి వారసుడిగా నియమించారు. ఒడెరొలాల్ లేక అమర్‌లాల్ మందిరాలకు సాంప్రదాయికంగా నియమితులయ్యే ఠాకూర్‌లలో యీ పాగర్ ప్రథములు. ఈ ఠాకూర్‌లు సింధుప్రాంతం అంతటావున్నారు. అయితే సేవాన్, షికార్‌పుర్, రానీపూర్ ప్రాంతాలలో చాలా విస్తృతంగా కనబడతారు. హిందువులలో చాలా సంస్కారకుటుంబాలలో, వీరి శిష్యులున్నారు. తరచు వీరు శిష్యులవద్దకు వెళ్లి వారికి సలహాలను ఇస్తూవుండడం, సాంవత్సరిక ఉపాహారాలను, కానుకలను వసూలుచేయడం వంటివి జరుపుతూ వుంటారు.

ఒడెరొలాల్ పూజలనుండి స్తోత్రాలు, కీర్తనలు అనేకంగా వెలువడ్డాయి. వీటిని ఐదుపాదముల కూర్పుతోనున్న 'పంజ్రా'లు అంటారు. ఈపంజ్రాల చివర ఉత్తేజకరమైన గీతిక ఝూలేలాల్ ఝూలేలాల్ (అంటే హలేలు జాలాల్‌కు) అని పాడతారు. భారతదేశంలోవున్న సింధీవారికి ఇది ఒక మంత్రముగ్ధమయిన పిలుపుగా ఏర్పడింది. ఒడెరొ లేక అమర్‌లాల్ శుక్రవారం సాయంత్రం, చైత్రశుద్ధ పాడ్యమినాడు జన్మించడంచేత చేతీ చాంద్‌లేక చైత్రశుద్ధ పాడ్యమి (మహారాష్ట్రంలో గుడిపర్వ అంటారు) భారతవాసులైన సింధీ హిందువులకు ప్రత్యేక పర్వదినము. సాంస్కృతిక సమ్మేళనాలకు ప్రత్యేకించిన దినము, శుక్రవారం (తరూన్) నదీదేవతకు అంకితమైన దినంగా ఎంచబడుతుంది.

ఒడెరొలాల్ తిరిగివారిని కూడ దీసిరిలో ధైర్యాన్ని పునరుజ్జీవింపజేయడానికి పూర్వందాకా, హిందువుల పతనానికి, విచ్ఛిత్తికి, పదవశతాబ్దం

ముఖ్యమైన కాలంగా తోస్తున్నది. భారతదేశంలో తక్కిన భాగాలన్నిటి నుండీ సింధుపూర్తిగా వేరుకావించబడడమే యీ విచ్ఛిత్తికి కారణం. ముస్లిం ప్రపంచానికి గొప్ప గురువులను, వైద్యనిపుణులను యిచ్చిన పురాతన సింధునాగరికత సంస్కృతి లుప్తమైపోయింది. (హరూన్ - అల్ రషీద్‌కు చికిత్స చేయడానికి సింధీవైద్యుని తీసుకువెళ్లారు) భారతదేశంలో శంకరాచార్యులవారు కావించిన మహత్తరమైన మతపునరుద్ధరణ వంటిది సింధులో కానరాదు. బౌద్ధమతాన్ని, బ్రాహ్మణ సిద్ధాంతాన్నీ అవలంబించగా అక్కడివారు తమ ప్రధానకేంద్రంతో సంబంధాన్ని పూర్తిగా కోల్పోయారు. అక్రమమైన తాంత్రిక సాంప్రదాయాలు సింధులో ప్రబలిపోయాయి. వాటిలో దుష్ప్రచారానికి ప్రసిద్ధికెక్కిన దాలూరాయ్ కథనం ఒకటి. దాలూరాయ్ క్షీణదశకు దిగజారిన వామమార్గి హిందూపాలకుడు. అతని రాజధాని నగరిసొడొమ్, గొమొర్రాహ్‌లవలెనే అతీతశక్తుల తీవ్రమైన ఆగ్రహానికి గురియై నాశనమయింది.

దాలూరాయ్ - జి - నగరి (దాలూరాయ్ రాజధాని నగరం) నాశనం కావడాన్ని గురించిన గాథ, సింధుదేశంలో ప్రచారంలో ఉన్న గాథలలో తరచూ వినబడుతూంటుంది. ఈ గాథకూడా సింధునదీ పరీవాహమార్గం మార్పిడితో ముడివడి వున్నట్లు చెబుతారు. దాలూరాయ్ నగరవినాశనం గురించి రకరకాల కథలు వున్నాయి. అయితే, ఒకవిషయం మాత్రం అందరూ ఏకగ్రీవంగా చెబుతారు. దాలూరాయ్ హిందూపాలకుడనీ, సుమరులకు కొంచెం ముందుగానూ దహిర్ తరువాతనూ జీవించి ఉన్నాడనీ చెబుతారు. లేదా సుమరుల పాలనాకాలపు తొలి సంవత్సరాలలో వుండేవాడనీ అంటారు. అతడు పదవశతాబ్దపు రెండవ అర్ధభాగం తొలి సంవత్సరాలలోగాని పదకొండవశతాబ్దపు తొలి అర్ధభాగం మొదట్లోగాని జీవించాడు. అతని రాజధాని నగరం ఆలోర్ అని కొందరూ, బ్రాహ్మణాబాద్ అని కొందరూ అంటారు. ప్రచారంలో ఉన్న కథలలో మాత్రం దాలూరాయ్ - జి - నగరి లేక దాలూరాయ్ రాజధాని నగరం అని మాత్రం పేర్కొనబడింది. భయంకరమైన భూకంపమూ, పెనుతుఫానూ సంభవించిన ఒక అర్ధరాత్రి నదీప్రవాహ మార్గం ప్రస్తుతం ప్రవహిస్తూన్న సుక్కూర్ బుక్కూర్ లోయకు మారిపోయింది. దాలూరాయ్‌నగరం దాలూరాయ్‌తో సహా, ఆ పట్టణవాసులు, అందరూ నశించిపోయారు.

సర్వసామాన్యంగా ప్రచారంలో ఉన్న కథనం ఏమిటంటే 'సింధు అక్కడి సూఫీలు' అన్నగ్రంథ రచయిత మాటలలో బ్రాహ్మణాబాద్ పతనం అని చెప్పవచ్చును. 'దుష్టపరిపాలనలో ప్రసిద్ధికెక్కిన హిందూపాలకులలో

రాజా దాలూరాయ్ ఒకరు; అతని దేశం అత్యున్నతమైన అభివృద్ధిని సాధించింది. రాజు చాలా ధైర్యసాహసాలు కలవాడు, చాలా బలవంతుడుకూడా. కాని విషయ లాలసత్వం కారణంగా పైశాచికత మూర్తీభవించిందేమోనన్నట్లు ప్రవర్తించేవాడని చెబుతారు. రాజ్యంలోని కన్యల నందరినీ చెరిచాడు. ఎవరైనా కన్యకు వివాహం జరిపేముందు, ఆకన్య అతని స్పర్శకు గురికావలసినదేనని శాసించాడు. సద్బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి నిష్కల్మషంగాను, నిర్మలంగాను వున్న ఒక బ్రాహ్మణ కన్య ఇలాటి ప్రమాదాన్ని ఎదుర్కోనవలసి వచ్చింది. తన కన్యాత్వం, శీలం అన్నిటికన్న ఆమెకు ప్రాణప్రదం. ఈ రాక్షసుడైన దాలూరాయ్ శక్తినుంచి తనకు విముక్తి ప్రసాదించమని నిర్మలాత్మలను పతివ్రతలను రక్షకుడైన వానిని వేడుకుంది. అప్పటికప్పుడే దేశంలో రానున్న కీడును సూచించే దుశ్శకునాలు చాలా కనిపించాయి. జ్యోతిశ్శాస్త్రవేత్తలు, ప్రవక్తలు దేశానికి గొప్పకీడు వాటిల్లబోతోందని చెప్పారు. ఆ బ్రాహ్మణ కన్య వివాహం నాటిరాత్రి పెద్ద భూకంపం, పెనుతుఫాను సంభవించి, దాలూరాయ్ నగరాన్ని ఆ దేశాన్ని నాశనం చేశాయని చెపుతారు. ఆ నగరమంతా శిథిలమైపోయింది. అనుశ్రుతంగా వింటూన్న ఆ కన్యకథ నిజమో కాదో నిర్ధారించలేకపోయినా, బ్రాహ్మణాబాద్, అలోర్ శిథిలాలు యీనాటికీ మన కళ్లముందు నిలిచి ఉన్నాయి. ఆ శిథిలాలు మైళ్ల తరబడి వ్యాపించి ఉన్నాయి. బ్రాహ్మణాబాద్ దగ్గర దృశ్యం భయాశ్చర్యాలను కలుగజేస్తుంది. ఏకైకగోపురం, రమారమి పూర్తి శిథిలావస్థలో ఉన్నది. వందలాది సంవత్సరాల క్రితం జరిగిన ప్రళయ భీభత్సానికి సాక్షిగా నిలిచి వుంది.'

మరికొన్ని కథల ప్రకారం మానభంగానికి గురికాబోయే ఆ కన్య రాజుగారి సోదరి కూతురు. దాలూరాయ్ క్రూర రాక్షసుడై వామమార్గీయుడై తన సోదరి కుమార్తెనే చెరచడానికి సిద్ధపడ్డాడని వర్ణించారు. దైవహస్తమే దాలూరాయ్‌ని, అతని రాజధాని అలోర్‌ను మట్టుపెట్టాయని ఒక హిందూ కథారచయిత చెప్పాడు. ఆ రాత్రి ఆ రాక్షసుడు ఆమెను తన ప్రక్కన పరుండమని బలత్కరించడంవల్లనే యీ అనర్థం వాటిల్లింది. 'దాలూరాయ్ - జి - నగరి' కథారచయిత ఫతే చంద్. నదీ ప్రవాహం క్రొత్తదారి త్రొక్కడం, దాలూరాయ్ నగర వినాశనం యీ రెండు సంఘటనలను వేరువేరుగా చిత్రించారు. దాలూరాయ్ ఒక సయ్యద్ సైఫుల్ ముల్క్ (షాహుస్సేన్) కుమార్తెను రాజాంతఃపురంలోనికి పంపవలసిందిగా ఉత్తరువులు జారీచెయ్యడం, అప్పుడు ఆయన పెట్టిన

శాపం వలన సింధునది ప్రవాహమార్గం మారిందనీ; ఆ సయ్యద్ నావలు లంగరు త్రాళ్లు తెంచుకొని దాలూరాయ్ పిడికిలి నుంచి తప్పుకొని నదిలో దూరంగా పోవడానికి ప్రయత్నించాయనీ, అప్పుడే దాలూరాయ్ ప్రయత్నాలను విఫలంచేసి, నది, తన మార్గాన్ని వేరు దిశకు మళ్లించుకొని అతని నగరమైన ఆలోర్‌ను ఎండగట్టివేసిందనీ, ఆ తరువాత నగరపతనం సంభవించిందనీ ఆ కథ సారాంశం.

నిజమైన కథ యేదైనప్పటికీ బ్రాహ్మణాబాద్, ఆలోర్ నగరాలు ధ్వంసం కావడం, సింధునది తన గమనాన్ని మార్చడం - ఈ రెండు భీభత్సాలూ చారిత్రక సంఘటనలుగా సింధు వాసులు నమ్మారు. వారి మనసులలో అవి చిరకాలం మెదలుతూ ఉంటాయి. కామాతురులకూ కీడుతలపెట్టేవారికీ దాలూరాయ్ దుర్గతిని ఉదాహరణగా ఎప్పుడూ చెబుతూ ఉంటారు. మహమ్మదీయులు నిజంగా ఈ మహాత్యం మహమ్మదు ప్రవక్త వంశంనుంచి వచ్చిన పవిత్ర సయ్యద్ ఒకరు చేసి చూపించినదేననీ, ఒక అవిశ్వాసి వ్యక్తి పతనమయినాడనీ భావిస్తారు.

సింధునది గురించిన గాధలలో యివికొన్ని. సాంప్రదాయకంగా వస్తూన్న మతపరమైన గాధలలో అతి ముఖ్యమైనది అఫ్ఘనిస్తాన్. మార్వాడ్‌లో 1143 లో జన్మించిన పీర్ ఉస్మాన్‌షా మార్వాడీ (లాల్‌షాహ్‌బాజ్)ను గురించినది. సేవాన్ సింధులోని ముల్తాన్ నుంచి అనుచరులతో వచ్చి ధారాళమైన మతసిద్ధాంతాలను వారు బోధిస్తూ చాలా మంది అనుయాయులను కూడ గట్టుకున్నారు. వారు లాల్‌షాహ్‌బాజ్ [ఎఱ్ఱడేగ] ఆధ్యాత్మికాకాశంలో అత్యున్నతంగా విహరించే వ్యక్తి అని అర్థం. వారు జీవించిన కాలంలో అనేక అద్భుతాలు చేశారనీ, వారు ౘవంగతులైన తదుపరి మరిన్ని అద్భుతాలు జరిగాయనీ, భక్తివిశ్వాసాలతో వారిని ప్రార్థించిన వారి కోరిక లీడేరునట్లు చేశారనీ ప్రతీతి.

పీర్‌ఉస్మాన్‌షా తన మిత్రుడైన షేక్ ఫరీద్ షకూర్‌గంజ్‌ను ఉరికంబంనుంచి తప్పించడానికి డేగరూపం ధరించడంచేత వారిని షాహ్‌బాజ్ (దేశాటనం చేసే డేగ) అని పిలిచేవారు. అతనిని లాల్, ఎఱుపు లేదా మాణిక్యం అనికూడా పిలిచేవారు. వారు ధరించే ఎఱ్ఱటి మెరిసే అంగీ, మఱుగుతున్న నూనె గంగాళంలోదూకి రక్తవర్ణంతో బయటికి వచ్చినప్పటినుంచీ వారు ఎఱ్ఱగా మెరిసే అంగీనే తొడుక్కుంటూ ఉండడమే దీనికి కారణం. సెవ్‌హాన్‌లో వున్న ప్రసిద్ధికెక్కిన వారి మందిరం హిందువులకూ, ముస్లిములకూ కూడా యాత్రాస్థలమే. ప్రతి సంవత్సరమూ

ఆ మందిరంలో జరిగే ఉత్సవాలలో మెందీ ఉత్సవానికి కావలసినవి సమకూర్చడానికి ముస్లిములకంటె హిందువులే ధారాళంగా విరాళాలు ఇస్తారు. హిందువులను, ముస్లిములను ఒకటిగా కలిపే జీవనవిధానం సూఫీతత్వంలో ఉంది. చాలామంది హిందువులు సింధులో సూఫీ విధానానికి నాంది పలికినది షాహ్‌బాజ్‌గా విశ్వసిస్తారు. సెహ్‌వాన్‌లో లాల్‌షాహ్‌బాజ్ మందిరం ఉన్న దగ్గరే శివుణ్ణి పూజించే విక్రమాదిత్యచక్రవర్తి సోదరుడు, సన్యాసి, భర్తృహరి అవతారంగా వారిని చాలామంది విశ్వసిస్తారు.

లాల్ షాహ్ బాజ్ మొదటి సూఫీ అయితే ఝోక్‌కు చెందిన షా ఇనాయత్ (ఇప్పుడు ఝోక్ షరీఫ్ లేక పవిత్ర ఝోక్ అని పిలుస్తారు) ఇప్పుడు సూఫీ గురువుగా పవిత్ర త్యాగిగా పేరొందారు. ఝోక్‌లోని వారి మందిరం సింధు అంతటిలోను ప్రధానమైనది. తక్కిన సూఫీల మందిరాలు దర్శించడానికి ముందరగా ఝోక్‌లోని మందిరంలో అంజలి ఘటించడం ఒక భాగ్యంగా సూఫీలందరూ భావిస్తారు. సింధు కవులలో అనుభవజ్ఞుడైన షా అబ్దుల్ లతీఫ్‌కు, షా ఇనాయత్ సమకాలికులు. షా గారి పద్యరచనలలో ఢిల్లీ చక్రవర్తి ఫ్రరుక్ సెరీ ముందు అనుమతితో కల్హోరాలు 1718 లో, ఇనాయత్‌ను విశ్వాసఘాతుకంగా హత్య చేసిన విషాదకరమైన ఉదంతం గురించి వ్రాయడం గమనార్హం. "ఈనాడు మైమరపించే భక్తుల మంత్రాలు చావడులలో వినబడవు. అత్యున్నతులైన వారు వెడలిపోయారు. ఆశ్రమాలు నిస్సారంగా మిగిలిపోయాయి నాకు. మాలోని ఆత్మలను తిరిగి మేల్కొల్పినవారు, ఉన్నతలోక వాసులు మనమధ్య లేరు".

అయితే ఆ జ్ఞాని మాత్రం తన మరణం గురించి అయిష్టత చూపలేదు. వారి శిరచ్ఛేదము జరిగిన పిమ్మట దానిని ఢిల్లీ చక్రవర్తికి పంపించారు. ఆ తెగిన శిరస్సు నోటి వెంట బేసార్ నామా (తెగిన శిరస్సు పలికిన పద్యాలు) పేరున ఇప్పుడున్నవి చెప్పబడ్డాయట. అందులో ఒకటి పర్షియన్‌లో వున్నది. "ప్రేమమూర్తి పాదసన్నిధిని ఈ శిరస్సును సమర్పించిన నేమి : భారమైన బాధ్యతను నెరవేర్చడానికి ఈవిధంగా చెల్లించిన ఏమైనది ? కత్తివేటు వేయబోతున్న తలనరికి యీవిధంగా కృతజ్ఞతలను అందించారు : జీవిగా ఉండే కీడు నుండి నన్ను నీవు విముక్తుణ్ణి చేస్తున్నావు. నీవు నాకు చేస్తున్న యీ మేలుకు ఆ పరమాత్ముడు నీకు రెండు లోకాలలోను బహుమానము లిచ్చుగాక."

ఆ మహాత్ముని మరణానంతరం కల్హోరాలు పతనమయ్యారు. వారు ఎంతటి దుర్మార్గులో ప్రతి ఒక్కరికీ తెలిసింది. ఢిల్లీలోని ఇనాయత్ సూఫీ భక్తులైన సయ్యద్ సోదరులిద్దరు చక్రవర్తిని అంధుణ్ని చేశారు. తరువాత చిత్రవధ చేశారనీ చెబుతారు. ఈ సూఫీ భక్తుడు కొలదికాలం హైదారాబాద్ (దక్కన్) లో వుండేవారని, దేశమంతటా ఖ్యాతి పొందారు - పరమాత్మ ఆజ్ఞకు బద్ధుడై ఉండవలసినదన్న ఆశయంతో ఆయన అనుచరులు అతని శత్రువులతో పోరాడ తలబడినప్పుడు వారిని వారించారు.

ఇనాయత్ ఇంకా మిగిలిఉన్న ఒక సింధీ పద్యంలో తనవంటి అంద విహీన, నీచ, బలహీన మానవుణ్ణి తన ఆరాధ్యదైవం ప్రేమమూర్తి అంగీకరించి ఎదురెదురుగా నిలచి పలుకరించినందుకు ఆనందపారవశ్య వివశుడై కృతజ్ఞతలు తెలుపుతారు. (సచర్ అనే మరొక గొప్ప సూఫీ ప్రవక్త ఇదే దురదృష్టానికి వితలోను గాకుండా తల్‌పూర్ అధీశలొకరు దయగొని అడ్డుపడ్డారు).

సింధీగాధలలో శిరచ్ఛేదమైన వెనుక శిరస్సు మాట్లాడడం, పద్యాలు చెప్పడం, షా ఇనాయత్ వొక్కరి సందర్భంగానే జరుగలేదు. 14 వ శతాబ్దంలో తటా సమీపాన మమూయీ వద్ద సమ్మా యువరాజు రెండవ తమాచీ (లేక జామ్ నిజాముద్దీన్) ఉత్తరువుల మేరకు ఏడుగురు ఫకీర్ల శిరస్సులు ఛేదించడం ఆ ఏడు శిరస్సులూ, నిగూఢార్ధంతో కూడిన ఏడు పద్యాలు చెప్పడమూ జరిగింది. వాటిని మమూయీ పద్యాలు లేక సమస్యలు అంటారు. ఎందుకంటే పర్షియన్ భాషలో "మవుమ్మా" అంటే సమస్య అని అర్ధం. తరువాతి కాలంలో అనేక పర్యాయములు, ఆఖరికి రెండవ ప్రపంచ సంగ్రామ సమయంలో కూడా కొందరు వ్యక్తులు ముందు జరుగబోయే సంఘటనల ప్రమాదాన్ని సూచించే వివరాలను యీ సమస్యా పద్యాలలో దర్శించడానికి ప్రయత్నించేరు. భేరుమల్ మహిర్ చంద్ వాదన ప్రకారం సింధీ పద్యవాఙ్మయంలో ఇవి ప్రాచీనతరమైనవి. వీటిలో అరబిక్, పర్షియన్ మాటల కలయిక లేదు.

వీటిలో నరుకబడిన ఫకీరుల శిరస్సుల నుండి ఒక్కసారి పద్యాలు లేక భవిష్యద్వాణి వెలువడి ఒక్కపద్యం ఆశిరస్సు నోటి వెంటరాగానే అది మాయమై సుదూరాన సేవాన్ వద్ద వున్న అగ్నిలో దిగ్భ్రాంతులైన ప్రజలు ఆ ఏడు శవాలనూ భూస్థాపితం చేసిన స్థలానికి చేరుకున్నాయి. ఈ ఏడు సమస్యలు లేదా భవిష్యద్వాణితో కూడిన పద్యాలను అంగ్లంలోనికి బర్టన్ స్వేచ్ఛానువాదం చేశారు.

1. కట్ట తెగి ప్రవహించు ఆరోరె
జీవనది హక్రో ప్రధాన దిశవైపు
ఓ చేపలారా యీదండి పుష్పాల్లా వికసించండి
వెచ్చని భూములను సమ్మదులు దున్నుచోట.

2. సన్నని, నీలి అశ్వములు దిగి వచ్చు ఉత్తరము నుండి
జనసమ్మర్ద మగు వీధుల నడతురు దాదులు
అప్పుడు సిండే! వంచుము నీ పెడసరి శిరము
ఆ పెరవారి పదను కత్తులకు దూరముగా.

3. రాబోవు వత్సరములలో ప్రవహించు వెడదయై అర్ (భగర్)
కాని విధియానచే అది ఎండి పోయినపుడు
క్రూరుడు బెలోక్ విక్రయించు నాతని సుతుని
రెండు, మూడు వెండి నాణెములకు.

4. సంఘర్షణ ధ్వనులు లార్ నుండి విందును నేను
తొందరపడు సేనా వాహినుల సిరో నుండి కందు నేను
అప్పుడు సిండే! తూరుపు పడమరల నుండి
నీ తీరముల వినాశమగు యుద్ధము వాతబడి.

5. కారో కబారో గోడలు తిలకించు
భయంకర పోరాటము అర్ధదినము ప్రకోపించు
మిర్మిచి పీడింపబడి
అపుడు సిండే! తిరిగి ఉల్లసిలుము ఆనందముతో.

6. ఆ మిర్మిచి బోధించ వచ్చునీకు
అతని నెరుగగ నమ్మదగిన గురుతేమిటి ?
అతని వనిత రెండు జడలు ధరించును
ఆతని పొడుగాటి ఉంగరముల కేశములు మెడనుండి జారును.

7. రమ్ము; రమ్ము, ఓ మానవా! ప్రశాంతముగా కూరుచొనుము
నగర్ యొక్క పై కప్పు నీడ క్రింద
పురాన్ దాటి నీడనిచ్చు చెట్టు నాటలేదు
వంట పొయ్యి కొరకు రాతినైన ఉంచలేదు.

పమూయి పద్యాలతో సింధీ భాషలోని ప్రాచీనమైన రచనలుగా పోటీకి నిలబడేవి దోడో ఛానెసర్ గాధను వర్ణించిన పద్యాలు మాత్రమే. ఈ

పద్యాలు సుమరసులకాలం నాటివి. అవి గనుక యదార్థమైనవి ఐతే మయాయీ పద్యాలకు తరువాతివి సమ్మాల కాలంనాటివిగానీ లేదా 14 వ శతాబ్దం రెండవ అర్ధ భాగంలోనివి గానీ అయి వుంటాయి.

సింధీ సాంప్రదాయంలో దోడో ఛానెసర్ కథ ఒక బాగం. ఎవరైనా వ్యక్తి తన తల్లి కొంగుకు కట్టుబడి పోయినట్లనిపిస్తే అవ్యక్తిని ఛానెసర్‌తో పోలుస్తారు. 13వ శతాబ్దం తొలి దశాబ్దాలలో సింధును పరిపాలించిన భూన్‌గర్ సూమ్రాకు ఇద్దరు భార్యలు. సూమ్రవంశానికి చెందిన భార్య వలన ఒక పుత్రుడు ఛానెసర్, రెండవ బార్య సూమ్ర రాజకుమార్తె వలన ఒక పుత్రిక భాగి, ఒక పుత్రుడు దోడో కలిగారు. ఛానెసర్, దోడోలను దగ్గరకు చేర్చే ఉద్దేశ్యంతో ఛానెసర్ కుమారుడు నంగర్‌కు, దోడో కుమార్తె కోయల్‌ను ఇచ్చి వివాహం చెయ్యాలని వారి తండ్రి సంకల్పించాడు. భూనగర్ మరణించిన తరువాత "సింహాసనానికి ఎవరు అర్హులు", అన్న విషయంపై తగవు రేగింది. దోడోకంటె వయసులో ఛాన్‌సర్ పెద్ద అయినప్పటికీ రాజలక్షణాలలో అతనికంటె అక్షరాలా తక్కువ స్థాయినే ఉన్నాడు.

భాగీని మధ్యవర్తిత్వం వహించవలసినదిగా పిలిచారు. దోడో ఆమె స్వంత సోదరుడే అయినా జ్యేష్ఠుడుగా ఛాన్‌సర్ పక్షానే నిర్ణయం చేసింది. ప్రభువులంతా ఛానెసర్‌ను సభకు ఆహ్వానించి యిలా అన్నారు.

రమ్ము, మీ తండ్రి సింహాసనమునకు, రమ్ము ఛానెసర్, రమ్ము.

అదృష్టము నీ పక్షమున నున్నది, మీ తల్లి నిను గన్న అదృష్టము కాలానుగుణముగ వర్తించి, సింహాసనాన్ని అదిష్టించుటకు బదులు యిట్లా అన్నాడు.

సేనలను ఆయత్తపరచుడు యీలోగా, ఇంటికి పోయిరానిండు నన్ను మా తల్లిగారిని అడుగనిండు నన్ను, పూజనీయ వయస్కురాలు ఆమె ఛానెసర్ వెళ్లిన మరుక్షణమే అతని ప్రవర్తనను అందరూ విమర్శించారు. ఆడువారికి సంబంధంలేని విషయాలలో తల్లిని సంప్రదించే పాలకుని తాము ఎట్లా విశ్వసించడం ? అందువలన దోడోను తమ ముఖ్యునిగా కోరారు. అంతఃపురంలోనికి పోయిన ఛానెసర్ తల్లిచేత, సోదరిచేత తిరస్కృతి పొందాడు. తల్లి యీవిధంగా అన్నారు.

నిన్నీ భువిలోనికి మగబిడ్డగా తెచ్చితిని, కాని నీవు ఆడుబిడ్డ వైతివి.

నూలువడకు చక్రముల వైపు పొమ్ము ముప్పదిపోగులు అవిసె నార వడకుము.

తల్లికి మేనకోడలైన అతని భార్య ఎత్తిపొడుపుగా ఇలా అన్నది.

అత్తా ! యీ నా భర్తనుద్దేశించి మాట్లాడితివా ?

నూలు వడకు చక్రముల మధ్యకు పోనిమ్ము, ముప్పది పోగులు అవిసె నార వడకనిమ్ము.

ఆతడు ఇంటి పనులకే తగినవాడు ; పరిపాలనతో ఆతనికేమిపని ? దోడో సింహాసనము నెక్కెనని తెలుసుకొని ఖానెసర్ ఉగ్రుడయ్యాడు. పగ సాధింతునని ప్రతిన చేశాడు. అతని నిర్ణయాన్ని తల్లి ప్రశంసించి ఇలా ప్రోత్సహించింది.

మామిడికాయలు రాల్చుము, తుఫాను రేపుటకు విజృంభించుము.

ఈ రెండిటి నుండీ వంచితుడవు కాకుండా చూసుకొనుము. సింహాసనమును తనకు వదలి పోవలసినదిగా దోడోకు సందేశం పంపి అందుకు సమాధానం లేకపోవుట వలన ఖానెసర్ అతనిని భయంకర పరిణామములను పేర్కొని బెదిరించాడు. ఢిల్లీ సుల్తాన్ అల్లాఉద్దీన్ సహాయము నర్థించి సింహాసనంనుండి పడదోస్తానన్నాడు. దోడో పట్టు వీడలేదు. అతని మంత్రులు, సామంతులు ఖానెసర్‌కు తమ ఏలికగా ఉండుటకు ఏవిధమైన అవకాశమూ వదలలేదు. అప్పుడు ఖానెసర్ ఢిల్లీకి పోయి, తన సోదరి భాగిను, ఇతర యువతులను సుల్తానుకు కానుకగా చూపి ఇలా అన్నాడు.

నా తండ్రి తొమ్మిదిమంది చక్కని చుక్కలను విడిచివెళ్లినాడు. నీకు కానుకగా వారిని తెచ్చుచుంటి, కాని దోడో నాచేయిని ఆపివైచెను.

నా విధి, నీకు తెలియచెప్పుట, నీ ఇష్టము ప్రతీకారచర్యగైకొనుము. దోడోను పదచ్యుతుని చేయుటకై సుల్తాన్ అల్లాఉద్దీన్ సింధుపైకి దండెత్తాడు. సింధీ సైన్యము రాజసైన్యానికి ఏ మాత్రమూ దీటుకాదు. ఖానెసర్ కుమారుడు, తనకు కాబోయే అల్లుడు అయిన నంగర్‌ను దోడో, తన పక్షమున సుల్తానుతో విన్నపము చేయడం కోసం పంపించాడు. సుల్తాన్ మొదట దోడో పక్షమున జాలిపడ్డాడు. కాని భాగీ యింకా తనది కాదని ఖానెసర్ జ్ఞప్తి చేయగానే దోడో రాయబారితో సుల్తానిట్లా అన్నాడు. అన్నదమ్ములిద్దరు తిరిగి పరస్పర మిత్రులై భాగిని నా కొసగుడు అప్పుడు సుమరులు నాచే గౌరవములు బహుమతిగా భూములు పొందండి.

త్వరగా పోయి వివాహ సన్నాహములు చేయండి. సుమరులు తమ కన్యలను సుమరేతరుల కిచ్చి వివాహ చేయనంగీకరించరని వాదించి, అది

తగదని, సుల్తాన్‌ను నంగర్ బ్రతిమాలాడు. సుల్తాన్ కుపితుడై యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు. మొట్టమొదట ప్రమాదానికి గురియైనది దోడోకు కాబోవు అల్లుడు, ఖానెసర్ కుమారుడు అయిన నంగర్. నంగర్ మొఘలులతో భయంకర యుద్ధం సాగించాడు. రాకుమారుడు నేల కొరిగాడు. ఎందరో యోధులు మరణించారు. నిస్సహాయుడైన నంగర్ యుద్ధ భూమి పై పడిపోయాడు. నంగర్ మృతదేహమును రాచనగరికి కొనిపోయారు. అతనికి కాబోవు భార్య కోయల్ జీవితాంతము అవివాహితగా ఉంటానని ప్రతిన బూనింది.

తరువాత జరిగిన ఘోర సంగ్రామంలో దోడో ప్రాణస్నేహితుడు హాస్సో అమరకోట నుండి సోడా రాజపుత్రులను సహాయము కొరకై తీసుకు వచ్చాడు. అత్యద్భుత వీరకృత్యాలు సాగించాడు. గాని అల్లాఉద్దీన్ సేనాని సాదిర్ చేతిలో మరణించాడు. కచ్‌లోని సమ్మాపాలకుడు అబ్రో వద్దకు తమ అంతఃపుర స్త్రీలనందరిని ప్రాణరక్షణకొరకు పంపి, దోడో స్వయంగా యుద్ధభూమికి వెళ్లాడు. తన ప్రాణాలను ఒడ్డియైన సుమరస్త్రీలను కాపాడతాడనని అబ్రో వాగ్దానం చేశాడు.

ఒక్కొక్క సుమరస్త్రీ రక్షణకై నా ప్రాణములర్పింతుననీ, తాను నిశ్చింతగా యోధునివలె పోరాటము సల్పవలెననీ అబ్రో, దోడోకు వర్తమానం పంపాడు. దోడో ధైర్యముగా పోరాడాడు. కాని పరిస్థితులు అతనికి తోడ్పడలేదు. అతను యుద్ధంలో మరణించాడు. అల్లాఉద్దీన్ సుమరస్త్రీలను తన అంతఃపురములో చేర్చుకోవాలన్న ఇచ్ఛతో ప్రవేశించాడు. కాని అంతఃపురమంతా నిర్మానుష్యంగా ఉంది. స్త్రీలందరు అబ్రోవద్ద తలదాచుకొన్నారని తెలియగానే మథెలో, ముల్తాన్‌లకు పరిపాలకునిగా చేస్తాననీ, సుమరస్త్రీలను తనకైవశం చేయమనీ అబ్రోకు ఆశ జూపాడు. అబ్రో సమాధానం సుస్పష్టంగాను దిశలు మార్మోగునట్లుగానూ ఉన్నది.

మథెలోగాని ముల్తాన్‌గాని నాకు ప్రియమైనవి కావు.

సుమరస్త్రీలను నీకప్పగించు అవమానముకంటె చావుమేలు. అబ్రో కుమారుడు మామత్ ధైర్యసాహసాలు ప్రదర్శించి పోరాడిన తీరుచూచి అల్లాఉద్దీన్ చకితుడైనాడు. ఎట్టకేలకు మామత్, అతని దాయాది సబర్, అబ్రోసుల్తాను సేనలధాటికి తట్టుకోలేక నేలకొరిగారు.

సూర్యరశ్మి అచ్ఛాదితమైనది, చీకటు లావరించె నెల్లెడల, అబ్రో సాహసోపేతముగ పోరాడె పర్రనేలల ఉప్పెనపొంగి వచ్చినట్లు అల్లాఉద్దీన్

సుమర రాణివాసస్త్రీల బాహుబంధాలలో తన కామదాహాన్ని తీర్చుకుందుకు పోగా అక్కడ అతనికి బూడిదతప్ప ఏమీ మిగులలేదు. స్త్రీ లందరూ రాజపుత్‌లుచేసే జోహార్ - చితిపై ఆత్మదహనం చేసుకున్నారు.

ఈ గాధను జాగ్రత్తగా పరిశీలించితే దోడో, ఖానెసర్, హస్సో, అబ్రో మొదలైన వారందరూ హిందూ రాజపుత్ జాతీయులనీ, యీగాధ జరిగిననాటికి వారిని ఇస్లాం మతంలోనికి మార్చలేదనీ స్పష్టమవుతుంది. మహమ్మద్‌సిదిక్ మెమొన్ తమ సింధీ సాహిత్య చరిత్ర (History of Sindhi Literature) లో యీ కధ వర్ణించారు.

ఇప్పుడు సింధుదేశంలో అందరికీ తెలిసిన ఏడుగాధల వద్దకు మనం వద్దాం. ఈ ఏడుగాధలను సింధు దేశంలోని మహాకవి షాలతీఫ్ మొదలైన వారు అజరామరం గావించారు. సింధీ సాహిత్యానికి యివే మూల సామగ్రిగా ఏర్పడ్డాయి. ఈ ఏడుగాధలకు విభిన్న పాఠభేదాలు ఉన్నాయి. వాటిలో ఎక్కువ ప్రచారంలో వున్నవాటిని యీ క్రింద పొందు పరచడమైనది.

రాయ్‌డైయక్ :

అతి ప్రాచీనమైన ఈగాధ యీనాటి బక్కచిక్కిన సింధు దేశానికి కాక విస్తృతమైన సింధుదేశానికి చెందినది. ఇది బృహత్ సింధుకు అంటే కచ్, గుజరాత్‌లు సింధులో భాగంగా ఉన్నప్పటిది. సుర్‌సోరట్‌లో చెప్పిన రాయ్‌డైయక్ ఉదంతం 1003 - 1010 మధ్య కాలంలో జునాగఢ్ సౌరాష్ట్రలోని గిర్నార్‌ని పాలించిన రాయ్‌దేవాస్‌కి చెందినదనీ వారు సింధుదేశవాసి (చూడ) సమ్మజాతికి చెందినవారనీ రాయ్ వంశస్థులను చాచ్ (బ్రాహ్మణుడు) పదవీ చ్యుతులను చేసిన వెనుక సింధు నుండి కచ్ సౌరాష్ట్రాలకు వలసపోయారనీ చెపుతారు. రాయ్‌డైయక్ లేక రాయ్‌దేవాస్ యొక్క తండ్రిపేరు రాయ్‌కన్వట్. రాయ్‌డైయక్ గురించి సింధులో ప్రచారంలో ఉన్నగాధ గుజరాత్‌లో రాయ్‌దేవాస్, రానిక్‌దేవి వీరి వేరు వేరు కథలు కలిపి చెప్పినదే. షాలతీఫ్ చెప్పిన రాయ్‌డైయక్ ఒక పరివ్రాజకుడు. బిజార్ కారణంగా తన తలనే నరుకుకున్న విషాదగాధ ఓడెరొలాల్ సింధులో ప్రభవించన కాలానికి ఏభైసంవత్సరాల తరువాత 1010లో జరిగింది. మరి యే ఇతర మహమ్మదీయ చరిత్ర కారులుగాని, షాకు పూర్వులెవ్వరూగాని ఈకథ గురించి చెప్పకపోవడం చేత, షా చెప్పిన విధంగానే దీనిని పునర్నిర్మించుకోవాలి. బ్రిటిష్‌వారు సింధును చేపట్టిన తరువాత అచ్చయి విద్యాలయాల్లో పాఠ్యాంశంగా వచ్చిన మొట్టమొదటి సింధీవచన కథ రాయ్‌డైయక్‌కు చెందినది. సింధీ వ్యాకరణముపై వెలు

వడిన ప్రప్రథమ గ్రంథంలో యీకథ సింధీవచనమునకు ఉదాహరణగా పేర్కొనబడింది. అది ఎంతో చక్కని ఉదాహరణ!

ఈకథ జునాగఢ్ పాలకుడైన రాయ్‌డైయక్ సోదరికి ఒక మగశిశువు జన్మించడంతో ప్రారంభమవుతుంది. రాజధాని గిర్నార్‌కోటలో, ఆమె చూలాలుగా ఉన్న రోజులలోనే జోస్యులు, మేనమామను అనగా ఆమె స్వంత సోదరుని చంపే ఒక మగశిశువును కనబోవునని జోస్యం చెప్పారు. పురిటి గదిలో పనిచేస్తున్న దాదితో తల్లి ఆ శిశువు ప్రాణం తీసివేయవలసినదిగా చెప్పింది. శిశువు అందంచూచి ముగ్ధురాలయిన దాది ఆశిశువును చంప చేతులాడక, ఒక పెట్టెలో నుంచి నదిలో జారవిడిచింది. ఆపెట్టె నీటిలో తేలి ప్రవాహంలో కొట్టుకొని గుజరాత్‌లో అనైరాయ్ సరిహద్దులలో చరన్ అను భృత్యుని కంటబడింది. వెంటనే అతడు, అతనిభార్య ఆ శిశువును దత్తత తీసుకొని ఆ శిశువుకు బిజాల్ అని నామకరణం చేశారు.

ఆ బిజాల్ అనేక విద్యలలో ప్రావీణ్యత సంపాదించాడు. ముఖ్యంగా జంతునరాలు తీగెలుగా అమర్చిన స్వరమండలముపై కమాను నడిపి సంగీతాన్ని పలికించడంలో ప్రవీణుడై మానవులను, మృగములను కూడా ఆనందపరవశులను చేశాడు. బిజాల్ తన చంగ్ లేక స్వరమండలిపై సంగీతాన్ని అత్యద్భుతంగా వాయించుతున్నప్పుడు గిర్నార్‌లో జరిగిన ఒక సంఘటన ఫలితంగా అతని జీవితమే పూర్తిగా మారిపోయింది. రతన్ అనే కుమ్మరి కూతురు అతిలావణ్యవతియైన సోరత్‌ను, బిజాల్ ఏలిక అయిన అనైరాయ్‌తో వివాహం జరపడానికి ఊరేగింపుతో తీసుకొనిపోతున్నప్పుడు అడ్డగించి ఆమెను ఎత్తుకొనిపోయి రాయ్‌డైయక్ కిచ్చి వివాహం చేశాడు.

రాయ్‌డైయక్ జోక్యం వలన సోరత్ తనకు భార్యగా దక్కని అవమానము వల్ల ప్రత్యర్థిని ఎదిరించుటకు సైన్యాన్ని ఆయత్తపరచాడు. కాని సోరత్‌తో రాయ్‌డైయక్ అపర్‌కోట్‌లో దాగొన్నాడు. ఆకోట ముట్టడి ప్రయత్నం విఫలమయింది. ఈవిధంగా భంగపడిన అనైరాయ్ తననగరి చేరి ఒకపళ్లెం నిండా వజ్రవైడూర్యములు ప్రోవుగాపోసి, తమ ప్రభువు అనైరాయ్ యొక్కముద్దులకోరిక సఫలముచేయ గలిగినవాడు ఎవడైనా యీ పళ్లెంలోని సంపదను తీసికొనవచ్చునని, ఆపళ్లెమును ఊరంతా త్రిప్పి చాటింపువేయించాడు. బిజాల్ భార్య తనభర్త యీ కార్యము సాధించ గలడన్న ధైర్యంతో ఆ పళ్లెమును తీసుకొని, భర్తయింటికి వచ్చిన తరువాత చెప్పింది. బిజాల్ వెంటనే రాజాస్థానమునకు వెళ్లాడు. రాయ్‌డైయక్ శిరము తనకు తెచ్చియివ్వవలసినదనీ, ఆపళ్లెములోని వజ్రవైడూర్యాల వెల

అదియేననీ అనైరాయ్ చెప్పగా బిజాల్ దిగ్భ్రాంతుడయ్యాడు. బిజాల్ సమాధానమేమి యివ్వగలడు ? ప్రభువు ఆజ్ఞ తిరస్కరించినట్లయితే అతని ప్రాణాలూ అతని బంధుమిత్రుల ప్రాణాలు దక్కవు. బిజాల్ స్వరమండల వాద్యమును చేతపట్టుకొని తనదారిని బయలుదేరి జునాగఢ్‌లోని గిర్నార్‌వైపు పయనించాడు. స్వరమండలము వాయించేటప్పుడు పెద్దజనసమూహం పోగైంది. రాయ్‌డైయక్ అతనిని రప్పించి అతని వాద్యకౌశలం గమనించి ముగ్ధుడయ్యాడు. బిజాల్‌ను ఏదైనావరం కోరుకొమ్మనీ, అది వెంటనే తీర్చుతాననీ చెప్పాడు. రాయ్‌డైయక్ హృదయ పూర్వకంగా చెప్పిన మాటలేననీ బిజాల్‌కు నమ్మకం కుదిరిన తరువాత తానుకోరబోయే వరం ఐశ్వర్యం, పదవి, వీటికి అతీతమైనదనీ ప్రాపంచిక సంపదలన్నిటిని మించినదనీ అన్నాడు. అప్పుడతడు "ఓరాజా ! నాకు నీ శిరస్సుకావాలి" అన్నాడు. ఆశ్చర్యం కలిగించే యీ కోరిక విన్న రాణిసోరత్ తమ ఐశ్వర్యాన్నంతటినీ ఇచ్చివేస్తాననీ, కోరినపక్షంలో అతనికి బానిసలుగా ఉంటామనీ అంది. కాని అతని పట్టుదల నుండి బిజాల్‌ను ఎవ్వరూ కదల్చలేక పోయారు.

రాయ్‌డైయక్ తన మాటకు కట్టుబడి తన శిరస్సును ఖండించు కొన్నాడు. బిజాల్ ఆ శిరస్సును తీసుకుపోయి తన ఏలిక అనైరాయ్ సముఖాన ఉంచాడు. కాని అనైరాయ్‌కి బిజాల్ ఒక పెద్దరాక్షసునిలా కనిపించాడు. అతన్ని కుటుంబంతో పాటు రాజ్యాన్ని వదిలి పొమ్మని ఆజ్ఞాపించాడు. వెంటనే బిజాల్ బయలుదేరి జనాగఢ్ చేరుకున్నాడు. అప్పటికే సోరత్ తన భర్త శిరో రహిత దేహాన్ని ఒడిలో పెట్టుకొని మంట లలో ప్రవేశించడానికి సిద్ధంగావుంది. అదే మంటలలో బిజాల్, అతని భార్యకూడా దూకారు. ఈ విషాదభరిత నాటకంలో మిగిలిన ఏకైక పాత్ర ధారి అనైరాయ్ దుఃఖభరితమైన జీవిత శేషాన్ని పశ్చాత్తప్తుడై కొన సాగించాడు.

లీలా చానెసర్ :

1288-1306 మధ్య తట్ట సమీపంలో వున్న దేవల్ కోటను పాలించిన సుమర పాలకుడు చానెసర్, అతని భార్యలీలాపేర యీ రెండవ గాథ 'తహ్‌ఫత్ అల్‌కిరం' ప్రచారంలో వుంది. ఆకాలంలో సింధీ ఓడరేవుగా నున్న లఖ్‌పట్‌కి సోలంకీ ప్రభువుగా నున్నరాయ్‌ఖన్‌గర్ కుమార్తె కౌన్‌రూ చానేసర్‌ను గాఢంగా ప్రేమించింది. కాని అతను భార్యలైలాను ప్రేమగా చూసుకుంటూ ఉన్నాడు. అందుచేత, అతని దృష్టిని మరల్చలేకపోయింది.

ఇది పని కాదనుకొని సేవకురాలి వేషంలో లైలా అంతఃపురంలో ప్రవేశిం చింది. కొలది కాలంలోనే ఆమె లైలాకు చాలా ప్రేమ పాత్రమైన సేవకు రాలయింది. లైలా తరుచూ ఆమె యొక్క విషాద వదనం చూసి కారణం యేమిటని ప్రశ్నించేది. మంచి అదను చూసి తన హృదయంలో దాగి వున్న అసలైన కథ బయట పెట్టింది కౌన్‌రూ. తాను సోలంకీ రాజకుమారిననీ లైలా భర్తతో తనను ఒక్కరాత్రిశయన మందిరంలో ఉండనివ్వమనీ తన మెడలోని 'నవలఖ్ హార్' తొమ్మిది లక్షల విలువైనది అమెకిస్తాననీ అన్నది. మెరుస్తున్న కంఠహారాన్ని చూచి మురిసిపోయిన లైలా తన భర్త సగం మైకంలో ఉన్నప్పుడు కౌన్‌రూను శయన మందిరంలోనికి పంపింది. ఉదయం కాగానే తన ప్రక్కన ఒక కొత్తయువతి ఉండడం చూసి చానెసర్ చకితుడయ్యాడు. కౌన్‌రూ తన కథను పూసగుచ్చినట్లు చెప్పింది. అంత వరకూ తన సర్వస్వాన్ని అర్పించిన చానేసర్ మనసు భార్యనుండి విముఖ మైంది. లైలా ఎన్ని విధాల ప్రాధేయపడినా రోదించినా పశ్చాత్తాప పడినా ఫలితం దక్కలేదు. అమె మహలును కూడా విడిచి వెళ్లవలసి వచ్చింది. కౌన్‌రూను చానెసర్ ప్రియురాలిగా అంగీకరించాడు. పరిత్యక్తఅయిన లైలా విరహ వేదనను సింధీకవులు వర్ణించారు.

లైలా తన పుట్టింట కాలం గడుపుతూ చానెసర్ ఒక వివాహ సందర్భంగా వారి నగరానికి వచ్చేవరకూ వేచివుంది. ఆ కల్యాణపు విందు సమయంలో నర్తకి వేషం ధరించి అద్భుతంగా నృత్యం చేసింది. విందుకు విచ్చేసిన అతిధులందరి హృదయాలను చూరగొంది. ముఖ్యంగా అమె లయనుకని, శ్రావ్యమైన గానం విని పరవశుడైన చానెసర్ ముఖం మీద ముసుగు తెరను తొలగించవలసినదిగా అమెను కోరాడు. ప్రార్థించాడు. ఎంతో మురిపెముతో అమె ముఖముపై నున్న తెరను తొలగించగా తన హృదయాన్ని దొంగిలించిన నర్తకి వేరెవ్వరోకాక తన లైలాయేనని తెలుసుకొని ఆనందపారవశ్యంతో అమెను తిరిగి చేపట్టాడు. కొన్ని భేదా లలో యీ కథను దుఃఖాంతంగా చూపించారు. పెళ్లి విందులో నృత్యం చేసిన లైలా తన కష్టాలనుండి విముక్తి పొంది చానేసర్ చేతుల్లో మరణిస్తుంది. ఆ వెంటనే చానేసర్ కూడా మరణిస్తాడు.

### ఉమర్ మరుయి :

చారిత్రక క్రమంలో తరువాతి గాధ మరుయి గురించినది. సింధీ జీవనంలోను సాహిత్యంలోనూ ఎల్లప్పటికీ చిరస్థాయిగా వెలుగొందిన నాయిక మరుయి. అమె దేశభక్తికి, స్వామి భక్తికి ప్రతీక. కచ్ వీర

గాధలు ఆమెను రాజవంశీయురాలినిగా పేర్కొన్నాయి. ఆమె తల్లి మెరాదీ ఆమెను థార్‌లోని ఒక గ్రామం (కరాచీ వద్దనున్న మాలిర్‌కాదు) మాలిర్‌కు తీసుకుపోయింది. అక్కడ మారు తెగకు చెందిన పాల్నా (పవారులు లేక వృత్తి రీత్యా ఆవులకాపరులు, గొఱ్ఱెలకాపరులు) వారికి ఆశ్రయమిచ్చి ఆమెను తన కూతురుగా పెంచుకొన్నది. ఆమె అక్కడే పెరిగింది. అంద మైన యువతిగా ఎదిగింది. ఆమె పితామహుడు ఖెట్‌సెన్ అనే తోటి కులస్థు నికి ఆమె నివ్వడానికి నిశ్చయించాడు. అందుకు ఫొగ్‌సెన్ కినుక వహించి అమర్ కోటకు వెళ్లిపోయాడు. థార్‌ను 1335-1390 మధ్య (తహ్‌పత్ అల్‌కిరం ప్రకారం) పాలించిన సుమ్రా పరిపాలకుడు ఉమర్ రాజధాని అమీర్ కోట. రాజాంతఃపురాలలో నివసించవలసిన మరూయి ఒకబీద గ్రామీణుని పాకలో ఉండకూడదని ఆమె అందమును వర్ణించి ఉమర్‌ను ఉత్తేజితుణ్ణి చేశారు. ఉమర్ ఆమెను బలాత్కరించి అయినాసరే తీసుకొని పోవడానికి నిశ్చయించుకొన్నాడు.

వడిగా పోయే ఒక ఒంటెనెక్కి ఆ గ్రామం చేరి మరూయీ నీరు తెచ్చే బావిచెంత పొంచి ఆమెను ఎత్తుకొని అమర్ కోటకు చేరాడు. ఒక పేద గ్రామీణ యువతి అంతఃపుర ఐశ్వర్యాలకూ, ఆర్భాటాలకూ సులభంగా లొంగిపోతుందని ఆయన భావించాడు. కాని మరూయి దృఢ సంకల్పంతో ఉంది. తన ముందుంచిన పంచభక్ష్యపరమాన్నముల వైపు గాని, నగలు, నాణెములు, వస్త్రములవైపుగాని కన్నెత్తి చూడలేదు. తనను తన ప్రియుని (భర్త) వద్దకు పంపమని మాత్రమే అడిగింది. ఆమె రావణుని శక్తిని బోధనలను తిరస్కరించిన మరొకసీత, కాని ఆమె కోసం యుద్ధం చేయడానికి, ఆమెను బంధించి ఉంచిన కోటను ఛేదించుకొని లోనికి చొరబడడానికి రాముడుగాని, హనుమంతుడుగాని లేరు. మరుయి దృఢ సంకల్పం సచ్ఛీలం ఆమె దేశభక్తి సింధీయుల మనస్సులలో ప్రతి ధ్వనించే లాగా పద్యాలలో పొందు పరుబడ్డాయి.

ఓ ఉమర్! నావంటి నిందారురాలైన యువతి శ్వేతదుస్తు లెట్లా ధరిస్తుంది?

ఆమె భర్త థార్‌లో దూషణలతో బాధింపబడుచుండ? మాలిర్‌కు తిరిగి పోవలెనని పవలు రేలు కోరుచున్నానని ఆమె ఉమర్‌తో చెప్పింది. మాలిర్‌లోని సామాన్యమైన వాకపళ్లు తనకి పంచభక్ష్యములకంటె ఇష్ట మైనవిగా ఎంచింది. మాలిర్‌లోని ముళ్లకంపలు అమర్ కోట అంతః పురములోని హంసతూలికా తల్పములకంటె సుఖంగా ఉన్నాయన్నది.

దుస్తులు ధూళి దూసరితములైనాయి. అన్నపానములు లేక దేహం విక్కిశల్యమైపోయింది. తన మరు తనకై నిరీక్షిస్తున్నాడనే ఆశతో, దూరంగా ఉన్న మాలిర్ పోవుదారివైపు మరూయి చూస్తూ ఉండేది. ఇనుప ఊచల వెనుకనుండి దృష్టి సారింపుతూ ఉండేది. ఉమర్‌ను ఆమె దూషించలేదు, శాపనార్థాలు పెట్టలేదు. ఆమె అతనిని సోదరునిగా భావించింది. తోబుట్టువును ఆమెకు కాబోయే భర్త వద్దకు పంపవలసినదిగా కోరింది. ఒకవేళ అమర్ కోటలో ఉండగా ఆమె మరణించినట్లయితే ఆమె మృతదేహాన్ని మలిర్ వద్ద మరువులకు అప్పగించ వలసినదిగాను, మలిర్‌లోనే తన అంత్యక్రియలు జరుపవలసినదిగాను కోరింది. పవలంతా ఇనుపఊచల వెనుక నిలుచొని ఎదురు చూడడంతో గడిపింది. రేయంతా రోదించుతూ ప్రార్థించుతూ గడిపింది.

కాలక్రమేణా ఉమర్‌కు మంచి బుద్ధి వచ్చింది. మరుయి తల్లి తనకు పసితనాన పాలిచ్చి పెంచిందనీ మరుయి తనకు చెల్లెలవుతుందనీ తెలుసుకొన్నాడు. వెంటనే ఆమె వద్దకుపోయి క్షమించమని అర్థించాడు. ఆమె బంధువులను క్షమించమని, కోరాడు. సోదరుడు చేయవలసిన లాంఛనాలతో కానుకలతో ఆమెను తిరిగి పంపించాడు. ఇంటికి చేరిన వెనుక ఆమెకు నిశ్చయించిన వరుడు ఆమెను స్వీకరించడానికి నిరాకరించాడు. రాజాంతఃపురంలో నిర్బంధంలో నున్నవనిత పవిత్రంగా తిరిగి వచ్చిందన్న నమ్మిక లేక ఆతడు నిరాకరించాడు. ఆమె అనేకవిధాల తన నిర్దోషిత్వాన్ని చెప్పుకొన్నది. కాని అతడు లెక్కచేయలేదు. చివరకామె తన పవిత్రతను నిరూపించుకొనడానికి అగ్ని పరీక్షకు సిద్ధపడింది. ఎఱ్ఱగా కాలుతున్న ఇనుపకడ్డీ పట్టుకొన్న తరువాత ఆమెను బంధువు లందరూ ఆమోదించారు. ఉమర్ కూడా ఆమె నిర్దోషిత్వాన్ని వారికి నచ్చచెప్పేందుకు ప్రయత్నించాడు. ఇంకా ఆమె శీలాన్ని శంకించినట్లయితే, శిక్షిస్తాననీ అన్నాడు. కానీ మరుయి కోరిక మేరకు సైన్యాన్ని అమీర్ కోటకు తిరిగి తీసుకుపోయాడు. మరుయితో తనకెట్టి కామ సంబంధమూ లేదని నిరూపించేందుకు అతడు కూడా ఎట్టి పరీక్షకైనా సిద్ధపడ్డాడు.

మరుయి ఉదంతంలోని వివరాలు ఆమె హిందూ వనిత కావచ్చునన్న అనుమానాన్ని మరింతగా బలపరుస్తున్నాయి. అమర్ కోటనుగురించిన అన్ని సందర్భాలలోను ఆ మాట "అమర్ కోట" అన్న ఉచ్చారణ స్ఫురించేలాగ ఉన్నదే గాని ఉమర్ కోట అని లేదు. అంటే అమర్ యొక్కకోట ఉమర్ కూడా ఒక హిందూ రాకుమారుడేనా ? ఈ సంఘటన జరిగేనాటికి సుమ్రాలు ఇస్లాం మతంలోకి మార్చబడలేదా ? ఏది ఏమైనా మరుయి :

సింధీయులందరి - వారు హిందువులైనా, ముస్లిములైనా - అందరి హృదయాలలో నిలిచి వుంటుంది.

## ముమల్ రానో :

చారిత్రక క్రమంలో తరువాతి గాథ, ముమల్ రానో గురించి. మీర్‌పూర్ మథెలో వద్ద రాజానంద్ మీర్‌పుర్ మథెలోను 1395 లో పరిపాలించాడని సింధు గురించి వ్రాసిన పుస్తకంలో ఏబ్బాట్ అన్నారు.

రాజానంద్‌కు తొమ్మిది మంది పుత్రికలు. వారిలో మమల్ చాలా అందగత్తె, సుమర్ చాలా తెలివైనది. రాజా వద్ద ఒక అపూర్వమైన ఎలుగుబంటి దంతం ఉంది. దాని మహాత్మ్యం నీటితోనున్న స్థలాన్ని పొడినేలగా మార్చేస్తుంది. తన ఐశ్వర్యాన్నంతా యీదంత, మహాత్మ్యంతో ఒక నదీ గర్భంలో తనకొక్కనికే తెలిసేటట్లు భద్రపరచుకున్నాడు రాజానంద్. అయినా ఒక ఫకీరుకు యీ రహస్యం తెలిసిపోయింది.

సుమల్ వెంటరాగా రాజానంద్ వేటకు వెళ్లిన అదను చూసుకొని రాజ సౌధానికి ఫకీరు వెళ్లాడు. ఫకీరు ఆర్తనాదం విన్న ముమల్ వెంటనే అతన్ని సమీపించింది. ఏసహాయం కావాలని అడిగింది. తానొక వ్యాధితో బాధపడుతున్నాననీ, ఎలుగుబంటి దంతం వుంటే ఆ జబ్బునయమవుతుందనీ చెప్పాడు. ఆ దంతపు మహిమ తెలియని అమాయకురాలు ముమల్ తన తండ్రి దాచిన ఆ దంతం వెదికి తెచ్చి ఫకీరుకు యిచ్చింది. దాని సాయంతో రాజు దాచిన ఐశ్వర్యాన్ని వెదకి పట్టుకొని ఫకీరు పరారయ్యాడు.

రాజానంద్ వేట నుండి తిరిగి వచ్చి విషయం తెలుసుకొని కుపితుడై ముమల్‌ను చంపబోయాడు. సుమర్ అడ్డుపడి తాను నష్టపోయిన నిధితో సమంగా ధనాన్ని సంపాదించే ఒక అపూర్వమైన ఉపాయం తనవద్ద ఉన్నదని చెప్పింది. కాక్ అనే వింత సౌధాన్ని ఆమె నిర్మించింది. ఆ సౌధం చివరి అంతస్తులో ముమల్ మందిరం ఏర్పాటు చేసింది. ఆ సౌధంలో చాలా చిక్కు ప్రదేశాలు, దార్లు వున్నాయి. మనసును చెదరగొట్టే భయోత్పాతాన్ని కలిగించే చాలా స్థలాలు ఉన్నాయి. ఇవన్నీ దాటుకొని ముమల్ మందిరం చేరడం ఆ భవనం యొక్క రహస్యాలు తెలిసినవారికి తప్ప ఇతరులకు అసంభవం, సుమర్ ఒక చాటింపు వేయించింది. 'ఆ సౌధంలో ముమల్ మందిరాన్ని సునాయాసంగా చేరగలిగిన వ్యక్తిని ఆమె వివాహమాడుతుంది. ఆ వ్యక్తి తన ప్రయత్నంలో ఓడిపోతే, అతని సొత్తంతా ముమల్‌కు చెందుతుంది' అని. చాలామంది రాకుమారులు

ప్రయత్నించారు. కాని కాక్ సౌధాన్ని రక్షిస్తున్న మంత్రశక్తులున్న అంగ రక్షకుడు వారి ప్రయత్నాలను వమ్ముచేశాడు. ఓడిపోయిన వారి సంపద లన్నీ తరిగిపోయిన రాజానంద్ ఖజానాను తిరిగి నింపసాగాయి.

ఎట్టకేలకు 1400 సం॥లో సింహాసనాన్ని అధిరోహించిన హమీర్ సుమ్రా అతని ముగ్గురు మంత్రులు ముమల్ కరగ్రహణం చేయడానికి సిద్ధపడ్డారు. సుమ్రా, మరి ఇద్దరు మంత్రులు తమ ప్రయత్నంలో విఫలు లైయారు. మూడవ మంత్రి రానో తన ప్రయత్నాన్ని విడువక, పట్టు దలతో క్రూరజంతువుల అరుపులకు జడియలేదు. కృత్రిమంగా అమర్చిన సాధనాలు, యంత్రాలు చేసే భయంకర ధ్వనులకు జంకలేదు. ముందుకు సాగాడు. మంత్రగాని మాయలేవీ అతనిని నిరుత్సాహ పరుచలేదు. చివరికి ఆతడు ముమల్ మందిరం చేరుకొని ఆమెను గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు. అతని ప్రభువు, తక్కిన ఇద్దరు మంత్రులు, రానో సౌధంలో ఎక్కడో చిక్కుకొని మరణించి ఉంటాడనుకొని, తిరిగి తమ రాజ్యానికి వెళ్లిపోయారు. ముమల్ రానోలు కొద్ది రోజులు ఆనంద పారవశ్యంలో గడిపారు. కాని రానోకు తన వారిని ఒకసారి చూచి రావలెనన్న కోరిక కలిగింది. ముమల్‌ను అక్కడే ఉంచి హమీర్ సుమ్రా వద్దకు చేరాడు. వెంటనే రానోను బంధించి కారాగారంలో ఉంచాడు. అతనాశిక్షను అనుభవిస్తున్నప్పుడే అతని సోదరి, హమీర్ సుమ్రా భార్య తన భర్తను బ్రతిమాలి అతనికి క్షమాభిక్ష నిప్పించింది. రానో వెంటనే కాక్‌కు పయనమయ్యాడు.

కాని కాక్ వద్ద పరిస్థితులు మరొక మలుపు తీసుకున్నాయి. కపటి యైన సుమల్ మరింత ధనాన్ని ఆర్జించాలని సంకల్పించింది. ఆమె ప్రయ త్నంలో సేవకురాలు నటర్ కూడా వేదోడు వాదోడుగా నిలిచింది. ముమల్ చెంతకు ఎవ్వరూ పోకూడదనీ, ఒకవేళ తిరిగివచ్చినా, ఆమె భర్త కూడా పోగూడదనీ కట్టడి చేశారు. ఆ కట్టడిని అమలు చేస్తానని నటర్ మాట ఇచ్చింది. రానోలేని కారణంగా దుఃఖ భరితయైన ముమల్‌ను ఓదార్చే నెపంతో పురుష వేషం ధరించి ఆమె చెంతనే పడుకొనేది.

అర్ధరాత్రికి కాక్ చేరిన రానో ముమల్ మందిరానికి పోబోయాడు అతన్ని వారించే ప్రయత్నంలో ఆమె వేరొక ప్రేమికునితో ఉన్నదని నటర్ చెప్పింది. ఈ వార్త విన్న రానో నిశ్చేష్టుడై తానే స్వయంగా రుజువుచేసు కోవాలనుకొన్నాడు. నటర్‌ను ప్రక్కకు త్రోసి అంతఃపురానికి వచ్చాడు. ఒక పురుషుని ప్రక్కలో ముమల్ గాఢనిద్రలో మునిగి ఉండడం (సుమల్ మొగము నాతడు చూడలేదు) చూచి మొదట వారిద్దరినీ ఒకే వేటుతో

వధించబోయాడు. ఉద్వేగాన్ని నిగ్రహించుకొన్నాడు. తన రాకను తెలియ చేయడంకోసం తన చేతికర్రను అక్కడే వదలి మెల్లగా బయటికి వెళ్లాడు.

ఉదయం ముమల్ రానో చేతి కర్ర చూచింది. వెంటనే కాక్‌ను విడిచి వెళ్లి అమర్ కోట చేరుకుంది. ఒక వర్తకుని వలె మారువేషం ధరించి రానోను కలిసి అతనితో స్నేహం నెరపింది. వారిరువురు గాఢ మిత్రులయ్యారు. ఎల్ల వేళలా కలసి తిరుగుతున్నారు. ఒకసారి, వారిరువురు పాచికలాడుతున్నప్పుడు రానో దృష్టి పైకెత్తిన మిత్రుని బాహువుపై పడింది. ముమల్‌ను రానో గుర్తించాడు. ముఖాన్ని ప్రక్కకు త్రిప్పుకొని ముమల్ ఎంత బ్రతిమాలినా పెడముఖం పెట్టాడు. భర్తచే తిరస్కృతమైన హిందూ వనిత అనుసరించే మార్గాన్నే ముల్ అవలంబించింది. కట్టెలను చేర్చి నిప్పంటించింది. ఆ అగ్నిఆమెమదూకిన పిదప రానోకూ ఆ సంగతి తెలిసింది. అతడు కూడా అదేమంటలో దూకాడు. ఆవిధంగా వారిరువురు కలుసుకున్నారు.

నూరీ తమాచీ :

ముందు చెప్పుకొన్నవన్నీ సుమ్రమల పాలన కాలంలోని అంతకు ముందు కాలంలోని గాథలు. నూరీ తమాచీల గాథ సమ్మలకాలంనాటిది. సుల్తాన్ ఫిరోజ్ తుఘ్లక్ బందీలుగా పట్టుకొని జాం తమాచీ I మేనమామ జాంజునా, అతని మేనల్లుడు జాచినాలను నిర్బంధంలో ఉంచిన వెనుక తమాచీ I సింహాసనం అధిష్ఠించారు. సమ్మల పరిపాలనలో ఇద్దరు తమాచీలు ఉన్నారనీ, యీ గాథలోని కథానాయకుడు తమాచీ I కాదనీ, తమాచీ II అనీ కొందరు రచయితలు చెప్పారు.

ఏది ఏమైనా ఒక జాం తమాచీ, హాలయకొండల దిగువ భాగాన ఖెుర్‌క్‌ల మధ్యనున్న కీంఝర్ సరస్సు నీట ప్రయాణించుతున్నప్పుడు, ఒక జాలరి కుమార్తెను మొదటి చూపులోనే ప్రేమించాడు. ఆమె పేరు గంద్రి. (మట్టి నుండి పుట్టినది) అతను వెంటనే ఆమె పేరు నూరి (వెలుతురు) గా మార్చాడు. భారతీయ సాహిత్యంలో జాలరి కూతురును ప్రేమించడం కొత్తకాదు. కౌరవ, పాండవుల వంశీయులలో ఒకరు జాలరి కుమార్తెను ప్రేమించారు. ఆమె పేరు సత్యవతి. నూరి, ఆమె తండ్రి, జామ్ తమాచీ కోరిక ప్రకారం జరిపించడానికి సంతోషంతో వెంటనే అంగీకరించారు. నూరీ చాలా విధేయురాలు కావడం చేత తానొక ఉన్నతురాలిగా ఉండడానికి గాని, అధికారాలు పొందడానికి గాని ఉత్సాహపడలేదు. తమాచీ అంతఃపురంలో అతి తక్కువ స్థాయికి చెందినవారిలో ఒకరుగా

ఉండడంతోనే తృప్తిచెందింది. తమాచీ, నూరీల శోభన సమయాన కీంఝర్ సరస్సు, దాని పరిసరప్రాంతాలపై సర్వాధికారాలు, జాలరుల హస్తగతంచేసి, వారు పన్నులు చెల్లించ నవసరములేదని ప్రభువు ప్రకటించ డము చేత కీంఝర్ సరస్సు జాలరి కుటుంబాల వారందరూ ఆనందోత్సా హాలతో ఉన్నారు.

తమాచీ అంతఃపుర వనితలు సహజంగానే నూరీ సద్గుణాలను తెలిసి కొనలేక పోయారు. అయినా నూరీ శాంత చిత్తయై, అణకువతో అందరకూ అన్ని విధాల సేవచేయడంలో నిమగ్నమయింది. ఆమె అణకువకు సాధుత్వానికి పరీక్షా సమయం రానే వచ్చింది. అంతఃపురవనితలందరినీ తమకు నచ్చిన దుస్తులతో అలంకరించుకొని సిద్ధముగా ఉండవలసినదనీ, వారిలో ఒకరిని ఎన్నుకొని, తనతో కూడా తీసుకొని పోతాననీ తమాచీ, ఆజ్ఞాపించాడు. తక్కిన యువతులందరూ కొట్టవచ్చినట్లలంకరించుకొన్నారు. నూరి అతి సాధారణమైన దుస్తులు ధరించింది. తన దృష్టిని నేలపైననే కేంద్రీకరించింది. వారందరినీ పర్యవేక్షించిన తమాచీ అందరిలోను నూరీ అత్యున్నత స్త్రీగా భావించాడు. ఆమె నిష్కాపట్యం, ముగ్ధమనోహరత్వం, సౌందర్యం, వినయం ఆతణ్ణి ఆకర్షించాయి. అసూయ ద్వేష రహితమైన సహజ సౌందర్యంతో ఆమె దేదీప్యమానంగా వెలుగుతున్నది. ఆమెను తన జతగా ఎంచుకొని ఆమె స్థాయిని పట్టపురాణి హోదాకు పెంచాడు. సింధీ సాహిత్యంలో దుఃఖము, విచారములేని ఒకే ఒకగాధగా నూరీ తమాచీల గాధ ప్రసిద్ధికెక్కినది. ఆ కథనిండా పువ్వులు, మొదటనుండి తుదివరకు పువ్వులే !

జాలరి వనితలో దర్పంగాని అహంకారంగాని లేవు.

నేలనంటు చూపులతో ప్రభువును బంధించినది. అది యంతయు ఆమె కళాకౌశలం.

## సుహ్నా మెహర్ :

పద్య కవితా సౌందర్యంతో వర్ణించిన ఏడు గాధలలోను చివరి రెండూ తక్కిన వాటిని మించి ఉన్నాయి. అందులో ఒకటి సుహ్నా మెహర్ కథలో నున్నట్లు నది గురించిన గాధ. రెండవది సౌసీపున్హూన్ కథలో మాదిరి ఎడారి గురించిన గాధ. ఈ రెండు గాధలు సిందుదేశం వెలుపల కూడా ప్రచారంలో ఉన్నాయి. పంజాబ్‌లో సోహినీ మహీవల్ కథకు దీనినే మూలంగా కొందరు భావిస్తారు. సింధీయులు ఇది సరికాదని

అంటారు. షహ్‌దాపూర్ సమీపంలో సుహ్ని సమాధి ఉందని సింధీయుల విశ్వాసం. ఈ కథకు అనేక రూపాంతరాలు ఉన్నాయి. సుహ్ని - తుల అనే ఒక కుమ్మరి కుమార్తె అనీ ఆమెను బంధువర్గంలో ఒకరైన 'డం' కి ఇచ్చి వివాహం జరిపించారనీ అందరూ సమ్మతించారు. అయితే యిక్కడ ఆమె మెహర్ (గొడ్లకాపరి)ను ఏవిధంగా ప్రేమించిందో అన్న విషయమై అనేక వాదాలు ఉన్నాయి. సైర్, అంటే సముద్రం లేక మహానది అన్నమాటను పోలి సహర్ అను పేరును మెహర్‌కు పెట్టారు.

ఒక వాదం ప్రకారం పెళ్లివారు నదిఒడ్డున అవలితీరం చేరడానికి బల్లకట్టు వద్దకు చేరగానే మెహర్ పెళ్లి కుమార్తెకు ఒక గ్లాసుతో పాలు ఇచ్చాడనీ, ఆ తరువాత మెహర్ గాని, సుహ్ని గాని ఇతరుల ధ్యాసయే లేక వారిరువురకు ఒకరికొకరిపై మమత ఆవరించిందనీ అంటారు. ఇంకొక వాదం ప్రకారం మెహర్ బొఖారాకు చెందిన వ్యాపారి యువరాజగు ఇజ్జత్ బేగ్ అనీ, అతడు కుమ్మరి కుమార్తె సుహ్నిని చూచిన క్షణమందే ప్రేమించాడు. ఆమె ముందుండేందుకు అతడు తన గౌరవాన్ని, సంపదను త్యజించాడు. అక్కడే ఉండిపోయాడు. అతడు అతి బీద స్థితికి జారిన వెనుక కుమ్మరి తుల జీతగాని క్రింద తన గొడ్లకాపరి పనికి నియుక్తి చేశాడు. ఆవిధంగా ఇజ్జత్ బేగ్ మెహర్ అయ్యాడు. ఒకసారి యజమాని కుమార్తె గొడ్లచావడికి పోయి తాగేందుకు కొంచెము పాలిమ్మన్నది. అప్పుడాతడు ఒక గేదెపాలు పితికి ఆమె దప్పిక కిచ్చాడు.

ఒక్కగ్రుక్క పాలు త్రాగగానే ఆమె మనస్సు మనస్సున లేదు. అప్పుడే పొదుగు నుండి పిదికిన పాలు. అప్పటి నుండి ఏదో వంక చూచుకొని సుహ్ని గొడ్లచావడిలో మెహర్‌ను కలుస్తూఉండేది. అందువలన పుకార్లు బయల్దేరాయి. ఆ పుకార్లను అంతం చేయడానికి సుహ్నికి వివాహం చేయడమే ఉత్తమ మార్గమని కుమ్మరి భావించాడు. అలాగే చేశాడు. మెహర్‌ను పనినుండి తొలగించాడు. పరివ్రాజకుడిగా తిరిగి తిరిగి మెహర్‌నది అవలి తీరానికిపోయి అక్కడ స్థిరపడ్డాడు.

సుహ్ని తన భర్తడంకు తనకు దూరంగా వుంచమని భగవంతుని ప్రార్థించింది. ఆమె ప్రార్థనలు ఫలించాయి. ఆమె భర్తడంకు భార్యను కలుసుకొనే ఒక్క అవకాశం కూడా చిక్కలేదు. సుహ్నితో ఒంటరిగా గదిలో చేరిన మరుక్షణమే అతన్ని గాఢమైన మైకం ఆవరించింది. ఉదయం వరకూ వొళ్ళు తెలీని నిద్రలో ఉండేవాడు.

అంతలో ఆవలిగట్టున ఎవరో పవిత్రమూర్తి నివాస మేర్పరచుకొన్నట్లు వార్త సుహ్నికి చేరింది. కుతూహలంతో ఆమె అతన్ని చూడడానికి వెళ్లింది. ఇరువురు కలుసుకోగానే ఒకరినొకరు పోల్చుకొని ప్రేమతో ఆలింగనం చేసుకున్నారు. ప్రతిరోజు ఒక మట్టికుండ సహాయంతో నదిపై తేలుకుంటూ ఆవలిగట్టు చేరుకొనేది. రాత్రి భోజనం మెహర్‌తో చేసేది. ఆనందంగా ఆ రాత్రి గడిపేది. తిరిగి ఉదయానికల్లా భర్త డం మేలుకొనే లోపల తన మందిరం చేరుకొనడం ఆమెకు పరిపాటి అయింది. భోజనం సాధారణంగా మత్స్య సమేతంగా ఉండేది. ఒకసారి చేపలు దొరక లేదు. మెహర్ తన తొడకోసి అదే మాంసంగా వండి పెట్టాడు.

వారి పవిత్ర ప్రేమకథ సాఫీగా కొనసాగలేదు. డం సోదరి దీనిని తెలుసుకొన్నది. ఈ పనినుండి సుహ్నిని మళ్ళించాలని నిశ్చయించింది. ఆమె ప్రతిదినము వాడే కుండ స్థానంలో పచ్చిమట్టితో చేసిన కుండను ఉంచింది. ఆ రాత్రి అంధకార బంధురం. ఆకాశంలో అప్పుడప్పుడు మెరుపులు మెరుస్తున్నాయి. నది గట్లు తెంచుకొని నిండుగా ప్రవహిస్తున్నది. సుహ్ని మనసంతా మెహర్‌తో నిండి ఉన్నది. గట్టికుండకు బదులు పచ్చిమట్టితో చేసిన కుండను ఆమె గమనించలేదు. నీట ప్రవేశించింది. మట్టికుండ కరిగిపోయింది. సుహ్ని తనను రక్షించవలసినదిగా మెహర్‌ను ఉద్దేశించి కేకవేసింది. మెహర్ చెవులబడ్డాయి. నావ తీసుకొనే వ్యవధి లేదు. ప్రవాహపు ఉరవడి గానీ పెద్దపెద్ద జలచరాలను చూచిగాని, వెనుదీయక మెహర్‌కూడా నదిలోనికిదూకి, సుహ్నిని చేరి ఆమెను తన బాహువులలో బంధించాడు. ఆ ఇద్దరూ సింధునదీ ప్రవాహమున కొట్టుకొనిపోయి ఆ నదీ జలాలలో శాశ్వతంగా వుండిపోయారు. మూడు సత్వాలు - మూడు విభిన్నముగా నెంచబడిన సత్వాలు ఏకమై, ఒకే ఒకటిగా అయినవి. మూడింటిలో స అను అక్షరముతో మొదలైన నామములు ; స సుహ్ని, సహర్ (మెహర్) సెయిర్-సముద్రమును పోలిన సింధునది.

సుహ్ని సింధునదిలో మునిగిపోయిన వర్ణనలు షాకథనంలో చెరగని ముద్రవేయును. అగాధమైన నీటనున్న క్రూరజలచరములు, వీటి వర్ణన గలదు. ఈ ఉదంతం షాజహాన్ పరిపాలన కాలంలో జరిగిందని చెపుతారు ; అనగా షా అబ్దుల్ లతీఫ్ జననానికి కొద్ది దశాబ్దాల ముందర జరిగింది.

## ససూయియీ పున్‌హూన్ :

ఈ ఏడు గాధలలోను చివరిది అయిన ససూయియీ పున్‌హూన్‌ల ప్రణయ గాధను షా అబ్దుల్ లతీఫ్ పద్యకావ్యంగా మలిచారు. సింధీ సాహిత్యంలో విస్తృత ప్రచారంలో నున్న గాధఇది. విషాదాంతమైన సందర్భాన రోమియో - జూలియట్‌ల కధను పోలివుంటుంది. ఈ కధ సింధుదేశపు సరిహద్దులను దాటి ప్రయాణించింది. కొందరు పంజాబీ రచయితలు యీ కధను కొన్ని సందర్భాలలో ఉదహరించారు. పరిశోధనలు కూడా చేశారు. ససూయియీ సంచరించిన కొన్ని ప్రదేశాలు ఇప్పటికీ ఆమె పేరుననే పిలువబడుతున్నాయి. ససూయియీ (నిజానికి శశి అంటే చంద్రుడు) సింధీభాషలో లోక ప్రసిద్ధమవడమే కాక పున్‌హూన్ అన్న పేరు కూడ దానితో సమంగా "ప్రేమికుడు" లేక "ఆశించినది" అన్న అర్ధంతో ప్రసిద్ధమయింది. సింధీవాఙ్మయంలో ససూయియీ తూర్పు ప్రాంతాల నిగూఢ తత్వజ్ఞానాన్ని క్రోడీకరించి చెప్పిన పద్యాలు తరచుగా ఉదహరింప బడుతుంటాయి.

నాలోనికి చొచ్చుకొనిపోయి నా అంతరాత్మతో భాషించితిని. అచట గిరులు లేవు. అధిగమించుటకు, పొందుట కేదియు పదార్థము నేను పున్‌హూన్‌నే కాంక్షించుచుంటి, ససూయియీగా నుండిన అతి దీర్ఘమగు బాధ.

ససూయి ఒక హిందూ వనితగా నావూ అను బ్రాహ్మణుని యింట జన్మించింది. ఆమె ఒక మహమ్మదీయుని వివాహం చేసుకొంటుందని ఆమె జాతక చక్రాన్ని చూచి ఆ బ్రాహణుడు దిగ్భ్రాంతుడైనాడు. ఒక పేటికలో ఆమె నుంచి నదీ జలాల్లో వదిలి వేశాడు. ఆ పేటిక నదిలో తేలుకుంటూ భంభోర్ అన్న జనపదం ఒడ్డుకు చేరింది. భంభోర్, మక్రన్‌నుండి తట్టకు పోవు జాతీయ రహదారిపై ఉన్నది. అక్కడ నున్న మహమ్మద్ అను రజకుడు ఆ పెట్టెను వెలికితీశాడు. ఆ పెట్టెలోని శిశువును తన స్వంత బిడ్డగా పెంచాడు.

ససూయి చంద్రబింబంలాగ చల్లనికాంతులతో పెరిగి పెద్దదయింది. అందుచేత ఆ పేరే ఆమెకు ఖాయం చేశారు. తట్ట విపణవీధికి వివిధ ప్రాంతాల నుండి వచ్చే వర్తకులు భంభోర్ గుండా పోతూ ఆమె అంద చందములు చూచారు. అందుచేత ఆమె ఖ్యాతి నలుదిశలా వ్యాపించింది. మక్రన్‌పాలకుడు అరిజాన్ పెద్దకుమారుడు పున్‌హూన్ ఈ అందాలరాణి సొగసులను స్వయంగా చూడవలెనన్న ఉత్సాహంతో ఒక వర్తకుని

వేషంతో భంభోర్‌కు పయనమయ్యాడు. అచట తన సరకులను బేరానికి పెట్టాడు. అతను తెచ్చిన సుందరమైన వస్తువులను కొనడానికి వచ్చిన వారిలో ససూయీ కుడా ఉంది. ఇరుపక్షములవారికి మొదటి వీక్షణంలోనే ప్రేమ ఉదయించింది. పున్‌హూన్ తాను యువరాజునన్న విషయమే మరచిపోయాడు. తన ప్రేమ మూర్తికి దగ్గరలో ఉండే తలంపుతో భంభోర్‌లోనే పున్‌హూన్ స్థిరపడిపోయాడు. ప్రేమ, హత్యల రహస్యం దాగదుగదా! అనతికాలంలోనే మహమ్మద్‌కు, తన కుమార్తెకు మక్రన్ యువరాజుకు మధ్య ప్రేమానుబంధం ఏర్పడిందని తెలియవచ్చింది. పున్‌హూన్ తనకు ససూయీని ఇచ్చి వివాహము జరుపవలసినదిగా మహమ్మద్‌ను అడిగాడు. మహమ్మద్ అతని అర్హతను నిర్ణయించడానికై పరీక్షించుతానన్నాడు. అతడు తన పిత్రార్జితమునంతా వదలుకొని తమలో ఒకడుగా ఉండాలని చెప్పాడు. పున్‌హూన్, ససూయీ సరసనే బట్టలు అతుకుటను మొదలుపెట్టాడు. ప్రారంభదశలో కొంచెం కష్టంగా అగుపడినప్పటికీ, కొలది కాలంలోనే చక్కని నైపుణ్యాన్ని సంపాదించాడు. పరీక్షా సమయం పూర్తికాగానే పెండ్లి జరిగిన పిమ్మట మామగారి యింటనే ఉండడానికి అంగీకరించాడు. మక్రన్‌లోని తన వారి దగ్గరకెప్పుడూ వెళ్ళనన్నాడు. ఆ మేరకు ఒప్పందము కుదిరింది వివాహం జరిగింది.

పున్‌హూన్ చాకలి వృత్తిని ప్రారంభించగానే అతని పరివారమంతా మరలిపోయారు. పున్‌హూన్ తండ్రి తన కుమారుడు చేసిన పని తెలిసి ఎవరో చావుదెబ్బ కొట్టినట్లు బాధపడ్డాడు. అతని దుఃఖం చూచినవారికి ఆ కారణంగా అతను తన దృష్టిని కోల్పోయి, క్రమంగా క్షీణించి మరణిస్తాడేమో నన్నంత భయం కలిగింది. తమ తండ్రి ప్రాణం దక్కించుకొనవలెనన్న, తమ సోదరుడు పున్‌హూన్‌ను ఏదోవిధంగా తిరిగి తీసుకురావలెనని అతని ముగ్గురు సోదరులు చన్‌రూ, హెూటు, నోటు నిశ్చయించారు. వారు తమ సోదరుని నయాన భయాన తెచ్చిస్తామని తండ్రికి వాగ్దానం చేశారు. ఆయన ఆనందించి, తిరిగి తన రాచకార్యాలలో నిమగ్నుడయ్యాడు.

ముగురు సోదరులు భంభోర్ చేరడానికి అట్టే సమయం కాలేదు. పున్‌హూన్ ఎక్కడ వున్నదీ కనుక్కోగలిగారు. వారి కాపట్యాన్ని నటననూ గుర్తించలేని ససూయీ మరదులను సాదరంగా ఆహ్వానించి వారికి అన్ని సదుపాయాలూ సమకూర్చింది. పున్‌హూన్ వారి బోధనలను పెడచెవిని పెట్టి ససూయీ ఎక్కడ ఉంటే తానూ అక్కడే వుంటాననీ ఇంటికి రాననీ తిరస్కరించాడు. తమ సోదరుని పట్టుదల చూచి అతన్ని బలవంతంగా

ఎత్తుకొనిపోవడం తప్ప వేరే మార్గంలేదని నిశ్చయించుకున్నారు. ఒక రాత్రి విందారగించి మధువు సేవించి మత్తుగా నిదురిస్తున్న సమయాన, దినమంతా పనిచేసి అలసిన ససూయీ గాఢనిద్రలో నున్న సమయాన, ముగ్గురు సోదరులు పున్హూన్‌ను ఒంటెకు కట్టివేసి, అతి ప్రయాసతో ప్రయాణించి, మక్రార్ చేరారు.

ససూయీ ఉదయాన మేల్కొని చూచేసరికి పున్హూన్ జాడలేదు. ససూయీ నిశ్చేష్టురాలయింది. తన తండ్రి సహాయంతో పరారైన వారిని పట్టుకొనుటకు చాలా ప్రయత్నించిందిగాని ఫలితం దక్కలేదు. ఇసుక తుఫాను చెలరేగడం చేత ఒంటెల జాడలు చెరిగిపోయాయి. తన అశ్రద్ధకూ, వివశురాలై నిద్రపోయినందుకూ ససూయి తన్ను తాను నిందించుకుంది. ఒంటెల అరుపులు తన చెవిని పడకుండా వారేం చేయగలిగారో ఆమెకు బోధ పడలేదు. తన మరదులను దూషించబోయింది. కాని, తక్షణమే అది తన కర్మవశమున జరిగినదిగా ఆమె గుర్తించింది. తన మరదులు గాని, వారు పోయిన జాడలను తుడిచి పెట్టిన ఇసుక తుఫాను గాని కారణం కాదని గ్రహించింది.

విధి వ్రాతకు అంతసులభంగా ఆమె తలవంచ లేదు. పున్హూన్‌ను వెతికి పట్టుకోవాలి, లేదా మరణించాలి అని నిశ్చయించుకొన్నది. ఇల్లు వదలి కొండలను, ఎడారిని అతికష్టం మీద కాలినడకను దాటి మక్రన్ చేరు కుంది. అమె కొండలమధ్య, ఎడారిలోను పడిన కష్టాలను సింధీ కవులు మరువరాని శైలిలో వర్ణించారు. ఎడారిలో నడచి కనబడిన ప్రతివ్యక్తిని తన పున్హూన్‌ను చూశారా అని అడిగింది. ససూయీ యొక్క యీ వేదనా భరితమైన అన్వేషణలో కొన్ని మహాత్మ్యములు కూడా సంభవించినవి అంటారు. ససూయీకి పవిత్రముగా తోచిన మబర్ని అను ప్రదేశంలో ఒక నీటిధార నేలనుండి పైకి విరజిమ్మి ఆమె దాహమును తీర్చింది. అక్కడ కర్రతో తాకితే హృదయ విదారకమైన ఆర్తనాదం భూమి నుండి వెలువడుతుందని కూడా చెబుతారు.

ఆమె ఈ అన్వేషణలో ఎడారి మధ్య ఒక ఫలవంతమైన ప్రదేశమును 'ఒయాసిస్' ను సమీపించింది. అచట ఒక మేకల కాపరి తన మేకలను కాచుకుంటూ ఉన్నాడు. ససూయీ తన అలవాటు ప్రకారం 'నా పున్ హూన్‌ను ఎక్కడైనా చూశారా ?' అని ప్రశ్నించింది. ఆ మేకల కాపరి ఆమె అందమును చూచి చకితుడైనాడు. తన తల్లి ఒక చక్కని చుక్కను తెచ్చి వివాహం చేస్తానని చేసిన బాస యీ విధంగా ఫలించబోతున్నదని సంత

సించాడు. ఆమెను పట్టుకొనుటకు ముందుకు వచ్చాడు. ససూయీ తన శీలమును కాపాడుమని భగవంతుని ప్రార్ధించింది. వెంటనే ససూయీ నిలుచున్న భూమి రెండు ముక్కలుగా చీలి ససూయీలోనికి దిగగానే తిరిగి నేల యధా ప్రకారము ఒకటి అయిపోయింది. కాని ఆమె పైటకొంగు మాత్రము భూమి పైకి కనబడుతూ మిగిలి వుంది. మేకలకాపరి యీ అద్భుతమును కను లారా చూసి తన అపరాధాన్ని మన్నించ వలసినదని ప్రార్ధించుతూ రోదిం చాడు. తన పాప పరిహారార్ధం ఆ స్థలమున ఒక సమాధికట్టి, తాను భంగ పరుప నెంచిన దేవతకు, తానే పూజారియై అక్కడనే ఉండిపోయాడు.

పున్‌హూన్‌ను తిన్నగా మక్రాన్ తీసుకుపోయారు. కాని ససూయీ లేని కారణాన అతడు ఉన్మత్తుడయ్యాడు. చివరకు హతాశుడై, అతని మనసు కుదుట బడుటకు, ప్రాణము దక్కించుకొనుటకు, అతని తండ్రి ససూయీ వద్దకు తిరిగి పోవడానికి అంగీకరించాడు. ససూయీ సమాధి వద్దకు చేరేసరికి ఆమె చీరకొంగు అతని దృష్టి నాకర్షించింది. పూజారిని ఏమి జరిగినదో నిజము చెప్పమని అర్ధించాడు. ససూయి జీవసమాధియైనదని విన్న వెంటనే తనను కూడా ఆమె చెంతకు చేర్చమని భగవంతుని ప్రార్ధిం చాడు. పున్‌హూన్ కాలి క్రింద భూమి బ్రద్దలై, అతను కూడా ససూయి ప్రక్కకు చేరిన తక్షణమే నేల మూసుకొని పోయింది. ఆ సమాధి సింధీ యులకే కాక ముల్తాన్ నుండి, ఇతర సుదూరప్రదేశాల నుండి వచ్చే ప్రజలకు పుణ్యక్షేత్రమయింది. సాధారణ ప్రజలకు ససూయి కథ ఒక చక్కని పాఠం నేర్పుతున్నది. తమతోటి వారిని బాగా తెలిసిన వారిని మాత్రమే వివాహం చేసుకోవాలిగాని, పరదేశీయులను ఎప్పుడూ వివాహ మాడకూడదు.

సింధీసాహిత్యంలో అత్యధికశాతం ఈ ఏడు ప్రేమగాధల చుట్టూ తిరుగుతూ ఉంటుంది. ప్రతి కవికి, రచయితకు యీ ఏడు గాధలు మూలగ్రంధాలే! తమ కవితనుగాని, వచన రచననుగాని, వీటినే ఆధా రంగా చేసుకొని సాగించారు. అవి పాటలు, వర్ణనాత్మక పద్యాలు, వ్యాసాలు, వేదాంత ఉపన్యాసాలు యిలాగ అన్నిరకాల సృజనాత్మక సాహిత్యానికీ ఈ ఏడు గాధలు మౌలికమైన ఉత్తేజాన్ని అందజేశాయి. సింధీ భాషా ధ్యయనం చేసే విద్యార్ధికి యీ ఏడు గాధలు తెలియకపోతే, ఇరవైయవ శతాబ్దపు సింధీ సాహిత్యాన్ని కూడా అసంపూర్ణంగానే అర్ధం చేసుకోగలుగు తాడు. సింధీ భాషలోను, సింధీ సమాజంలోను ఈ ఏడు గాధలు జన సామాన్యంలోనికి విశేషంగా చొచ్చుకొని పోయాయి.

ఈ ఏడు గాధలే కాక మరియెన్నో గాధలు, జానపద గాధలు, సింధీయుల స్మృతి పథం నుండి వైదొలగి పోయాయి. తమ 'సింధీభాషా చరిత్ర' (History of Sindhi Language) అన్న గ్రంధంలో నబిబక్స్ బలోక్‌గారు యిలాంటి జానపద గాధలను గురించి పేర్కొన్నారు.[8] సాంప్రదాయిక మోహ పూరిత కధలలో మల్‌మహమ్మద్, మహర్ నిగర్ కధ, స్వర్ణకారుడు ఉమ కధ, ఉమర్ గంగల కధ, ఖుదాదోస్త్ మహమ్మద్ గజ్ని కధలను కూడా ఉదహరించారు. వీర గాధలలో, యుద్ధ గాధలలో 1150-1250 మధ్య సింధీ సుమ్రీలకు, బర్మరుకు చెందిన గజ్జిర్లకు మధ్య జరిగిన సంఘర్షణలు, సుమ్రీలకు అల్లాఉద్దీన్‌కు (దోడో ఛానెసర్‌లగాధ) మధ్య జరిగిన పోరాటం, సుమ్రీల ఉబ్బత్వమును గురించి వీధిగాయకులు, పాడిన కధలు సుమ్రీనాయకుడైన జామ్‌లఖో యొక్క ధైర్యసాహసములు, దాతృతము గురించిన గాధలు, మరికొందరు జామ్‌ల గాధలు ఉ : జామ్‌హాల్ ఇటీవలి కాలంలో వెలువడిన సింధీ పద్య వాఙ్మయంలో వీటిని గురించిన ప్రసక్తి నిక్షిప్తంగా కనబడుతుంది. కాని ఈ కధలేవీ అంత విస్తృత ప్రచారంలో లేవు, సింధీయుల స్మృతి పథంలో నిలిచిలేవు. అక్కడక్కడ వీటి నుండి అంశాలు తీసుకొని హిందీలో వాడుకలో నున్న దోహాలుగా వ్రాతప్రతులలో రెండేసి పంక్తుల పద్యాలుగా భద్రపరుపబడి షాఅబ్దుల్‌లతీఫ్ గారి చెయిత్‌లకు మార్గదర్శకారులుగా ఉన్నాయి.

కోయల్ దీపక్ :

పదునాలవశతాబ్దికి చెందినదిగా చెప్పబడుతున్నదీ, కాని ఇటీవలి కాలంలోనే వెలికి వచ్చినదీ అయిన ఒక సింధీ జానపదగాధ, అరేబియన్ నైట్స్‌ను గుర్తుచేస్తుంది. కోయల్, దీపక్ (దీప్‌చందు) ల గాధ. ఇది సింధీ సాహిత్యంపై యేవిధమైన ప్రభావమూ చూపకపోయినా సింధీ పత్రికలలో కొన్ని దోహాలరూపంలో యీకధ చోటుచేసుకున్నది.

తట్ట పరిపాలించిన ఇబ్నుసూమర్ మహమ్మదీయ మంత్రికుమార్తె కోయల్, ఒక హిందూవర్తకుని కుమారుడైన దీపక్ యీ ఇద్దరూ ఒకే పాఠశాలలో విద్యార్థులు. బాల్యదశలో అంకురించిన అనురాగం వారు పెద్దవారయిన వెనుక ప్రేమగా పరిపక్వతనొందింది. కోయల్ యువతిగా ఎదిగింది. అతనికి దూరంగా వుండగా ఒకబలమైన త్రాటిని ఆధారం చేసుకొని రాత్రిసమయములందు దీపక్ రహస్యంగా, ఆసౌధోపరిభాగానికొచ్చి ఆమెను కలుసుకుంటున్నాడు. ఒక వెన్నెలరాత్రి ఇబ్నుసూమర్ రక్షక భట వేషమున తిరుగుతూ దీపక్‌ను పట్టుకున్నాడు. ఉదయం న్యాయస్థానమునకు

వచ్చేదాకా తనను జామీనుపై విడుదల చేయమని దీపక్ ప్రార్థించాడు. జామీనుగానుండు వ్యక్తిని చూపమని కోరగా అతని బంధువులెవ్వరూ అందుకు అంగీకరింపలేదు. అప్పుడు దీపక్ ప్రాణస్నేహితుడు నవ్‌రంగ్ ముందుకువచ్చి జామీనుగానుండి ఇబ్నసూమర్‌కు తన గృహమును చూపించాడు.'

విడుదల అయిన తక్షణము దీపక్, కోయల్ మందిరమును ప్రవేశించునని గట్టిగా విశ్వసించిన ఇబ్నసూమర్ ఆమె మందిరానికి ప్రక్కగా ఉన్న గదిలో పొంచిఉన్నాడు. కొలది నిముషములలోనే దీపక్ అచటికి చేరాడు. అంతవరకూ దీపక్ రానికారణాన దుఃఖించుతున్న కోయల్ దుస్తులన్నీ తడిసి, కలతనిద్దరలో ఉంది. దీపక్ తన వ్రేలిని కత్తితోకోసి కోయల్ రుమాలుపై తన విషాదగాథను రక్తముతో వ్రాయ బూనాడు. అతడు తన సందేశం వ్రాయడం పూర్తిచేసేలోపలనే కోయల్ మేలుకొన్నది. అతనిని చూసిన సంతోషంలో ఆమె సర్వమును మరచింది. దీపక్ పట్టుబడిన విషయం తెలుసుకొని, అతడు తన నేరమునకు న్యాయస్థానమున విచారణ జరిగిన వెనుక ఉరితీయబడునని తెలిసి, తాను నల్లబురఖా ధరించి అచటికి వస్తాననీ, అతనితోనే తన జీవితమును అంతముగావించుకొంటాననీ ప్రతిన చేసింది. వారిప్రేమ పవిత్రమైనదనీ, విషయ లాలసరాహిత్యమనీ గుర్తించిన ఇబ్నసూమర్ చాలా సంతసించాడు.

మరునాటి ఉదయం దీపక్ ఇంకా నిద్రలోనుండగా, నవరంగ్ భార్య తన మిత్రునికి బదులు తన భర్త నవరంగ్‌ను పోయి ఆ శిక్షననుభవించ వలసినదిగా ప్రార్థించింది. ఇబ్నసూమర్ న్యాయస్థానానికి అటుగా తెరచివున్న సింహద్వారంవద్ద ఒక ఏనుగుతో కావలివానినుంచి, నల్లని ముసుగుతోనున్న వ్యక్తినెవ్వరినీ లోనికి ప్రవేశించకుండా అడ్డగించవలసినదిగా కట్టడి చేశాడు. లోపల న్యాయస్థానమున నవరంగ్ తానే నేరస్థుడనని వాదించి మరణశిక్ష తనకే విధించవలసినదిగా కోరాడు. దీపక్ సభలోనికి ఆతురతగా పరుగిడి వచ్చి తాను అసలైన దోషిననీ, తాను మరణశిక్షకు అర్హుడననీ చెప్పాడు. ఇంతలో మరో కలకలం బయలుదేరింది. నల్లని ముసుగులో ఫకీరు వేషముననున్న వ్యక్తి ఒకరు లోనికి చొచ్చుకొని వచ్చి తాను పవిత్రయాత్రికునిగా ప్రకటించుకొని, ఆ నిందితునికి 'దైవసేవకుల, క్షమాభిక్ష' నిచ్చి దీపక్‌ను రక్షించవలసినదిగా న్యాయస్థానమును కోరడంతో అనూహ్యమైన యీ సంఘటనలకు న్యాయస్థానములోని ప్రతి ఒక్కరూ చకితులైనారు. కాని అన్ని విషయములు తెలిసిన ఇబ్నసూమర్ పరిస్థితులను చక్కదిద్దగా, కోయల్ యొక్క ప్రవిత్రప్రేమ, భక్తి, సమయస్ఫూర్తికి

గుర్తింపుగా దీపక్‌కు క్షమాభిక్ష దొరికింది. ఆమె తన నల్లని దుస్తులతో లోనికి ప్రవేశించకుండ ఆటంక పరచిన ఏనుగును పైనున్న మావటితో సహా చంపి ప్రవేశించింది. నిజమైన ప్రేమికులిద్దరకు, హిందూ మహమ్మదీయ మతపరమైన విధులతో వివాహం జరిగింది. చాల సంవత్సరముల దాకా ఆ దంపతులు సుఖంగా జీవించారు.

# 4

# సూఫీ సిద్ధాంతం, సింధీ జీవన విధానం

సింధీ సాహిత్యం, లిఖిత వాఙ్మయ రూపంలో, అంటే జానపద గేయాల, గాథలనుండి విడివడి ఒక నిర్దుష్టరూపంలో 16వ శతాబ్దపు మూడవ దశాబ్దం నుండి రెండువందల సంవత్సరాలు గడిచిన తరువాత అబ్దుల్ లతీఫ్ పద్యరచనలతో పరిపూర్ణ దశను చేరుకున్నదని సాధారణ అభిప్రాయం. 1520 ప్రాంతాలలో అర్ఘున్ తుర్ఘన్లు సింధు పాలకులయ్యారు. 1520 లో అక్బర్ ప్రభువు సింధును మొగలాయీ సామ్రాజ్యంలో విలీనం చేశారు. అర్ఘున రాక తరువాత సింధులో పర్షియన్ రాజభాష అయింది. బ్రిటిష్‌వారు 1843 లో సింధును జయించేవరకు అది రాజభాషగానే కొనసాగింది.

అర్ఘున్లకు ముందు, ముస్లిములకు పవిత్రమైన అరబిక్ భాష విద్యావంతుల మధ్య ప్రచారంలో ఉండేది. అయితే ఆ ప్రాపకంలో వెలువడిన సింధీ సాహిత్యం ఏమీలేదు. కానీ, సింధీసాహిత్యం రూపొందడానికి పర్షియన్ భాష, పర్షియన్ సాహిత్యంమాత్రం దోహదకారులయినాయి. వందలాది సింధీయులు పర్షియన్‌లో పద్యకవితలు వ్రాయడానికి ప్రయత్నించారు. పర్షియన్‌లో ముస్లిములు వ్రాసిన చరిత్రలలో వారి పేర్లు పేర్కొనబడ్డాయి. కాని ఏ ఒక్కరూ తగు మాత్రమైన సామాన్య స్థాయికికూడా చేరని యీ కుహనా కవులలో ఎవరి గురించైనా ప్రస్తావించడం సమయాన్ని శక్తినీ, వ్యర్థపరచడమే అవుతుంది. అయితే యీ పర్షియన్ వ్యాసంగం మాతృభాషలో - అంటే సింధీభాషలో పద్యాలు వ్రాయడానికి దారి తీసింది. పీర్‌హసముద్దీన్ రష్దీ ననుసరించి మొట్టమొదటి సింధీ పద్యాలు మజిమల్ - ఉల్ - తారీఖ్‌లో ఉటంకించినవే

అరహ బరహ కంకర్హా
కరకరే ముండర్హా

ఐతే యిది సింధీభాష కానేకాదు. పీర్‌హసముద్దీన్ రషీ ప్రస్తావించిన దోడో చానెసర్ గాధ మముయీ కధలు యివన్నీ 1520-21 (అర్ఘుల పాలన ఆరంభం) కి పూర్వం ప్రచారంలో వున్న సింధీ వినికిడి వాఙ్మయం మాత్రమే. అదీగాక యివన్నీ జానపదగాధలే. సమ్మలకాలానికి చెందిన వారంటూ పీర్‌హసముద్దీన్ ఇరువురు సింధీ కవులను పేర్కొన్నారు: సమూయినివాసి (తట్టకు సమీపం) షేక్ హమద్ బిన్ రషీదుద్దీన్ జమాలి (1362లో మరణించారు) షేక్‌ఇషాక్ అహంగర్ (కమ్మరి). సమ్మల పరిపాలన చివరిరోజుల్లో వీరు నరన్‌కోట్ (ఇప్పటి హైదరాబాద్)లో నివసించారు. జమాలి వ్రాసిన రచనలేవీ మిగులలేదు. అహంగ్ వ్రాసిన ఒక్కపద్యం మాత్రం మిగిలివున్నది. "పిచ్చుకనైతి గాను ఎగిరి నా ప్రియుని ఇంటికప్పుపై వ్రాలి కూరుచుండ. నా ప్రియుడంత తన బంగరు వాక్కున నన్ను వారించు 'డిక్' అని 'కేకవేసి', చరిత్రలో యీ తరహాకు చెందిన మరికొన్ని పేర్లు - ఉ॥ దెర్వేష్‌రాజు, షేక్‌ఖిరియా వంటి వారివి గోచరిస్తాయి. గాని వారు వ్రాసినవిగా ఖచ్చితంగా చెప్పదగిన రచనలేవీ కానరావు. అందువల్ల సమ్మల పాలనాంతంలో ఉన్న కవులపేర్లలో, ప్రధముడు నిజమైన సింధీకవి అయిన 'క్వాజీఖజన్' పేరు మాత్రమే మన ముందు ఉంటుంది. వీరు అటు ప్రాచీన జానపద రీతికి, శాస్త్రీయ సింధీ పద్య వాఙ్మయాలకూ మధ్య వారిధిగా భిట్‌వాసి షా అబ్దుల్ లతీఫ్ (1689 - 1752) గారి అత్యున్నత స్థాయినందుకున్నది. సింధీ పద్య రచన షాకు ముందర వెలసిన క్వాజీఖజాన్, తదితర కవుల గురించి చర్చించేముందర సింధీ జీవనవిధానం (సింధీ మతము) గురించి కొంత తెలుసుకోవాలి. ఈ జీవన విధానమే షా రచనల్లోనూ ఇతర సింధీకవుల కవిత్వంలోనూ ప్రతిబింబిస్తూ వుంటుంది. దీనినే సూఫీ సిద్ధాంతం అనీ అంటారు.

సింధీవాఙ్మయం యొక్క ఉనికి, సూఫీ విధానం లేక 'తసవ్వుఫ్' అనే ఆధ్యాత్మిక సిద్ధాంతముతో ముడివడి ఉంది. సూఫీ విధానం ప్రాచీన భారతీయ విజ్ఞానం అనగా వేదాంతం, భక్తి యోగాలతోను, పర్షియన్ పురాతన గ్రంథాలైన జామిగారి యూసఫ్ జులెయిఖా, అత్తర్‌గారి మంతిక్ అల్‌తెయిర్, రూమీగారి మస్నవీలలో ప్రవచించిన ఇస్లామిక్ సూఫీ సిద్ధాంతాలతోనూ కలసిఉంది. ప్రాచీన భారతదేశంలో ప్రచారంలోనున్న సంత్ కవుల ఉద్యమ ప్రభావం పర్షియన్ తెలిసిన సూఫీకవులపై ప్రసరించక పోయినట్లయితే సింధీపద్యవాఙ్మయం వేరొక మార్గంలో పయనించేది. ఏ మత నియమాలలో జన్మించిన వారైనా ఏ మతపరమైన మూఢసిద్ధాంతాలకూ

కట్టుబడి ఉండరనీ, 'సూఫీలా కూఫా' సూఫీయులు ఏ తరహా మత సిద్ధాంతాలకు గాని, సూత్రాలకు గాని కట్టుబడిలేరనీ వీరు ప్రకటించారు

సూఫీ అన్న పదం వివిధ విధాలుగా రూపొందింది. ఖొర్సాల్, ఇరాన్, ఇరాక్‌లలో సూఫీలు ధరించే 'సుఫ్' అనబడే ముతక ఉన్ని దుస్తులనుండి, 'సఫా' అనగా పరిశుద్ధత నుండి 'సోఫియా' అనగా జ్ఞానం నుండి తలెత్తింది. 18 శతాబ్దాంతాన సర్ విలియం జోన్స్ ఇలా అన్నారు: 'తమను సృష్టించిన కరుణామయుడైన పరమాత్మణ్ణి, ఆయనచేత సృష్టింపబడిన జీవులు తమ భక్తి పారవశ్యతను, గాఢమైన ప్రేమానురాగాలను, అలంకారయుతంగా వ్యక్తీకరించడం ఆసియాలో అనాది నుండీ ఉన్నది. ఈ విధానాన్ని పర్షియన్లలోని ప్రాచీన హసంగీలు ఆధునిక సూఫీలు భారత తత్త్వజ్ఞుల నుండి గ్రహించారు....." పగన్ల వేదాంత శాస్త్రం గురించి అది ప్రాదుర్భవించినచోటనే తెలుసుకోవడానికి ప్లాటో ఇటలీ, ఈజిప్టు పర్యటించారని" క్లాడ్ ఫ్లెయురీ అంటారు. "అసలు కేంద్రస్థానం ఇటలీలో గాని ఈజిప్టులో గాని లేదు.... అది పర్షియాలో గాని ఇండియాలో గాని ఉన్నది" అన్నారు. ఆర్బరీ ఉటంకించినట్లే మాల్కొం భారతీయ యోగులు, జ్ఞానులు అవలంబించిన విధానాలు, పద్ధతులనుండే సూఫీ సిద్ధాంతాలను తీసుకున్నారు. అయితే భారతీయ యోగులు అవలంబించిన కఠినమైన నిష్ఠ నియమములను గ్రహించలేదు: పర్షియన్ సూఫీలు చాలవరకూ నమ్మకాలు, వ్యవహరించే పద్ధతులు భారతదేశంనుంచి గ్రహించినా ఆ మోక్షసాధనకు హిందూ భక్తులు అవలంబించిన కఠినమైన విధులు మాత్రం గ్రహించలేదు.

సూఫీ విధానం కొరాన్ బోధలనుండి, ప్రవక్త మహమ్మద్ సూక్తుల నుండి గ్రహింపబడినదనీ అది ఇస్లాంయొక్క గూఢమైన అంతర్భాగమేననీ ఇటీవల సింధీ ముస్లిములు భావించడం ఒక కొత్త వైఖరిగా గోచరిస్తుంది. టిటస్ బర్క్‌హార్ట్ అంటారు. "సూఫీ విధానం ఇస్లాం యొక్క అంతరంగ రహస్యాలకు ప్రతినిధి గనుక దాని సిద్ధాంత సారాంశం కొరాన్‌పై నిగూఢవ్యాఖ్య!" 4

సింధీసాహిత్ సొసైటీ వారికోసం 'తసవ్వుఫ్' పై మిర్జా కాలిక్ బేగ్ గారు ఒక చిన్నపుస్తకం వ్రాశారు. అది 1922లో ముద్రింపబడింది. అందులో ఇదే అభిప్రాయాన్ని వెల్లడించారు. మిర్జాకాలిక్ బేగ్ ఆధునిక సింధీ రచయితలలో ఎక్కువ పుస్తకాలు వ్రాసిన రచయిత. 'సింధులో గాని భారతదేశంలోగాని ప్రచారంలో నున్న సూఫీ విధానానికి పునాది భారతదేశంలో గాని, గ్రీక్ వేదాంతంలో గాని లేదు. అరేబియాలో

మొట్టమొదట మొలకెత్తిన ఇస్లాం సిద్ధాంతాలకిది నిగూఢ వ్యాఖ్యానం. అదే తరువాత 'ఇరాక్, భారతదేశాలకు ప్రాకింది' అని అంటారు మీర్జా కాలిక్ బేగ్. ఇలా అనడంవల్ల ఇదివరకు ప్రచారంలో ఉన్న వ్యాఖ్య లన్నిటినీ ఆయన ఖండించినట్లయింది. వారు సూఫీ సిద్ధాంతాన్ని రెండు రకాలుగా గుర్తించారు. 'సున్నీ తసవ్వుఫ్' అనగా పరిశుద్ధమైన తసవ్వుఫ్ 'షియా తసవ్వుఫ్' అనగా కాంతివంతమైన తసవ్వుఫ్.... అదే పదహారవ శతాబ్దం నుండీ సింధీ పద్యవాఙ్మయం నిండా వ్యాపించి ఉంది.

భారతదేశ విభజన తరువాత చాలామంది ముస్లిం రచయితలు సింధీ పద్యకవిత్వం అంతా ఒకే సామాన్యమైన, మూలవిషయమైన సూఫీసిద్ధాంతం మీాదే ఆధారపడి ఉన్నదన్నారు. ఆ సూఫీసిద్ధాంతం కొరాన్‌లోని కొన్ని బోధ నలపై, ముఖ్యంగా కున్ (ఉండు) ఫయకున్ (ఉండినది) అన్న అతిప్రియమైన సూత్రంద్వారా ఉత్తేజితమైనదని నిరూపించడానికి ప్రయత్నించారు. అయితే ఎవ్వరూ సింధీ పద్యవాఙ్మయంలోని సూఫీవిధాన విషయాలలోని రెండు ముఖ్య సత్యాలను వివరించి చెప్పలేకపోయారు. సింధీ వాఙ్మయం హిందూవేదాంత, యోగ, భక్తివిషయాలను ఎల్లప్పుడూ స్మరిస్తూ, వాటి ఆధారంగానే కొనసాగింది. సూఫీలలో హిందువుల సంఖ్యకూడా అధికం గానే వున్నప్పుడు ప్రత్యేకంగా సూఫీసిద్ధాంతం కొరాన్‌కు వర్తించినదే అన్న వ్యాఖ్య సింధీ హిందువులకు అంగీకార యోగ్యంకాదు. హిందువులు వ్రాసినా ముస్లిములు వ్రాసినా, సింధీ పద్యవాఙ్మయంలో ఒక సత్యం ఉంది. రెండు మతాలవారూ తమ తమ మతాలను బహిరంగంగా ప్రకటించినా, వారి వారి పవిత్ర గ్రంథాలను ఉదహరించి చెబుతూ ఉన్నా, కొన్ని మూల భావాలను అందరూ అంగీకరిస్తారు. కాని యివి సదాచార సంపన్నమైన ఇస్లాముకు అంగీకార యోగ్యాలు ఎంత మాత్రమూ కావు. 1879 లో డచ్ పండితుడు డోజీ యిలా అడిగాడు: ఇప్పటివాదనలబట్టి అంటున్నట్లుగా ఆధ్యాత్మికతత్వం నిజంగా ఇస్లాం అంతరంగంనించి ఉద్భవించినదేనా? అలా సందేహించడానికి బలమైన కారణం ఉంది. ఈవాదనలో ప్రవేశ పెట్టిన సాక్షులు, సాధికారంగా చెప్పనర్హులు కానంతటి ఆధునికకాలానికి చెందినవారు. అదీకాకుండా వారిలోనే చాలామంది తాత్వికులు సూఫీలు కూడా వున్నారు. వారు తమ సిద్ధాంతం ఇస్లాం కాలంనాటిది మాత్రమే కాదంటారు. అలీ, మహమ్మదులను సూఫీలుగా పేర్కొంటారు. అది పురుషుని కాలంలోనే పుట్టినదని చెబుతారు. అబ్రహాం సూఫీయేననీ అంటారు.... అంతకంటే ముఖ్యం. అసలు ఆధ్యాత్మిక తత్వమనేది పర్షియా నించి వచ్చినదే అనడం సమంజసంగా ఉంటుంది. సహజంగా కూడా

ఉంటుంది. నిజానికి ముస్లిములు పర్షియాను జయించడానికి పూర్వమే భారతదేశ ప్రభావంవల్ల అక్కడ ఆధ్యాత్మికతత్వం వ్యాపించి ఉన్నది. ఆ కాలానికి కాస్తముందుగా "పరమాత్మనుండి ప్రతీవస్తువు ఉద్భవించి పర మాత్మలోనే ఐక్యమవుతుంది." అన్నభావన పర్షియాలో విస్తృత ప్రచారంలో ఉన్నది. "గోచరించే ఈప్రపంచానికి ఉనికి లేదు. ఉన్నదంతా పర మాత్మయే, పరమాత్మతప్ప వేరేదీ లేదు." [5] అని సాధారణంగా చెబుతారు.

ఈ విశ్వమునందు ఒకే బ్రహ్మం ఒకేసారం ఒకేజీవి ఉన్నది. తక్కిన వెన్ని ఉన్నా అవి నిజంగా లేనివే. అది అంతా మాయయే! సూఫీలుదానినే 'తిల్సం' అంటారు. ఇదే వేదాంతుల నమ్మిక, దీనినే సూఫీలు కూడా ప్రధానంగా నమ్ముతారు. ఆత్మకు పరమాత్మకు భేదంలేదు. సాంప్ర దాయిక ముస్లిములు మన్సూర్ హల్లాజ్ 'నేనే సత్యాన్ని లేదా పరమాత్మను' అన్నప్పుడు అతని శిరస్సును ఖండించారు. కాని అతను చెప్పినది కుఫ్ గాని, భిన్నమతావలంబకులు చెప్పినదిగాని కాదు. ఆతడు వచించింది పరమసత్యం. మానవుడు తన పూర్వీకులెవరో ఎప్పుడో చేసిన పాపాల ఫలితంగా తాను మానవ జన్మపొందలేదు. ఒక్క మానవుడు మాత్రమే పరమాత్మ పుత్రుడనీ, పరమాత్మయేననీ, వారు నమ్మరు. మనలో ప్రతి ఒక్కరు పరమాత్మ ప్రతీకలే. ఈస్థితిని చేరడానికి మనలను మనమే తెలుసుకోవలసి వుంటుంది; మనమే గుర్తించవలసి వుంటుంది. సింధీ కవు లలో అగ్రగణ్యులు "ఇది సృష్టికర్త, తక్కినవి సృష్టింపబడ్డాయి అనకు. రెండూ ఒకటే" అన్నారు. వ్యక్తి తన దైవసంకల్పితమైన పుట్టుకను దైవత్వమేనని గుర్తించితేచాలు, అదేదైవత్వం. ప్రతి ఒక్కరూ తానువేరు అను భావననుండి విడివడాలి. అన్ని ఉపదేశాలనూ, స్థాయిలను అధిగ మించి షరియత్ - చట్టం, తరిహత్ - మార్గం, హకీకత్ - వాస్తవం అన్న భావాల ద్వారా ప్రయాణించి మార్ఫత్ అంటే తానెవ్వరో గుర్తించగలిగిన అత్యున్నతమైన జ్ఞానాన్నిపొందే స్థాయికి చేరుకోవాలి.

అజ్ఞానమనే తెర విడిచిపెట్టడానికి గురువు లేక ముర్షద్ యొక్క ఉప దేశాన్ని స్వీకరించవలసి వుంటుంది. అన్వేషకునికి అది తప్పకుండా లభిస్తుంది. కాని అందుకు బలమైన ప్రేరేపణా, ఉపదేశమూ కావాలి. ప్రయాసతో ప్రయాణించే బాటసారులకు మార్గం చూపించడం కోసం మహా త్ములైన అబ్దల్లు ఉండనేవున్నారు. ప్రయాణించే వారికి మార్గంలో ఉల్లాసాన్ని కల్గించడానికి ధృవతారలు కుతుబ్లు ఎప్పుడూ వెంటనంటి ఉంటారు. వారి సహాయంతో జ్ఞానులు "తాము పరమాత్మ నుండి వేరు" అన్నమాయ నుండి, అజ్ఞానం నుండి బయట పడవచ్చును. భిన్నత్వంలో

ఏకత్వం ఉన్నదన్న నమ్మకం సడలని వారు సూఫీలు. సూర్యకిరణాల నుండి ఉద్భవించిన వ్యక్తి యొక్క చరమదశ సూర్యునిలో లీనమవుతుందనీ, ఫనా అగుట - అనగా దీనిలోనే లయిస్తుందనీ నమ్మకం గలవాడు సూఫీ. బాకా అనగా పరమాత్మలో ఆత్మ శాశ్వతముగా ఐక్యంచెందే స్థితియే, ఫనా. అదే అంతిమ లక్ష్యము. మానవుడు పరమాత్మతో ఆధ్యాత్మికంగా ఐక్యతను సాధించినప్పుడే ఇది సాధ్యపడుతుంది. ఈ ఐక్యతను సాధించడానికి భక్తి, ఆరాధన, ప్రేమ సరైనమార్గాలు. వీటిద్వారా మాత్రమే మానవుడు ఉన్నతస్థితికి చేరుకుంటాడు. పరమ్మాతతో ఐక్యతను సాధించగలుగుతాడు.

దీప జ్వాలలోపడి భగ్గుమన్న శలభం పరమాత్మలో విలీనమయ్యే విధంగానే మానవుడు కూడా భక్తి, ప్రేమలతో తననుతాను సజీవదహనం చేసుకొని ఆ పరమ్మాతసన్నిధిని చేరుకోవాలి. అందుకు ప్రథమ సోపానంగా సుందరమైన దానిని సాకారంగా ప్రేమించవచ్చు. అది అహాన్ని రూపుమాపుతుంది. కాని నేను, అన్న అహాన్ని నశింపచేసి, అవతలితీరాన్ని చేరడానికి సాకారప్రేమ ఒక వంతెన మాత్రమే. ఆ వంతెనవద్ద నిలుచొని సాకారప్రేమలోని మాధుర్యాలను, దుఃఖాలను చవిచూచి, పారలౌకిక ప్రేమవైపు మరలని వాడు దుఃఖ భాజనుడవుతాడు. సూఫీలు సేవించే మధువు ద్రాక్షపండ్ల నుంచివచ్చే రసంకాదు. అదొక మార్మికమైన ఔన్నత్యం. సమున్నతమైన ఏకత్వం. తనను గురించిన, లేదా ప్రపంచాన్ని గురించిన, ఆలోచన, చింత, లేనంతటి సంలీనావస్థలో సూఫీ ఉంటాడు. 'తానువేరు' అన్న స్మృతి ఉన్నంత వరకు మానవుడు ఏమీకాడు ; 'నఫీ' "తాను తానే" అన్న గుర్తింపును విస్మరించి 'తాను' పరమ్మాతలో తాదాత్మ్యతచెందినప్పుడే ఆతనికి నిశ్చయత్వం, 'అస్బత్' అనుభవంలో కొస్తుంది.

'సింధు, సూఫీలు' (Sind and its sufis) అన్న గ్రంథంలో జెట్‌మల్ పరశురాం సింధీ కవులలో ముఖ్యులైన కొందరి రచనలను పేర్కొన్నారు. సింధీ కవులందరిపైనా - ముఖ్యంగా భారతీయ, పర్షియన్ ఆధ్యాత్మిక తత్వప్రభావాలు ప్రసరించా యనవచ్చు. ఇస్లాం సాంప్రదాయం సంగీతాన్ని, నృత్యాన్ని అభిమానించలేదు. కాని సూఫీయులు ఉన్నతస్థితిని చేరుకోవడానికి సంగీత నృత్యాలను బలమైన సాధనాలుగా వినియోగించారు. సర్వవిధాలైన ప్రాపంచిక వాంఛలను త్యజించాలి. పరలోకాన్ని త్యజించాలి. దైవత్వాన్నే త్యజించాలి. చివరకు పరిత్యాగాన్నే త్యజించాలి. 'నేను' అన్న అహం నశించాలి. కడపటిగా 'నేనే ఆ పరమాత్మను' అన్న భావం రావాలి.

'భిట్ వాసి షా అబ్దుల్ లతీఫ్' (Shaw Abdul Latif of Bhit) అన్న పుస్తకంలో డా॥ సోర్లె ఇస్లాం గురించి యెంతో వివరించారు. సింధీ వారి సూఫీతత్వం, భారతీయుల వేదాంత యోగ భక్తి సమ్మిళితమైన ఆధ్యాత్మిక తత్వం నుండి వేరు చేయరానిదే - అన్న నిర్ణయానికి రాక తప్పలేదు. సోర్లె అంటారు : సూఫీతత్వంలో రెండు గొప్ప లక్షణాలున్నాయి. ఒకటి మానవప్రయత్నం ద్వారా ఆత్మ పరమాత్మతో ఐక్యం చెందుతుందనే విశ్వాసం. రెండవది : నిజమైన దివ్యతేజస్సు మానవునకు గోచరము కాకుండా అడ్డు తెరల వంటివే అస్థిరమైన ప్రాపంచిక విషయాలనీ. ఈ లక్షణాలు షా లతీఫ్ పద్యాలన్నిటిలోను మనకు గోచరిస్తుంది. ప్రముఖ పర్షియన్ కవులందరిలాగే వీరూ తమ ముఖ్యసందేశాన్ని సుబోధకం చేసేందుకు వివిధ రూపాలను వినియోగించారు. నిజమైన ప్రేమ (ఇష్క్‌హకీక్) కు కపటమైన ప్రేమ (ఇష్క్‌మ జాజి) కు, అట్లే అసలైన ద్రాక్షరసానికీ, నకిలీ ద్రాక్ష రసానికీ మధ్యగల వ్యత్యాసం సుస్పష్టం. ద్రాక్షరసవిక్రేత పరమాత్ముడు ఒక చుక్కద్రాక్షరసం చవిచూచి దాని నాణ్యతను నిర్ణయిస్తాడు. తనను తాను తెలుసుకొంటాడు. లిసాలో, తన ప్రేమైకమూర్తి నుండి వియోగం, ఆత్మ పరమాత్మకు దూరంగా ఉండడం, పరమాత్మను చేరడం విఫలం చెందడమూ కనబడుతుంది.

వియోగ సాగరములు, తరగలు,
ప్రతి ఒక్క ఆత్మను విడి విడిగా ముంచివేస్తాయి.

ఇక్కడ విడి విడిగా అన్నమాటను ఒత్తిపలుకుతారు. ఆ ఆధ్యాత్మిక సిద్ధికి చేరేమార్గం, పద్ధతి ముందుకు సాగిపోవడం ఆధ్యాత్మికమైన సంతృప్తి సూఫీ ఆలోచనలో సర్వసాధారణంగా వ్యక్తం అవుతూవుంటాయి. మానవుని ఆత్మ సన్మార్గాన్ని అన్వేషిస్తూ ఉంది. జీవిత పరమావధి ఏమిటంటే, మార్గంలో ఎదురయ్యే ఆటంకాలను అధిగమించి పరిశుద్ధ ప్రేమ మార్గంలో పయనించి దైవత్వ సారాంశాన్ని పొందడం. భక్తుడు (తాలిబ్) లేక అన్వేషకుడు ఒక గురువు (ముర్షద్) సాన్నిధ్యం చేరి ఆధ్యాత్మిక పథికుడు (సలీక్) అవుతాడు. సేవ, ప్రేమ, ఏకాంతం, జ్ఞానం, పారవశ్యం అనే అవస్థలన్నిటినీ దాటి సత్యస్వరూపుడైన పరమాత్మను చేరుకోవడానికి తన వ్యక్తిత్వాన్ని పరిహరించుకొంటాడు. ఈ విధంగా సూఫీ తత్వజ్ఞానం సాధికారంగా కోరేవి ఆత్మీయమైన క్రమశిక్షణ, వివిధ మనోవికారాలను అణిచి పెట్టడమూను. ఇది గాఢమైన నైతిక విధానం మీద ఆధారపడి ఉంది. హృదయ నైర్మల్యం మీద కేంద్రీకృతమై ఉంది. ఇది అగాధమైన నైతిక విధానం మీద ఆధారపడి ఉంటుంది. మనసు నిర్మలంగా ఉండేలా లక్ష్యాన్ని

దిద్దుతుంది. పరిశుద్ధతను సాధించే దశలో 'తాను' అనేది చాలా ప్రమాద కరమైన అడ్డంకి, సాధకుని పెడత్రోవ పట్టించడానికి పరమాత్మకు, సాధకు నికి మధ్య భేదించడానికి వీలులేనంతటి తెరను దించివేస్తుంది: [6] అంటారు సెల్.

భారతదేశంలో సూఫీతత్వానికి పుట్టిల్లు అన్న ఘనత సింధు రాష్ట్రా నికి చెందుతుంది. ఖ్వాజా హసన్ నిజామీగారు చెప్పినట్లు సుహరావర్దీ సూఫీలు, ప్రప్రథమంగా భారతదేశంవచ్చి సింధును తమ ప్రధాన కేంద్రంగా చేసుకున్నారు. ఇది బహుశా క్రీ. శ 711లో అరబ్బుల విజయం తరువాత కొన్ని శతాబ్దాలకు అనంతరం జరిగి ఉండాలి. ఎందుకంటే 1170- 1267 మధ్యకాలంలో భారతదేశంలో సుహరావర్ది గురువుల ప్రచారం ముల్తాన్‌కు చెందిన బహ - అల్ - హక్, బహ- అల్ - దిన్ అన్న వేదాంతవేత్త నాయ కత్వంలో గొప్ప ప్రాభవాన్ని పొందింది. వారు తమ యాత్రలో మక్కా, మదీనా, జెరూసలెం దర్శించుకొని బాగ్దాదు వెళ్లి అక్కడ సుహరావర్ది గురువుల పరంపర స్థాపకులు షాయఖ్ అక్ షయుఖ్ సాహిబ్ అల్ దిన్ సుహరా వర్ది (1144-1235) గారికి ప్రియ శిష్యులైనారు.... సుహరావర్ది గురు పరంపర ఇస్లాం ప్రపంచంలో గొప్ప సాహిత్యవేత్తలను అందించింది.... వారిలో ఒకరు సయ్యిద్ జలాహి అల్‌దిన్ సుర్ఖ్ పోష్ (1192-1291) వీరు బుఖ్రాలో జన్మించి సింధులోని ఉఖ్‌లో నివసించారు. సింధు, గుజరాత్, పంజాబ్‌లలో విస్తృతంగా తమ ఆధ్యాత్మిక ప్రేరేపణలను సాగించారు.... బాగ్దాద్‌కు చెందిన షయఖ్ అబ్దుల్ అల్ కాద్రి జిలానీ (1078-1166) కాద్రీ గురుపరంపర స్థాపకులు 1482 లో సింధు ద్వారా భారతదేశం ప్రవేశించారు.... వీరి పరంపరలో ఒకరు సయ్యాదే బందగి మహమ్మద్ ఘావత్. సుహావర్ది గురుపరంపర ద్వారా అప్పటికే ముస్లిం పరమ పురుషులకు కేంద్రమని ప్రఖ్యాతి చెందిన ఉఖ్‌లోనే తమ నివాసం ఏర్పరచుకొన్నారు. వారు ఉఖ్‌లో 1517 లో మరణించారు.... ఈ పరంపర వ్యవస్థాపకుల శక్తివంతమైన మూర్తిమత్వం, పాండిత్యం, వాక్పటిమ, ధర్మనిష్ఠాపరత్వం వల్ల యీ శ్రేణి గొప్ప గౌరవం పొందింది. వీరు ఎన్నో మహత్యాలు ప్రదర్శించినట్లు కూడా చెపుతారు. అల్ ఘవాత్ అల్ అజమ్, పిరి - ఇ - పిరాన్, పీర్ - ఇ - దస్తగిర్, బడేపీర్ వంటి బిరుదులు వీరికి ఉన్నాయి .. పాత కాలపు ఇస్లాంలో స్ఫూర్తిమంతమైన మనోభావాన్ని చొప్పించి దానిని బహుళ ప్రచారంలోనికి తెచ్చిన వారు నిస్సందేహంగా షెయిక్ అబ్దుల్ కాదిర్ జిలాని. దీనిని విద్యావంతుల పరిధిలో ప్రవేశ పెట్టినది ఘజాలి, తక్కిన రెండు సూఫీ గురు పరంపరలలో

చిస్తీ పరంపరను 1192 లో ఖాజ్వాముయిన్ అల్ దిన్ చిస్తీ భారత దేశంలో ప్రవేశపెట్టారు. వారి ప్రధాన కేంద్రం అజ్మీర్‌లో స్థాపిత మయింది. రెండవది అయిన నక్షాబందీపరంపరను 17వ శతాబ్దపు తొలి సంవత్సరాలలో ఖ్వాజా బేరంగ్ షెయిఖ్ అహ్మద్ సిర్హాండీలు భారత దేశంలో ప్రవేశపెట్టారు. తసవ్వుఫ్‌పైన వెలువరించిన చిన్న పుస్తకం 38వ పేజీలో మిర్జాకాలిక్ బేగ్, సింధులో ఇస్లామిక్ సూఫి విధానాన్ని ప్రవేశపెట్టిన షేక్ బహాఉద్దీన్ జకరియాకు ముగ్గురు మిత్రులున్నారనీ, సయ్యద్ జలాల్ బుఖారీ (వీరి గురించి ముందే చెప్పబడింది, వీరే మఖ్ దుమ్ జహానియాన్ అని కూడ పేరొందినారు). షేక్ ఫరీ దుద్దీన్ షకర్ గంజ్ దహల్వీ, అందరికంటె ప్రఖ్యాతి వహించిన సెహ్వాన్ వాసి లాల్ షెహ్ బాబ్‌గా పేరొందిన షేక్ ఉస్మాన్ మార్వాడీలు. వారి పేర్లన్నీ ప్రస్తావించారు. వీరు ఇమామ్ జఫర్ అల్‌సదిక్ వంశం నుండి వచ్చిన వారు, ఎల్లప్పుడూ సింధూర వర్ణపు దుస్తులనే ధరిస్తూ ఉండేవారు. గడ్డం లేక పోవడం వల్ల వీరిని లాల్ షెహ్‌బాబ్ అని పిలిచేవారు. వీరు మెర్ వాండ్ నుండి ముల్తాన్‌కు అక్కడ నుండి సెహ్వాన్‌కు వచ్చారు. 1304 లో వీరు పరమపదించారు. వీరే 'చార్‌యార్' నలుగురు మిత్రులుగా పేరొందారు. ఐదవ మిత్రుడు షా. షా మ్, బు. అలీ కలందర్ సద్ర్ ఉల్ దిన్ తండ్రి తరువాత వారి స్థానమును చేరుకున్నారు.

"భారతదేశంలోని సూఫీవిధానం హిందూ సంప్రదాయ వర్ణశోభితం" అని ఆర్ బెరీ అంగీకరించారు. బిదాత్ వంటి హిందూ సామాజిక ఆచార వ్యవహారాలు ఎన్నెన్నో తక్కిన ఇస్లాం దేశాలలో తెలియదు. మహాత్ముల సమాధులు దర్శించడానికి తీర్థయాత్రలు చెయ్యడం, వాంఛా సిద్ధికై మొక్కు కొని భగవంతునికి కానుక లివ్వడం, హారతులు, అగరువత్తులు వెలిగించ డం, మహాత్ముల సమాధులపై దీపాలు వెలిగించడం, సమాధుల వద్ద మందిరాలలో నైవేద్యాలకై తీపి పదార్థాలుంచి ప్రసాదం (తబ్రుష్) గా వాటిని స్వీకరించడం వంటివి ఇస్లాంలో దేశీయ పరమైన ఆచారాలు కావు. కాని భారతదేశపు ప్రభావం వల్లా ఆ వాతావరణంయొక్క ప్రాబల్యంవల్లా ముస్లిం మహాత్ములకు కూడా అవి వర్తింపచేయ బడ్డాయి. అవి హిందూ మతావలంబకులు చేసే పూజా విధానమూ, ప్రాచీన విగ్రహా రాధకుల తాంత్రిక మంత్రాలతో కూడిన పూజా విధానమూ అని పోల్చుకోడానికి కూడా వీలులేనంతగా కలిసిపోయాయి, ఆ విధానమూ, ఆపదజాలమూ.

సింధీ సూఫీల ప్రధాన కేంద్రాలు ఝోక్‌లో వున్నాయి. అమర వీరుడు షా ఇనాయత్‌ను సూఫీ ప్రవీణునిగా వారు గుర్తించారు. వీరు కలీం

అల్లాసోదరుడు షా అబ్దుల్ మాలిక్ శిష్యులు. వారి శిష్యులు షా అబ్దుల్ లతీఫ్ తాతగారైన బుల్రీ వాసి అబ్దుల్ కరీం. సచల్ కవి కుటుంబానికి షెయిక్ అబ్దుల్ కాదిర్ జిలానీతో సంబంధం ఉంది.

మధ్యయుగంలో భారతదేశ మందంతటా వ్యాపించిన ఆధ్యాత్మిక తత్వంతో ఇరానియన్ (పర్షియా, ఖొరాసర్, ఇరాక్‌ల నుండి) సూఫీ విధానం లేక ఆధ్యాత్మిక తత్వం సింధుదేశంలో సంయోజన చెందింది: వీరిలో ప్రధముడు పన్నెండవ శతాబ్దానికి చెందిన గీత గోవింద కావ్య కర్త సంతకవి జయదేవుడు. వారి ప్రధమ కవితాగానం ఏదో రూపంలో దేశమంతటా ప్రసరించి, భారతీయ సాహిత్యంలో సార్వజనీనతను సంతరించుకొంది. దాని సారాంశం రాముడు, కృష్ణుడు అని దైవాంశను ఏదో పేరుతో మూర్తీభూతం చేసి ఆధ్యాత్మిక తత్త్వాన్నే విషయంగా గ్రహించి ఆ పరమాత్మను చేరడంకోసం లేదా తాదాత్మ్యత చెందడం కోసం ఆత్మీయమైన వాంఛను వ్యక్తం చేయడం[19] ఇదే భక్తి సిద్ధాంతం లేదా మత సూత్రం, మొట్టమొదటిగా భగవద్గీతలోనూ తరువాత భాగవతంలో మరింత వివరంగానూ ప్రతిపాదించ బడింది. 12వ శతాబ్దంలో శాండిల్యుని భక్తి సూత్రాలుగా రూపొంది భారతీయ సాహిత్య ప్రపంచాన వ్యాపించింది. శంకరాచార్య, రామానుజ, రామానంద, బసవ, వల్లభాచార్యులు సిక్కు గురువుల వంటి గొప్ప ఆచార్యుల సిద్ధాంతాలు, హితోక్తులు వీనిపై పరిపూర్ణ విశ్వాసం, నమ్మకం ఉంచి ఆత్మ, తాను నమ్మిన దైవం యొక్క పరతత్వ స్వరూపంలో చేరడానికీ లేదా మోక్షసాధనలో జీవి పొందవలసిన వికాసమన్న యోగ పదతి మీదే ఇది ఆధారపడి ఉన్నది.

ఈ ఉద్యమంలో కబీర్‌కు ఒక ప్రముఖస్థానం వుంది. కబీర్ కుల కట్టుబాట్లు, విగ్రహాల ముందు మోకరిల్లడం వంటి వాటికి ఎంతో అతీతంగా ఉన్నాడు. శబ్దావళి లేక కబీర్ చెప్పిన వెయ్యి లోకోక్తులలో 'మాయను గూర్చిన వేదాంతపరమైన సిద్ధాంతం జైన, బౌద్ధ, బ్రాహ్మణ సిద్ధాంతాలు చెప్పిన జీవులన్నిటి పైన దయ జూపాలన్న సూత్రాన్నీ విష్ణువు ఒక్కడే భగవంతుడన్న సిద్ధాంతానికి తోడుగా చేర్చారు. కబీర్ అంటారు "నీవు ఆచరణలో చూపని సన్మార్గాలను ప్రశంసిస్తూ మరొకప్రక్క రక్తపాతం గావించుతూ గడాలు తీసి వేయడం నేలబడి మోకరిల్లడం నీట మునగడం వంటి వాటివల్ల ఫలితమేమిటి ? నోరు శుభ్రంగావించి, రుద్రాక్ష త్రిప్పుతూ స్నానాదు లాచరించి, గుడులలో మోకరిల్లి ధ్యానించుతూ, మక్కామదీనాలకు ప్రయాణించుతూంటే నీ హృదయం మాలిన్య భరతమైనప్పుడు ఏమి లాభం ? .... గుర్తుంచుకో అన్నిటిలోనున్నది. ఒక్కటియే,

ఆ రెండవదియే నిన్ను పెడదారి పట్టించుతుంది." కబీర్ మరణించినప్పుడు హిందువులు, ముస్లిములు కూడా ఆయన మృతదేహం తమదంటే, తమదే నని వాదించుకొన్నారు.

తరువాతి సంత్ కవులలో ముఖ్యుడు బిద్యాపతి లేక విద్యాపతి. "వీరు మైథిలీభాషలో రాధాకృష్ణుల పరంగా రూపాలంకార రూపంలో జీవాత్మ పరమాత్మను పొందగోరడాన్ని గురించి చక్కని గీతాలు వ్రాశారు.' చండీ దాసు, అంతకు మించి మీరాబాయ్ పాడిన దివ్యమైన పాటలు కూడా ద్వీప కల్ప మంతటా చొచ్చుకొని ఇప్పటికీ ప్రజల మన్నన లందు కుంటూనే ఉన్నాయి. ఆధ్యాత్మికతత్వం కాక భక్తితత్వం యొక్క పార భౌతిక, పారమార్థిక అవధులను చూరగొన్న వల్లభాచార్యుని చైతన్యుల సూక్తులు బంగాళదేశంలో ఇంటింటా వెలసినవి. వల్లభాచార్యుని తత్వంప్రకారం "మానవాత్మ, దైవస్వరూపుడైన ఆ కృష్ణ పరమాత్మ నుండి వేరు చేయబడి నప్పటికీ, అది అభిన్నమైనది, ఆ దివ్యాత్మలోని ఒక పవిత్ర శకలం కాబట్టి దాన్ని కఠోరనియమాలకు. గురిచేయకుండా భక్తితో గౌరవించాలి." చైతన్యుడు (1485 జననం) తన బోధనల సారాంశాన్ని తన నడవడికలో ప్రత్యక్షంగా చూపించాడు. పరిశుద్ధమైన ఋజువర్తనాన్ని ఆధ్యాత్మి కౌన్నత్యానికి తోడుగా ప్రచారం చేశాడు. కృష్ణునిపై భక్తితో పాటు అణకువ, పరిశుద్ధత కూడ బోధించారు. 'నీవు యీ ప్రపంచమున స్వల్ప కాలంపాటు ఉండే అతిథివే! నీ శాశ్వతనివాసానికై సిద్ధంగా ఉండాలి.' 'కృష్ణుడు కోరేదాన్నే యెల్లప్పుడూ ఆచరించు, కృష్ణుని పవిత్రమైన కోరికకు భిన్నంగా నీవేదన్నా చేస్తున్నావని భావించకు. చైతన్యుడు కృష్ణభక్తి పార వశ్యుడు. అతడు ఇతరులను కూడా ఆ భక్తి పారవశ్యతలో ముంచితేల్చాడు. దైవమైన ఆ బాలుడు, గోవులకాపరి, రథసారధి. అతడు భక్తి పారవశ్యంలో కృష్ణుని దర్శించాడు.

తరువాత కాలంలో కూడా భారతీయ కవితను, సింధీ పద్య వాఙ్మయం ప్రభావితం చేస్తూనే వచ్చింది. ఆ ప్రభావానికి ప్రతీకల్లో ఒకరు సూర్‌దాస్. ఆయన తమ సూర్‌సాగర్‌లో కృష్ణునిపై తనకున్న భక్తినంతా నింపి వేశారు. రెండవ వారు ప్రపంచ సాహిత్య చరిత్రలోనే గొప్పకవిగా వెలసిన తులసీదాస్. ఆయన రచించిన తులసీ రామాయణం 'రామచరిత మానసం'లో రాముని ఆధ్యాత్మికోన్నతిని పరమాద్భుతంగా చిత్రించారు. తులసీదాస్ 1624లో మరణించారు. వారి గ్రంథం 1574 లోనే ప్రారంభించబడింది. తులసీదాస్ చిత్రించిన రాముడు సర్వోత్కృష్ట మానవునికి ప్రతీక. అతన్ని నమ్మిన భక్తులకు 'తన' అనే భావం పూర్తిగా

కరిగి పోతుంది. పారవశ్యంతో ఆనందమయమైన ఆత్మ ఆపరమాత్మలో మునిగి ఏకత్వాన్ని పొందుతుంది. అది విశ్వజనీన సత్యం. ఆ సత్యం నుండి సృష్టి అంతా సాగుతూ ఉంది. తక్కిన సంత్‌కవులలో కొందరు దాదుకు చెందినవారు. వారందరిలో గొప్పవాడు గురునానక్ (1469 జననం). గురునానక్ అంటారు : హిందువులేడు, ముస్లింలేడు ! అని భగవద్గీత, కబీర్, వేదాంతం మనకు నేర్పినదే సిక్కుల ప్రథమ గురువైన నానక్ మనకు బోధించిన విధానం. అది ఇల్లా అంటుంది. ఒకే పరమాత్మను ఆరాధించాలి. అతడే మాయవల్ల లేక భ్రాంతివల్ల మిధ్యాహేతు రూపంలో మనకు ద్వైదీ భావాన్ని కల్పిస్తూ వివిధరూపాలలో అవతరిస్తూంటారు.

'అంతాగోవిందుడే, అంతా గోవిందుడే తక్క
....................................... మరెవ్వరూ లేదు
ఒక నీటి అల, నురుగు, బుడగ, నీటినుండి వేరవుతాయా
ప్రపంచ మంతయూ ఆ పరబ్రహ్మ లీల'
('ట్రంపు' అనువాదం)

నానక్ ఒక పరిపూర్ణుడైన హిందువుగానే మిగిలిపోయారు. వారికి ముసల్మానులతోసాహచర్యం ఉంది. వారిలో చాలామంది ఆయనకు శిష్యులే. ఎందుకంటే వీరంతా బహిరంగంగా సూఫీ విధానాన్ని అవలంబిస్తున్నారు కనుక ఈ సూఫీ విధానం నిజానికి హిందువుల నుండి వచ్చిన అద్వైత స్వరూపమే ! కాని దాని బాహిరరూపం ఇస్లాం విధానాలకు అనువుగా మలచబడినది. (ట్రంప్) నిర్వాణం లేక ఆత్మ విలీనం - అత్యున్నత సారాంశం. ధ్యానం ద్వారా సాధ్యపడేది, ఆ పరమాత్మ హరినామస్మరణం, అతని గుణగణాదులను పునశ్చరణం చేయడం వల్లనే, ఇది సాధ్య పడుతుంది. గురువుల యందు భక్తి, వారి బోధనలలో అచంచల విశ్వాసం ఆ పరబ్రహ్మ స్వరూపజ్ఞానాన్ని మాయాశక్తిని తెలుసుకోడానికి దారితీస్తాయి. "ద్వైవిధ" అనే భ్రాంతి నుండి విముక్తి కలుగుతుంది.

ఎవని యెదలో గురువుల యెడ విశ్వాసముంటుందో
ఆతని ఎదలో నుండు హరి, ఆ ప్రభువు
ఎవడు ఆ పరబ్రహ్మమును సత్యముగా ఎంచునో
ఆతడు విలీనమగును ఆ ఏకైక సత్యమున.

అంటారు నానక్. ఉత్తరాన అతని తరువాత మరికొందరు ఉదయించారు. దక్షిణాన శివాజీ సమకాలీనుడైన తుకారాం విఠోబా విగ్రహ మూర్తిలో తన కృష్ణుని పూజించాడు.

నిండు మనసుతో పాడుపాట, మనసును పరిశుద్ధ పరచుచు
ఆ పరమాత్మ నందుకొంటివా, అపుడు సుగమ మార్గమిది,
నీ హృదయమునకు అణకువను అలవరచుము, మహాత్ముల
పాదములు స్పృశించుము
ఇతరుల గురించి, వినకుము మంచిగాని, చెడుగాని, వారియోచన మానుము.

అని తుకారాం అంటారు: 'అది కొద్దియైనా గొప్పయైనా, ఇతరులకు మంచినే చేయి' అని ఈ విధంగా పన్నెండవ శతాబ్దం మొదలుకొని పదహారు పదిహేడు శతాబ్దాలవరకు యోగంతో కలసిన వేదాంతయుత భక్తి ఉద్యమం దేశమంతటా వ్యాపించింది. సంతకవులు యీ ఉద్యమ సారాంశాన్ని దేశమునందన్ని ప్రాంతాలకూ అందజేశారు. కొంతకాలంపాటు తక్కిన భారత దేశంతోపాటు సింధు ప్రాంతం సంబంధాలు పూర్తిగా త్రెంచుకొని వున్నప్పటికి, పదహారవ శతాబ్దంనుంచీ భారతీయ భావసంపదకూ, ప్రాబల్యానికీ సింధుదేశపు తలుపులు తెరచుకున్నాయి. సూఫీ సిద్ధాంతం భారతీయ వేదాంత భక్తివిధానాలతో కలసి పెనవేసుకొని ఒక ప్రత్యేక వేదాంత తత్వంగా రూపొందింది. అదే సింధీ వాఙ్మయానికి పునాదిగా వెలసింది. సింధీ వాఙ్మయంలోని కవితాత్మను నిజంగా అర్థంచేసుకోవాలంటే యీ సంత్‌కవుల పద్యవాఙ్మయం క్షుణ్ణంగా తెలిసిఉండాలి. అలాగే సూఫీ కవులకు ప్రముఖంగా ఉత్తేజాన్ని అందించినవి జలాలుద్దీన్‌రూమి గారి పద్యాలు (మస్నవి మరియు షామ్స్ తర్బిద్ పద్యాలు), తరువాత చెప్పదగినవి ఫరిదుద్దీన్ అఖ్‌తర్ గారి కవితలు (మంతిక్ అల్‌తెయిర్), జామీగారి యూసఫ్ జులెయ్‌ఖాలో సూఫీ సిద్ధాంతాలకు సంబంధించిన అధ్యాయాలు.

యూసఫ్ జులెయ్‌ఖాలో జామీ సూఫీ వేదాంతాన్ని యీ విధంగా వివరించారు: 'తన సౌందర్యాన్ని తాను దర్శించుకోవడంకోసం భగవంతుడు యీ విశ్వాన్ని సృష్టించాడు. అతడు సత్యం, యీవిశ్వం అసత్యం. అందమైన వదనం ఏకాంతాన్ని భరించలేదు. 'తలుపులు మూసినట్లయితే ఆ వదనాన్ని గవాక్షంనుండి చూడాలి.' ట్యులిప్, గులాబీ పూవులు తమ అందాన్ని బహిర్గతం చేయాలి. మరి ఆపరమాత్మ సౌందర్యమూర్తి తనప్రతి రూపాన్ని చూడడానికి కుతూహలపడితే ఏం? అశాశ్వతమైన విశ్వమే ఆ విశ్వ మోహనుని సౌందర్యాన్ని ప్రతిబింబించే అద్దం. దానిలో ఆ పరిపూర్ణుడు ప్రతిబింబిస్తాడు. ఆపరిపూర్ణ సౌందర్యమూర్తి మహత్సౌందర్యంలోని కాంతి శకలాలైన అతి లావణ్య సౌందర్యవతులు లైలీ, షిరీన్ లేక యూసఫ్‌లో చూచిన వారిని ఉన్మత్తులను చేశారు. ప్రేమ ఒక్కటే జీవితంలోని సత్యం. ప్రేమరహిత హృదయం హృదయమేకాదు. ఆకాశం, యీ సమస్త ప్రపంచ

మంతా అందంమీది ఆప్రేమతోనే అల్లకల్లోలితంగా ఉన్నది. నీవు, స్వతంత్రుడవు కాగోరుతున్నావా ? అయితే ప్రేమకులు బందీవి కావాలి. ప్రేమ కొరకు నీ హృదయాన్ని బాధలతో నిండనీ, తరువాత నీవు సుఖంగా ఉంటావు. ప్రేమనెరుగని విజ్ఞులను మరచి పోతారు, ప్రేమికులనే గుర్తుంచు కొంటారు. శారీరకప్రేమ మాత్రమేకానీ - ప్రేమను తిరస్కరించకు. అది నిజమైన, శాశ్వతమైన ఆధ్యాత్మికప్రేమకు నీమార్గాన్ని సుకరం చేస్తుంది. అక్షరమాలయే తెలియని వ్యక్తి కొరాన్ గ్రంధమునెట్లా చదువగలుగుతాడు ? ప్రేమతప్ప మరేదీ అక్కరకు రాదు. (ఆ పరమాత్మను చేరుటకు అతనిలో లీనమగుటకు అదొక్కటే సాధనం.)

సూఫీ తత్వం దానిలోని పరమాత్మ, ప్రేమ, ప్రేమికుడు, ప్రియు రాలు వంటి భావనలు ఉదారస్వభావంతో అర్థం చేసుకొని గ్రహించినప్పుడే సింధీ వాఙ్మయం పాఠకుల మనస్సులకు రంజింపజేస్తుంది. 'సూఫీ తత్వం లేక సూఫీ విచార ధార లేని సాహిత్యం సాహిత్యమే కాదు' అన్నంత మేరకు కొందరు సూఫీ మనస్కులైపోయారు. అలాంటి వారు సాహిత్యంలోని అందం ఆకర్షణ వంటి వాటిని లక్ష్యపెట్టరు. ఒక సుప్రసిద్ధ సింధీకవి షేక్స్పియర్ వ్రాసిన పద్యాలను, ప్రధానంగాను ; వారి నాటకాలను సాధారణంగాను సూఫీ సిద్ధాంతాలకూ సూఫీ వేదాంతానికీ, దృష్టాంతాలు అని గూఢార్థాలను వివరించే ఒక వ్యాఖ్యాన గ్రంధాన్ని ఆంగ్లంలో రచించారు.

## 5

## పాకు ముందున్న కవులు

పదహారవ శతాబ్దానికి ముందర, అనామకుల కర్తృత్వంలో ప్రచార మందున్న జానపదగాథలు, పాటలుతప్ప, సింధీభాషలో పద్యంగాని, వచనంగాని మరే సాహిత్యరూపంగానీ, నిలిచిలేదు. విచిత్రమేమిటంటే, రచయితల పేర్లు తెలిసి ప్రచారంలోనికి వచ్చిన ప్రాచీన సింధీ సాహిత్యం అంతా, అర్ఘులు సింధీపాలకులుగా గద్దెకెక్కిన తరువాతి కాలానిదే ! అనగా ఆ సాహిత్యం అంతా క్రీ.శ 1520 లేక 1521 కి తరువాత వ్రాసినదే. సింధుదేశంలో జాతుల ప్రభుత్వం (సుమ్రలు, సమ్మలు) పూర్తిగా అంతరించిన వెంటనే సింధీయుల జీవనంలోనికీ, సాహిత్యంలోనికీ, పర్షియన్ల భాషాప్రభావం చొచ్చుకు వచ్చింది. మూడు శతాబ్దాలకుపైబడి పర్షియన్ ప్రభావం సింధు మీద ప్రసరించింది. సింధీయులు ఆ భాషలో పాండిత్యం గడించారు.

ఆ భాషలో వారు రచనలు చేశారు. ఇదొక గర్వకారణంగా సింధులోని విద్యావంతులు భావించేవారు.

సింధులో అర్ఘున్‌తుర్ఘన్ పరిపాలన డెబ్బదిఏండ్లకు మించిలేదు. 1592 లో మొఘలులు ఆక్రమించిన పిమ్మట, 18 వ శతాబ్దంలో కల్హోరాలు వచ్చేవరకు సింధులో పర్షియన్ మాతృభాషగా గలవారే పాలకులుగా ఉన్నారు. సింధీభాషపైన, సాహిత్యంపైన పర్షియన్ రచయితలు - ముఖ్యంగా ఆధ్యాత్మిక రచయితల ప్రభావం గాఢంగా ఉంది. పర్షియన్లు పరిపాలించిన దానిలో పదవవంతు అధికారం కూడా సింధుదేశ ప్రజలపైన, వారి సంస్కృతిపైన అరబ్బులు చూపలేక పోయారు. దానికి కారణం, అరబ్బు విజేతలు సింధీయుల కంటె తక్కువ నాగరీకులు కావడమే. వారు ఎల్లప్పుడూ ప్రజాసమూహాల మధ్య, రక్షణ సేనలమధ్య, గుంపులుగా నివసించేవారు. అరబ్ సంస్కృతికి, సాహిత్యానికి దూరంగా ఉండేవారు. ముస్లిములు మాత్రం కొరాన్‌ను అరబిక్‌లో అభ్యసించారు ; అంతే. పర్షియన్ ప్రభావం మాత్రం సింధులోని అన్నిప్రాంతాలమీద ప్రగాఢంగా ఉంది, అన్ని ప్రాంతాలు ఆ ప్రభావానికి గురి అయ్యాయి. దీనికి ముఖ్యకారణాలు : బలూచిస్తాన్, అఫ్ఘానిస్తాన్, పర్షియా, మధ్యఆసియా ప్రాంతాలనుండి పర్షియన్ మాట్లాడే ప్రజలు సింధులోకి వచ్చారు. పర్షియన్ భాష, అర్ఘున్లు, తుర్ఘన్‌లు, మొగలులకాలంలో రాజభాషగా ఉంది. అన్నిటి కంటె ముఖ్యమైన మూడవ కారణం రూమీ, హాఫిజ్, జామీ, అత్తర్, ఘజాలి, ఆఖరికి ఉపదేశాత్మక రచనలు చేసే సాదీవంటి వారి తాత్త్విక రచనలు, సామాన్య సింధీ ప్రజలను కుడా ఆకర్షించాయి.

ఈ పర్షియన్ ప్రభావంవల్ల చాలామంది సింధీయులు కూడా పర్షియన్‌లో కవిత్వం వ్రాయడం కొనసాగించారు. కాని ఆ కవితలు గొప్పవారైన పర్షియన్ కవులకవితలకు అనుకరణలు మాత్రమే. అయితే మధ్యయుగంలో అమీర్ ఖుస్రూ, మనకాలంలోనే ఇక్బాల్ భారతదేశంలో పర్షియన్ పద్య రచనలో చూపించిన ఘనత, సింధీలలో ఎవ్వరూ చూపలేదు. కాని పర్షియన్ కవుల సంఖ్య బాగా పెరిగి, వారిపై పుస్తకాలు వచ్చాయి. పరిశోధనలు జరుపబడ్డాయి. సింధీ సాహిత్య విద్యార్థికి వారి పేర్లుగాని, వారి రచనలు గాని నిరుపయోగాలు, ఆసక్తిరహితాలు. ఇవి భాషా వ్యాయామస్థాయిని మించి విలువలేనివి. మధ్యయుగంలో యూరోపా దేశాల్లో కూడా ఇల్లాగే రచనలు చేయడం ఒక అచారంగా ఉండేది. కాని ఆంగ్లభాషా సాహిత్య చరిత్రలో ఎక్కడా యీ ల్యాటిన్ భాషా విన్యాసాలను గురించి, మేధావి

మిల్టన్ వ్రాసిన వాటిని గురించీ ఎవరూ ఉదహరించ లేదు. ఇక్కడ కూడా వీటిని నిరుపయోగమైనవిగా వదలివేయడమే మంచిది.

సాహిత్య చరిత్ర వ్రాసిన కొందరు ముస్లిం రచయితలు యీ సింధీ కవుల గురించి గుణదోష విచక్షణారహితంగా పొగడుతూ వ్రాశారు. ఈ పర్షియన్ కవితలవల్ల ఒక్క విషయం తేటతెల్ల మవుతుంది. 16, 17 శతాబ్దాలలో సింధుదేశంలో గొప్ప సాహిత్య సంచలనం ఉన్నది. పర్షియన్ చారిత్రిక, అర్ధచారిత్రిక జీవితచరిత్ర గ్రంథాలను రచించిన సింధీయులే, సింధును గురించి, దాని పాలకులను గురించి, కులీనవంశాలను గురించి వ్రాశారు. ఆ వ్రాతలే ఇందుకు చక్కని సాక్ష్యం. వీటిలో ప్రసిద్ధికెక్కినవి తారీఖ్‌మౌసమి, తారీఖ్ తాహిరి, బేగ్లర్‌నామా, తహ్‌ఫత్ - ఉల్ - కరీం, బయాన్ - ఉల్ - అర్‌ఫిర్, చాచ్‌నామా అన్న వి.

సింధును గురించి, సింధీసాహిత్యం గురించి వ్రాసిన రచయితలు యీ సాహిత్యసంచలనం గురించి మామూలుగా పేర్కొన్నారు. కాని అబ్దుల్ లతీఫ్‌కు ముందర రెండున్నర శతాబ్దాలలోని సింధీసాహిత్యాన్ని గురించిన అవగాహన కలుగజేసే ఒక ముఖ్యాంశాన్ని వారు విస్మరించారు. సింధు రాష్ట్రం తన ఒంటరితనాన్ని వదలి బయటబడి భారతదేశంలోని తక్కిన రాష్ట్రాలతో సంబంధాలు ఏర్పడిన పిమ్మట మధ్యయుగంలోని భారతీయ రచయితల, భక్తకవుల ప్రభావం సింధీయులపై చాలా ప్రసరిస్తూ వచ్చింది. ఈ విషయం వారు విస్మరించారు.

మొగలుల శకంలో, సింధు ఒక సుబాగా వుండేది. కొందరు సింధీయులు మొగలుల క్రింద అత్యున్నత స్థానాలను అలంకరించారు. ముఖ్యంగా అబుల్ ఫజల్, ఫైజీలు సేహ్వాన్ వాసులు, అక్బర్‌కాలంలో మంత్రి పదవులను అలంకరించారు. భారతీయులు, భారతదేశానికివచ్చే విదేశీపర్యాటకులు కూడా సింధులోని బుక్కర్, దిగువ సింధులోని తట్టా - యీ రెండు ప్రదేశాలు తప్పక దర్శించేవారు. అక్కడి స్నేహపూరిత వాతావరణంలో ఒకరి భావాలను మరొకరు తెలుసుకొనేవారు. సింధు, పంజాబ్‌తోను రాజస్తాన్‌తోను అంటిపెట్టుకొని ఉన్నది. సింధీయుల దైనందిన జీవనంలో రాజస్థానీ, పంజాబీ ప్రభావాలు గాఢంగా కలసిపోయాయి. షాకు ముందర ఉన్న సింధీసాహిత్యం మూడు ప్రజా శక్తుల సమ్మేళనం. మొట్ట మొదటిది సింధీ జానపద సంపద. సమ్మలు, సుమ్రలు వారికి పూర్వం గతించిన హిందూపాలకులు, వీరందరి కాలంనుండీ వంశానుగతంగా వస్తూన్న జానపద సంపద. రెండవది పర్షియన్ కవుల ఆధ్యాత్మికత

ప్రభావం. మూడవది వేదాంత, భక్తియోగాల సుగంధాలను విరజిమ్మే భారతీయ భక్తకవుల కవితలు.

భారతీయ పద్యవాఙ్మయం, సింధీ స్థానిక ప్రభావం, వీటి సమ్మేళనమే 'జ్ఞాన్' అనే పద్యాలు. 14వ శతాబ్దం అంతంలో, 15వ శతాబ్దం ప్రారంభంలో పీర్ సద్రుద్దీన్, వారి కుమారులు హసన్ కబీరుద్దీన్ వ్రాసినవిగా ప్రతీతి. వీరు కొందరు హిందువులను ఇస్మాయిలీ పద్ధతిలో మతం మార్పించి వారికి ఖోజాలని బిరుదునిచ్చారు. ఈ జ్ఞాన్ పద్యాలు తరచుగా హిందీ, సింధీ, గుజరాతీలు కలసిన కలగూరగంప. పద్యరచనా శిల్పం కుడా అతి సామాన్యం. ఖోజాల యీ వాఙ్మయం 'అతి విస్తారం కానప్పటికీ, సంస్కృతం, సింధీ, కచ్, గుజరాతీలు బాగా తెలిసిన వారికే యీ జ్ఞాన్‌లు అర్థం అవుతాయి.' నబీబక్స్‌గారి సింధీ భాషాచరిత్ర (History of Sindhi Language ) అన్న గ్రంథంలో యీ జ్ఞాన్‌లు కొన్ని అధునిక సింధీ వర్ణ మాలలో వేశారు. అందులో తొలిపద్యాలివి.

మేలుకొని అపేక్షించ వెందులకు ఆపరమాత్ముని, ఓదురదృష్టవంతుడా ?
రాత్రంతయు నిదురపోతివి నీవు....
వారు మాత్రము మనమున తలతురా ప్రభువును
మేలు కొన్నారు వారు, తూరుపు తెలవారకుండ.

షాకు ముందటి కవులు అతనికి మార్గదర్శకులైనారు. కొన్ని సందర్భాలలో వారి పద్యాలు షా పద్యాలలో చేర్చబడినవి. షా పద్యాల నుండి వేరుగా గుర్తించలేనంతగా కూడా ఉన్నాయి. షాకు ముందరి సింధీ పద్యాలలోని విశిష్టలక్షణాలు: ప్రధమంగా పద్యరూపం భారతీయ పద్ధతిలో అంటే దోహాలరూపంలో ఉంటుంది. రెండవది, ఆ పద్యాలు భారతీయ ప్రాచీన వాఙ్మయమైన వేదాలను జీర్ణించుకున్న ఒక విభ్రాంతికర మైన వినతి పాఠకులను ఉద్దేశించి కనబడుతుంది. షా యుగానికి ముందున్న కవులలో మొట్టమొదటి ప్రామాణికమైన కవి క్వాజీకజిం కవిత. ఇది బాగా ప్రచారంలో నున్నపద్యం: 'జోగినన్ను మేలుకొలిపె నిదురనుండి అవలం బింప జేసెను మార్గమును ప్రియునిచేర, కవి, తన గురువు, ముర్షిద్ (జౌన్ పుర్‌కు చెందిన సయ్యద్ మిరాన్‌మెహదీ)ను గురించి ప్రస్తావించినప్పటికీ, భావవ్యక్తీకరణ పద్ధతి పూర్తిగా భారతీయ సాంప్రదాయానికి చెందినదిగానే ఉన్నది. మూడవ లక్షణం పర్షియన్ యోగులకు, సూఫీలకూ సంబంధించి ఉండడం. క్వాజీకజిందే ఇంకొక పద్యం చూస్తే ఇది విదితమవుతుంది: 'నాకేమి పని యున్నది తిరస్కృతితో ? నాకేదియు గోచరించుటలేదు ప్రేమ

మూర్తిదక్క.' షాకు ముందటి పద్యవాఙ్మయంలోని నాల్గవలక్షణం సింధులో బహుళ ప్రచారంలో ఉన్న కథలు గాథలు తప్పకుండా ఉదహరించవలసి ఉంది. క్వాజీకజించే మరొక పద్యం చూడండి. 'నాలోనే ఉన్నాడు ప్రేమ మూర్తి. ఒంటెపై నాతని నెత్తుకొని పోవునపుడు చేతులు విదలించితి, నా హృదయ మాతనితో నుంటచే' ఇందులో ససూయీ, పున్‌హూన్‌ల కథ ఉదహరించబడి, ఒంటె మావటీలు పున్‌హూన్‌ను దొంగతనంగా కొని పోయిన కథనం కూడా సూచించబడింది. సింధీ పద్యవాఙ్మయంలోని ఇటీవలి లక్షణం ప్రకృతి దృశ్యాలను వర్ణించుచు వానినుండి నీతిని గ్రహించుట. క్వాజీకజం మరొక పద్యంచూస్తే యీ విధమైన భావాలు సింధీ, పద్యవాఙ్మయంలో ఉన్నట్టు తెలుస్తుంది.

సాగరమొక బలమైన ఊపుతో
పెద్దపిన్నల నందరిని ముంచివైచె
సంఘటిత పరచె నన్నిటిని
దిశలేదు, వేర్పరచి కనుగొనుటకు ఏదియు లేదు.

ఆరవదీ, అతి ముఖ్యమైనదీ అయిన లక్షణం ప్రాచీన సింధీ కవిత్వంలో మనకు గోచరించేది, భారతీయ సంస్కృతి వారసత్వమే. మానవుడు తెలుసుకొన వలసినది ఒకే ఒక్కటి. అదే జ్ఞానం. మహత్వపూర్ణమైన జ్ఞానం. ప్రేమ మూర్తిని కలియుట. అనగా పరమాత్మని కనుగొన డానికీ, ఆత్మవికాసానికీ మార్గం. క్వాజీకజర్ మిగిలిన మూడు పద్యాలలోని ముఖ్యాంశం యిదే. (హా! సింధుదేశపు మొట్టమొదటి ప్రామాణికులైన కవి ప్రపంచానికి అందించిన కవితా భాండారంలో ఏడు రత్నాలు మాత్రమే భద్రపరచి ఉండడం విచారకరం) నా చదువులన్నీ నన్ను పడద్రోయడానికి పనికి వచ్చాయి. ప్రతి మాట పోరాటం చేసేవాక మొసలి అయింది. తర్కం నాకేం సహకరిస్తుంది? వేదాంతం లేక వ్యాకరణం కూడా అంతే! ఇవి ఏవీ నన్ను ప్రేమైక మూర్తి చెంతకు తీసుకొని పోలేవు. తర్కం, వేదాంతం, వ్యాకరణం వీటి నుండి పొందిన జ్ఞానమంతా ఉండికూడా నీవు నూతిలో నున్న చిన్న చీమలాగా పైనున్న ఆకాశమంతటినీ ఆ నూతి నుండే చూస్తున్నానని భావిస్తావు. షా అబ్దుల్ కరీం పద్యాలతో పాటు క్వాజీకజర్ వ్రాసిన యీ ఏడు పద్యాలు బయాన్ అల్ అర్జన్ అను పర్షియన్ కావ్యంలో పొందు పరుపబడ్డవి. ఈ పద్యాలలో షా కవిత్వంలో ఉన్నంత ఘనత గాని, విశిష్టత గాని లేదు. ఇవి తరువాత వచ్చిన సింధీ పద్య వాఙ్మయానికి ఆదర్శాలుగా నిలిచి ఉన్నాయి. కాని సింధీ పద్య రచన

యీ విధంగా ఉండేది అని చూపించడానికి ఇటువంటివి మరి ఏడు పద్యాలు దొరకడమే దుర్లభం.

క్వాజీకజర్ నాలుగు పరిపాలనల కాలంలో జీవించారు - జామ్ నజ్ ముద్దీన్, జామ్‌నందా సింధును పాలించిన చివ రిఇద్దరు సమ్మ ప్రభువులు మొదటి ఇద్దరు అర్ఘున్ పాలకులు షా అర్ఘున్ బేగ్, షా హుసేన్ వారి జనన కాలం వివరంగా తెలియదు కాని 1551లో అరేబియాలోని మదీనాలో వారు పరమ పదించారు. డిశంబర్ 1520 లో దిగువ సింధు రాజధాని తట్టపై షా అర్ఘున్ బేగ్ దాడి చేసి ఆక్రమించు కున్నప్పుడు, ఆ యుద్ధపు అలజడిలో క్వాజీకజర్, అతని కుటుంబం చిక్కుకున్నారు. కాని ఆతని దైవ భక్తి, జ్ఞానం సంపద పేరు ప్రతిష్ఠలు, విజేతలకు ఎంతగానో నచ్చి, వారిని కుటుంబ సహితంగా రక్షించడానికి అంగీకరించారు. షా అర్ఘున్ జులై 1522 లో మరణించగా అతని తరువాత వచ్చిన షా హుసేన్, క్వాజీ కజర్‌ను ఎగువ సింధుకు ముఖ్యపట్టణమైన బుక్కుర్‌లో, ముఖ్యన్యాయాధి కారిగా (కాజీ) నియమించాడు. ఆ పదవిలో తన విధులను ఎంతో ఋజు వర్తతోను సమర్ధత తోను నిర్వహించుతూ, 20 సంవత్సరాలకుపైగా పని చేశాడు. మహాత్ముల గురించి సాధారణంగా చెప్పినట్టే క్వాజీకజర్ చేసిన మహత్యాలను గురించి అనేక కధలు చెపుతారు. ఆ కధలు గాధలు నిజంగా జరిగినవే అయినా, వారు విడిచి వెళ్లిన యీ ఏడు పద్యాలు అమూల్యమైనవి. సింధీయుల దృష్టిలో ఈ పద్యాలు సంపాదించి పెట్టిన ఖ్యాతి, గౌరవాలు మరియేవీ సంతరించలేదు. కాని ఇక్కడ గమనించ వలసిన విషయం ఒకటి ఉన్నది. అతనికి ఆధ్యాత్మిక జ్ఞానబోధ చేసే వ్యక్తి తటస్థపడగానే వారి జీవితం మరొక దిశలో మలుపు తిరిగింది. వారిని గురించే "జోగి నన్ను నిద్ర నుండి మేల్కొల్పి ఆధ్యాత్మిక విషయాలపై నాదృష్టిని మరలించినా" రని చెప్పారు.

దురదృష్ట వశాత్తు, యీ కాలంలోని చారిత్రక సంఘటనలను గురించిన కధనమంతా ముస్లిం పరిశోధకులే వ్రాశారు. వారెంత సేపూ తమ పూర్వీకులను గురించి గొప్పగా చెప్పుకొన్నారు. కొందరు పవిత్ర సయ్యదులను గురించీ, ఇతర ముస్లిం వేదాంతులను గురించీ, భక్తులను గురించిన వివరాలు వ్రాశారు. అంతే గాని సింధీ భాషలో హిందువులు వ్రాసిన కవిత్వాన్ని మచ్చుకైనా భద్రపరచలేదు. 4 జులై 1965 'హింద్ వాసి' లో దేవ్ చందర్ అనే హిందూ భక్తకవి, "అక్టోబరు 1581లో అమర్‌కోట (అక్బర్ జన్మస్థలం) లో జన్మించారని, వారు షాకు ముందటి కవి అని జయరాందాస్ దౌలత్‌రాం పేర్కొన్నారు. సింధు

దేశాన్ని అప్పుడు తుర్ఖన్లు పాలించేవారు. అమర్ కోట వారి సరిహద్దులకు వెలుపల నున్నది. దేవ చందర్ చిన్న వయస్సులోనే సన్యాసం స్వీకరించి అనేక పుణ్యక్షేత్రాలను దర్శించారు. వారు స్వామి నిజానందులుగా పేరొంది సౌరాష్ట్రలోని జాంనగర్ వద్ద 5 సెప్టెంబర్ 1655 లో మరణించారు. వారికి ప్రాన్నాథ్ అనే శిష్యులున్నారు. వారు విద్యావంతులు, చాలా ప్రదేశాలు సంచరించిన వారు. కొంతకాలం ఒక రాష్ట్రంలో మంత్రి పదవిని కూడా నిర్వహించారు. 1667 - 1668 మధ్యకాలంలో స్వామి ప్రాన్నాథ్ సింధులో ఉన్నారు. వారి జీవిత విశేషాలను వారి శిష్యులైన స్వామి లాల్‌దాస్ ఇచ్చారు. స్వామి ప్రాన్నాథ్ 18,758 పద్యాలను విడిచి వెళ్లారట. అందు 600 శ్లోకాలు సింధీభాషలో ఉన్నాయట. ఈ 600 శ్లోకాలు అచ్చయి వుంటే షాకు ముందర సింధీ హిందూ కవుల పద్య రచనా విధాన మెలాంటిదో మనకు తెలిసేది. బహుశా ప్రాన్నాథ్‌గారి పద్యాలలో వారి గురువుగారి శైలి, లక్షణాల ప్రభావం, మనకు కనపడేవి. లేదా కొన్ని వారు స్వయంగా వ్రాసినవే చేర్చి ఉండవచ్చు. ముస్లిముల స్వమతాభిమానం చేత మాత్రమే కాక, షాకు పూర్వం రెండు శతాబ్దాలలోని హిందూ సింధీకవుల వాఙ్మయం అంతరించడానికి గల కారణం - యీ రచనలలో హిందీ శబ్దజాలం బాగా చొచ్చుకొని పోవడం. అందువల్ల వీరి రచనలు పంజాబి రాజస్థానీ, లేక గుజరాతీ సాహిత్యాలలో కలిసి పోయి ఉండవచ్చు. కబీర్, తులసీదాస్, మీరా, సూర్‌దాస్, ఇంకా అతి ముఖ్యులైన గురునానక్, వారి తరువాతి వారి రచనలు సింధీ కవులకు ఆదర్శప్రాయాలు. ముస్లిం చరిత్రకారులు, జీవిత చరిత్రకారులు, ప్రత్యక్షంగా యీ పద్య వాఙ్మయంలో అభిరుచి లేని వారు గనుక, వాటిని వారు భద్రపరచలేదు, లేదా కనుగొనలేదు.

ఆచార్య లుఫ్త్ అల్లా బద్వీ, క్వాజీకజన్ తరువాత వారుగా తక్కువ స్థాయి సింధీకవుల పేర్లను చాలా చెప్పారు. కాని, బహుశా వారు తమ కవిత్వ పటిమకు గాక, తమ మత విశ్వాసాలకు, భక్తి ప్రపత్తులకు పేరు పొంది ఉండాలి. తుహ్ఫత్-అల్-కిరమ్‌లో మఖ్‌దుమ్ అహ్మద్ భట్టి చాలా ధర్మ నిష్ఠాపరులని పేర్కొనబడింది. వారి సమక్షంలో మహత్వ పూర్ణమైన కొన్ని పద్యాలు చదువగా వారి ప్రేమైకమూర్తి జ్ఞప్తికి వచ్చి వెంటనే ప్రాణాలు విడిచి పెట్టారనీ చెపుతారు. పీర్ మహమ్మద్ లఖి తట్ట వాసి, ఎగువ సింధులోని లఖికి వలసపోయి 16 వ శతాబ్దం చివర అక్కడే చనిపోయారు. వారు మనాజత్, లేక ప్రార్థనలు ప్రవక్తను కీర్తిస్తూ వ్రాశారు. వీటిలో పద్యరచనా చాతుర్యం అంతగా లేదు. అయితే ప్రతి

పంక్తి చివరి 'అ' వంటి అచ్చు ఉంచి దీర్ఘం తీయడానికి అనువుగా అంత్య ప్రాసలను చేర్చి ఒకక్రొత్త విధానంలో పద్యాలు వ్రాశారు. సింధీభాష నుండి వచ్చిన శుద్ధసింధీ మాటలను అరబీ, పర్షియన్ పదాలను సహ్యంకాని రీతిలో కూర్చారు.

1505 లో పుట్టిన మఖ్దుం నోవా మరొక దైవభక్తుడు. వారు చేసిన మహత్యాలను తుహ్-ఫత్-ఉర్ కిరంలోను హదికత్ అల్ అవల్యా లోను నమోదు చెయ్యబడ్డాయి. వీరు కొరాన్‌ను పర్షియన్ భాషలోనికి అనువదించారు. ఆ నాటి సింధు పాలకులు, మొగలులు కూడా వీరిని గౌరవించేవారు. వారి పద్యాలలో కూడా హిందూ జోగీల స్వాముల చెవులను పొడుచుకొను కక్రీల ప్రస్తావన కనబడుతుంది. షా జననానికి ముప్ఫై ఐదు సంవత్సరాల పూర్వం కూర్చబడిన మిన్హబ్ అల్మరూప్‌లో లుత్ఫ అల్లాకాద్రీ రచించిన పధ్నాలుగు పద్యాలు కనబడతాయి. వారి పద్యాలలో దోహాలలో వలె రెండు పంక్తులవి మాత్రమే ఉండవు. అవి ఏడు వరకూ పొడిగింపబడి ఉంటాయి. వారి కవితా వస్తువు సూఫీ పరమైనదే. అనుప్రాసకై కష్టబడి వారు యీ పద్యాలు వ్రాసినప్పటికీ, వాటిలో శ్రావ్యత అంతగా కనబడదు. పీర్ మహమ్మద్ లఖ్వికి సమకాలికులు ఉస్మాన్ ఇహ్సానీ బలూచిస్థాన్‌లోని భగ్నారి నుండి 1640 ప్రాంతాలలో లఖికి వచ్చారు. వారు 'వతన్‌నామా' అనే కావ్యం, మృత్యువు అనివార్యం, సమాధి ఇదియే అన్న అంశాల మీద వ్రాశారు. సంభాషణ రూపంలో మిగిలివున్న ఒకే ఒక్క పద్య రచయిత షా ఖైరుద్దీన్ (జననం బాగ్దాద్‌లో1505, మరణం 1617లో) దైవ భక్తుడైన వీరి సమాధి సుక్కూర్ వద్ద యాత్రాస్థలంగా ఆకు పచ్చని కప్పుతో ఒక గురుతుగా నిలచి ఉన్నది.

ప్రశ్న : నీవు లేవు కాబాలోగాని కిబ్లాలోగాని నీవు ప్రార్ధన జరుపు తీరు నందున్నావు !

జవాబు : రాజు నెరిగిన వారికి కిబ్లా అవసర మేమిటి ?

ఎవరు సాహసింతురాతనికి ప్రార్ధించు విధమిట్టిదని చెప్పుటకు ? ఈ చిన్న చిన్న రచయితలను వదలిపెట్టి చూస్తే, షాకు ముందుండిన కవులను పరిశీలిస్తే ముగ్గురిని చెప్పక తప్పదు. వారిలో ప్రధముడూ గొప్పవాడు షా అబ్దుల్ కరీం (1530-1620). వారి ప్రపితామహులు, ఒకప్పుడు సింధీ వాఙ్మయాన్ని స్థాపించారు అనబడే అబూ అల్ హసన్ (జననం 1661), షా ఇనత్ లేక మియుం షా (జననం 1613-1623 ముందర మరణం 1701-1710 మధ్య కాలంలో)

ఈ ముగ్గురు ప్రముఖ కవులను విలోమ క్రమంలో పరిశీలించి చూస్తే షా ఇనత్ అదృష్టవంతులు. ఎందుకంటే నబి బక్స్ బలోక్ ఇటీవల షా ఇనత్ పద్యసాహిత్యం (Poetry of Shah Inat) అన్న బృహద్గ్రంథం (సింధీ అ బాదీ బోర్డు. హైదరాబాద్ 1963) ప్రచురించారు. దాని ఉపోద్ఘాతంలో యిలా వ్రాశారు. "అ విధంగా షా ఇనత్ లేక వారి సంతతి వారు ప్రజలు ప్రియంగా పిలిచే పేరు 'మియుంషా' ముఖ్యంగా 17వ శతాబ్దానికి చెందిన సాంప్రదాయ కవి, సింధీ జాతీయం, సింధీ సాంప్రదాయ రీతులను బెయిట్, వాయీ లేక కఫీలను వాడారు. అయినప్పటికీ ప్రాచీన భట్టు కవిత్వరీతులను తరువాత అభివృద్ధి చెందిన సూఫీ భక్త కవుల ఆధ్యాత్మిక చింతనలతో జోడించి సింధీ పద్య వాఙ్మయ రంగంలో క్రొత్త శకానికి నాంది పలికారు. దీనికి పూర్వం సింధీ కవిత్వం దేశి భట్రాజులు, వృత్తి పాటలు వ్రాసి, పాడి రంజింపజేసే వీధి గాయకులు, యుద్ధ వీర గాధలను, వారి పరాక్రమాలను వర్ణించుతూ పాడిన పాటలు, శాంతి సమయాలలో దాతల ఔదార్యాలను అభినందించే పద్యాలు, ప్రజలను రంజింపచేయడానికి జానపద గాధలను చారిత్రాత్మక కల్పిత ప్రేమ గాధలను పాటలుగా రచించి పాడుతూండే వారు. తమ భావాలను వ్యక్తం చేయడానికి ఒక సాధనంగా సూఫీలు, భక్తులు తమ ఆధ్యాత్మిక భావాలను, సమకాలీన సమాజంలోని వ్యక్తుల చేతలు సరియైనవనీ, కాక నిందార్హమనీ తమ స్వవిచారాలను వ్యక్తం చేయడానికి యీ విధానాన్ని అవలంబించారు. ఈ రెండు రీతులు ఇంకా సంగమం కాలేదు. దేనికవి తమ గమనాలను సాగించుతూనే ఉన్నాయి. భట్రాజులు, వీధి గాయకులు వీరి కవిత్వరీతులు బహుళ ప్రచారంలో ఉన్నప్పటికీ, ఆధ్యాత్మిక పద్య వాఙ్మయాన్నను సరించే వారు. వరసగా గొప్ప సూఫీ కవు - లుద్భవించి వ్రాసే పద్ధతిని వ్యక్తీకరణను అత్యున్నతస్థాయి వరకూ గొనిపోయిన రచనలు సాగించిన వారు క్వాజీకజర్ (క్రీ. శ. 1551 లో మరణం). షా అబ్దుల్ లతీఫ్ ప్రపితామహులైన షా అబ్దుల్ కరీం (క్రీ. శ. 1620 - 21 మరణం). మియుర్ ఇనత్‌కు పూర్వమున్న గొప్పకవులు వీరు. వారి రచనలు ప్రజా బాహుళ్యంతో గాని, వారిఅమర వీరులతో గాని, జానపద గాథలు, ప్రణయ గాధలు వీటి తోను ఏ మాత్రం సంబంధం లేకుండా ప్రధానంగా ఆధ్యాత్మిక చింతన, నీతి దాయకాలుగా మనకు కనబడుతుంది. ఈ రెండు సాంప్రయాలను దాడించి వారు ఒక క్రొత్త బాటను వేశారు. 'ప్రజాభక్తకవిగా వారు అమర వీరుల గాధలను పాడుతూండేవారు. శాంతి సమయాల్లో వారి సాంప్రదాయ కథలు, ప్రణయ గాధలు, వ్యాపారులు, నేత గాండ్రు, ప్రజల ఆర్థిక ఉన్నతికి ఆధారమైన ఋతువనాలను గురించి పాడుతూండే

వారు. వారి పద్యాలలో ప్రేమ, ఆశవంటి అంశాలను గురించి కూడా వ్రాశారు. భగవంతుని వెదకు సర్వసంగపరిత్యాగులు, మహాత్ములు, వీరి గురించి కూడా పద్యాలు వ్రాశారు. మనకు లభ్యమైన వారి రచనలున్న గ్రంథంలో పైన పేర్కొన్న అంశాలన్నిటిపైన రచనలు చేశారు. ప్రతి అంశానికీ ఒక అధ్యాయం వంతున ప్రారంభంలో దొరికిన వ్రాతప్రతిలో పెద్ద అక్షరాలతో శీర్షిక సురుద్ ఏ రాగంలో అది పాడాలన్న సూచన ...." అదృష్టవశాత్తూ మియన్ షా ఇనత్ సింధీ పద్య వాఙ్మయానికి వేసిన క్రొత్త బాటలను, త్రొక్కి దానిని అత్యున్నత స్థాయికి చేర్చడానికి షా అబ్దుల్ లతీఫ్ (1689-1752) దొరికారు. మియన్ షా ఇనత్ మరణించేసరికి అబ్దుల్ లతీఫ్ ఇంకా ఇరువది ఏండ్లపై బడిన వారో లేక ఇంకా చిన్నవారో అయి ఉంటారు. ఈ నాటికీ ప్రచారంలో వున్న సాంప్రదాయికంగా వస్తూన్న కథనం ప్రకారం వయోవృద్ధులైన షా ఇనత్ దర్శనానికి షా అబ్దుల్ లతీఫ్ వెళ్లారనీ, ఒకే అంశం మీద ఇరువురూ వ్రాసిన వాటిని ఒకరి కొకరు చదివి వినిపించు కొనే వారనీ అంటారు. అదియెలా ఉన్నప్పటికీ షా అబ్దుల్ లతీఫ్, మియర్ షా ఇనత్ రచనా విధాన, పద్ధతి వీటివల్ల బాగా ప్రభావితులయ్యారని చెప్పడానికి ఎట్టి సందేహమూ లేదు. తన పద్య రచనా పరిధిలోనే ఇనుమడించిన నైపుణ్యాన్ని అంతర్ దృష్టినీ కనబరుస్తూ వారు వాడిన నానుడులు చాలా ఉన్నాయి. భావ ప్రకటనలు కూడా వినియోగించి వారిని అనుసరించారు. షా అబ్దుల్ లతీఫ్ భావ వైవిధ్యంలో నిస్సందేహంగా మియర్ షా ఇనత్ కంటె అత్యున్నత స్థాయికి చేరారు. మియర్ షా ఇనత్ మార్గ దర్శకులు ముఖ్యంగా వివిధ విషయాలపైన నూతన భాషా సంప్రదాయాలను నవీన కల్పనా సృష్టి చేసే మార్గంలో వర్ణనలను విపులంగా కవితాత్మకంగా ప్రదర్శించడంలోనే ఎక్కువ ధ్యానం ఉంచారు. అట్లా చేయడం వలన ఒక నూతన విధానం రూపొందించి, షా అబ్దుల్ లతీఫ్ రాకకు మార్గదర్శకులయ్యారు. ఇనత్ వ్రాసిన సుర్ ఖంబత్ ఉదాహరణకు షా వ్రాసిన సుర్‌ను గుర్తు చేస్తుంది. అయితే షా అబ్దుల్ లతీఫ్ చూపించిన చమత్కారం అందులో కనబడదు.

ఓ చంద్రుడా ! నా మదిలో నుండె నీ కథ
భగవంతుని సాక్షి, అంటారు ఇనత్ నీవు కాంతివంతుడవు (చీకటి) రాత్రి
చూడవా నీవు, ప్రకటితం చేయవా నాకు, ప్రియతముని నే వెదకు ?

సుర్ మరుయిలో నాయిక విరహ వేదన షా అబ్దుల్ లతీఫ్‌లో వలెనే ఉంటుంది. కాని ఆ తీవ్రమైన భావన కనిపించదు.

మరలు అగుగాక ఓ సుమర! నా స్నేహితులు, బంధువులు మాత్రమే
వారి ఆశ్రితుడను నేను, ఎటులనే నివసింతు నిచట ?
దారి జూపుము వారి వద్దకు, సమెద్ అంమరు, పవిత్రుల చెంతకు
ఆ పోగొట్టుకొనిన గ్రామవనిత వారి చెంతకు తిరిగి చేరుగాక.

సుర్ ధనా శ్రీలో షా లతీఫ్ చేయనవుసరం లేనిది ఇనత్ చేశారు. పీర్ గిలానీ బహ ఉద్దీన్, ముఖ్యంగా లాల్ షహబాజ్ మార్వాండీ పవిత్ర పురుషులను సహాయం, రక్షణ కోరారు.

క్రీ. శ. 1700లో ముకద్ద మా అలసల్‌వత్, అను గ్రంథాన్ని తట్టకు చెందిన మౌల్వీ అబు అల్ హసన్ (జననం 1661) వ్రాశారు. ఈ గ్రంథంలో నమాజ్ (ప్రార్ధనలు), వాజు (స్నానాదులు) మొదలైన విషయాలను గురించిన ఉపదేశాలివ్వబడినవి. సింధీ భాషలో మొదటి గ్రంథంగా యీ సంగ్రహం చాలా ప్రఖ్యాతి పొందింది. ఈ గ్రంధ కర్తను సింధీగానే పిలవడం పరిపాటి. అబు అల్ హసన్ వ్రాసిన యీ సింధీ రచన ముకద్దమా అల్ సల్ వాట్ పద్యకావ్యమా లేక పద్యాత్మక వచనమా అని ఒక వాదం మొలకెత్తింది. నయా జిందగీ (అక్టోబర్ 1964) పాకిస్తాన్ సాహిత్య పత్రికలో ఒక రచయిత (షమ్ షుద్దీన్ ఉర్సాన) అబు అల్ హసన్ ప్రధమ సింధీ వచన రచయిత అబ్దుల్ జబ్బార్ జునేజో జున్ 1965 సంచికలో వ్రాస్తూ సింధీ భాషలో మొదటి రచయిత మఖ్ దుమ్ జఫర్ బుబ్‌కెయిన్ అనీ వీరు అర్జున్‌ల కాలంలో 'తల్లాఖ్' (విడాకులు) మీద ఒక గ్రంథం వ్రాశారనీ బుజువు చేయడానికి ప్రయత్నించారు. అబుల్ హసన్ పద్య కావ్యం వ్రాసిన కవి అనీ వారి రచన దోహాల రీతిని కాక హిందీలోని కబత్ మాదిరి దోహా లేక బెయిల్ వలె పదాల సంఖ్య పరిమితం కాక ఉంటుందనీ వ్రాశారు. వీరు ప్రతి పంక్తిలోని మాత్రల సంఖ్యను బట్టి కబత్ వివిధ తాళాలలో ఉంటుంది. హిందీ లోనికి కబత్ మాదిరి పద్యాలు మత పరమైన ఉపదేశాలను చెప్పడానికి వేదాంత గ్రంథకర్తలు విస్తృతంగా ఉపయోగించారు. అబుల్ హసన్ కాలం నుండి అబ్దుల్ రహీం గ్రోహీ కాలం వరకూ బెయిల్ రీతితో సమానంగా కబత్ రీతి కూడా ప్రచారంలో ఉంది. తరువాతి కాలంలో అనగా కల్హోరాల తరువాత ప్రణయ కథలు, ప్రేమ గాథలు కూడా కబవా రీతి పద్యాలలో వ్రాయబడ్డాయి. ఈ రకం పద్యాలు వ్రాయడంలో సిద్ధ హస్తులు మఖ్ దుమ్ మహమ్మద్ హాషమ్, అబ్దుల్లా జియా ఉద్దీన్‌లు. అనాసక్తిదాయకమైన నమాజ్ గురించిన చర్చల్లో కూడా జీవం ఉట్టి పడేటట్లు విచిత్రమైన చిత్రణలతో చెప్పడం అబు అల్ హసన్ విశిష్టత. ఉదాహరణకు నమాజ్ (ప్రార్ధనల) వాజ్ (స్నానాదుల)

యొక్క ప్రకాశాన్ని గురించి చెప్పడానికి వారు చంద్రుని గురించి చెబుతారు. వారి భాష లార్ యొక్క భాష, శబ్దాలంకారాలతో నిండి వుంటుంది. అబు అల్ హసన్ విజ్ఞానవేత్త అనీ, పేరొందిన వేదాంత శాస్త్ర బోధకులనీ తుహ్ఫత్ ఉల్ కిరమ్ వర్ణించింది. వారు తమ తొంభైయవ ఏట మరణించారట. మఖ్దుమ్ అబ్దుల్లా వారి మేనల్లుడు. వారు మామగారి పద్ధతినే అనుసరించి కనాజ్ అల్ భ్రత్ అను గ్రంధాన్ని వ్రాశారు.

అబుఅల్హసన్ ఒక మార్గదర్శకునిగాను, 'సింధీ' వ్రాసిన వారిగాను మాత్రమే ఎన్నదగిన వారు అంటే తప్ప, చురుకైన కవిత్వం వ్రాస్తారన్నది ఎంచతగిన విషయం కాదు. వారిలో కవిత్వంకంటే శబ్దాడంబరత్వమే అధికంగా గోచరిస్తుంది. మహమ్మద్ సిదిక్ మెమొన్ తమ సింధీ వాఙ్మయ చరిత్రలో అబుల్హసన్ 'సింధీ'లో పారంగతులు అని అతిగా కీర్తించారు. (పుట 68)

అబ్దుల్ లతీఫ్ పూర్వీకులలో చాలా గొప్పవారు, వారి తాతముత్తాత, బుల్రీ వాసి షా అబ్దుల్ కరీం. వీరిని సింధీ సాహిత్య విమర్శకులు సింధీ ఛాసర్ అనీ, లేక సింధీ వాఙ్మయ 'ధృవతార' అనీ పిలిచారు. వారు 1536 లో జన్మించి 1620 లో మరణించారు. వీరు మరణించిన ఆరు సంవత్సరాల తదుపరి వారి శిష్యులలో ఒకరు తట్ట నివాసి దరోఘాగోహర్ పుత్రులు, మహమ్మద్ రజా అబ్దుల్వాస్, (మీర్ దయాల్ అనికూడా పిలువబడే వీరు) బయాన్ అలర్ఫిన్ అను గ్రంథం వ్రాశారు. అందులో వారి గురువుల జీవిత చరిత్రతోపాటు వారే రచించిన తొంభైమూడు లేక తొంభైనాలుగు పద్యాలు, వాటితో బాటుగా షా అబ్దుల్ కరీం అతి మక్కువతో తరచుగా చదివే కాజీ కజర్ వ్రాసిన ఏడెనిమిది పద్యాలు కూడా చేర్చారు. ఈ గ్రంథం అంతవరకూ మరుగునపడి 1798 లో మహమ్మద్ మలూక్ పుత్రుడు అబ్దుల్ రహీం సింధీలోకి అనువదించిన తరువాత వెలికి వచ్చింది. ఇది 1874 లో బొంబాయిలో హాజీ మహమ్మద్ మెంగుయిన ఒరంగ్ హోతాగారి కుమారుడు మఖ్దూం అబ్దుల్ సంక్షేపం చేసి అచ్చువేశారు. మీర్జాకాలిక్ బేగ్ రిసాలో కరీమిని 1904 లో అచ్చువేశారు. ఈ రిసాలో యొక్క ఇటీవలి సంపుటం కరీం-జొ-కలామ్ అన్న శీర్షికతో సుక్కూర్ సింధ్ సింధీ అదబీ సొసైటీ వారి అధ్వర్యంలో మెమొర్ అబ్దుల్ మజిద్ సింధీవారి సంపాదకత్వం క్రింద వెలువరించారు.

షా అబ్దుల్ కరీంను గురించి వ్రాసిన వారందరూ వారి పవిత్రమైన నడవడికను గురించి నొక్కి చెప్పారు. వీరి తండ్రి సైయ్యద్ షర్ఫుద్దీన్.

తాతగారైన సైయ్యద్ మీర్ అలీ సింధీలోని మితియాలో నివసించడం కోసం హెరత్ నుండి వలస వచ్చారు. వారు ప్రవక్త సంతతిగా ఆ గొప్ప సాంప్రదాయలన్నిటినీ పాటించారు. మహమ్మద్ ప్రవక్తవలెనే వారి దీక్షా వాక్యం 'దారిద్ర్యమే నా గర్వకారణం'గా గైకొని వారు కుటుంబ సహితంగా అడవులలో, పొలాలలో పని చేసేవారు. అందు లభించిన స్వల్పాదాయం మీదే జీవించేవారు. వారి వైరాగ్యం, నమ్రత, జితేంద్రియత్వాలను గురించి అనేక కథలు చెపుతారు. సంగీతం విని ఆనందించేవారు. భగవన్నామ చింతనతోను, పవిత్ర ఫకీర్ల దైవాన్వేషకుల సాంగత్యంలోను కాలం గడిపేవారు. వారిలో ముఖ్యులు మఖ్‌దుమ్‌నోవా, వారి సలహా ననుసరించి బుత్రీలో నివాస మేర్పరచుకొన్నారు (ఆ వూరి పేరనే వారిప్పుడు సుపరిచితు లయ్యారు).

షా కరీంకు వివాహంపై ఆసక్తిలేదు. కాని వారి సంరక్షకులు, అన్నగారు అయిన సయ్యద్ బిలాల్ షా గారికి 'కాదు' అని చెప్పలేక పోయారు. వివాహమైన తరువాత భార్యకు అన్ని సదుపాయాలనూ కలిగించారు. ఆమె సుఖంగా, ఆనందంగా ఉండేందు కవసరమైన ఏర్పాట్లన్నీ చేశారు. వారి పనులలోను, పూజాది కార్యక్రమాలలోను వారి పుత్రులు ఓరిమితో సహకరించవలసి వచ్చింది. వారి పుత్రులలో ఒకరు సరియైన ఆహారం లేక (పొలాలలో పని చేస్తున్నప్పుడు) చనిపోయే స్థితికి వచ్చారు. వారికి పదకొండుగురు పుత్రులు. వారిలో ఒకరు సయ్యద్ జమాల్ షా "సింధీ భాషలో అత్యుత్తమ కవి" షా అబ్దుల్ లతీఫ్‌కు ఈయన తాతగారు.

షా కరీం అంతగా చదువుకున్నవారుకాదు. వారు కొరాన్‌లోని రెండే పరలు (సర్గలు) చదువుకున్నారుట. కాని వారు మత సంబంధమైన, ఆధ్యాత్మిక సంబంధమైన జ్ఞానమంతా ఆ కాలంలో ఉన్న ఫకీర్ల మహాత్ముల ద్వారానే సంపాదించారు. ప్రతి వారి నాలుకపైన పర్షియన్ వేదాంతుల రచన లన్నిటినీ బాగా నేర్చినవారు. తనను అనుసరించిన వారికి ఆ పరమాత్మనే ఎల్లప్పుడూ ధ్యానించుడని బోధించారు. ప్రాపంచిక జ్ఞానార్జనను విడువరాదని వారికి చెప్పారు. 'చేతులు వాటి శ్రమలో వాటిని పడి ఉండనిమ్ము మనసును మాత్రం ఆ పరమాత్మ యందే లగ్నం చేయుము' అని అందరికీ తెలిసిన సూక్తికి వారు చక్కని నిదర్శనం. చాలా మాహాత్మ్యములు వారి పరంగా నమోదు అయి ఉన్నవి. వారిని అవలియా లేక భాగవత పురుషులుగా ఎంచుతారు. వారిని గురించి వ్రాసిన వారు వారిని కవిగా

కాక మహాత్ములుగానే గుర్తించడానికి ఇష్టపడతారు. వారు కవిగా అంతగా రాణించలేదు.

కాని ఇప్పటి విమర్శకులు వారిని మొట్టమొదట సింధీకవిగా గుర్తించారు. సింధీ వాఙ్మయంలో ధ్రువతారయనీ, సింధీవాఙ్మయోదయానికి వైతాళికులైన వారి మనుమడైన షా అబ్దుల్ లతీఫ్ రాకకు దూత అనీ కీర్తించారు. వారి 94 పద్యాలు సాంప్రదాయ భారతీయ దోహాల పద్ధతిలో రెండు పంక్తుల చొప్పున ఉన్నాయి. వారి సృజనాత్మకతకు తార్కాణంగా మూడు మాత్రం మూడేసి పంక్తులలో ఉన్నాయి. షా అబ్దుల్ లతీఫ్ వీటికి మెరుగులు దిద్దారు.

షా కరీం శైలి పరిశుద్ధమైన సింధీభాష అని డాక్టర్ దౌడ్‌పోతా గుర్తించారు. వారి రచనలన్నిటిలో మొత్తం 29 అరబిక్ పదాలు, ఒక అరబిక్ వాక్యభాగం, 8 పర్షియన్ పదాలు ఉపయోగించారు. సింధీ భాషా సాంప్రదాయాలను అరబిక్ పర్షియన్ పదాలు చేరి కలుషితం చేయని కాలంలోనే షా కరీం జీవించారు. వారి పదజాలం అంతా లార్ లేక దిగువ సింధులో ఉచ్చరించే విధంగా వ్రాసే విధంగా ఉన్నది. వారి పద్యాలలో వైవిధ్యం లేకున్నా అవి మధురంగాను సంగీత భరితంగాను ఉన్నాయని డాక్టర్ దౌడ్‌పోతా వ్యాఖ్యానించారు. నిజానికి షా కరీం పద్యాలు రూమీ వలెనే ఆధ్యాత్మిక భావచ్ఛాయలతో నిండి ఉండేవి, కాని మనోకల్పితాలన్నీ పూర్తిగా సింధుకు సంబంధించినవే. వారి ప్రఖ్యాత చెయిత్‌లు లేక పద్యాలు యీ విధంగా చెపుతాయి. 1) ఆ రెంటికిని పొత్తు కుదరదు ; ప్రేమైక మూర్తికై పడు ఆరాటం, ప్రాపంచిక విచారాలు ; 2) నాలుక గాని కన్నులు గాని ప్రియమైన వానిని సాధించలేవు ; 3) నేను భౌతికంగా ఇక్కడ ఉండవచ్చును ; ఓ ఉమర్ నా హృదయమునందు మాత్రమే నేను థార్‌లో మరువుంచెంత నున్నాను ; 4) ఆతడు ప్రభువు, సందేశం, అంతేకాదు సందేశాన్నిచ్చే దూత, జ్ఞాని, జ్ఞానంకూడా ; 5) ఇతరులు వ్యాకరణాన్ని పఠించవచ్చు, కాని జ్ఞానమంతా ఒకే ఒక మాటలో ఉన్నది - ఆతడు, ఆతడొక్కడే ; 6) మొదటిది తెరుచుకొనిన తక్షణమే వాయువు ప్రవేశించుతుంది. కనుక మనసున దాగిన కథ బయలు పెట్టకు ; 7) ప్రతి యువతీ నీటిని కుండతో తేవచ్చు కాని అది రూకలకై తెచ్చినది ఆ ప్రేమైక మూర్తికి తెచ్చినది గానిచో ఏమి విలువ ?

# 6

# ఛిట్ వాసి షా అబ్దుల్ లతీఫ్

సామాన్యంగా 'షా' లేక 'చక్రవర్తి' అని పిలువబడే షా అబ్దుల్ లతీఫ్ సాహిత్య ప్రపంచంలో ఒక అద్వితీయమైన వ్యక్తి. సింధీ సాహిత్య చరిత్రలో చాలా ప్రసిద్ధి కెక్కినవారు. దేశిసాహిత్యంతో వారిని పోల్చి, సింధీ సాహిత్యం వారితో ముగిసిపోయిందన్నట్లుగానే భావిస్తారు. సింధు నాగరికతను సంస్కృతిని పరిశోధించిన మొదటి పాశ్చాత్యులు సింధుదేశం సమర్పించిన ఒకే ఒక గొప్పకవి, వేదాంతి షా అబ్దుల్ లతీఫ్‌గా భావించారు. షా పద్యకావ్యాలన్నీ వున్న షా-జో-రిసాలో యొక్క దేశవ్యాప్త ప్రచారాన్ని బట్టి సింధీభాషలో యీ రిసాలో ఒక్కటే మహాకావ్యమని వారు విశ్వసిస్తున్నారు.

కాని ఇప్పుడు తెలిసిన వివరాలను బట్టి వారొక్కరే సింధుదేశంలో వెలసిన ఏకైక మహాకవి, ఏకైక మహాగాయకుడు కాదు. సింధుదేశంలోని అనేకమంది కవులలో వారూ ఒక గొప్పకవి. పదిహేడు పద్దెనిమిది శతాబ్దాలలో ఉద్భవించిన గాయక విహంగాలలో వారుకూడా ఒకరు అని విదితమయింది. కవితోద్యానంలోని అత్యంత సుందరమైన ఒక పుష్పం వంటిది వారి కవిత్వం. అది మొదటి మార్గదర్శకుని కవిత్వం మాత్రమేకాదు, పరిపూర్ణ సాఫల్యం పొందిన కవిత్వం కూడా. అది ప్రయోగాత్మకమైనదీ, నూతన కల్పనలతో కూడినదీకాదు; అనుగ్రహంతో నిండిన దీవెన. వారే సాంప్రదాయిక కవులలో, మధ్యయుగపు సింధు కవులలో చివరివారు అని కొందరంటున్నది కూడా సరికాదు. ఎలిజబెత్ యుగంలో చివరివాడైన మిల్టన్ కవి కాదు ఈ షా. సాచల్‌ను తన ఆధ్యాత్మిక వారసునిగా చూడడం అందరికీ తెలిసినదే. షా యొక్క సాంప్రదాయాలను కొనసాగించడానికి సాచల్ లేక ఇంకా ఎందరో కవులున్నారు. హాఫిజ్ పర్షియన్ గేయరీతులకు 'ఘనత కెక్కిన ఇటలీ భాష'కు డాంటే, హిందీ భాషకు సాహిత్యానికి తులసీదాస్ చేసినసేవలు తక్కిన ప్రపంచ కవులు వారి వారి మాతృభాషలకు దేశాలకు తమ తమ ప్రత్యేక మార్గాలలో చేసిన సేవలాంటిదే షా కూడా సింధీభాషకు, వాఙ్మయానికీ, సింధీయులకూ చేశారు.

షాను గురించిన మరొక దురభిప్రాయాన్ని తొలగించడానికి విస్తృతమైన వివరణ అవసరం. ఎందుకంటే పట్టువిడువనంతగా అది వ్యాపించింది. షా ఇస్లాంను గురించి మాత్రమే, ముస్లిములకు మాత్రమే, ఇస్లామిక పద్ధతులకు

కట్టుబడి మాత్రమే వ్రాసిన కవి అన్నటువంటిదే ఆ వాదన. షా నిజంగా ఇస్లాం కవి మాత్రమే అయినట్లయితే, హిందువుల ప్రేమాభిమానాలను అంతగా ఆకర్షించి వుండేవారు కాదు. సింధును విడిచిపోవాలన్న ముస్లిముల దురభిమానానికి గురియై బలవంతంగా సింధు వదలి వచ్చిన హిందువులు కూడా షా - ఓ - రిసాలోను భక్తిభావంతో తమ పవిత్ర గ్రంథంగా భావిస్తున్నారు. షా తక్కిన భారతీయకవుల మార్గంలో, ప్రధానంగా భారతీయ కవిగా దేశభక్తి కలిగిన సింధీయునిగా కాక ఇస్లాంకవి మాత్రమే అయినట్టయితే ఇది అసంభవం. షా పుట్టుక చేత, పెంపకం చేత, వంశం చేత మహమ్మదీయుడు. ఆయన తమ మత సిద్ధాంతాలకు కట్టుబడి ఉన్నారనడంలో అబద్ధం ఎంత మాత్రం లేదు. మహమ్మద్ ప్రవక్తపై వారికి ఎనలేనిభక్తి, వారి అల్లుడు అలీ అంటే వారికి ప్రేమ, గౌరవం ఉన్నాయి. కర్బలాయందు అసువులు బాసిన అలీ కుమారుడు కూడా వారికి ప్రేమ, పాత్రుడే. కాని కర్మకాండలు, మూఢాచారాలు వీటికి కట్టుబడిన సిద్ధాంతపరమైన మహమ్మదీయుడు మాత్రంకాదు. చాలా ప్రసిద్ధికెక్కిన వారి పంక్తులు కొన్ని చూదాం.

అది మంచిది చాల ప్రార్ధన (నమాజ్), ఉపవాసము
కాని ప్రేమ యొక్క మన సృష్టికి వలయు వేరు నైపుణ్యము.

ఒకసారి కొందరు షాను "మీరు షియా ముస్లిమా, సున్నీ ముస్లిమా" అని ప్రశ్నించగా వారు "ఆ రెండూ కాదు, రెంటికీ మధ్యనున్నా" నని చెప్పారట. వారిలో ఒకరు "రెండిటి మధ్య శూన్యమున్నది" అనగా "అట్లయిన నేనును శూన్యమునే" అని వారు సమాధానమిచ్చారని ఒక గాథ ప్రచారంలో ఉన్నది. ముస్లిం రచయితలు చాలా వ్యర్థ వివాదాలు రేకెత్తించి షా ఏరకం సూఫీ వాది అనీ, కాదిరీ పరంపరకు చెందిన వారా, చిస్తీ పరంపరకు చెందిన వారా అని తర్కించారు. వారి వద్ద యీ రెండు పరంపరలకూ చెందిన లక్షణాలు కొన్ని ఉన్నాయి. ఈ రెండు పరంపరలకు చెందిన ఏ ఒక గురువూ అయనకు సూఫీ విధానపరంగా ఉపదేశమిచ్చినట్లు వాదించలేదు. 'అయితే గురువులెవ్వరూ లేని యీ వ్యక్తి ఉవేసీ రకం సూఫీయా?' అని ఎవరో ప్రశ్నించారు. ఇందుకు ఒక నిశ్చితమైన సమాధానం చెప్ప వీలు పడదు. హిందూ జోగుల ఉడుపులు ధరించి వారితో సంవత్సరాల తరబడి సంచరించుతూ, హింగ్‌లాజ్, ద్వారక, ఇతర హిందూ పుణ్య క్షేత్రాలు దర్శించిన వ్యక్తి, సమా లేక నాట్య సంగీతంపై ఇస్లాం విధించిన ఆంక్షలను ఇసుమంత కూడా పశ్చాత్తాప పడక ధిక్కరించి, చివరకు ఆ నాట్య సంగీతానందాన్నే ఆస్వాదిస్తూ జీవితం చాలించిన వ్యక్తి ఆయన. కల్హోరా స్వపక్ష దురభిమానుల నుండి బలవంతంగా ఇస్లాం మతానికి

మార్పు చేయడానికి యత్నించినప్పుడు, తప్పించిన వ్యక్తిని మహమ్మదీయుడని అనడం కష్టం. అదీ, పవిత్రమైన సాధారణ ముస్లింగా భావించలేము. షా మిత్రులలో అతిముఖ్యుడూ, ఛాయలాగావారి వెన్నంటివుండే మదన్ హిందువు. వారి ఆత్మకు శాంతి కలిగించిన గాయకులిద్దరూ అటల్, చంచల్ హిందువులే. ఇది గమనార్హమైన సత్యం. సుర్ కల్యాణ్‌లో వారు ప్రవక్తనుద్దేశించి మహమ్మద్ ప్రవక్త 'కర్ని' అంటే యీ సృష్టికి కారకులు అనీ, లేక వేరొక సందర్భంలో వర్ష మేఘాలు తరలిపోతూ ఇస్లాం భూతలం మీద పయనించి ప్రవక్త సమాధిపై కృతజ్ఞతా పూర్వకమైన వర్షపు జల్లులు కురియించా యన్నారు. రిసాలో శతాధిక సందర్భాలలో పవిత్ర కొరాన్ నుండి పద్యాలను ఉదహరించారంటే వారి నమ్మకము, వారి కవితా పటిమ మనకు విదితమౌతుంది. వారు తమ శ్రోతలను పూర్తిగా అవగాహన చేసుకున్నారని మనకు అర్థం అవుతుంది. అది ప్రచారకుల పట్టుదల గాని పిడివాదంగా గాని అనిపించదు. వారు రచించిన వన్నీ నశించి, సుర్ రామ కవి వంటివి, ఒకటి రెండు సుర్‌లు నిలచి ఉన్నా, షాకు హిందువులతోను హిందూమతంతోను దగ్గర సంబంధాలు ఉన్నాయని నిరూపించడం కష్టం కాదు. పైగామ్ - ఎ - లతీఫ్ అన్న తమ ఆలోచనా పూర్ణమయిన గ్రంథంలో బి.ఎం. సయ్యద్ ముస్లిం ప్రపంచానికి సంబంధించిన - ప్రధానంగా ఇస్లాంకు సంబంధించిన ఇక్బాల్ వంటి కవికి, దేశభక్తియుత జాతీయ వాదియైన షా వంటి కవికి మధ్య పోలికలు చూపించారు. సింధుపై వర్షించి, ఫలవంతము చేయమని వారు భగవంతుని ప్రార్థించినప్పుడు షా నిస్సందేహంగా సింధు భారతదేశంలోని అవిభాజ్య భాగంగా ఊహించే వ్రాశారు. ఈ కవిత సింధీయులందరికీ ప్రియమైనది. షా పాఠకులు మరువరానిది. వారి కావ్యాలన్నీ సాంప్రదాయ భారతీయ రాగ రాగిణులలో బంధింపబడినవి. వారి నాయికా నాయకులు ప్రతి అణువున భారతీయులు. వారి కవితా విషయాలు మధ్యయుగానికి చెందినవే ఐనప్పటికీ, మధ్యయుగాల్లోని భారత దేశానికి చెందినవి మాత్రమే గాని మధ్య ఆసియా, లేక పశ్చిమ ఆసియాకు సంబంధించినవి ఎంత మాత్రమూ కావు. భారతీయ కవులలో మాత్రమే కనిపించే అసామాన్య వైఖరి - 'వనితయే ప్రేమికురాలు, పురుషుడు అపేక్షించ బడువాడు' అన్న విషయం షా కావ్యాల్లోని నాయికా, నాయకులను చదివిన వివేకవంతులైన పాఠకులు గ్రహించుతారు. షాను గురించి వ్రాసిన వ్యాఖ్యాతలు, విమర్శకులు అందరూ విస్మరించిన ఒక ముఖ్య విషయం షాను ప్రాచీనకాలంలో కాశ్మీర్, కనోజ్‌ల నుండి మక్రాన్, సౌరాష్ట్ర, జైసల్మీర్, బర్మార్‌లవరకూ విస్తరించి ఉన్న బృహత్ సింధుకు చెందిన గొప్పకవిగా గుర్తించాలి గాని, విభజనలకు గురియై సన్నగిలిన

ఈనాటి సింధును గురించి గొంతెత్తి పాడి వ్యాఖ్యానించిన కవిగా ఎంచకూడదు. ఇలా భావించినట్లయితే షా 'కథలకు' సరియైన అర్థం ఉండదు. వారి తీర్థ యాత్రలు, పర్యటనలు, లక్ష్యరహితాలు, నిరుపయోగాలు అయిపోతాయి. భారతదేశ చిత్రపటంలో షా పరివ్రాజకునిగా దర్శించిన సుదూర ప్రదేశాలను గుర్తించినట్లయితే, ఆ పరిధిలోనున్న ప్రదేశమే బృహత్ సింధుదేశం, దానిని గురించే షా తన 'సుర్'లలో గానం చేశారు.

షా కవిత్వంలోని ఆధ్యాత్మిక తత్త్వం, సూఫీ తత్త్వం గురించి ఎంతో గొప్పగా చెబుతూ వారి కవిత్వంలోని మరొక ప్రధానమైన గుణం లేక విషయాన్ని దాట వేయడానికి అవకాశం వుంది. అది వారి సింధీయత. మరే ఇతర సింధీ కవులలోను మనకు కనబడనంత హెచ్చుగా షా కవిత్వంలో సింధీతత్త్వం మనకు కనబడుతుంది. ఈ సింధీయత అనేది నిజానికి అతి ప్రాచీనమైనది. భారతీయ పద్యవాఙ్మయ, వేదాంత సుమమాల లోని అత్యంత సుగంధభరిత పుష్పం : షా కవిత్వంలో ఆధ్యాత్మికత సింధీయత అను రెండు విషయాలు విస్తృతంగా పరిశీలింపదగినవి. వారిని మిహ్రాన్ (లేక సింధు) జ్ఞాని అనడం సమంజసమే ! ఎందుకంటే మిహ్రాన్ లేక సింధు నది భారతదేశంలోని నదులన్నిటిలోను పొడవైనది. షా పద్య కవిత్వం లోను, వారి మానసిక పరిపూర్ణత్వంలోను, భగవంతుని మైకంలో మునిగిన జీవి, సింధును గురించి పలికే గొంతుక అన్నవి రెండు ముఖ్యాంశాలు. వారు మహమ్మదీయులు కావడం అంతగా గమనించదగినది కాదు.

మరొక చెప్పుకో తగిన ముఖ్యాంశం ఒక్క ముస్లిము షా జీవిత చరిత్ర, వారిపై ఒక నిఘంటువు సింధీలో వ్రాసిన మీర్జా కాలిక్ బేగ్ తప్ప, రమారమి తక్కిన అందరు సంపాదకులు, జీవిత చరిత్రకారులు, వ్యాఖ్యాతలు, విమర్శకులు అవిభక్త బొంబాయి ప్రెసిడెన్సీలో సింధు ఒక భాగంగా ఉన్నంత వరకూ (1937), కాదు, భారతదేశ విభజన వరకు (1947) వ్రాసిన వారందరూ ముస్లి మేతరులే. డా॥ ఎర్నెస్టుట్రంప్ మొట్టమొదటి సారి రిసాలోను (1866) ఒక సంపుటిగా ప్రకటించినవారు. డా॥ హెచ్. టి. సోర్లె మొట్టమొదటిసారిగా ఆంగ్లంలో వారి జీవిత చరిత్ర వ్రాస్తూ వారి సాహిత్యం నుంచి పలు విధాలైన రచనలు ఏరి అనువదించి ప్రకటించాడు. (Shah Abdul Latif of Bhit 1940) సర్ బార్టలే ఫ్రేర్ షా పై వ్రాసిన వ్రాతప్రతి గాని, కొందరు రచయితలు మీర్ అబ్దుల్ హుసేన్ వ్రాసినదిగా చెప్పే వ్రాత ప్రతిగాని ముద్రించబడలేదు. బ్రిటిష్ పరిపాలనా కాలంలో పైన చెప్పబడిన వారే కాక సుమారుగా షా కవితా నికుంజంలోని వ్యాసాయిలకు లందరు హిందువులే. న్యాయమూర్తి దయారాంగి మల్ తమ కలం

పేరు 'సిగ్మా' క్రింద షా గురించి కొన్ని విషయాలు (Something about Shah) 1882 లో వ్రాశారు ; కొన్ని అనుశ్రుతంగా వస్తూన్న కథలు విశ్వసనీయమైన స్థానాల నుండి సేకరించి మరొక న్యాయమూర్తి లీలారాం (సింగ్) వతన్ మల్ షా గురించి 1890 వారి జీవిత చరిత్ర ఒక చిన్న పుస్తకంగా వ్రాశారు ; 1900 లో విద్యావేత్త తారాచంద్ ఖాకీరాం ప్రభుత్వ యాజమాన్యం క్రింద షా గురించి ఒక సంపుటి వేశారు ; ఈ శతాబ్దపు తొలి దశాబ్దంలో లాల్‌చంద్ అమర్ దినామల్ సింధీ భాషలో షా హానో షా అన్న చిన్న పుస్తకం ప్రచురించారు ; రెండవ దశాబ్దంలో జెట్‌మల్ పర్సురాం షా కథలు అన్న పుస్తకం, సింధులోని సూఫీలు, మహాత్ములు అన్న పుస్తకంలో షా గురించిన వివరాలు వ్రాశారు ; 1928 లో లతీఫ్ సైర్ అని షా యాత్రలగురించి భేరూమల్ మహిర్ చంద్ ఒక పుస్తకం వ్రాశారు ; నారాయణ్ దాస్ భంభానీ సింధీలో షా నాయికలు ("The Heroins of Shah") అనే పుస్తకం వ్రాశారు ; టి.ఎల్. వాస్వానీ, ఎం.ఎం. గిద్వానీ, యీ పుస్తక రచయిత, షా గురించి వ్యాసాలు పత్రికలలోను, చిన్న పుస్తకాలుగాను వ్రాశారు ; అన్నిటికంటె ముఖ్యం డా॥ హెచ్.ఎం. గురుబక్సాని 1923 మొదలుకొని మూడు సంపుటాలలో షా పై, వారి అద్భుతమైన ఉపోద్ఘాతంతో (మున్ దూమా లతీఫ్) సింధీ వాఙ్మయ చరిత్రలో ఎప్పటికీ ఒక మైలురాయి వలె నిలిచే -షా-జా-జొ- రిసాలో తీసుకువచ్చారు. బ్రిటిష్ వారి కాలంలో షాను గురించి వ్రాసిన ముస్లిము లిరువురిలో మహమ్మద్ సిద్ధిక్ మెమొద్, వీరు సింధీ వాఙ్మయ చరిత్ర వ్రాస్తూ (History of Sindhi Literature) అందులో గత్యంతరం లేని పరిస్థితులలో షా గురించి విస్తృతంగా వ్రాయవలసి వచ్చింది. ఈ గ్రంథం ఇరువదియవ శతాబ్దపు మూడవ దశాబ్దంలో వ్రాయబడింది. రెండవ వారు డా॥ యు. ఎం. దౌడ్ పోతా. వీరు హెచ్. ఎం. గురుబక్సాని ప్రియశిష్యులు. చిరకాలం జ్ఞప్తికి ఉండే వారి గ్రంథ రచనలో సహాయకుడు.

దేశ విభజనానంతరం భారతీయ సింధీయులకన్న పాకిస్తానీ సింధీయులు, షా రచనలమీద క్రమబద్ధమైన పరిశోధనలు గావించారు. సింధు - పాకిస్తాన్‌లో విడిగా ఒక రాష్ట్రంగా ఉన్నంతకాలం షా గురించి పరిశోధనకు, పాండిత్యానికి, షా నివసించిన భిట్‌లో వారిపేర ఒక సాంస్కృతిక కేంద్రానికి సింధు ప్రభుత్వం ధనసహాయం చాలా చేసింది. డా॥ గురుబక్సానీ సవరించి ప్రచురించకుండా విడిచి పెట్టిన 'సుర్'లను ఖచ్చితంగా వారి అడుగు జాడలలోనే అధస్సూచనలు, ఉపోద్ఘాతాలు సహితం 1950లో షా సంకలనమంతా అచ్చువేసిన ఘనత ముస్లిం పండితులు గులాం మహమ్మద్

షాహ్ వానీకి దక్కుతుంది. షాపై పరిశోధనలు జరిపి రచనలు చేసిన ముస్లిం పండితులలో ముఖ్యంగా పేర్కొనదగిన వారిలో కొందరు, మిహ్రాన్ సంపాదకులు మహమ్మద్ ఇబ్రహింజోయో, సింధీ విశ్వవిద్యాలయం సింధీ అధ్యయనశాఖ అధిపతి నబిబక్స్ బలోక్, సింధీ వాఙ్మయం (సింధీ అదబ్) గురించి చిన్న పుస్తకం వ్రాసిన పీర్ హసముద్దీన్ రష్దీ, మూడు సంపుటాలలో సింధీ పద్య వాఙ్మయచరిత్ర (History of Sindhi Poetry) వ్రాసిన లుత్ఫుల్లాబద్వీ, 1951 లో అక్స్-ఎ-లతీఫ్ అని షా జీవితాన్ని ఉర్దూలో వ్రాసిన టాజ్ మహమ్మద్ ఆగా, ప్రత్యేకంగా పేర్కొనదగిన వారు సమ కాలీన ఉర్దూ కవులలో సుప్రసిద్ధులు. షా రిసాలోను ఉర్దూలో తర్జుమా చేసిన కవి అయాబ్, 1951లో సింధీభాషలో పాకిస్తాన్‌లో అచ్చయి షా గారిపై మిక్కుటంగా చదువదగిన పుస్తకం లుత్ఫ్-అల్- లతీఫ్ గ్రంధకర్త దీన్ మహమ్మద్ వఫాయి, షా ఆలోచన, మానసిక వికాసం (పైగాం-ఎ-లతీఫ్) అను అద్భుతమైన విశ్లేషణ గ్రంధకర్త గులాం ముర్తజా సయ్యద్, అందరికంటే ముఖ్యులు; ఆదయాళువులైన దంపతులు ఇందాద్ కాజీ (రిసాలోను ప్రచురించిన ఇటీవలి సంపాదకులు), షా గేయాలను అనువదించిన కవయిత్రి శ్రీమతి ఎల్సాకాజీ. షాపై శ్రద్ధాంజలులు, విధేయతలు, (యాద్‌గార్-ఎ-లతీఫ్) కరపత్రముల ద్వారా, పత్రికలలోను వ్రాస్తే వారి సంఖ్య అపరిమితం అనూహ్యం. షా ప్రేమికులెవ్వరూ మిహ్రాన్, నయా సింధు, గోత్‌సుధార్ పత్రికలు షాపై వెలువరచు విశేష సాంవత్సరిక సంచికలను విస్మరించకూడదు.

భారతదేశ విభజన అనంతరం రచయితలలో ముగ్గురిని ముఖ్యంగా పేర్కొనాలి. షారచించిన 'సుర్' లన్నిటికీ వ్యాఖ్యానాలు వ్రాసి ఒక సమగ్రమైన గ్రంథాన్ని ప్రచురించిన కళ్యాణ్ అద్వానీ ఒకరు. ఈగ్రంథం ముచ్చటగా రూపొందింది. షాను అధ్యయనం చేసే ప్రతి విద్యార్థి తప్పక చదవాలి. షా కవిత్వం గురించి, వారి వ్యక్తిత్వం గురించి పాండిత్య ప్రకర్షతో నిండిన అధ్యాయాలతో కూడిన ఫతేచంద్ వాస్వానీ వ్రాసిన గ్రంథం షా రచనల నుండి కొన్ని ఎంపిక చేసినవి (Selections from Shah) చాలా ఆసక్తిదాయకాలు, జ్ఞానబోధకాలు. షా రచించిన ఏడు కథలు అన్న తమ గ్రంధంలో రాంపంజ్వానీ వారి 'సుర్'లలో కొన్నింటిని నాటకాలుగా మలచి జానపదాలకుగాను కొన్ని అధ్యాయాలు ప్రత్యేకించి వ్రాశారు. ఈ గ్రంధకర్త పై గ్రంధంలో ఉపోద్ఘాతం వ్రాస్తూ సింధుదేశాన్ని విశదీకరించడంలో షా పాత్ర గురించి వ్రాశారు.

సింధీ కవులలో అందరికంటె గొప్పకవి, 1689 లో ఒక సయ్యద్ కుటుంబంలో జన్మించారు. వారి తండ్రిగారైన షా హబిబుల్లా వారికాలంలో సువిఖ్యాతులైన భక్తులు. తుల్ ఫత్-అల్-కరంలో వర్ణించినట్లు షా హాబీబ్ తమ పరిసరాలలో ఏమి జరుగుతున్నదోనన్న స్పృహ కూడా లెనంతగా ధ్యానమగ్నులై ఉండేవారు. ఒక్కొక్కప్పుడు వారు తమ కుమారుని కూడా గుర్తించలేక పోయేవారు. వారు భక్తి పారవశ్యంలో అంతగా మైమరచి ఉండిపోయారు. కాని వారు చాలా దయాళువులు, ప్రేమమూర్తి అయిన తండ్రి. ఒకసారి షాహబిబ్ తనప్రియ పుత్రుడు ఒక చెట్టు తొఱ్ఱలోనో, ఇసుక పర్రలోనో గొంతువరకు పూడ్చుకుపోయి ధ్యాననిమగ్నుడై ఉండడం చూసి, అతడీ ప్రపంచంలో లేడని భావించి భయ విహ్వలుడై యిట్లా అన్నారు -

ఆ గాలి మారినది గాలి దుమారముగా,
అవయవములన్ని మునిగి యుండె ధూళిలో.

వారి కుమారుని వద్దనుండి యీ విధంగా సమాధానం వచ్చినది:

శ్వాస ఇంకను, వచ్చుచు పోవుచున్నది,
చూచుటకు ప్రియుని, ఊపిరి కొనసాగ వలెను

మరియొక కథ : హబీబ్ మరణశయ్యపై నున్నపుడు వారి ప్రియమైన పుత్రుని చివరిసారిగా చూడవలెనని కోరిక గలిగి కబురంపెనట.

దానిని నీ నుండి నే పొందగలవా జీవించి యుండ
నాప్రియమైన వాడా నామరణా నంతరము నిశ్చయముగా నీలిత్తువని
తెలుసు.

షా లతీఫ్ యీవిధమైన అనునయ వాక్యాలు పంపారట సమాధానంగా.

అధైర్యపడకుము, నేనెప్పుడును నీకు దూరంగాలేను
ఈ దూరము దృగ్గోచరము మాత్రమే
నీ సరిహద్దు మరి నీదియు ఒకటైనవి.

అసలు, పుత్రుడు దగ్గరికొచ్చే సరికే తండ్రి ప్రాణం విడిచినాడు. తండ్రి కుమారుని కంటె ఏడు సంవత్సరాలు ముందుగా మరణించారు. (1745), కొందరు పది సంవత్సరములు ముందుగా మరణించారు అంటారు. షాకు అధ్యాత్మిక చింతనలో మార్గదర్శకుడంటూ ఉంటే - అది వారి తండ్రిగారేనని వారి జీవితచరిత్రకారులు అంగీకరించారు. షా జననానికి చాలాకాలం క్రిందటనే వారికి పుట్టబోయే కుమారుడు 'లతీఫ్' ఒక 'కుతుబ్'

లేక 'ధృవతార'గా వెలుగొందుతారని చెప్పారు. అందువల్లనే వారి ప్రథమ పుత్రుని పేరు 'లతీఫ్' అని పెట్టారు. కాని ఆ శిశువు కొద్దికాలం తరువాత మరణించారు. వారి రెండవ పుత్రునిపేరు కూడ 'లతీఫ్' అనే పెట్టారు. షా అబ్దుల్ లతీఫ్ సంతానం లేకుండానే మరణించారు. అతని ఒకే ఒక్క సోదరుడు (నిజానికి సవతి సోదరుడు) జమాల్ అతని తరువాత వారి గద్దెనెక్కారు, జమాల్ వంశీయులు ఇప్పటికీ ఆ గద్దెమీద సాధికారులే!

సాంప్రదాయానుసారం షా లతీఫ్ తండ్రి పవిత్రమైన వ్యక్తి, కాని వారి ప్రపితామహులు బల్రీవాసి షా కరీం అంతకంటె కీర్తిమంతులు, గౌరవ నీయులైన వ్యక్తి. షా కరీం వాస్తవానికి చాలా పవిత్రమైన వ్యక్తి. వారిని కొని యాడే వారిలో చాలామంది వారిని పవిత్రవ్యక్తిగానే చూడగలిగారు గాని వారిలోని కవిని చూసి కవిగా గుర్తించలేదు. నిజానికి వారి మనుమడు సింధీ సాహిత్యరంగంలోకి అడుగు పెట్టడానికి ముందు షా కరీం సింధుభాషలో చాలా గొప్పకవి. హిందీ దోహాల ఆధారంగా వారు వ్రాసిన శతాధిక పద్యాలు, వాటిలోని సింధీ జానపదం, సూఫీ తత్వాలతో నిండిన కవితా వస్తువు షా కవిత్వంతో కలసిపోయింది. వారు ఆ పద్ధతులనే అనుసరించి వ్రాశారు. వారి ప్రపితామహులు అనుభవించిన దారిద్ర్యాన్నీ, కష్టాలను షా అనుభవించ నవసరం లేకపోయింది. షా కరీం మొదటి నుంచీ ఆశ్రమజీవితానికీ, బ్రహ్మచర్యానికీ అలవాటుపడిన వ్యక్తి, అయినప్పటికీ పెద్దలమాట కాదనలేక వివాహబంధానికి తలఒగ్గక తప్పలేదు. షా కరీంలో ఆ మరోప్రపంచపు ధోరణులు మొదటినించీ లేవు. వారు సాధారణ మానవునిలాగే జీవిస్తూ విషయ లాలసత్వం, ఆశ, వీటికి లోబడలేదు. మిత్రుల సహవాసంతో గడుపుతూ, ప్రేమ, సామాజిక విషయాలలో ఇతర మానవుల వలెనే ఆసక్తి చూపుతూ ఆనందించారు. వారి సుప్రసిద్ధ వంశీయులవలె షా నాగలి చేతబట్టలేదు, ఆకలిబాధతో గడపలేదు. షా లతీఫ్‌వలె షా కరీం సుదూర ప్రాంతాలకు ప్రయాణం చేసినట్లుగాని, ఆ సుదూర ప్రదేశాలలో స్వల్పకాలం పాటైనా నివసించి వచ్చారని చూపడానికి గానీ నిదర్శనాలు లేవు. షా కరీం ఏకాంత జీవితం గడిపారు. వారి జీవితం ఎల్లప్పుడూ పుణ్యాత్ములను ఆకర్షించే కేంద్రంగా ఉండేది. షా కరీం రాజులు, రాజస్థానాలకు దూరంగా ఉన్నారు. కాని షా లతీఫ్ క్వాజీ కజన్‌వలె ఉన్నత న్యాయాధికారిగా కాకపోయినా, మొట్టమొదటి, సిసలైన సింధీ కవిగా వారిలో అసూయ ఆగ్రహాలు మొదటి దశలో రేకెత్తించి నప్పటికీ, ఆనేలనేలిన కల్హోరాపాలకుల మకుటంలవంటి కులీనుల మన్నన లకు, గౌరవానికి పాత్రులయ్యారు. కల్హోరా పాలకులలో చాల ప్రఖ్యాతి

బడిసిన గులాం షా నేహ్లోరా, షా లతీఫ్ ఆశీర్వచన బలంవల్లనే కల్హోరానూర్ మహమ్మద్‌కి జన్మించారు. ఈ కల్హోరానూర్ మహమ్మద్ షా మనోబలాన్ని ఇంద్రియ నిగ్రహాన్ని పరీక్షించాలని భావించి కొంతమంది నీతినియమాలు పాటించని అందమైన వనితల మధ్యవారిని ఒంటరిగా ఉంచారట. వారి వలపులు, కపట నాటకాలు షా తిరస్కరించగా, కల్హోరా ప్రభువు వారి పవిత్రభావాలను ఛాందసాన్ని హేళన పూర్వకంగా మాట్లాడినప్పుడు దానికి సమాధానంగా చెప్పిన దానిలో ఆఖరుపంక్తి సింధీభాషలో ఇప్పటికీ ప్రచారంలో ఉంది.

ఆ చెడిన పడుచులు వారి విసరులు విసరనీ
వారికి కాదు లహుటీలు అంటిపెట్టుకొని యుండుట.

కాని ఝోక్‌వాసి షా ఇనాయత్ సుప్రసిద్ధ సింధీ సూఫీ వీరమరణం చెందారన్న వార్త విన్నప్పుడు షా లతీఫ్ గురియైన వేదనను షా కరీం ఎప్పుడూ అనుభవించ లేదు.

వెదకు వేదాంతుల సవ్వడులు వాకిటలేవు ; అదె సీలు వెడలిరి
ఆశ్రమములో వాటి ఆకర్షణను కోల్పోయినవి
జీవితమున పరశువేది గలవారు గతించిరి.

మహమ్మద్ సంతతి నుండి పుట్టిన షా లతీఫ్ ఒక సందర్భంలో వారి కాలంలో రాజులు, ప్రజాకంటకులను ధైర్యంగా, దయార్ద్ర హృదయంతో తలపడిన విధం 'ఇస్లాం కేసరి' ప్రవక్త మహమ్మద్‌ను, అలీని జ్ఞప్తికి తెస్తుంది. అట్లే వారి పూర్వీకులైన సయ్యద్ హైదర్ (వంశాను క్రమంలో షా లతీఫ్ నుండి 13వ వారు) చతురత కూడా షా లతీఫ్‌లో కొంత కనబడుతుంది. విజేత తామర్ లేన్‌కు గొప్ప విందు ఏర్పాటుచేసి వారి పటాలంలోని సిపాయిలందరూ ఒక్కొక్కరు ఒక రూపాయ వంతున బహుమతి యిచ్చి, వారి ప్రాపు సంపాదించి వారి కుటుంబ సంపదకు పునాదివేశారు. సయ్యద్ హైదర్ 1398 లో అఫ్ఘనిస్తాన్‌లోని హెరత్ నుండి వచ్చి సింధులోని మతియారీ (ముతాల్వీ) వద్ద స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు. వారికి హెరత్‌లో ఒక భార్య, సింధులో సయ్యద్ కుటుంబానికి చెందిన మరొక భార్య ఉన్నారు. సింధులో జన్మించిన వారి కుమారుడు మీర్ అలీ పెరిగి పెద్దవాడైన హెరత్‌కు తరలి వెళ్లి అతని సవతి సోదరుల నుండి తండ్రి ఆస్తిలో కొంత భాగం సంపాదించారు. ఆయన సింధుకు తిరిగి వచ్చి రెండు సయ్యద్ శాఖలకు

మూలపురుషుడైనాడు : అవి షరఫ్‌పోతాలు, మీరాపోతాలు. షా లతీఫ్ షరఫ్‌పోతా శాఖకు చెందినవారు.

షా లతీఫ్ ప్రపితామహులు మతియారీ నుండి బుత్రీకి వలస వచ్చారు. వారే బుత్రీ యోగిగా యిప్పుడు ప్రచారంలో ఉన్నారు. వారి పుత్రులు ; అనగా షా లతీఫ్ తాత, ఒక భర్తృహీనురాలిని దొంగలు దోచుకొంటుండగా ఆమెను కాపాడబోయి ఆ సంఘర్షణలో మరణించారు. వారి మరణానంతరం ఆ కుటుంబం తిరిగి మతియారీలో స్థిరపడింది. షా లతీఫ్ తండ్రి అక్కడినుండి హలా తాలూకాలోని భాయిపూర్‌లో కొంత కాలం ఉండి, చివరకు అదే తాలూకాలోని కోత్రీమొగల్‌లో స్థిరపడ్డారు. చాలా ఏండ్ల తరువాత షా లతీఫ్ కొత్త ప్రదేశాన్ని అన్వేషించడానికి కోత్రీ వదలి, కోత్రీమొగల్ (ఇప్పుడు నిర్మా నుష్యం) నకు నాలుగైదు మైళ్ల దూరంలోనే ఉన్న ఖిట్ (ఇసుక దిబ్బ)కు వచ్చారు. సింధు చరిత్రలో ఖిట్ ఇప్పుడు చాలా పేరు వహించింది ; ప్రతి సింధువాసి, ఖిట్‌కు చెందిన షా అబ్దుల్ లతీఫ్‌ను గురించి చాలా విన్నారు. సింధులో ఖిట్ ప్రఖ్యాతి బడసిన సాంస్కృతిక కేంద్రంగా రూపొందింది. షా లతీఫ్ జననం భాయిపూరలో, బాల్యం కోత్రీలో గడిపారు.

తరతరాలుగా భక్తి ప్రపత్తులకు, సాంఘిక సేవకు పేరొందిన కుటుంబ వాతావరణంలో షా లతీఫ్ బాల్యం గడిచింది. కుటుంబ సాంప్రదాయాలను కాపాడుతూ వచ్చారు. సంగీతమునందభిరుచి, మానవుల పశుపక్ష్యాదుల పట్ల దయగా మెలగడమనే క్రొత్త సాంప్రదాయాలను జోడించారు. ఆ కాలంలో జంతుహింస ఒక క్రీడగా ఉండేది. అందరూ వేటకు పోయినప్పుడు షా లతీఫ్ మాత్రం హృదయాన్ని స్పందింపజేసే పాటలు పాడే బాలుర సాంగత్యంలో కాలం గడిపేవాడు. షా లతీఫ్ వేటకాడు కాడు, అయినా మంచి క్రీడాకారుడు. వారు తమ విలువిద్యా పాటవం చూపించారు. కోత్రీ గ్రామంలో వయోవృద్ధులైన మిర్జామొగల్ బేగ్ వ్రేళ్ల సందులోనించి బాణం దూసుకుపోయేలాగున ఒకసారి, వారిని గాయపరచకుండా వారి తాయెత్తుకు రంధ్రంపడే విధంగా మరోసారీ బాణాలను వదిలారు. వారి భావి ఔన్నత్యానికి సూచనలుగా బాల్యదశలోనే అద్భుతమైన చిహ్నాలు పొడచూపాయని చాలా కథలు చెబుతారు. సింధులో నీలివర్ణ దేవతామూర్తి ఖ్వాజాఖిజ్ర్ సమక్షం నుంచి, దైవచింతనాసక్తుడు, తట్టకు చెందిన ఒక ఫకీర్ రెండు పుష్పాలను బాలుడైన షా లతీఫ్‌కు యిచ్చారని మౌల్వీ దిన్ మహమ్మద్‌వఫై సూచించారు. ఆ పుష్పాలు

సింధు యొక్క ఆత్మ, ప్రకాశమూ అనీ, అవి రెండూ ఆ బాలుని ఆవరించాయనీ చెబుతారు.

షా ఎంతవరకూ చదువుకున్నారు అన్న విషయంమీద వాదాలు జరిగాయి. సహజంగా అద్భుతాలను నమ్మేవారు షా 'ఉమి' అంటే చదువుకోనివాడనే అంటారు. భగవదనుగ్రహం వల్ల జ్ఞానం, తేజస్సు పైనించే వచ్చాయని వారి భావం. ఆ పర్షియన్ కవిలాగే వారు నమ్మినది :

పుస్తకము వలదనును, అంకెలు వలదనును, అక్షరములు వలదనును, అయినను విజ్ఞానము వచ్చును ఆ మనిషికి పరమాత్మనుండి. తూర్పుదేశాలలోని భక్తుల, యోగుల జీవితాలలో సాంప్రదాయ సిద్ధమైన గురుకుల శిక్షణ లేకుండానే వారికి భగవదనుగ్రహంవల్ల విజ్ఞాన సంపద లభించిందన్న నమ్మకం తరచు వింటూన్న కథయే. షా లతీఫ్‌ను బాలునిగా అఖుండ్ నూర్ మహమ్మద్ భట్టి చెంత విద్యాభ్యాసానికి చేర్చగా 'అలిఫ్' అన్న మొదటి అక్షరం నేర్చుకున్న పిదప రెండవ అక్షరం 'బెయ్' నేర్చుకొనడానికి నిరాకరించాడనీ, అలిఫ్‌ను మించి వేరులేదనీ, అదే ఒకటి, లేక ఏకత్వం అని వారు చెప్పారనీ చెపుతారు. వెంటనే వారిని విద్యాభ్యాసం నుండి విరమింపచేశారు. అటు తరువాత మరే ఇతరమైన విద్యాభ్యాస ప్రయత్నాలు జరుగలేదు. ఈ కథ అంత విశ్వసనీయంగా లేదు. చాలా కాలం తరువాత బహుళ ప్రచారం పొందిన ఒక పద్యంలో షా ఇలా అంటారు.

చదువుము ఒక అక్షరము, అలిఫ్, ఒకటి మాత్రము
తక్కిన వన్నియు మరచి పోవచ్చును
నీ ఆత్మను పరిశుద్ధము గావింపుము
మరియే చదువులు తరువాత వలదు నీకు.

ఇదే విషయంమీద వారు చెప్పిన మరొక పద్యం చూద్దాం.

ఏ ధముగ జాగరణలు ఉపవాసములు
సరితూగ గలవు ఒక్క కటాక్ష వీక్షణంతో ?
పుటలు నీవు త్రిప్పుము అంతులేక
ఒకే మాట మాత్రము నీవు పరీక్షించ గలవు.

ఇక్కడ 'అలిఫ్' అన్న అక్షరాన్ని నొక్కి వక్కాణించారు. అలిఫ్ అనగా ఐక్యత. ఏకత్వం, ఒక మాట, అంతర్లీనమైనది, ఆ ఏకత్వాన్ని ఊహించగలిగే అంతర్ దృష్టికావాలి. ఆ ఒక్కమాటను నేర్చుకొనవలసిన అత్యావశ్యకమైన విధ్యుక్తధర్మం. అదే మొదట నున్నది. అదే భగవంతునితో

ఉన్నది. అదే భగవంతుడు.... అట్లని విద్యను పుస్తకాలద్వారా పొందటం పట్ల చిన్నచూపు కనబరచ లేదు. భగవద్దృష్టికి ఆటంకం అయిన పక్షాన దానిని విడిచి పెటాలి. షా వ్రాసిన రిసాలో చదివిన వారు మాత్రం వారు విద్యనభ్యసించకుండానే భగవత్ప్రేరితం వల్లనే అది వ్రాశారని నమ్మరు.

రిసాలోను పైపైన చదివిన వారికి కూడా షాకు కొరాన్ సంపూర్ణంగా తెలుసునన్న విషయం సువిదితం. పర్షియన్ దార్శనికులకు బైబిలు వంటి జిలాలుద్దీన్ రూమీ మస్నావీ పట్ల వారికి చాలా మక్కువ అన్న విషయం కూడా ధృవపడింది. ఆనాటి కల్హోరాపాలకుడు బహుమతిగా ఇచ్చిన మస్నవీ ప్రతిని వారు భద్రంగా దాచుకొన్నారు. రిసాలోని విషయాల ఆధారంగా, వారికి అరబిక్‌లో ఉన్న కొరాన్, హాదీస్ (ప్రవక్త సాంప్రదాయాలు) వారికి తెలుసును. పర్షియన్ భాషలోనున్న రూమీ వ్రాసిన మస్నావీ వారికి తెలుసు. ఉత్తర భారతంలో ఆనాడు ప్రచారంలో నున్న హిందీ లేక ఇతర ప్రాంతీయ భాషలలో విఖ్యాత భక్తి రచనలు, సింధు జానపద గాథలు, షాకు పూర్వీకులైన క్వాజీకజర్, షా కరీంల రచనలు, వీటన్నిటి నుండి కొన్ని వారి రచనలలో చేర్చి, లేక వాటికి వ్యాఖ్యానాలు వ్రాసి తమ పద్యాలలో చేర్చి ఉన్నారు. పైన చెప్పిన రచనలన్నీ షా నోటితో చెప్పుకొని కంఠస్థం చెయ్యడానికి అవకాశమున్నది; కాని అట్లా జరగడం అసంభవం. పుస్తక పఠనం ద్వారా జ్ఞానోపార్జన ముస్లిముల కాలంలోనే సింధులో అంతగా లేకపోయినప్పటికీ ఉన్నంతలో షా అబ్దుల్ లతీఫ్ తమవంతు ఆర్జించి ఉండాలి.

పుస్తకాల ద్వారా జ్ఞానం సంపాదించినా లేకపోయినా, షా అబ్దుల్ లతీఫ్ ప్రకృతి నుండి సంపూర్ణమైన జ్ఞానాన్ని సంపాదించారు. వర్డ్స్‌వర్త్ మహాకవిలాగా వారి మాతృభూమిలో కొండలు, కోనలు పరిభ్రమించుతూ నదులు, సరస్సులు దాటి ఎడారులలోను, అడవులలోను సంచరించి చివరకు భిట్‌వద్ద స్థిరనివాసం ఏర్పరచు కొనడానికి చేరారు. భిట్ ఇసుక గుట్టలు కిరార్ సరస్సును పరివేష్టించి ఉన్నవి. ఇరువది ఏండ్లు వయసు వచ్చిన తరువాత మూడు సంవత్సరాలు పర్యటించినట్లు తెలుస్తున్నది. చాలా సంవత్సరాలు గడిచిన తరువాత తమ ప్రపితామహుని సమాధిపై ఉంచడం కోసం ముల్తాన్ నుండి శిలలు తీసుకురావడానికి చేసిన ప్రయాణాన్ని గురించి అనేక సాక్ష్యాధారాలు ఉన్నవి. కాని వారు సర్వకాల సర్వావస్థల లోను ప్రకృతి యొక్క సన్నిహిత సాహచర్యాన్ని అనుభవించుతూనే గడిపారు. అది రక్తసిక్తమైన క్రూర జంతువుల కోరలు, పంజాలతో గోచరించే ఎట్టిని ప్రకృతి కాదు, మొగంమొత్తే ప్రకృతి కాదది. అది అ

విశాలం, ఏకాంతం, మార్గమధ్యంలో విశ్రాంతి సమయాల్లో నిశ్చలత్వాన్ని, అనంతత్వాన్ని బోధించే ప్రకృతి; ఏకత్వాన్ని శాశ్వతత్వాన్ని అందించే ప్రకృతి, గొంతులేని సంగీతం నిశ్చలతను, కదిలించని శ్రావ్యతను, అందించే ప్రకృతి. అందుకు సరియైన రీతినే షా పద్యకావ్యాలను ఎడారి సంగీతం అంటారు.

షా పట్టణ వాసి కానే కాదు, రాజసభలలో ఉండే సేవకు డంత కంటె కాదు; వారి పద్యాలు బజార్లలో దొరికేవీ కాదు, చర్చి మఠాలకు చెందినవీకాదు, పండిత ప్రకాండులవీ, ధర్మశాస్త్ర విధాయకులవీ కానే కాదు. అందువల్ల కొందరు విమర్శకులు షాను నాగరికత ఎరుగని గ్రామ్యకవిగా పొరపాటుపడ్డారు. అతడు గ్రామీణ వాతావరణంలో పెరిగి రూపొందిన కవి గనుక, నాగరికత నెరుగని కవిగా ఎంచితే అది సవ్యమే అవుతుంది. కాని అపదాన్ని సంస్కృతి నెరుగని అజ్ఞానం, అనాగరికత, సంకుచితత్వాలను సూచించే భావాలు, వీటి పరంగా ఉపయోగించినట్లయితే షా ఎంత మాత్రమూ నాగరికత నెరుగని గ్రామ్యకవి కాదు. ఏ పురుషుడైనా స్త్రీ అయినా ఎంత కులీన వంశజులైనా, ఎంతటి సభ్యత కలిగిన వారైనా, షా రిసాలో చదివితే, ఏదో ఒక క్రొత్త విషయం నేర్చుకోదగినదిగా గోచరిస్తుంది. షాను ఇతరత్రా అన్ని విధాలా అభిమానించే ఒకరు షా నాగరికత ఎరుగని గ్రామ్యకవి అన్న విషయం ఆధారంగా తీసుకొని ఆ విషయాన్నే బలంగా చెపుతూ సుప్రసిద్ధ పర్షియన్ కవులు రూమీ జామీ, హాఫీజ్‌ల స్థాయికి ఒక మెట్టు క్రిందివారుగా చూపించారు.

లేదు శక్తియిచట రూమీ పద్యములో నున్నది
లేవు జామీలోని జీవి మైమరపించు సంగీతపు కదలికలు
లేదు ఆ తార స్థాయి స్వరము హాఫీజ్‌లోని వేర్పు
వీ విభ్రమ మైన వీధిగాయకుని గీతలలో ఆ ధ్వని.

డా॥ సోర్లె కొంత వరకు షాకు కూడ ప్రశంసలు పంచి పెట్టడానికి సమ్మతించారు. కానీ ఇస్లాంకు చెందిన కవిగా మాత్రమే ఆ సమ్మతి పరిమితమయి ఉంది.

మరి అయినప్పటికీ, - వింతైన విరుద్ధమది
తక్కువేమి కాక మవసువ హత్తుకొను ఆ శాంతమైన,
ఆ సరళమైన మంత్రమాతని మాటల ముందున
జ్ఞాన పూరిత గంభీరమైన ఇస్లాం వాక్కులకంటె!

వారిని ఆదర్శవంతమైన నిజమైన భారతీయ ఋషిగా చూచి, ఆ భగవత్సాక్షాత్కారమైన వానిగాను లేదా స్వప్న దర్శనమైన వ్యక్తిగాను, ఆ మధురాను భూతులను మై మరపించే మాటలలో శ్రోతలకు సమర్పించిన కవిగా చూడడం న్యాయం. అందుకు బదులుగా ఇస్లాం అనే సంకుచిత సిద్ధాంతపరిధిలో షా అబ్దుల్ లతీఫ్‌ను బంధింప చూడడం సోర్లె చేసిన పొరపాటే! ఒక పెద్దలోపమే! భిట్ మధ్యయుగంలోని ఒక ఆశ్రమం లేదా అరణ్యం లోని పుణ్యస్థానం. అక్కడ షా యీ లోకాన్ని చూశారు. అఖండమైన ప్రపంచంగా చూశారు, ఆ ప్రపంచానికి ఆవలగా వెనుకగా ఉన్న రహస్యాన్ని దర్శించారు. ఉపనిషత్తుల యొక్క వాటి కర్తలైన ఋషుల యొక్క మహిమను గురించి అస్పష్టంగా నైనా సోర్లెకు తెలిసి ఉందనిపించు తున్నది. షా వారి తరువాత సచల్, సమీలు మహత్వపూర్ణమైన వారసత్వానికి ఉత్తరాధికారులు, దానిని మనకు బోధకాలుగా అందించిన వారు. ఋషులు సింధునదీ తీరాన వేదాల నుండీ ఉపనిషత్తుల నుండీ మంత్రాలుచ్చరించుతూ మానవునిపై ప్రకృతిపై భగవంతునిపై తమధ్యానాన్ని కేంద్రీకరించి జీవి అంతరాంతరాల వరకు చొచ్చుకు పోయారు. రూమీ, జామీ, హాఫీజ్‌లలోని శక్తి జీవిని మరపించుట గేయరచనా సామర్థ్యం, యీ మూడు లక్షణాలు కలిసి వినయ విధేయుడైన తక్కువస్థాయి నున్న సింధుకు చెందిన భట్టుకవిలో ఉన్నాయనిసోర్లె చెప్పి ఉన్నట్లయితే అది సత్యదూరం కాదు. షా కవితా రచనలు నిజానికి పరిపూర్ణ సామర్థ్యంతో రచించినవేగాని, నాగరికత ఎరుగని గ్రామ్యకవి రచించినవి ఎంత మాత్రమూ కావు. రూమీ పద్ధతి కథ నంతటిని కథా క్రమాన్ననుసరించి పూర్తిగా వర్ణించి సూఫీ సిద్ధాంతం యొక్క నీతి చివరకు వచ్చేలాగ చూడడం. అదే షా పద్ధతి. పాఠకులకు, శ్రోతలందరికీ తెలిసిన కథలను పూర్తిగా వర్ణించి చెప్పనవసరం లేకుండా, తిరిగి జ్ఞప్తికి తెచ్చుకోవలసిన అవసరం రాకుండా ఆధ్యాత్మిక అంశాలను స్ఫురింప చేస్తూ బాణాలవలె అర్థాలను సంధించడు. ఒక పూర్తి అధ్యాయంలో చెప్పలేని విషయాన్ని స్ఫురింప చేస్తూ 'అల్లుళ్లకు బయలు బంగారాన్ని ఇచ్చి పుచ్చుకోవడం 'మీరు' లకు అలవాటు లేదు' అని మరూయీ యీ మాటలు మాత్రం అంటుంది. మానవుడు విధివ్రాత గురించి తెలుసుకొన వలిసినదంతా సంక్షిప్త పరచి ససూయి తన వైపునకే తిరిగి తీక్ష్ణమైన బాధ రోదనలువీటి మధ్య కీడు తల పెట్టిరని భర్త సోదరులపై నింద మోపుట యేల, నాదినమే నాతో అనర్థము లాడ కుండిన - అని మాత్రం అనగలుగుతుంది. 'ఆ కుండ పగిలినది, ఆ చెడు నడత గల వనిత మరణించినది, అన్ని సాధనములు మాయమైనవి, అప్పుడే మెహార్ కేక వింటాడు సుహ్ని' అని ఒక గొప్ప ఆధ్యాత్మిక ఉపదేశాన్ని జేస్తారు.

షా యూసస్-జులెయ్ఖా లోని హృదయాన్ని ఆనంద పారవశ్య పరచే అధ్యాయంలోని అతి శ్రేష్ఠమైనదిగా ఎంచారు.

చూడుము ట్యులిప్ ఎక్కడ మొలకెత్తునో
మెట్టనేలల మైదానములలో, ఎటుల పరిమళ భరిత వసంతమున
తనను తా శృంగారించుకొనునో, ఎటుల కంటకముల మధ్య
అడవి గులాబి తన ఉడుపులను చీల్చుకొని బయల్పరచు
తన అందాలను. నీవు కూడ ఏదో అపురూపపు టాలోచన
లేక సుందరమగు ప్రతిమ లేక గాఢమైన రహస్యము
నీ ఆత్మలో మెరసినపుడు, సహించ లేవు
అది గతించి పోవుట కాని పట్టుకొనుము ఆ దైవ వశమైన అవకాశమును
మాటలలో గాని, వ్రాతలలో గాని నీవు వెలువరింతు వేమొ
వలపింప జేయ ఈ ప్రపంచమును.

ఇంకా ఇలా అంటారు :

జామీ రచించిన పైఅంశంతో పోల్చ దగినది రిసా యందేమియు లేదు. షా గొప్పదనం దీర్ఘమైన వర్ణనలలో లేదు. అన్ని దిశలలోను వారి కలం విరజిమ్మే సూక్ష్మమైన మెరపు శకలాలలో ఉన్నది. షా కవితలన్నీ ఆలోచనా మందిరంలో కూర్చుని వ్రాసినవి కావు. 'బెయిత్' లు లేక పద్యాలు వారికి మెరుపుల వలె ఆశువుగా స్ఫురించినవి. తనను గురించి వారే చెప్పినట్లు :

ఇవీ కావు పద్యములో మీరనుకున్నవి
సాక్షాత్కరించినవి నాకు శాశ్వతమైనవి
అవి మీ మనసులను మలచును లోనికి
మరి గొనిపోవు నాతని చెంతకు

ఇక హాఫిజ్, ప్రపంచ మందలి గొప్ప గేయ కవులలో ఒకరు. హాఫిజ్ షాల గేయాలను ఒకే తూరి విను సింధీయునకు ఏది మధుర తమమో ఏది మంత్ర ముగ్ధులను చేయుచున్నదో నిర్ణయించుట కష్టం. హాఫిజ్ వారి ఘజల్ లను గురించి వారే యిలా అన్నారు. 'అవి ఆకాశమే కృత్తికకు చేరువ చేయు ముత్యములకోవ' షా తన పద్యాలను గురించి ఎప్పుడూ ఆ విధంగా చెప్పుకోలేదు. కాని వారు సృష్టించిన వాయ్ లేక కఫీ అను గేయరీతి అత్యంత ఘనత వహించిన కవి చేతి మీదుగా వెలువడిన ఘజల్ అంతటి సుశ్రావ్యంగాను, ఉన్నత భావ బంధురంగాను ఉంటుంది. అమాయకత్వం

అణకువ, మాటల పొదుపు, నిరాడంబరత్వం, యీ గుణాలు ప్రకృతికి వారిని సన్నిహితులుగా ప్రకటిస్తాయే తప్ప అనాగరిక గ్రామీణ కవిగా నిర్ణయించ డానికి ఉపకరించవు. కవి తన విమర్శలను తమ నాయికల మనోభావా లతో కలగలిపి వ్యక్తం చెయ్యడం తార్కిక విరుద్ధమని సోర్లె; షా పై నేరారోపణ చేశారు. షా నాటకీయ కవి కాదనీ వారు గేయకవియనీ అంటారు. ఈ ఆశ్చర్యార్థకమైన మలుపులు సంగీతానికి, వర్ణనకు ఔన్నత్యం గొప్ప దనం ఇనుమడింప జేస్తాయంటారు. ఈ విధమైన అనుసరణలో షా హిందీ కవులను అనుసరిస్తున్నారన్నదే సోర్లె కినుక. షా హిందూ సాంప్రదాయా లకు కట్టుబడిన, భారతీయకవి అన్న విషయాన్ని సోర్లె విస్మరించారు. ఆకాలంలో అరువది సంవత్సరాలు షా అలజడుల మధ్య జీవించారు. ఔరంగజేబు మరణించేనాటికి షా వయస్సు పద్దెనిమిది సంవత్సరాలు. అప్పటి నుండి కల్హోరాలు క్రమంగా పరిపాలనను హస్తగతం చేసుకున్నారు. నాదిర్షా ఇండియాపై దండెత్తి జయించే నాటికి షా జీవించి ఉన్నారు. కాని యీ అలజడుల ప్రస్తావన గాని వాటి ప్రతి ధ్వనులు గాని వారి కవిత్వము నందెక్కడా కానరావు. వారుకల్హోరాల రాజధాని ఖుదాబాద్ పరిసరాలలోనే నివసించే వారు, కాని వందలాది మైళ్ల దూరంలో ఉన్నట్లుగా వారిపై ఆ పరిస్థితుల ప్రభావమేమీ ప్రసరించలేదు.

షా జీవితంలో వారి పరిభ్రమణాలు, వారి వివాహం, సహచరులతో వారి జీవనం అనే మూడున్నూ మూడు ముఖ్యాంశాలు, ఆసక్తిదాయకాలు. అదృష్టవశాత్తు ఏ సింధీ కవి గురించీ మనకు లభ్యంకానన్ని వివరాలు యీ మూడు అంశాల గురించి మనకు దొరుకుతున్నాయి. మొదటి అంశం వారి పర్యటనలు. సింధీభాషలో విస్తృతంగా వ్రాయబడిన లతీఫీ సెయర్ (లతీఫ్ పర్యటనలు) అన్న చక్కని గ్రంథాన్ని చాలా శ్రమకు ఓర్చి సింధీ భాషకు ఆచార్యులు భేరూమల్ మహిర్ చంద్ వ్రాశారు. ప్రప్రథమంగా రచయిత ప్రజలను, ప్రకృతిని షా నిశితంగా పరిశీలించే శక్తికి ఆ పరి వ్రాజకుని (సెయిలానీ)కి గౌరవ సూచకంగా నివాళులర్పిస్తారు. షా మగ్గాలు నేసే స్త్రీలను, ఇంటిపై వాలే కాకిని, వాలిన ప్రతిచోటా అపరిశుభ్రం చెయ్యడం, ఒక చోటనుండి మరియొక చోటికి ఎగురుతూ దూతగా ఉండేందుకు తగిన ఆ కాకిని కూడా నిశితంగా పరికించేవారు. ఆకాశంలో ప్రకాశవంతంగా వెలుగొందేవాటిని ఉరుములు, మెరుపులు, వాన, అంగడిలో కమ్మరి, తన దాగలి చెంత స్వర్ణకారులు, రత్నాలవర్తకులు వారి విలువైన ఆభరణాల చెంత, కుమ్మరిని ఆతని చక్రం చెంత గుర్తించేవారు. వారి దృష్టి ప్రత్యేకం ఆకసంలో ఎగిరే పక్షులపైన, ఎడారిన నడిచే ఒంటెలపైన

నిలచి ఉండేది. ఆ ఎడారి నిజానికి సముద్రంలాగ కనిపించేది. అద్భుతమైన ఆ నది ఆ కవి జీవితాంతం అధ్యయనం చేసినవి. ఎడారి వారి వాకిటి యెదుటే ఉండేది. వారి నివాసస్థలం భిట్ అంటే ఇసుక గుట్ట అని అర్థం. వారెల్లప్పుడూ ఇసుక గుట్టలలో ఒంటరిగా వాహ్యాళికి వెళ్లడంలో ఆనంద మనుభవించేవారు. నది గుండా దూరాన హిందూ మహాసముద్రాన ప్రయాణించే నావికులు వారికి పరిచయమైనారు. వారి 'సుర్'లలో ఒకటి సుర్ సముంది అనగా సాగర జీవులపై సుర్. దీనిలో వారు సముద్ర యానానికై అన్నీ సమకూర్చుకొని సిద్ధమవడం, ఆతురత చెందే ఆడువారి బాధలు, సంకటాలు వర్ణించబడినవి. యూరోపు దేశంలోని సముద్రపు దొంగలను గురించి షా కు తెలుసు ; వారే ఫ్లాంగీలు. (ఫెరింగీలు అన్న పేరు నుండి వచ్చినది) నిజానికి షా పద్యాలలో ప్రతి పద్యానికీ ఏదో అర్థం ఉంటుంది ; ఎడారి వాసుల జీవితాలు, నదీ వాసుల జీవితాలు, సముద్ర వాసుల జీవితాలు, వారికి అమూల్యమైన పాఠాలు అందించాయి. ఎడారి వాసులు, పశుల కాపరులు, ఒంటరిగా కూర్చొని తలను రెండు కాళ్ల మధ్య నుంచుకొని దీర్ఘాలోచనలో నిమగ్నులైన షాపై అనేక కథలు చెబుతారు. సింధీ చిత్రకారులు చిత్రించిన షా చిత్రాలలో యీ విధంగా తల వంచుకొని ధ్యానమగ్నులై (మోనస్) ఉండడాన్ని గమనించవచ్చు.

ఉంచుము నీ శిరము మోనస్ నందు
చింతించకు మిసుమంతయు తినునది నీవు
క్రిందికి చూడుము, కనులు మూయుము
ఆ మిత్రునే చూడుము, కలియు మాతనినే.

ఆ 'మోనా'ను ఒక్కొక్కసారి మోసెస్‌కు దైవదర్శన మిచ్చిన సినా శిఖరం లేదా సినాయ్‌తో పోల్చడం జరిగింది.

కనీసం మూడేండ్ల కాలం షాహిందూ జోగుల, సన్యాసులసాంగత్యంలో అనేక ప్రదేశాలు సంచరించారు. ఈ కాలాన్ని మిల్టన్ జీవితంలోని హార్టన్ కాలంతో పోల్చి అది వారి కవితా వైభవం రూపొంది పెంపొందిన కాలంగా చెప్పవచ్చు. ఈ పరిభ్రమణల కాలంలోనే జీవితాంతం వరకు సరిపోయేటన్ని విషయాలను సేకరించారు. ఆ యాత్రలు ముగించుకొని వచ్చేసరికి వారి వయస్సు ఇరువదిమూడు ఇరువదినాల్గు సంవత్సరాలు మాత్రమే.

షా తమ యాత్రలలో దర్శించిన మొదటి స్థలం ఆధునిక హైదరాబాద్ వద్దనున్న (షా మరణానంతరం కొలది కాలానికే వెలసిన నగరం) గంజాటకర్. అక్కడి కాళీ ఆలయంలోని కాళీమాత దర్శనం అయింది.

అక్కడ నుండి హిందూ జోగులతో గూడి ఇప్పుడేర్పడిన మార్గం ద్వారా కరాచీ (అనాడు ఒక చిన్న చేపలు పట్టే కేంద్రం) గుండా పయనించి బలూచిస్తాన్, లస్‌బెలా రాష్ట్రంలోని సుప్రసిద్ధ పుణ్యక్షేత్రం హింగ్లాజ్‌కు చేరారు. హిందూ యాత్రికుల పద్ధతులకు అనుగుణంగా షా కూడా కాషాయ వస్త్రాలను ధరించారు. గంజాటకర్ నుండి హింగ్లాజ్ షాకు వచ్చే త్రోవలో హిలాయా కొండలు, కీంఝార్ సరస్సుల ప్రక్కనుండి పయనించారు. అచటనే వారు జాలరి వనిత నూరీ లేక గంద్రితో జామ్ తమాచీ సరసాలాడిన ప్రదేశాన్ని దర్శించి, సూర్ కమోద్‌లో దాని ప్రస్తావన చేశారు. కరాచీ సమీపంలో ఇప్పటి మనోరా ఓడరేవు వైపుగా, మారీ జాలరి ఆరుగురు సోదరులను పొట్టబెట్టుకున్న పెద్ద మొసలి దాగి ఉన్న కలాచీ సుడిగుండాన్ని చూచారు. షా తన కవితలలో కలాచీని గురించి ప్రస్తావించారు. సింధీ వాఙ్మయంలో ప్రఖ్యాతి వహించిన నాయిక ససూయీ నివసించిన బంభోర్ కూడా కరాచీకి పోవు మార్గంలో చూశారు. పాబ్‌నది దాటిన తరువాత ఆ అడవులలో పోవడం అతికష్టం. ససూయీ తన ప్రియుడు పుర్‌హూర్ అన్వేషణలో దాటిన నిర్జీవమైన స్థలాలు, కొండలు, ఇసుక గుట్టలను గురించిన ప్రత్యక్షానుభవం షా పొందారు. అటు తరవాత కథలుగా చెప్పుకొనే హరా పర్వతాన్ని, హింగోర్ ఉపనదిని చూశారు. అతి కఠినమైన ప్రయాణం చేసిన తరువాత షా, వారితోటి యాత్రికులు హింగ్లాజ్, చేరుకున్నారు.

సుప్రసిద్ధమైన హిందూ పుణ్యక్షేత్రమైన హింగ్లాజ్ హరా పర్వతపు వాలునం దొక గుహ. ఒకేసారి ఐదువందల మంది యాత్రికులు ప్రవేశించ గలిగినంత విశాలంగా ఉంటుంది. అక్కడ దేవి అంబ, శయనించి ఉన్న భంగిమలో ఉంటుంది. ఆ విగ్రహంపై పాలు పోస్తారు. షా రెండవసారి కూడ హింగ్లాజ్ దర్శించారట. కాని ఆ సందర్భంలో తన హిందూ సహ యాత్రికులతో అభిప్రాయ భేదాలు రావడంచేత హింగ్లాజ్ నుండి అద్భుతంగా మాయమై తట్టలో ప్రత్యక్షమయ్యారట. అయినా చివరి క్షణంవరకూ షాకు హిందూ జోగులపై గౌరవాభిమానాలు తరుగలేదు. జోగులలో రెండు రకాల వారిని వారు గుర్తించారు. ఒక రకం 'నూరీ,' తేజస్సును వెదకువారు, రెండవరకం 'నారీ' నరకంలో ఉంటున్న వారు :

కొందరు నూరీలగుచు, మరి కొందరు నారీలు
జోగీల ప్రపంచమున జీవించుచు,
బూడిదయైన ఎదలో వారు జ్యోతిని వెలిగింతురు
వారికొరకు మాత్రమే జీవించుచుంటిని నేను.

లాస్ బేలా, కెచ్ మక్రాన్‌ల పర్యటన మార్గంలో ససూయీకి సంబంధించి అనేక స్థలాలను, తమ సుర్‌లలో సువిఖ్యాతి పొందింప జేసే స్థలాలు వంకర్ లహూట్, బలూచీస్తాన్‌లోని పర్వతశ్రేణి ప్రదేశమైన ఝల్వాన్ వంటివి చాలా దర్శించారు. తట్టగుండా తిరిగి వస్తూ లార్ లోని ప్రదేశాలను చూస్తూ కచ్, భుజ్‌లను చేరుకున్నారు. 1819 లో సంభవించిన భూకంపం వలన సముద్రంలోనికి చొచ్చుకొని వచ్చిన కచ్‌ను సింధు నుండి పూర్తిగా విడగొట్టిన సంఘటన అప్పటికి జరుగలేదు. సింధు నుండి కచ్‌కు చాలా సులభంగా పోవచ్చు. కచ్‌లో లఖ్ పట్ నారాయణ సర్, కోడేసర్ పుణ్యక్షేత్రాలకు యాత్ర సాగించారు.

కచ్ నుండి షా సౌరాష్ట్ర లేక కథియ వాడ్‌కు పయనించి పుణ్య క్షేత్రాలైన ద్వారక, పోర్ బందర్‌లు దర్శించి ప్రఖ్యాత నగరం జునాగడ్, సుర్ సోరత్‌లో వారు గానం చేసిన గిర్నార్ కోటలను దర్శించారు. ఖంబట్ లేక కాంబేకు కూడా వారు పోయారు. తిరుగు ప్రయాణంలో థార్ గుండా ప్రయాణించి, మరూయికి శాశ్వతంగా అర్పించిన మలిర్‌ను దర్శించి, నాయిక ముమల్‌తో ముడివడిన స్థలాలనన్నిటినీ చూచారు. బహుశా షా థార్ వాసుల నరనరాలలోను జీర్ణించుకు పోయినంతగా, థార్ భాషను వారు ప్రయోగించారు. అచ్చట ఆచారాలను, దుస్తులను, నివాసాలను, నాగ చెముడు పొదలను, అద్భుతమైన వృక్షాలను, లోతైన బావులను, థార్ ఎడారిని తమ పద్యాలలో అక్కడ జన్మించిన వారిలాగా వర్ణించారు. థార్‌పై వాన చినుకులు పడినప్పుడెట్లుంటుందో హృద్యంగా చెప్పారు. జైసల్మీర్‌ను చూశారు. ముమల్ రానోల ద్వారా ఖ్యాతి వహించిన కాక్ నది ఎగువ నున్న లాఢోరో లేక లడానోను దర్శించారు. బర్మార్ వరకు షా ప్రయాణించారు. సింధునది పురాతన నదీ ప్రవాహ తలమైన పూరన్‌ను కూడ దర్శించారు.

షా ఎగువ సింధులో కూడా దరాజన్‌లోని ఖైర్‌పూర్ వద్దనున్న నౌ షాహ్రో వంటి పట్టణాలలో కొంతకాలం గడిపారు. అక్కడ వారి తరువాత రాబోవు కవులలో గొప్పవాడైన చాల సాచల్‌ని కలుసుకొన్నాము. ముల్తాన్ వరకు ప్రయాణించారు. తన ప్రపితామహుని సమాధి కట్టించడానికై పోయినప్పుడు వారు ఎగువ సింధును బహావల్‌పూర్‌ను దర్శించారు. మధ్య సింధు వారికి పుట్టినప్పటి నుండి తెలిసినదే. దిగువ సింధులోని అనేకమంది మిత్రులను అనేక సందర్భాలలో చూచారు. షా కవిత్వంలోని ఉచ్చారణ, మాటల కూర్పు, పూర్తిగా దిగువ సింధులోని లార్‌కి చెందినవే నన్న విషయం మరువకూడదు. వారి స్మృతి పథంలో

నిలచిన అద్భుత సంఘటన వీర మరణం చెందిన సూఫీ షా ఇనాయత్ (ఝోక్ వాసి).

ఒకే ఒక్క యాత్రపై వారి మనసు లగ్నమైనది. కాని అది నెరవేరే లోపలనే 1752లో వారిని మృత్యువు గొనిపోయింది. అది ఇమామ్ హుస్సేన్, వారిని భక్తితో అనుసరించిన అనుయాయులు మృతి చెందిన విషాద ఘట్టం జరిగిన, ఇరాక్‌లోని కర్బలా మైదానయాత్ర. కర్బలా మైదానంలో జరిగినది హృదయాలను ద్రవింపజేసే కథ. కవి ఆధ్యాత్మిక చింతనా పరుడు అయిన షా, కర్బలాను చూడాలని ఉత్సుకుడైనాడు. కర్బలా విషాద గాథ అద్భుతంగా గానం చేయబడిన సుర్‌కేదారొలోని రచనా శైలి షా ఇతర శైలిలో సమ్మిళితమై వేరుగా గుర్తింప రానంతగా మారి పోయింది. అనేక సందర్భాలలో మంత్ర ముగ్ధమైన వారి శైలి వాటిలో మనకు గోచరిస్తూ ఉంటుంది. కర్బలాపై వారికున్న మక్కువను బట్టి షా లతీఫ్ షియా అయి వుంటారా అని చాలామంది వేసే ప్రశ్నకు సమాధానం చెప్పనవసరం లేదు.

షా చేసిన పర్యటనల ద్వారా సింధీ గాథలు, జానపద కథలలో ప్రసిద్ధికెక్కిన ప్రతి అంగుళం వారికి సన్నిహిత మయ్యాయి. ముఖ్యంగా థార్ ఎడారి. వారి రచనల ద్వారా సింధీయులు దర్శించి దానిని మక్కువతో వీక్షించడానికి అనువుగా వారు ద్వారాలు తెరచారు. అలా వారు చూపించి ఉండకపోతే ఎడారి ప్రాంతమంతా సింధీ వాఙ్మయంలో మరు భూమిగానే నిలచి యుండేది. వారి విస్తృతమైన యాత్రలలో షా అనేక ప్రమాదాలు, ప్రాణాపాయకరమైన వాటిని ఎదుర్కొన వలసి వచ్చింది. కాని వారు వాటన్నిటినీ నిరపాయంగా అధిగమించ గలిగారు. వివిధ రకాలైన వ్యక్తులను కలుసుకున్నారు. ఈ సంఘటనలను గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. వీటిలో ప్రసిద్ధి కెక్కిన కథ ఒంటరిగా నున్న ఒక సన్యాసిని వారు కలుసుకున్నప్పటిది. హింగ్లాజ్, తట్టలకు మధ్య గల దట్టమైన అరణ్యంలో ఆ సన్యాసి తనలో తానే ఒక పద్యపాదాన్ని ఉచ్చరిస్తూండగా షా చూశారట.

**ఒంటరిగా, ఒంటరిగా పోవుచుంటి పున్‌హూన్ వైపున**

ఆ పద్యం తక్కిన రెండు పాదాలు తెలియక పూర్తిగా చెప్పలేక పోయారు. షా జార విడచిన ఒక పంక్తిని ఇట్లా అన్నారు.

**గిరులు చరించనివిగా నున్నవి, కాని అది ఒక వరము.**

అప్పుడా సన్యాసి మూడవది, చివరదీ అయిన పంక్తిని కూడా చెప్ప మని కోరగా షా అదికూడా యిట్లా చెప్పారు.

"నీ బాధలను కూడ గట్టుకొమము చేరుటకాతవిని శీఘ్రము"

పద్యం పూర్తికాగానే ఆ సన్యాసి నిలువున కూలిప్రాణం విడిచి పెట్టారు. షా గోతినిత్రవ్వి ఆప్రేమికుని పాతిపెట్టవలసి వచ్చింది. కాని తాను ప్రేమించిన దానిని సాధించుటకా జీవి పడిన బాధను షా ఎన్నటికీ మరువలేదు.

షా బడికి వెళ్లి విద్యనార్జించనప్పటికీ, బృహత్ సింధులోని పుణ్య క్షేత్రాలన్నిటికీ ప్రదక్షిణాలుచేసి విద్యనార్జించారు. మత మౌఢ్యులైన సయ్యదుల, ఫకీర్ల సాంగత్యంలో పెరగడం వలన వారికి అబ్బినవేమో నను కొనే కఱకుతనం, అక్రమప్రవర్తన, వికారచేష్టలన్నీ వారు యోగ, భక్తి వేదాంతాల అభ్యాసాన్ని ప్రారంభించిన పిదప, అవన్నీ నశించి నాగరికు లైనారు. భారతీయ సాంప్రదాయిక వేదాంతతత్త్వం అందరినీ కూడగట్టే మతం లేదా ఆధ్యాత్మిక తత్త్వం వేలాది సంవత్సరాలుగా భారతదేశంలో పరిరక్షించబడుతున్నాయి. వారు తమ జీవితంలో మూడు సంవత్సరాలు బృహత్ సింధును పర్యటించారు. అలా కాక అమూల్యమైన ఆమూడు సంవత్సరాల కాలం హిందూ జోగుల, సన్యాసుల సరసన తిరిగి వారి వలె వస్త్రధారణ చేసుకొని, వారి వలె వసియించి, పూజించి, భజియించి వారిలో ఒకరుగా మెలగక పోయినట్లయితే షా సింధులో కవిగా అంత ఉన్నత స్థాయికి ఎదిగి నిజమైన వేదాంతిగా ఉండేవారా అన్నది అనిశ్చితమైన విషయం. వారి కవిత్వంలోని ఆలోచనలలోని సింధూత్వమునకు (భారతీయత్వముకూడ) ధారాళమైన ప్రామాణ్యములు వారి సుర్ రామకలి, సుర్ ఖాహొరీలు.

ఇక షా ప్రేమ, వివాహం వైపు చూస్తే, పర్షియన్ కవి జామి చెప్పిన ప్రసిద్ధ పంక్తులు జ్ఞప్తికి తెచ్చుకోవాలి.

అది బాగుగనే యుండును మనము ప్రేమలో ఇంకను ఉండుట :
ఈ విలోమము లేకున్న మన మందరము వృధా......
ఆ హృదయము అది హృదయము కాదు ప్రేమ బాధలేకుండ.
మోహబాధల వైపు నీ ముఖము త్రిప్పుము ఈ భువిపైన :
మనో వికారముల ప్రపంచము, అది ఆనందమయ ప్రపంచము
ప్రేమ యొక్క తీపిబాధ నుండి హృదయము విడి వడలేదు.

ఈ భువిపై ప్రేమలేక మానవుడు లేడు .....
మనోవికారములకు చిక్కకొనుము, అదియే నిను విడుదల చేయనోపు.
ఉంచుకొనుము నీ గుండెలపై దాని భారమును, ఆనందటపడుటకు
ప్రేమ మదిరీ ఉత్సాహముతో మరి నిండు మనసుతో దీవించును
తక్కిన దంతయు తెచ్చు వ్యాకులము, స్వార్ధపరత్వము.....
ఉన్నప్పటికిని ఈ ప్రపంచమున నీవు సుకరమగుగాక విషయములు
ప్రేమ యొక్కటే గొని పోవును నిన్ను నీ నుండి వేరుగా
త్రిప్పకుము మొగము ప్రేమ నుండి, అది కపటమైనను ....

సాధనము పరమాత్మ సత్యము దాని ద్వారా సంపాదించవలెను. ఆఖరి రెండు పాదాల చాలా మహత్వ పూర్ణమైనవి, కాని అవి బాగా అను వదింప బడలేదు. జామీ అసలు పర్షియన్ పద్యానికి సరియైన అనువాదం.

త్రిప్పకుము మొగము ప్రేమనుండి, అది ఐహికమైనను
అది తీయును త్రోవ, ఆ నిత్య సత్యమునకు.

జామీ తొందరచేసే దాని భావం చాలా స్పష్టంగా వున్నది. జామీ చెప్పిన విషయానికి షా అబ్దుల్ లతీఫ్ ప్రేమ జీవితంలో దృష్టాంతీక రించబడింది. సాకారమైనది, విషయ సుఖాసక్తమైనదీ అయినా మోహం లేక ప్రేమ, విశ్వప్రేమకు మొదటి మెట్టు. ఇది మానవుని తన ప్రత్యేకమైన ఉనికిని మరపింపజేసి, తన ప్రేమైకమూర్తిని, సర్వమును హరింపజేసే కోరికతో సంపూర్ణంగా తనలోనికి ఆకర్షించుకుంటుంది. సాకారప్రాప్తి, సుఖాను భూతులు అనే వంతెన దాటకుండా అక్కడే నిలచి భౌతిక సుఖాలు కలయికలు అనేవ్యసనంతోనే తృప్తి చెందిన వాడు దుఃఖభాజను డవుతాడు. చివరకు ప్రేమికుడు తన ఆరాధననంతా అనిశ్చితమైన దేహం నుండి శాశ్వతు డైన ఆ పరమాత్మవైపు మరల్చాలి. ఆతనికి దేహం లేదు. ఆకారం లేదు, తన ప్రత్యేక ఉనికిని నశింపజేసికొని, జీవులందరి జీవియైన అతనిలో ఐక్య మయేట్లు పాటుపడాలి. సూఫీలేక వేదాంతి ఇదియే లక్ష్యంగా ఎంచి భౌతిక దేహం నుండి పరమాత్మకు, పాశాలనుండి పరిపక్వతకు, 'తాను' అను భావన నుండి వినాశనం వరకు పయనించుతాడు. షా లతీఫ్ ఐహిక సుఖాలనుండి ఆధ్యాత్మికమే దైవప్రేమ అనే ఉత్కృష్టమైన స్థితికి ఎగసి పోయారు. అలాగే గమని చదగిన మరొక విషయమేమంటే షా, ఇంద్రియలాలసుడై విషయవాంఛలపై మమకారం తరిగినవాడై, ప్రేమ పట్ల భమలుడిగి ఆపరమాత్మవైపుకు మరలినవాడుకాదు. అతడు ఒకే ఒక ప్రేమను ఆరాధించినవాడు, వైవాహిక సంబంధమైన ఆనందాన్ని ఒకసారి

అనుభవించినవాడు. జీవితంలో అతిచిన్న ప్రాయంనందే దైహిక ప్రేమానుభవాలననుభవించి, ఆధ్యాత్మిక ప్రేమానందాన్ని అనుభవించడానికి స్థిరపడినవాడు, ప్రేమలో దీవెనలందిన అదృష్టవంతుడు. పర్యటనలు ప్రారంభించడానికి పూర్వమే ఇరువదియవపేట ప్రేమపాశాలలో చిక్కుకొన్నాడు. నిజానికి కోరికలు దుర్భరంగా పరిణమించక ముందే వాటి నుండి దూరమవడం కొరకే షా తన బాల్యాన్నంతా గడిపిన కోట్రీని వదలి వెళ్ళారు.

కోట్రీలో ఉన్నతస్థానంలో ఉన్నమొగలు ప్రభువు మీర్జామొగల్ బేగ్. వీరు షాపుట్టుటకు వంద సంవత్సరాలముందట సింధును పాలించిన అర్ఘన్ వంశజుడు. తక్కిన భారతీయ, మధ్య ఆసియాలో ఉన్నత కుటుంబాలలో వలెనే పర్దాను కఠినమైన పద్ధతులలో అర్ఘనులు అవలంబించేవారు. ఏడు సంవత్సరాలు పైబడిన స్త్రీలను క్రొత్త పురుషుల కంటపడనిచ్చేవారు కాదు. వారి పద్ధతులకు వారెంతో గర్వపడుతూండేవారు. లౌకికులకు, ఆధ్యాత్మిక మార్గదర్శకులైన, ఇస్లాం ప్రవక్తవంశజులైన సయ్యదులకు మాత్రం వెసులు బాటు కలిగించారు. షా తండ్రిని మీర్జామొగల్‌బేగ్ అప్పుడప్పుడు పిలిపించి వారివద్ద నుండి తాయెత్తులను మంత్రించిన రక్ష రేకులను పొందుతూ ఉండేవారు. కష్టసమయాలందు తమ కుటుంబంలోని, వారికి మంచి జరగడం కోసం ప్రార్థనలు జరుపవలసిందిగా వారిని అర్థించేవారు. ఒకసారి, యౌవనవతియైన మీర్జా కుమార్తె రోగగ్రస్త అయింది. చింతాక్రాంతుడైన తండ్రి షా లతీఫ్ తండ్రియైన షా హబీబ్ వద్దకు వెళ్లారు. వారిని తమ సౌధానికి ఆహ్వానించి తమ కుమార్తెకు సంభవించిన ప్రమాదాన్ని తప్పించడానికి ఒక మంత్రించిన రక్షరేకు తయారు చేయవలసినదిగా అర్థించవలెనన్న కోరికతో. కాని షా హబీబ్ అస్వస్థులగుటచేత కుమారుడు షా లతీఫ్‌ను తన కుమారునిగా హబీబ్‌తో పొమ్మని చెప్పారు. అర్ఘన్ వంశజుల సౌధం చేరగానే షాను తిన్నగా అస్వస్థులై కుప్పగా బట్టల మధ్య ముడుచుకొని పడుకున్న రాకుమారి మంచం వద్దకు తీసుకు వెళ్ళారు. పలుచని మస్లిన్ బట్టతో అచ్ఛాదితమైన ముఖం స్పష్టంగా కనబడక పోయినా షా మొదటి చూపుతోనే ఆకర్షితుడై ఆమెను ప్రేమించాడు. ఆతడామె చేతినెత్తి చిటికెన వ్రేలును మాత్రం తన వ్రేళ్లతో స్పృశించగలిగాడు. ఆతురతగా నున్న తల్లిదండ్రులకు ఊరట కల్గునట్లు ప్రార్థనలు జరిపి, ఆమె చిటికెన వ్రేలును మాత్రం తన చేతిపట్టునుండి విడువక ఆశ్చర్యాన్ని ఇట్లా వ్యక్తం చేశాడు.

చెడుపేది గాని ప్రమాదమేదిగాని దరజేర సాహసించదు
ఏదైనను చిటికెనవ్రేలు ఉండగా షా చేతియందు

ఆ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేయడంలోని వ్యంగ్యాన్ని అవమానంగా భావించిన మీర్జా, కుపితుడై, తనకుమార్తెను పరిణయమాడడానికి సూచనలు చేయ సాహసించిన యువకుని శిరసు ఖండించవలెనన్న తలంపును అతికష్టం మీద అణచుకొన్నారు. కాని అప్పటి నుండి ఆ గ్రామంలో నున్న సయ్యదులను శత్రువులుగా చూస్తూ వారిపై పగబూని ద్వేషించారు. చివరకు కోట్రీని వదిలి మీర్జానివాసానికి చాలా దూరానికిపోయి అచటి తమ నివాసం, హవేలీలు ఏర్పరచుకొన్నారు. చాలా సంవత్సరాల తరువాత, ఐదుమైళ్ల దూరంలో నున్న నిర్జనప్రదేశం భిట్‌కు తమ నివాసాన్ని మార్చుకున్నారు.

సమాజ వ్యతిరేక పద్ధతిలో గాని, రహస్యంగా గాని, బలవంతంగాగాని తాను ప్రేమించిన దానిని పొందవలె నన్న తలపు షాకు కలుగలేదు. అందుకు వ్యతిరేకంగా తన ఇరువదియవ ఏట యిల్లువదిలి తన దుఃఖాన్ని దిగమ్రింగడానికి, ఆధ్యాత్మిక ఉపశమనము నాస్వాదించడం కోసం హిందూ జోగుల సాంగత్యంలో పర్యటనల కుపక్రమించారు. సింధీ వాఙ్మయంలో అజరామరులై నిలచిన నాయికలు మెట్టిన, ప్రదేశాలలో పయనించారు. వారు పవిత్రం గావించిన పుణ్యక్షేత్రాలకు యాత్రలు పోయారు. అందు వలన వారి విరహబాధ ఇనుమడించింది.

షా యాత్రలనుండి తిరిగివచ్చిన, కొందరి కథనం ప్రకారం మూడు రోజులకే విషాద పరిస్థితులలో మీర్జా మొగల్ బేగ్ మరణం సంభవించింది. 1711 లో ఒకనాడు మీర్జా, వారి స్నేహితులు, కోట్రీలో లేని సమయం చూసుకొని ఆడువారు మాత్రమే ఒంటరిగా ఉండటంచేత అమూల్యములైన వన్నీదోచుకొని పోయారు. మీర్జాతిరిగి వచ్చి కుపితుడై ఆ దోపిడి దొంగల వెంట పడ్డారు. త్రోవలో షా, కుటుంబంతో నివసిస్తున్న వీధిగుండా పోవలసి ఉంది. తమ పాతపొరుగు వారికి జరిగిన అన్యాయానికి, వారి ఇక్కట్టులకు చింతించి దొంగలను పట్టుకోడానికి తమ సహాయం కావలసినట్లయితే చేస్తామని చెప్పారు. కాని వారి ప్రార్థనను ఛీత్కారంతో తిరస్కరించారు. దొంగలను వెంట తరిమి పట్టుకొని ముష్టియుద్ధానికి తలపడగా, మీర్జా, ఆయన మనుషులందరూ మరణించారు. ఒకే ఒక మగ సంతానం అదీ ఒక శిశువు 'గోలా' కోట్రీ అర్ఘునవంశాన్ని నిలబెట్టడానికి మిగిలారు. సయ్యదుల అనుయాయులు యీ వార్తవిని షాకు ఒక్కమాటలో ఆ సంగతంతా చెప్పారు. 'బద్‌ఖబిస్' అనగా ధూర్తుడింకలేడు అని చెప్పారు. ఈ మాటలు అబ్జద్ అంటే పర్షియన్ సాంఖ్యశాస్త్రాన్ని పట్టి మీర్జా మరణించిన సంవత్సరం 1711 అవుతుంది. వెంటనే షా వారిని సరిదిద్దారు. వారిని ఆ మాటలను సరిదిద్ది ఆ సంవత్సరాన్ని 'యాక్‌ముఘల్ బిహ్‌బుడాహ్' అని పలుకమన్నారు.

ఆమాటలు కూడ అబ్జద్ నిబంధనల ప్రకారం అదే సంవత్సరం క్రింద అర్థం వస్తుంది ; 'ఒక మంచి మొఘల్ ఉండేవారు' అని భావం. తన ప్రత్యర్ధి మరణానికి పొంగిపోయే స్థాయికంటె చాలా ఉన్నత స్థాయినందున్న గొప్ప వ్యక్తి, షా. చదువులకు సంస్కారానికి దీనినొక సంపూర్ణమైన తార్కాణంగా కొందరు భావిస్తారు.

ఒక్క పసికందు తప్ప కుటుంబంలోని పురుషులందరూ, మరణించడం చేత మిర్జా కుటుంబ స్త్రీలందరూ నిస్సహాయస్థితికి దిగజారిపోయారు. వారిలో చాలమంది, సయ్యదులకు తమవారు తలపెట్టినకీడు మాత్రమే యీ అనర్థాలకు కారణమని తలచారు. ఆ హతాశుడైన ప్రియుడు షాకు, నాలుగేండ్లనుండి ప్రేమించుచున్న నవయువతియైన సయీదాబీగంను ఇచ్చి పాణిగ్రహణం జరిపించారు. ఆమె వివాహమైన తరువాత తన గృహప్రాంగణంలో ప్రవేశించినప్పటి నుండి షా లతీఫ్ స్వర్గ సుఖాలను అనుభవించారు. అప్పటి నుండి ఆమె తా అల్-ముఖ్‌దరత్‌జ్ అనగా పునీత స్త్రీలకు మకుటంగా ప్రసిద్ధికెక్కి ఒక స్త్రీ పొందగలిగిన గౌరవాలన్నింటికీ తగిన దానినని నిరూపించుకున్నది. తమ గ్రంథం 'షా' లో కల్యాణ్ అద్వానీ శీలవంతుడు పర్షియన్ సాదీ అన్న ప్రచారంలో నున్న పద్యపంక్తులను షా భార్యకు అనువర్తింప జేశారు.

ఆ స్త్రీ ఉత్తమురాలు, విశ్వాస పాత్రయు, శీలవతియు
చేయగలదు చక్రవర్తిని, తన నిరుపేద భర్తను.

వివాహమైన తరువాత షా జీవితం పరిపూర్ణం, మధురం, అయినా ఫలవంతంకాలేదు. వారి పర్యటనలు వారి దృక్పథాన్ని విశాలవంతం గావించడమే కాక ఇంకా చాలా చేశాయి. హిందూ వేదాంతం వారి మనస్సును అంతర్ముఖం చేసింది. ఇష్క్‌మజాజీ దైహిక విషయ వాంఛా సహిత ప్రేమ నుండి వారిని మరల్చి, ఇష్క్‌హకీకీ సత్యమైన లేక ఆధ్యాత్మిక ప్రేమ మార్గానికి త్రిప్పింది. వారి భార్య గర్భవతి అయినదని తెలిసినపుడు వారి నడతను బట్టి పై విషయం సరియైనదని తేలింది. ఆసక్తిదాయకమైన అవస్థలో స్త్రీలు సర్వసాధారణంగా కొత్త కొత్త కోరికలు కోరుతూ ఉంటారు. షా భార్యకు పాలా చేపలను తినాలన్న వింత కోరిక కలిగింది. షా అనుచరులలో ఒకరు దూర ప్రమాణంచేసి పాలా చేపలను తెచ్చి పెట్టారు. తిరుగు ప్రయాణంలో ఆ వ్యక్తి అలసిపోయి ఎగ శ్వాస తీసుకుంటూ రావడం షా చూశారు. "మీ భార్యకు బహుమానం తేవడం కోసం నేను వెళ్లానని" అతడు చెప్పగా షా ఆశ్చర్యాన్ని వ్యక్తపరచి "ఇంకా పుట్టకుండానే నా

ఫకీర్లకు వ్యధ కలిగిస్తున్న ఆశిశువును పొందడం వల్ల ఏమి ప్రయోజనం?'' అన్నారు. అటు తరువాత ఆమెకు గర్భస్రావ మయింది. మరి గర్భవతి కాలేదు. తమకు సంతానంలేదని షా ఎప్పుడూ విచారించ లేదు. సంతోషంగా తిరిగే ఫకీరులందరూ వారి సంతానమే.

షా ఇంటి పట్టున వుండే గృహస్థు కాదు. స్త్రీల అభ్యంతర మందిరాలలో వారెప్పుడూ కనబడేవారు కాదు. తమ యింటిలో కాని, 'ఒటక్' మగవారు కూర్చుండే మందిరాల్లో గాని సర్వకాలాల యందు ఫకీర్ల సాంగత్యంలో ఆనందంగా గడిపేవారు. చిన్నప్పటి నుండీ వారి తండ్రి, ఇతర సయ్యద్‌లు పెద్ద గుంపులుగా వారి సహాధ్యాయులు, శిష్యులు, ఆధ్యాత్మిక బోధనల కొరకు పరివేష్టించి ఉండడం చూసేవారు షా. వారు భిట్‌లో ఇల్లు కట్టుకున్నప్పుడు, వారి భక్తి శ్రద్ధలకు నిదర్శనంగా ఇటుకలను తెచ్చి, చిల్లర పనులను చేస్తూ ఎల్లప్పుడు తనను పరివేష్టించి ఉండిన ఫకీర్లలో శిష్యుల సాంగత్యంలో ఆయన తన జీవితం గడిపారు. ఈ భక్తి శ్రద్ధలు 1752 లో వారు చనిపోయే వరకూ, అటు తరువాత కూడా కొనసాగాయి.

ఇప్పటికీ ప్రతి శుక్రవారం ఫకీర్లు రాత్రంతా మేలుకొని, భిట్‌లోని వారి సమాధి వద్ద మనసులను కదిలించే గేయాలను గానం చేస్తూ ఉంటారు. గత శతాబ్దం ఎనిమిదవ దశాబ్దపు రోజులలో దయారాం గిడుమల్ ఆ విధంగా రాత్రులు జాగరణ చేసిన విషయం యీ విధంగా వర్ణిస్తారు; "రమారమి నూరు మందికి పైగా స్త్రీ పురుషులు పిల్లలు కలసి నిశ్శబ్దం ఆవరించిన ఆ విశాల ప్రదేశంలో అప్పుడప్పుడు నిశ్శబ్దాన్ని ఛేదించుకుంటూ 'అల్లాహీ' అన్న హృదయ పూర్వకమైన కేకలా ప్రదేశం అంతటా నిండి ఉంటాయి. మరువరాని జాగరణ చేశాను.''

షా అబ్దుల్ లతీఫ్ గాని, వారి తండ్రి గాని వారి జీవనాధారం కోసం ఎప్పుడూ కాయ కష్టం చేసినట్లు ఎవరూ చెప్పలేదు. వారి సామాన్యావసరాలతో కూడిన జీవితాలు గడపడానికి, వారి తండ్రి దైవభక్తులుగా పొందిన పేరు, తాను స్వయంగా కవిగా ఋషిగా ఆర్జించిన పేరు ద్వారా భక్తులు అందించే కానుకలూ సరిపోయేవి. షా అబ్దుల్ లతీఫ్‌కు తన అవసరాల మేరకు ఉన్నది. అంతకు మించి లేదు.

బేగ్‌లతో వారు మొదట తలపడినప్పుడు ఆ గ్రామంలో వారితో సరితూగ లేకపోయారు. అంతస్థులో, అధికారంలో; వారు ప్రభువులు, ఆతడు ప్రవక్త సంతతి నుండి తిన్నగా వచ్చిన, సయ్యద్‌గా మన్నన లందుకుంటూన్నా, సామాన్య మానవుడే. కల్హోరా ప్రభువులు మొదట్లో శతృత్వం

వహించినా, తరువాత వేదాంతిగా పవిత్ర వ్యక్తిగా వారిని చాలా గౌరవించారు. ప్రత్యేకంగా వారి ఋజువర్తన, గుణాలు, ప్రాపంచిక ఆకర్షణలను కాలదన్నడం చూసి వారు ప్రభావితులైనారు. వారు వివాహితులైనప్పటికీ పవిత్రమైన జీవితం గడపడమేకాక, పొగాకును, మత్తుపదార్థాలను తిరస్కరించారు. తమ సమక్షంలో నశ్యం పీల్చడాన్ని కూడా వారు అంగీకరించే వారు కాదు. వయసుకు తగ్గట్లు వారు చాలా మితంగా భుజించేవారు.

అంతటి వినయం, నమ్రతగలవారైనా షా చాలా గంభీరమైన మూర్తి. వారిని తెలియని వారైనా ఆ పొడవైన, స్ఫురద్రూపియైన వారి రూపాన్ని చూసి మెచ్చుకొనే వారు. ఎన్నోసార్లు వారి ధీరత్వం, సాహసం ప్రకటించిన దృష్టాంతాలు ఉన్నాయి. ముఖ్యంగా కల్హోరా ప్రభువులు ఆలోచనా పూర్వకంగానే ఒక పెంకి గుఱ్ఱాన్ని సవారి చెయ్యమని ఇచ్చారు. అది అతనిని క్రింద పడద్రోసి చంపేస్తుందని వారనుకొన్నారు. అతడు ఆ గుఱ్ఱాన్ని మచ్చిక చేసుకొని సవారీ చేశాడు.

అందరిలా సందడిగా తిరుగుతూ ఉత్సాహంతో ఉరకలు వేయక పోయినా ఆ సాధారణస్థాయిలో వారు స్నేహ శీలురు. వారు ఏకాంతాన్నీ, పదిమందితో సహవాసాన్నీ ఒకే తూరి ఇచ్చగిస్తారు. దొరికిన సమయమంతా వారు మెల్లగా జారుకొని ఏకాంతగా ఎడారిలోగాని, నదీతీరాన గాని కూర్చొని, తన భగవంతునితోను, ప్రకృతితోను సంభాషించ కోరుతారు. ఇతరులు గుర్తించలేని దృశ్యాలు, రంగాలు, వారిని ఆకర్షించేవి. ఒకసారి కొన్ని మేకలు అతిదాహంతో నీటి కోసం ఉరకలు వేస్తూ ఒక నీటి బుగ్గను సమీపించాయి. కడుపునిండా దాహం తీర్చుకొని అక్కడే పెంటికలు వేసి నీటిని కలుషితం చేసి వెనుతిరిగి చూడకుండా తమ దారిని పోయాయి. ఈ దృశ్యం వారి కంటబడింది. వెంటనే వారి, కవి హృదయం పొంగి పొరలింది. 'పరిభ్రమించుచు వెదకుచుందు గాక, మరి కలియకుందు గాక, నా ప్రేమైక మూర్తిని!' అన్నారు వారు.

ఒకసారి వారు ఒక మఱ్ఱిచెట్టు కొమ్మపై కూర్చొని రుద్రాక్షమాలలోని రుద్రాక్షలు లెక్కించుతూ భగవన్నామస్మరణ చేస్తున్నారు. ఇద్దరు యువతులు వచ్చి ఆ చెట్టు క్రింద విశ్రాంతి తీసుకొంటున్నారు. వారిలో ఒక స్త్రీ రెండవ స్త్రీని యీ విధంగా ప్రశ్నించింది. 'నీ ప్రియుని ఎన్నిసార్లు కలుసుకున్నావు ?' రెండవ స్త్రీ యీ విధంగా సమాధాన మిచ్చింది. 'దానిని ఎట్లా లెక్క పెట్టుకోవడం ?' వెంటనే తమ జీవితానికి ఒక పాఠం

నేర్చుకున్నట్లు భావించి రుద్రాక్షలు లెక్కపెట్టటం మాని ఆ రుద్రాక్ష మాలను ప్రక్కకు విసరివైచారు.

ఇదివరకు వర్ణించినట్లే భగవంతుని ధ్యానంలో నున్నప్పుడు వారు కూర్చొని ఉండే భంగిమ - తలను రెండు కాలిముఃఖుకుల మధ్య నుంచి, ధ్యాన నిష్ఠలో నిమగ్నులై ఉండడం. చిత్రకారులు ఊహించి యీ చిత్రాన్నే చిత్రించారు. ఇంకొక భంగిమ, గాత్రంతోగాని, వాద్యంతోగాని సంగీతం వాతావరణాన్నంతా ఆవరించి ఉన్నప్పుడు మైమరచిపోవడం. అది శుద్ధ భారతీయమైన అలౌకికమైన సంగీతం. అది వారిని మైమరపించేది. వారు ప్రోత్సహించే నాట్య సంగీతంలో శృంగారమేమీ లేదు. వారిని మైమర పించేది శృంగార భరిత సంగీతం కాదు. వారు తమ 64 వ ఏట 1752 లో అట్టి పారవశ్యతను కలిగించే సంగీతాన్ని వింటూనే అసువులు విడిచారు. అదియే 'సామా'.

ఇదివరకే చెప్పినట్లు షా ఏకాంతాన్ని ఎంతగా వాంఛించేవారో, నలుగురి సాంగత్యాన్ని కూడా అంతగానే వాంఛించేవారు. వారికి స్నేహితులు, సహాధ్యాయులు ఎంతో మంది ఉండేవారు. వారిలో కొందరు సింధు దేశంలో చాలా సుప్రసిద్ధులు. షా వీరితోనున్న సంబంధ బాంధవ్యాలను గురించి వర్ణిస్తూ దిన్ మహమ్మద్ వఫెయ్ తమలుత్-అల్-లతీఫ్ అను గ్రంథంలో ఒక పూర్తి అధ్యాయం వ్రాశారు. అందరి మిత్రులూ, సహాధ్యా యులలోను ప్రథములు అతిముఖ్యులు ఝోక్‌కు చెందిన పరమయోగి షా ఇనాయత్. వీరు సింధీ సూఫీలలో ప్రఖ్యాతులు. వీరి వీరమరణం గురించి సూర్ రామకలి అంకితం చేయబడింది.

ఇతర ప్రముఖ సహవాసులు ఖ్వాజామహమ్మద్ జమన్‌లావారి, దరా జనకు చెందిన ఫకీర్ సాహెబ్, రషీద్ పేర్ల వంశ పూర్వీకులు సయ్యద్ మహమ్మద్ ముఖ్ దుమ్ అబ్దుల్ రహీం గోఁహ్రీ, భగవత్ మదన్. ఈ ఫకీర్లతో కలసి సంభాషించినవి, వారితో వాదనలు చేసినవి చాలా విశ్వాస పాత్రమైనవీ, అనుమానాస్పదమైనవీ అనేక కథలున్నాయి. వాటిలో ప్రసిద్ధి కెక్కినది వారు రెండవసారి దరాజన్ సందర్శించిన సందర్భంలో జరిగి నది. అక్కడవారు షా లతీఫ్ తరువాత అంతటి ప్రముఖ స్థానం వహించ తగిన కవి మియసాహిబ్‌దినో మనుమడు సచల్‌ను కలుసుకున్నారు. చూసిన వెంటనే ఆ బాలుని గొప్ప చిహ్నాలను షా గుర్తించారు. వారు కాగ బెట్టడానికి ఉపక్రమించిన కాగు (పద్య వాఙ్మయం) పై మూత సచల్ తొలగిస్తారు అని చెప్పారు. ఆ బాలుడు తమకు ఆధ్యాత్మిక వారసులవు తారని వెల్లడి చేశారు ; అది నిజమైనది. ఒక ముస్లిం రచయిత చెప్పినట్లు

షా కథలలోను, ఉపమానాలు, అర్ధాలంకారాలను భాషలో చెప్పిన విషయాలనే సచల్ చురుకైన భాషలో వివరంగా మరింత గుణయుక్తంగాను చెప్పారు.

మదన్ అనే హిందూ భక్తుడంటే షాకు చాలా మక్కువ. అనేక పర్యాయాలు వారిరువురు ఆధ్యాత్మిక విషయాలను గురించి చర్చిస్తూ ఉండే వారు. ఒకసారి మదన్ ఒక ఏకాంత ప్రదేశానికి వెళ్లారట. అక్కడ కప్పల బెకబెకలు విని వారు భయ భ్రాంతులైనారట. మదన్ తన భయాన్ని ఎరుక పరచడానికి షా వద్దకు వెళ్లారట. వెంటనే షా మదన్‌ను, అతడు భయపడిన రీతికి మెచ్చుకున్నారట. పరమాత్మ పట్ల చూపవలసిన సరియైన రీతి అదియేనని వారన్నారట. 'నీకు వీలైనదంతా ఆతనికి సమర్పించు. కాని సర్వకాల సర్వావస్థల యందును భయ భీతులతోనే ఉండు. నీ వేదో ఇస్తున్నావని ఎప్పుడూ గర్వపడకు. మన మిత్రుడు నిజంగా చాలా గంభీరమైనవాడు' అన్నారట.

భిట్‌లో తమ ఇరువురు హిందూ గాయకులు ఆరుల్, చంచల్‌తోను, ఇష్టులైన సహవాసులు భిలాల్, ఇనాయత్, వాగంద్ వంటి వారితోను, తమ లేఖకులైన తమర్, హాషింలతోనూ, నిరంతరం సంతోషంగా గడిపారు. ఈ మిత్రులందరూ వారి పట్ల శ్రద్ధా సక్తులు కలిగి ఉండేవారు. ఒకసారి అమితమైన ఉద్రేకం, నిస్పృహలతో కుపితులై 'రిసాలోను' కిరార్ సరస్సులో పడేలాగు విసిరేస్తే, వారి లేఖకులు తమర్, హాషింలు తమ జ్ఞాపకాల నుండి తిరిగి అంతా వ్రాసి ఆ నష్టాన్ని భర్తీ చేశారు. తమర్ వంశీకులు ఇప్పటికీ షా 'రిసాలో' అసలు వ్రాతప్రతిని భద్రంగా ఉంచారు.

షా నిజంగా ఒక గొప్ప దేశ భక్తుడు. సుర్ మరూయి చదివితే, వారు తమ మాతృభూమిని ఎంతగా ప్రేమించారో అర్ధమవుతుంది. ఆధునిక పాఠకులు వారిని జాతీయవాది, ప్రజాస్వామ్యవాది అని కూడా అంటారు. వారు తమ కాలానికి ముందుగానే తమ పద్యాలలో సామాన్య మానవుని పట్ల ఎనలేని సానుభూతి చూపించారని కూడా వారంటారు. కష్టజీవుల పట్ల షా అమితమైన దయ - సింధులోని కుమ్మరులు, కమ్మరులు బీద రైతులు, సాలెవారు, జాలరులు వారికి అత్యంత ప్రియులు. భూస్వాముల భావాలు వారికిలేవు. దోపిడిదారులైన పాలక ప్రభువులతో గాని, ఆ కాలంలో మూఢనమ్మకాలతో మగ్గుచున్న మతాధికారులతో గాని సంబంధం లేదు : వారి చుట్టూ సంచరించే పక్షులను, జంతువులను చూసి ఆనందిస్తూ వాటి అలవాట్ల నుండి ఎన్నో నీతులను వారు గ్రహించారు. వారు

ప్రేమించిన సింధును పునః సృష్టిస్తూ సింధుకూ, యావజ్జీవ కోటికి దీవెన లర్పించారు ఒక పద్యంలో.

> **ఓ ప్రభువా ! సింధు ఎల్లప్పుడు ఉండుగాక సఫలముగా, ఫలవంతముగా మానవాళి అంతయు ఆనందమయులగుదురుగాక !**

ఆ ఎడారి, ఆ నది, అదే సింధు. అట్టి సింధుకు నిత్యత్వము నిచ్చి ఎల్ల కాలముల యందుండునట్లు చేసినాడీ సింధుకవి. సాధారణ సింధీ నాయకులను కొందరు ఆబ్రోవంటి నాయకులను, తమ పద్యాలలో అమరులుగా చేశారు షా. సింధీ జానపదాలకు గాథలకు ఉజ్జ్వలమూ, శాశ్వతమూ అయిన స్థానాన్ని కల్పించారు. సింధును, దాని పశుపక్ష్యాదులను, పువ్వులను, గడ్డిని సింధులోని చేతిపనుల వారిని, శ్రామికులను, కర్షకులను, అమాయకులగు గ్రామీణులను, జాలరులను, అందరికంటె మిన్నగా సింధు స్త్రీలను భక్తితో తమ కవితలలో పొదిగారు. ఆయన చేసిన దానితో పదియవ వంతైనా మరి ఏ ఇతర సింధీకవి చేయలేదు.

షా తన జీవితకాలంలోనే మహాకవిగా గుర్తు పొందారు. వారు గతించిన తరువాత కూడా సింధీ కవులలో ఆయన ఉన్నతస్థానం ఇప్పటికీ యథాతథంగా ఉంది. ఇతర సింధీ కవులు అనేక వివాదాలకు తావిచ్చారు. కాని షా వినమ్ర వ్యాఖ్యలను మాత్రమే అందుకున్నారు. సింధీయులలో ముస్లిములు, హిందువులు అన్న విచక్షణ లేకుండా అందరూ రిసాలోను తమ అమూల్యమైన సారస్వతనిధిగా దాచుకుంటారు. భారతదేశంలో కూడా సింధీయులందరి హృదయాలలో షా అబ్దుల్ లతీఫ్ నిలచి ఉన్నారు.

## 7

# షా రచించిన రిసాలో

షా అబ్దుల్ లతీఫ్ వ్రాసిన 'రిసాలో' లేక వారి పద్యకవితలు సింధీ వాఙ్మయంలో అమూల్యమైన, అతి ముఖ్యమైన గ్రంథంగా పరిగణించబడుతున్నది. సింధీయులు దానిని తమ ఏకైక సాంస్కృతిక, ఆధ్యాత్మిక నిధిగా భావిస్తారు. దానిని వారెన్నటికీ విడువరు.

ఒక సింధీ కాజీ ఏర్చికూర్చిన షా పద్యాలను 'ముంతకబ్' పేరున రూపొందించగా డా॥ సోర్లే ఆంగ్లంలోనికి అనువదించేవరకు షా రిసాలో సింధీ యేతరులకు ఒక రహస్య గ్రంథంగానే ఉండిపోయింది. అంతకు

పూర్వం కూడా కొన్ని రచనలను అనువదించడానికి ఇద్దరు ముగ్గురు సింధీయులు ప్రయత్నించారు గాని ఆ ప్రయత్నాలు అంతగా విజయవంతం కాలేదు. కొద్ది సంవత్సరాల క్రిందట ఇప్పటి కవులలో గొప్పవారైన సింధీకవి అయాజ్ రిసాలోను ఉర్దూలోనికి అనువదించారు. అది సంతృప్తికరమైన, అనువాదం. అయాజ్ అనువాదం చదివిన సింధీ రాని లక్షలాది భారతీయులు, పాకిస్తానీయులు షా కవిత్వాన్ని ఆస్వాదించ గలుగుతున్నారు. ఇరవైయవ శతాబ్దపు కవులు విప్లవ కవులు కానీయండి, అభ్యుదయ కవులు కానీయండి, ఆమాటకు వస్తే సింధులోని కవులెవ్వరు గానీ షాతో పోల్చడానికిగాని వారితో సమానులైన వారుగాని లేరని ఒప్పుకున్నారు. అందరూ పూజ్యభావంతో వారిని ఆరాధిస్తారు.

ఆ విధంగా షా 'రిసాలో' సింధీ వాఙ్మయంలో ఒక అపూర్వమైన గ్రంథంగా నిలచింది. అందువల్ల యీ 'సింధీ సాహిత్య చరిత్ర'లో ఒక అధ్యాయం దానికి వినియోగించడం సముచితం. డా॥ సోర్లే షాపై వ్రాసిన గ్రంథంలో రిసాలో గురించి వివరంగా మనకు తెలుస్తుంది. షా ఇస్లాంకవి అన్న ఊహ ఆధారంగా వ్రాయడంవల్ల రంగుపూసి అసత్యాలను సత్యాలుగా చూపించింది. సోర్లే రచన అలాగాక వారిని ముస్లిం కవి మాత్రమే అని ఊరుకుంటే ఏ అభ్యంతరం ఉండేదికాదు. 220 పుటలో వారు యీ విధంగా ఒప్పుకోక తప్పిందికాదు.

"షా అబ్దుల్ లతీఫ్ భావాలు, అవి వ్యక్తంచేసే పద్ధతిలోను, ఉదహరించ తగిన ముస్లింకవి గాని, వారి సంగీతం యొక్క మౌలికతకూ ఇస్లాంకూ ఏమీ సంబంధం లేదు.... ఆ రాగరాగిణులు శుద్ధమై, సరళమైన హిందుస్తానీ సంగీతంలో ఒక రూపంగా ఏర్పడ్డాయి." తరువాత వారు ఇలా అన్నారు. "సింధీయుల సంగీతం అని ఒక విశిష్ట పద్ధతి ప్రత్యేకంగా లేదు. భారతీయ సాంప్రదాయ సంగీత పద్ధతియే సింధీయుల సంగీతంలోని భాగం." "సింధులోని అధిక భాగం సంగీత విద్వాంసులు ముస్లిములు కారు, హిందువులే" అని ; సింధీ హిందువులు షా కవిత్వాన్ని అంతగా ఆస్వాదిస్తూండడానికి ఇదే కారణం అని కూడా అంటారు! షా భావాలు ఇస్లామిక్ పద్ధతులలో ఉన్నా, ఆ పద్యాలు గానం చేసేసరికి భారతీయుల హిందూ సాంప్రదాయరీతులలోనే ఉంటాయి అని మళ్లీ అంటారు.

షా పద్యాల తీరు మొదట పరిశీలిస్తే; అది సాంప్రదాయికమైన దోహాబెయిత్, దాని విస్తరణగాని, లేక సింధీ ప్రతిభకు ప్రత్యేకమైన గొంతెత్తి విషాదంగా రోదించే 'వాయ్' గాని అయివుంటుందే తప్ప, షర్షియన్,

అరబిక్ ఛందస్సులతోగాని, బ్రిటిష్ పరిపాలకులు సింధును ఆక్రమించుకున్న తరువాత సింధీ కవులు ఏకమొత్తాన్ని అనుకరించిన అరబిక్ పర్షియన్ పద్య రూపాలతో గాని షాకు సంబంధంలేదు. రిసాలో పాఠకులకు ఘజల్, మస్నవి, రుబాయి, ముస్సదస్, ముస్సజద్‌ల కోసంగానీ లేక సాధారణమైన కితా కొరకు గానీ దానిలో వెదకడం వ్యర్థం. రిసాలోని పద్యాలకు విశృంఖలమైన నడక ఉంది. కృత్రిమ చట్రాలైన ఛందోరీతులలో వాటిని ఎవ్వరూ బంధించ లేకపోయారు. పదిహేడు పద్దెనిమిది శతాబ్దాలలో పంజాబీ, హిందీ వంటి సజాతీయమైన భాషలయందు భక్తిరచనలలో వాడుకలోనున్న భారతీయ ఛందోరీతులలోని ఛందస్సులకు అన్వయించడానికే అన్ని ప్రయత్నాలు ఆ దిశగా జరిగాయి.

ఇక వస్తు విషయాన్ని బట్టి చూస్తే రిసాలో ముఫైసుర్‌లు లేక సర్గలు ఉన్నాయి. వీని కర్తృత్వం వివాదాంశమైన సుర్‌కేదార కూడా ఉన్నది. ఈ సుర్‌ల పేర్లు ఒక పద్ధతిగా ఒక రీతిగాలేవు. కల్యాణ్, యమన్ కల్యాణ్ అసా, సారంగ్ రామకలివంటి సుర్‌లు హిందుస్తానీ రాగాలలో, అప్రత్యేక మైన సంగీతానికే పాడాలి. కొన్ని సుర్‌లు ఆ పేరు ఉన్న నాయిక కథను వర్ణిస్తాయి. ఉదహరణకు సుహిని, లీలా ఛానేసర్, మరుయీ, ససూయీ సుర్‌లు అలాంటివే! కొన్ని పేర్లు రాగాన్ని సూచించేట్లుగా ఉండి అదే పేరు ఒక నాయికకు లేదా ఒక ఊరుకు ఉండడంచేత ఖంబట్, సోరట్ వంటివి సందేహాస్పదమైన నామాలుగా గుర్తింప బడ్డాయి. మరికొన్ని సుర్‌లు అవి వ్రాయబడిన స్థలం పేరునగాని లేక కథాంశానికి సంబంధించినవిగాని అయి ఉంటాయి. ఉదా: దోహర్ (ఇసుక ప్రాంతాలు) కరెయిల్ (చిక్కని కుచ్చు లున్న పక్షి), ఖహొరి (భగవంతుని వెదకువారు), రిప్ (ప్రళయం), కపైటీ (సాలీడు) మొదలైనవి ఒకే ఒక సుర్ ఇస్లాం శోకగీతాలవలె ఉంటుంది, అది సుర్ హుసెయ్‌నీ. దీనిలో సింధీ నాయిక ససూయి రోదనలను కష్టాలను వ్యక్తం చేస్తూ ఒకచోట కర్బలా మైదానంలో మరణించిన తమ ప్రియ పుత్రుడు హుసేన్ మరణానికి ప్రవక్త కుమార్తె బీబీ ఫతిమా రోదన లను గురించి ప్రస్తావించారు.

ఈ ముఫైసుర్‌లలోని విషయాలను నిశితంగా పరిశీలిస్తే, వివిధ సుర్‌లలోని భావాలు సూఫీ సిద్ధాంతాలకు సంబంధించి, పరమాత్మ సాక్షా త్కారానికి లక్ష్యంగా ఉంటాయి. చివరి దృష్టాంతంలో కూడా అదే ఆత్మ సాక్షాత్కారాను భవంగా చూపబడింది. ప్రతిజీవి అన్నిజీవులకు మూల మైనదానితో చేర్చబడడం. లేదా కలసిపోవడం కోరుకొనే కోరిక అన్నీ ఇదే భావం అన్ని సుర్‌లలోని ప్రధానాంశం, సూఫీ విధానమే అందులో శ్రేష్ఠమైన

హేతువాదం, దైహిక విషయ సుఖాలతో కూడిన ప్రేమ (మజాజి), ఆధ్యాత్మిక సర్వోత్కృష్టమైన ప్రేమ (హకీకి)కు చేరుకొనే మార్గం, అది ఒక మెట్టు. విషయ వైవిధ్యం కనబడుతుంది. వెన్నెల వర్ణన, లాభదాయక మైన వాన జల్లులు, వృత్తి పనివారి వివిధ వృత్తులు సముద్ర యానంచేసే నావికులు, యుద్ధభూములలో పోరాటం.... కాని యివన్నీ కూడా మానవుడు భగవంతుని చేరుకొనడమన్న ఒకే ఒక్క ముగింపుకు దారిచూపుతాయి. ఇందులో ముఖ్యంగా కావలసినది ప్రేమికుడు తాను అన్వేషకుడుగా మారాలి, ప్రత్యేకమైన ఉనికి అనేభావం, అహంకారం కరిగిపోవాలి, తన ఆరాధ్యమూర్తి ధ్యానంలో తనను తాను మరచిపోవాలి. అదే నిత్యం జీవించుతుంది. తనను తాను విస్మరించాలి అన్న యీ మార్గంలో రకరకాల దృశ్యాలు, చిత్రాలు పద్య శైలిలో అందిస్తారు: ద్రాక్ష సారాయి విక్రేత వద్ద తన తలఖరీదు చేసేమద్యం అంగీకరించడం, నదిలో మృత్యుమునక, యుద్ధ భూమిలో వీరస్వర్గం అలంకరించడం, అడవులు, కొండలగుండా కష్టాలతో నిండినపాట్లు, కారాగారంలో బంధింపబడడం, కష్టతరమైన ప్రాయశ్చిత్తాలు, జాగరణలు, వెన్నెల రాత్రులలో ఒంటెపై సవారి, కాకులు, కొంగలు, హంసలు, రాక్షసజలచరాలను చూడడం, ప్రతిసందర్భంలోనూ, పరిశుద్ధ మైన, అణకువతో కూడిన జీవితమే జీవించాలనీ, స్వపరిత్యాగం అవసరమనీ, స్వ అన్నది తుడిచివేయాలనీ, చెప్పారు. భగవదేచ్ఛకు లొంగిపోవడం, ప్రాపంచిక వాంఛలు, ఆశాపాశాలను త్యజించడం, వంటి వానికే ప్రాధాన్యత ఇవ్వబడింది. షా సూటిగా నీతిబోధలు చెయ్యడం చాలా అరుదు. నీతి బోధలన్నీ ఒక యువతి అనుభవించే తీవ్రమైన సంతాపంద్వారానో, అమె తన ప్రియుని వెదకే కథనరీతిలోనో దొర్లిపోతాయి. భగవంతుని మైకంలో ఉన్న ఉత్కంఠాత్మ అన్వేషణ, కఠోర జీవిత సత్యాలు యీరెంటి మధ్య విలీనత ఉన్నది. ఈ క్రింది ప్రతి సుర్‌లోని విషయాలకు సంక్షిప్తవర్ణన ఇవ్వబడింది. (ప్రొఫెసర్ కల్యాణ్ అద్వానీ ఒకే సంపుటిలో సంపాదకత్వం వహించి ప్రచురించిన సంపుటి ఆధారంగా)

సుర్ కల్యాణ్ : ఆ పరమాత్మను, ప్రవక్తను ధ్యానించడంతో యీ సుర్‌ప్రారంభమై దైవత్వంలో ఏకత్వం, అది తప్ప మరేదీలేదు అని నొక్కి చెపుతారు. తక్కినదంతా ఉన్నట్లు కనబడుతుందిగానీ అది అంతా మిధ్యయే తప్ప వేరుకాదు. (వేదాంతులు ప్రాధమికంగా విశ్వసించేదాని వలెనే ఇది ఉన్నది: ఈ ప్రపంచం ఒకమాయ. భ్రమ. బ్రహ్మం మాత్రమే సత్యం) షా అంటారు: వానిని ప్రేమికుడు అనకు, ప్రియ తముడని అసలే అనకు! వానిని సృష్టికర్త అనకు సృష్టి అనికూడా అనకు.

ధ్వని, ప్రతిధ్వని రెండూ ఒకటే. భిన్నత్వంలో ఏకత్వం కోసం చూడు. ప్రేమ పారవశ్యతను సాధింపగోరే ప్రేమికుడు, తన జీవితాన్ని సంతోషంగా విడిచిపెట్టడానికి సిద్ధపడివుండాలి. మదిర అమ్మువాని మదిర కొరకు ఒక ఓడను వదిలినట్లు అన్వేషకునికి నిజమైన విశ్రాంతి దొరకు చోట వధ్య వద్ద కనబడుతుంది. నిజమైన అనుభవం మృత్యువులోనే కనబడుతుంది. నీవు అన్వేషించు వాడు నిన్ను అన్వేషిస్తూ వస్తాడు. నీకు యిప్పుడు వేదనలు కలిగించు వాడే నీకు నిజమైన ఉపశమన మిస్తాడు. అతడే నీకు చికిత్స, అతడొక్కడే అంజనం. అతడే మాన్పువాడు.

సుర్ యమన్ కల్యాణ్ : పరవశంతో నిండిన 'నీవే గాయము మాన్పు వాడవు, ఆ మిత్రుడవు, నా బాధలన్నిటికి దివ్యౌషధ మవు' అన్న కేకతో ప్రారంభమవుతుంది. ఆ భావాన్నే విస్తరించి చెబుతుంది. 'నాకే విధమైన ఔషధమూ వద్దు. ప్రేమ యొక్క బాధ మాత్రమే కావాలి, ఏమో ఒకవేళ నా వైద్యుడు వస్తాడేమో, దీపంచుట్టూ తిరుగు శలభాలు తమంతతామే బాధకు గురి కావడం గురించీ, గొడ్డలి వ్రేటుకు తల లొగ్గువారిని గురించీ, గొప్పగా స్తుతిస్తారు కవి. నిప్పులో నుంచి కమ్మరి ఎఱ్ఱగా కాల్చే ఇనుముగా ఉండాలని కోరుకుంటారు. అన్వేషకుని చేత నుంచే విషపాత్ర శాశ్వత జీవితాన్ని అందజేస్తుంది. ఈ విశ్వంలో అందమంతటికీ మూలం ఆ పరమాత్మ. దానినే అందరూ అపేక్షించుతారు. తాను వేరు అన్న తెర తొలగించిన తరువాతనే దానిని సాధింప వీలవుతుంది - అని సూఫీలలో అగ్రగణ్యుడు జలాల్-ఉద్ దీన్ రూమీ చెప్పిన దానిని వినమ్రుడై ఉటంకిస్తాడు. గ్రంథ పఠనం ద్వారా జ్ఞాన సముపార్జనను నిరాకరిస్తారు కవి. అట్లే అన్ని ఉపవాసాలను, అన్ని జాగరణలను ఖండిస్తారు. దైవత్వాన్ని సాధించమని ప్రేరేపిస్తారు. నీ విలుకాడు బాణాన్ని సంధించి నట్లయితే దానిని ఛేదించే లక్ష్యానివి నీవు కావాలి. ప్రాణభయంతో ఉండేవాడు తన ప్రతిష్ఠను ప్రధానంగా ఎంచేవాడు ప్రేమ మార్గంలో అడుగిడ నక్కరలేదు. సుర్ ఖంబట్ : ఈ సుర్ నందు రెండు చిత్రాలు చిత్రించ బడ్డాయి. మొదటిది దివ్యతేజస్సుతో వెలుగొందు పున్నమి చంద్రుని అందం, తళుకుదనం ప్రేమైక మూర్తి దివ్య తేజస్సుతో నిండిన అందం ముందర పేలవంగా ఉంటుంది. అయినా చంద్రుడు ప్రేమైకమూర్తి ప్రాంగణాన ప్రకాశింప చేయ గలదు ; ఆ ప్రేమైక మూర్తికొక నిశ్శబ్ద సందేశాన్ని కొని పోగలదు. రెండవది, మానవుని మనసు వలెనే మూర్ఖపు ఒంటె మనసు కూడా సువాసనలు వెదజల్లే వృక్షాల కంటె కసందు చెట్టునే ఇష్టపడుతుంది. ఐనా ఒంటె వివేకంతో తనను అదుపులో ఉంచుకొంటుంది. దారి చూసి నడిపించితే స్వర్గంలోని

ఉద్యాన వనమునకు తీసుకొని పోతుంది. అక్కడి ఒక ఆకు భూతలంలోని లక్ష ఆకుల విలువ చేస్తుంది. సింధు దేశపు విశాల ప్రదేశాలలో వెన్నెల రాత్రులలో ఒంటె ప్రయాణం చేసినవారు యీ సుర్‌లోని అందాలను చవి చూడ గలుగుతారు.

సుర్ శ్రీ రాగ్ : ఈ సుర్‌లో నావికులు వారి పడవలు, వీటి నుండి ఒక నీతిని చూపిస్తారు. వారు తమ నౌకాయానానికి, ఆయత్త పరచుకునే విధానం మనకు చెబుతారు. ఈ ప్రపంచాన్ని ఈదుకుంటూ తన గమ్య స్థానాన్ని చేరుకోవాలంటే, నావికుడు లేదా అన్వేషకుడు వాని తెడ్లు, తెరచాపలు, పడవలు అన్నీ మచ్చ లేకుండాను, నిష్కల్మషంగా మెరిసే లాగానూ ఉంచుకోవాలి. అన్వేషకుడు నిర్మలత్వాన్ని, ధర్మనిష్ఠా పరత్వాన్ని పాటించక పోతే ఆతడు పరమాత్మను చేరలేడు. రాత్రంతా మేలుకొని ఆ పరమాత్మనే ధ్యానించుజీవి ధన్యుడు. వాని మృతదేహం కూడా గౌరవింప బడుతుంది. నావికుడు సత్యాన్ని, అమూల్యమైన వస్తువులను మాత్రమే తన వ్యాపారంలో వినియోగించాలి గాని సరసతలేని నీచపు పదార్థాలను కాదు. నావికుడు సముద్రపు దొంగల బారి నుండి, ముఖ్యంగా ఫెరింగీల (పాశ్చాత్యుల) బారి నుండి తప్పించుకొనవలె నంటే అతడెప్పుడూ జాగరూకుడై ఉండాలి. అనగా అన్వేషకుడు ఎల్లప్పుడూ మార్గంలో ఎదురయ్యే ఆకర్షణల నుండి ప్రాపంచిక తంత్రాల నుండి జాగరూకతతో ఉండాలి. సాధారణ స్ఫటికం రాళ్లు, వజ్రపు రాళ్లు వీటి మధ్య గల తార తమ్యాన్ని కూడా పేర్కొన్నారు. నిజమైన వజ్రపు రాళ్లను, కృత్రిమమైన రాళ్ల నుండి వేరుగా గుర్తించ గల వారే మాయమైపోతున్నారని కవి వాపోయారు. ఈ సుర్‌లోని సారాంశం ఆ పరమాత్మ అన్వేషణలో మానవుడు ఎల్లప్పుడూ జాగరూకుడై అప్రమత్తుడై, వాస్తవాన్ని కృత్రిమాన్ని గుర్తిస్తూ ఉండాలి అని. నావ, వజ్రాల పనితనం వీటిని యీ సుర్‌లో దృష్టాంతాలుగా వినియోగించారు కవి.

సుర్ సముంది తరువాతి సుర్. పేరులో విదిత మవుతున్నట్లు యీ సుర్ సముద్రాన్ని గురించినది. ఉత్తర పవనాలు వీచే నది మొదలు సుదూరంగా నున్న లంకకు (సిలోన్) పోవుటకు సముద్ర నావికులు యాన యత్నముల యందు నిమగ్నులై ఉన్నారు. వారి భార్యా బంధువుల మనస్సులు తమ ప్రేమికులకు, భర్తలకు దూరంగా ఉండవలసిన క్లేశంతో నిండిపోతాయి. వారు తిరిగి క్షేమంగా ఇంటికి వచ్చేవరకూ ఆ స్థితిలోనే వారుంటారు. సంప్రదాయికంగా సందేశాలను తీసుకుపోయే వాయసాన్ని, వారియానము ముగియ నున్న దన్నవార్తనుగొని తెమ్మని అర్థించుతున్నారు.

వారు తాము కూడా లంకకు పోవాలంటే ప్రధాన నావికుని కివ్వడానికి ఆ పేద స్త్రీల వద్ద ధనం లేదు. వారి పురుషులు తమ నావలతో క్షేమంగా తీరం చేరేవరకూ విచారిస్తూ వేచి ఉండాల్సిందే. ఆ జాలరి స్త్రీల మనో వేదన, వారి వద్ద ప్రయాణఖర్చులు లేకపోవడంలోని అధ్యాత్మిక భావం స్పష్టంగానే ఉన్నది.

సుర్‌సుహిని : చక్కని యీ సుర్ ఒక అవివాహిత స్త్రీ సుహిని మెహర్ లేక సహర్ అనే గొర్రెల కాపరి ఆమెకు దాహం తీర్చే సందర్భంగా పాలు ఇచ్చినప్పుడు అతనిని ప్రేమించిన కథను గురించినది. ప్రతి రాత్రి, ఆమె నది ఒడ్డు చేరి ఒక కుండ సహాయంతో, నది దాటి ఆవలి ఒడ్డున తన ప్రియునితో రాత్రంతా గడుపుతుండేది. నదీ ప్రవాహ వేగాన్ని గాని, నదిలో నున్న పెద్ద చేపలను గాని, మొసళ్లనుగాని, పెనుగాలి భయంకర వాతావరణాన్ని గాని ఆమె లక్ష్య పెట్టలేదు. ప్రతి దినమూ తాను వినియో గించే కాల్చిన కుండకు మారుగా, తన శత్రువు పచ్చికుండను దాని స్థానంలో ఉంచడాన్ని ఆమె గమనించలేదు. దానిపై నీట ప్రవేశించగానే అది కరిగి ఆమెను నదీ గర్భంలో ముంచింది. నీట మునుగుచు తన ప్రియునికై ఆమె ఎలుగెత్తి కేక వైచింది. కాని అతడామె దరికి చేరేసరికే ఆలస్యం అయింది. ఆమె దేహాన్ని జల జంతువులు మ్రింగి వేస్తూండగా, ఆమె, మరణంతో ప్రియునితో కలసి ఏకమయింది. ఈ మహా విపత్తులో పాల్గొన్న త్రిమూర్తులలో మూడవ దైన సముద్రం (సముద్రము, సుహిని, సహర్) గూఢమైన విధంగా దానిని శాశ్వత సంయోగంగా మార్చింది.

అద్భుతమైన సానుభూతి పూర్వకమైనది యీ సుర్. ఉరకలు, పరుగులు వేస్తున్న జలాలూ, లోతు నీటిలో నుండే జల రాక్షసులు, పెను గాలుల అలలు, కాకికి సంబంధమైన ఆలోచనలు, ప్రాపంచిక అవమానాలు వీటన్నిటి పట్లా గ్రుడ్డి దానినిగా చేసిన హృదయంలో నిండిన ప్రేమ, యివన్నీ అద్భుతంగా వర్ణించ బడ్డాయి. ఆమె తన మెహర్‌ను శాశ్వతంగా కలుసుకో డానికి ఆటంకంగా నిలిచిన కుండను ప్రత్యేకంగా చెప్పారు. కుండ కరిగి పోవడం జరుగ గల సంఘటనలలో ఒక ఉత్తమమైనది. వారికి ప్రియమైన భావన ఇందులో ప్రవేశ పెడుతారు కవి. సుహిని తన ప్రియునికి, ఈ సృష్టిలోనికి రావడానికి ముందరే తాను అంకితమయి పోయిందనీ, ఆమె ఉనికికి మూలమైన ఆ స్థానాన్ని చేరుకొనడానికి ఎటువంటి కష్టాన్నయినా ఎదుర్కోవలసినదేననీ, అన్ని ఆధారాలను, అన్ని ఉపశమనాలను, ఎడ బాట్లను వదలిపెట్టాలనీ భావిస్తుంది. నదీ జలాల అంచున నిలిచి అన్ని పరిస్థితులనూ పర్యాలో చించుకుంటూ నీట ప్రవేశించగానే తాము ఏదో

త్యాగం చేస్తున్నట్లు భావించే ఇతర ప్రేమికురాండ్ర వంటిది కాదు ఆమె. 'ఈ నిండు నవ్వుతో నీట ప్రవేశించ గలిగిన వారి సొత్తే సహర్'. ఈ సుర్‌లో సూఫీ విధానంలోని బోధన స్పష్టంగా ఉంది. షరియాత్ (మతాన్ని శాస్త్రీయంగా అవలంబించుట) యొక్క పాఠాన్ని శ్రద్ధగా నేర్చుకో తరీకాత్ (యథేష్టమైన మార్గం) యొక్క ప్రవాహ వేగంలో కొట్టుకొనిపో హకీకత్ (యదార్థము)ను తెలుసుకొనుటకు సిద్ధంగా ఉండు. అన్నిటిలోను చివరిది మారఫత్ (పరమాత్మను సాధించుట) అన్ని విధాలా అర్హులైన నిజమైన ప్రేమికులు పొందుతారు.

సుర్ ససూయీ అబ్రి: మజూరి, దేశి, కొహియారీ, హుసేనీ అను మరి నాలుగు సుర్‌లతో పాటు యీసుర్ రిసాలో అంతటిలోనూ అతిముఖ్యమైనది. దీనిలో విషాదకరమైన ససూయి కథ వర్ణించబడింది. సింధీ నాయికలలో ప్రఖ్యాతి వహించినది ససూయీ. తన భర్త పున్‌హూన్‌ను వెదుక్కొంటూ ఎడారులు, లోయలు, కొండలు, ఇసుక గుట్టలు తిరిగింది ససూయి. ఆమె మైమరచి నిదురిస్తుండగా, ఆమె ప్రక్కనే నిద్రస్తున్న పున్‌హూన్‌ను మత్తుమందిచ్చి స్పృహతప్పించి, ఒంటెపై కెక్కించి అతని సోదరులు మక్రాన్ నుండి వచ్చి దొంగిలించుకుపోయారు. ఎట్టకేలకు పున్‌హూన్ మక్రాన్ నుండి తప్పించుకొని సింధు వైపు పయనమయ్యాడు. కాని రోమియో, జూలియట్‌ల వలె ఆ ప్రేమికులు చివరకు ఆ అకాల సమాధిలోనే కలుసుకున్నారు. కెచ్ మక్రాన్ రాకుమారుడు పున్‌హూన్, సింధులోని భంభోర్ వాసి ముస్లిం రజకుని పెంపుడు కుమార్తె ససూయి ప్రేమకు పాత్రుడై ఆమెను పెండ్లాడాడు. కాని అందుకు అతడు రజక వృత్తి నవలంబించి, ససూయి భర్తగా భంభోర్‌లోనే ఉండిపోయే షరతుపైన వివాహం జరిగింది. అతని జీవితం, అదృష్టం, రెంటికీ ఒక హెచ్చరిక అందింది. అన్యదేశీయులతో సంబంధాలు కలుపుకోవద్దు. ఏదో ఒకరోజున వారు వొంటరిగా వదలి వారి స్వదేశానికి పోతారు. వారు వెళ్లిన పిమ్మట నీ స్వస్థలం (భంభోర్) నీకు అర్థహీన మవుతుంది.

ససూయి భయంకరమైన, అసహ్యమైన కొండలు, ఎడారులు దాటి కాళ్లు బొబ్బలెక్క, అలసి, సొలసి, దాహంతో బాధపడుతూ చేతులు పైకెత్తి కనబడిన వారి నెల్ల 'నా పున్‌హూన్‌ను చూశారా?' అని అర్థించుతూ తిరిగిన సన్నివేశాలు చాలా హృదయ విదారకంగా వర్ణించబడినవి. మృత్యు దేవత ఆమెను పిలువ వచ్చినప్పుడు తన భర్త పంపిన దూతయే వచ్చెనని ఆమె తలంచుటను కవి ఊహిస్తారు.

ఈ దుఃఖంలో తనను తాను నిందించుకోవడం వల్ల, ఆమె వేదనలు మరింత అధికమయ్యాయి. తన పున్‌హూన్‌ను వారి సోదరులు తీసుకొని పోయేటప్పుడు, అంతగాఢమైన నిద్రమత్తులో ఆమె ఎందుకు బంధింపబడి ఉండాలి? మామూలుగా ఒంటెలు చాలా గట్టిగా అరుస్తూ ఉంటాయి. అందుకే ఆమె ఒంటెలను ఆ రాత్రి అంత నిశ్శబ్దంగా ఉన్నందుకూ, నిందించింది. క్రూరులైన పున్‌హూన్ సోదరులను నిందించింది. వారి దౌర్జన్యానికి.... తరువాత ఆమెకు తట్టింది, ఎవ్వరిని నిందించడం వల్లా తప్పు పట్టడం వల్లా ప్రయోజనమేమీ లేదని. అది విధి వ్రాత 'ఆరోజు' అన్నదామె. ఆ రోజు ఆమెకు ప్రతికూలంగా ఉన్నది. జరుగవలసినదేదో జరిగి పోయింది. ఇక భంభోర్‌కు తిరిగి రావడం కల్ల; కచ్ మక్రాన్ వైపు ప్రయాణం సాగించాలి. ఆ పేదవాని హృదయంలేని వాని వలలో తానెందుకు చిక్కుకొన్నది? (అపవిత్రం కాకుండా దూకిన గోతిలోనే సమాధియై తన ప్రియుడు పున్‌హూన్‌తో శాశ్వత నిద్ర, సమాగమం పొంద గలిగింది.)

చివరకు, తాను అసందర్భంగా మాట్లాడుతున్నదనీ, ఆమె గ్రహించింది. పున్ హూన్ ఆమె చెంతనే, ఆమె హృదయంలోనే ఉన్నాడు. కాదు, కాదు తానే అయివున్నాడు. ఆ గుర్తింపులో, అన్ని తారతమ్యాలు పరిష్కరించబడ్డాయి. వియోగం సంయోగంగా మారింది. ససూయి గురించి వ్రాసిన సుర్‌లలో షా గారు వ్రాసిన అత్యంత సారయుతమైన, తీక్ష్ణమైన కరుణాపూరితమైన పద్యాలు ఉన్నాయి. రమారమి సింధీయులందరికీ యీ పద్యాలు బాగా తెలుసు. సంద్భాను సారంగా వీటిని తరుచుగా పునశ్చరణ చేస్తూ ఉంటారు.

సుర్ అబ్రీలో యీ పంక్తులు: నీటిపై తేలిపోవు క్రిమి కీటకాదులు వివేకం లేనివి గనుక తమ దాహాన్ని తీర్చుకోలేవు, తమ శ్వాస కంటె దగ్గర నున్నాడు ప్రేమైకమూర్తి. ఆతని కొరకై ఉద్రేక పూరితమైన అన్వేషణ! ఆప్రేమైకమూర్తి ఆత్మసాక్షాత్కారం సంపాదించితే గాని జ్ఞానం వ్యర్థమని సూటిగా కవి యీ సుర్‌లో హెచ్చరిస్తారు. ఇంతకు ముందరే గమనించినట్లు ఈ సుర్‌లో మృత్యుదేవత ఇజ్రాయిల్ ససూయిని సమాధిలో మేల్కొల్పగానే ఆమె పున్‌హూన్ పంపిన దూత వచ్చినట్లు భావిస్తుంది. రిసాలో అంతటిలోనూ ఖ్యాతి నార్జించిన పద్య పంక్తులు ఈ సుర్‌లో నున్నవి. అందులో తాను ససూయిని అన్న భావన తనలో నున్నంత కాలం, అనగా పున్‌హూన్ నుండి వేరుగా తలచినంత కాలమూ ఆమె వేదనలకు గురి అయింది. పున్ హూన్‌కు తనకు భేదం లేక అనన్యత్వం ఎప్పుడైతే చూడ గలిగిందో ఆమె

దాటేందుకు ఎడారి, కొండలు లేవు, వెదకడానికి కెచ్ లేదు. ఈ సుర్‌లో రుహ్ రిహాన్ (ఆత్మ సంసర్గము) ను నిర్వచిస్తూ అదివ్యక్తి తన ప్రత్యేక ఉనికిని కోల్పోయి తన ప్రేమైకమూర్తిలో ఐక్యం చెందడం అంటారు. అన్వేషకునికి దారి చూపడానికి ముర్షిద్ లేక జ్ఞానాన్ని బోధించే గురువు యొక్క ఆవశ్యకతను గురించి యీ సుర్‌లో నొక్కి వక్కాణిస్తారు.

సుర్ మజూరీలో హేరో లేక పున్‌హూన్ ఉండే చోటు చేరుకొనే ముందు పరిత్యాగం గురించి ప్రయాణించ వలసిన దుర్గమ మార్గం గురించి ప్రత్యేకించి చెప్పబడింది. ప్రేమైకమూర్తి చెంత నుండుటకు ప్రేమికుడు మృత్యు స్పర్శకు పూర్వమే మరణించాలి. ఆ ప్రేమైకమూర్తిని పొందడానికి అత్యంత పరిశ్రమ, మిక్కుటమైన త్యాగం కావాలి. ఈ సుర్ పేరులో (మజూరీ అనగా బలహీనత, నిస్సహాయతనే సూచించినట్లు పున్‌హూన్ అన్వేషణలో ససూయి ఎంత నిస్సహాయురాలిగా దయనీయ స్థితిలో ఉన్నదో వర్ణిస్తారు కవి ఈ సుర్‌లో.

సుర్‌దేశి (స్వదేశి) : సంబంధ బాంధవ్యాలు స్వదేశీయులతోనే చేసుకొన వలెననీ, విదేశీయులతో కూడదనీ యీ సుర్‌లో వివరించి చెప్పడం చేత దీనికా పేరు పెట్టారు. విదేశీయులు సహజంగా ఎప్పుడో ఒకప్పుడు తమ డేరా ఎత్తుకుని భంభోర్ విడిచిపోతారు. ఈ మూడు 'డ'లు ఒకటి విడిచి ఒకటి పొగడుచు తెగడుచు ససూయి పున్‌హూన్‌ల వియోగానికి కారణ భూతాలైనవి - దాఘ్‌లు (ఒంటెలు), దెర్ (భర్త సోదరులు) దూంగర్ (పర్వతాలు).

సుర్ కొహియారీ (పర్వతం) : ససూయికి అమె త్రిప్పటలలో పర్వతం కలుగజేసిన ఇబ్బందులకు ససూయియే కారణమని, మైమరచి నిద్రలో మునిగి ఉండక పోయినట్లయితే యీ త్రిప్పట తప్పి ఉండేదనీ వివరంగా యీసుర్‌నందు వర్ణితమయింది. కాని నిజానికి ససూయి మనసులోని విరహబాధలు పర్వతాలను కుడా కరిగించేటంతటి శక్తివంతమైనవి.

సుర్‌హుసేనీ : ససూయి పడిన బాధలు, అమె ప్రాణత్యాగం గురించి చెబుతూ, అమె దాహం మృత్యు సంఘర్షణలో ప్రవక్త మనుమడైన హుసేన్ వీరమరణ ఘట్టం గుర్తు చేస్తూ రోదించిన శోకగీతం లాంటిది యీసుర్.

సుర్‌లీలా ఛానెసర్ : లీల యొక్క పశ్చాత్తాపాన్ని వర్ణించే గీతం. తన భర్త ఛానెసర్ లేక దర్సోను పిచ్చిగా ప్రేమిస్తూన్న కౌనరూ ఎరచూపిన తొమ్మిది లక్షల విలువ చేసే వజ్రాలహారం మెరుపులకు ప్రలోభపడి అది

గైకొని, తన భర్త సరసన శయనమందిరంలో గడపుటకు అంగీకరించింది. దాని ఫలితంగా ఖానెసర్ ఆమెను శాశ్వతంగా పరిత్యజించాడు. ఆమె కన్నీరు మున్నీరుగా విలపిస్తూ పశ్చాత్తప్తయై హీన పరిస్థితులలో తలవంచు కొనవలసి వచ్చింది.

లైలా తిరిగి తన భర్తను పొందగలిగినదా లేదా అన్నది లెక్కకురాదు. పరమాత్ముడు చాలా అసూయాపరుడు. తుచ్ఛమైన పరధనాన్ని ఆశించి, కొదువపెట్టితే ఆతడు క్షణమైనా, సహించలేడు. లైలా ఎడతెగలేని ఏడ్పు: ఆ నగలన్నీ మండి భస్మమగుగాక, రత్నాల హారం మసియగుగాక, ఏది ఏమైనా నా భర్త నాకు తిరిగి కావాలి. నేను అతినీచ పరిస్థితులకు దిగజారి పోయినానరే. ఆమె వేదనను జ్ఞప్తికి తెచ్చుకున్నది. ఆమె ఒక నాటకాన్ని ఆడదలచింది. రత్నాలహారాన్ని తన భర్తను కూడా పొందదలచి అట్లా ఆడింది, అవ్వా కావాలి, బువ్వా కావాలి అన్న సామెత లాగా. కాని కథ అడ్డం తిరిగింది. కౌన్‌రూకు అనుకూలంగా మారింది. ఆమె ఇంక, గర్వించవచ్చు. కృత్రిమంగా బ్రతకడం వ్యర్థం అనీ లైలా చాలా ఆలస్యంగా గుర్తించింది. 'ఓయి భగవంతుడా! నేను వివేక వంతురాలనుగా, నేర్పుగలదానినిగా ఎప్పటికీ మారలేనా? తెలివైనవారు, కపటులు, బాధపడితీరుతారు. నేను నిర్మలంగా, సహజంగా మాలిన్య రహితంగా ఉన్నంతకాలం నాప్రేమైక మూర్తి నాతో చాలా సంతృప్తి చెందాడు.' కాని లైలా విరహబాధ ననుభవించడం తద్వారా సత్యాన్ని గుర్తించడం కూడా మంచిదేనని కవి అంటారు. తన భర్తచెంతనున్నంత వరకూ ఆమె "తాను" అన్న భావంతో నిండి వున్నది. భర్త వేరుకాగానే తాను అన్న భావం పూర్తిగా విడనాడి, అతనిని తిరిగి పొందడానికి కావలసినదంతా చేసింది. ఆమె ఖానెసర్ భార్యగా పొందిన గౌరవము, ఉన్నతస్థితి, అతడామెను త్యజించిన తరువాత ఆమె అనుభవించిన దయ నీయమైన స్థితి, యీ రెండు పరిస్థితులను కవి చక్కగా వర్ణించారు. ఈ సుర్‌నందు ప్రకృతి వర్ణనగాని బాహ్యావర్ణనలుగాని లేవు.

సుర్‌ముమల్ రానో: ఈ సుర్ ముమల్ యొక్కవేదన, ప్రతీక్షణ, సౌందర్యాన్ని గురించి వర్ణనలతో నిండి ఉన్నది. రానో (మెంధ్రో లేక సోఢో) అతని ముగ్గురు స్నేహితులు ఒక కప్పి లేక సన్యాసిని కలుసుకున్నారు. ఆ సన్యాసిని లావణ్యవతియైన ముమల్, ఆమె అద్భుత సౌధము గురించి చెప్పునపుడు కండ్ల నీరు కార్చు చుండెను. ముమల్ మీది ప్రేమ అతనిలో ఒక ప్రత్యేకమైన వెలుగులను స్ఫురింప చేశాయి. ముమల్ కండ్లు వజ్రాలవలే మెరుస్తూ చూపరుల హృదయాలను ఆ కట్టుకొనేలాగ ఉన్నాయి

అని అతడు ముమల్‌ను వర్ణించిన విధం రానోను దిగ్భ్రాంతుణ్ణి చేసింది. రానో అతని మిత్రులు కాక్ సౌధం దిక్కుగా ప్రయాణించారు. చిక్కుల దారులతో నిండిన ఆ సౌధంలో యుక్తితో రానో, అంతవరకు అదృశ్యంగా వున్న ముమల్‌ను కలుసుకొని ఆమె ప్రేమకు పాత్రుడవుతాడు. కొంతకాలం ఆనంద పారవశ్యంలో ఆ ఇరువురు గడుపుతారు. ఆమె సోదరి సుమర్ కుతంత్రం పన్ని ఆమెను రానోకు దూరం చేసింది. సుమర్ మగవేషం ధరించి ముమల్ సరసనశయనించి అకస్మాత్తుగా వచ్చిన రానోకు ముమల్ తనకు విశ్వాస ఘాతకురాలైనదన్న తప్పుడు అభిప్రాయాన్ని కలిగించి ఆమెకు అతనిని శాశ్వతంగా దూరం చేసింది. ముల్మ యీకుతంత్రం తెలుసుకొనేందుకే చాలా ఆలస్యమై పోయింది. మనసు చెదరినదై ముమల్ రానోను తిరిగి రప్పించడానికి అనేక విధాల ప్రయత్నిస్తూ, నిరీక్షించుతూ, ఎదురు తెన్నులు చూస్తున్నది. ఆమె నిరీక్షణ, జాగరణలు, ఈ సుర్ నందలి అత్యంత మనోహరమైన భాగాలు. కాక్ సౌధం, ఒంటె అంబారీలు, సుందర ఉద్యానవనాలు, అంతఃపురాలు, వార్తాహరులు, చెలికత్తెలు, ఇవి అన్నీ కొరగానివి అని అమె గుర్తించిన పిదప ఆమెకు శాంతి కలిగింది. ససూయివలెనే వేరు భావాన్ని విస్మరించినదై మెంధ్రో లేక రానో ఆమె అంతరాంతరంలోనే ఉన్నాడని భావించి ఆమెయే మెంధ్రో అన్నట్లు అయింది. అప్పుడామెకు శాంతి కలిగింది. విరహవ్యధలు ఆమెను పునీతం చేశాయి.

మూడు ముఖ్యాంశాలు యీ సుర్‌న గుర్తించదగినవి వున్నాయి. మొదటిది. ముమల్ అమె చెలికత్తెలు పారవశ్యత చెందే విధంగా వర్ణించిన వారి సౌందర్యం, వారి దుస్తులు మొదలైనవి: 'వారి దుస్తులు గులాబి పువ్వులవలె వున్నవి. వారి శిరోజాలు నిరంతరం చమేలీ పుష్పాల సౌరభాలను వెదజల్లుతున్నాయి. వారు వెండి బంగారాలతోనే క్రీడించే వారు.' రెండవదీ అతిముఖ్యమైనదీ ముమల్ రాత్రులంతా జాగరణచేసి ప్రతీక్షించడాన్ని గురించిన వర్ణన: 'ఉదయమగుదాక నీ కొరకై రాత్రి వెలిగించితిని దీపమును, తిరిగిరమ్ము. ఓ మెంధ్రా, ఆ భగవంతునియాన.' అని. మూడవది ఒక గుణపాఠం. ప్రేమైకమూర్తితో అతిస్వల్పమైనదే అయినా దురభిప్రాయమేర్పడితే అది పెద్ద యెత్తున అపదలకు మూలం కావచ్చును. కనుక అది ఎట్టి పరిస్థితులలోను సంభవించకుండా కాపాడుకోవాలి.

సుర్‌మరూయి: బహుశ సుర్‌లన్నింటిలోను చాలా ప్రచారంలో నున్నది, ముఖ్యంగా సింధు దేశాభిమానుల జ్ఞాపకాలున్న వారికి ప్రజాస్వామ్య భావనలతోనున్న వారికి, జాతీయవాదులకు యీ సుర్ చాలా ఆకర్షణ కలిగి వుంటుంది. పరిపూర్ణ గ్రామీణ వాతావరణంలోని పల్లెటూరి వనిత

మరూయి కుటీరాలలో దారిద్ర్యం మధ్య ఆకలి అంచులలో అల్లాడుతూ, గడ్డి వ్రేళ్లు తింటూ బ్రతికిన గ్రామస్థుల నడుమ పెరిగిన వనిత, రాకుమారుడు ఉమర్ ఇవ్వజూపిన అంతఃపుర వాసాన్ని తిరస్కరించింది. తన ప్రియుడు మరుప్ నివాసమైన, తనను బలవంతంగా తీసుకొని వచ్చిన మలీర్‌కు పోవు దారివైపు సుదూర ఆకాశపుటంచులనే చూస్తూ గడిపింది. వర్షాలు కురిసే టప్పుడు తన జన్మభూమియైన ఎడారి ప్రాంతం థార్ వికసిస్తూ ఫలించి ఉంటుందేమోనన్న అమితోత్సాహం, దానితోపాటే భంగపాటుతో కూడిన ఆలోచనలతో ఉండేది ఆమె. ఆమెకు ఎరగా జూపబడిన ఉన్నత జీవిత ఆశాపాశాల కంటె తన బీద స్థితియే ఆమెకు బాగా తోచింది. ఆమె ప్రియుని (పెండ్లి కొడుకును) నమ్మకాన్ని వమ్ము చేయకూడదు. ఎందుకనగా ఆమె మానవాత్మల సృష్టికి పూర్వమే అతనికి అంకితమైనది. తన వారు సందేశాన్ని ఏల పంపలేదో అనీ, తన మాతృభూమిపైన, తన వారిపైనగల గాఢమైన భక్తి అభిమానాలగురించి తనను తాను ప్రశ్నించుకొన్నది. తన మాతృభూమిపైన, తనవారి గల గాఢమైన భక్తి అభిమానాలను చూశాక ఆమెను బంధించి వారి మనసులు కరిగాయి. తన వారిచెంత నుండి వచ్చిన సందేశహరుని ఆమె సముఖాహాన ప్రవేశ పెట్టారు. ఆమె థార్ ఎడారి నంతా తన కన్నీటితో తడిపి ఫలవంతం చేస్తున్నదేమో. అన్నట్లుగా ఆ సందేశహరుని చూచిన వెంటనే అతనిని ఆప్యాయతతో ఆహ్వానించి, కంటికి మింటికీ ధారగా విడ్చింది. ఆమె బందీగానే అసువులు బాయవలసి వస్తుందేమోనని భావించి అమర్ కోటలోని ఉరుర్ అంతఃపురంలోనున్న ఆమె తన మరణ శాసనం వ్రాయుచున్నట్లుగా ఎంచి తన మరణానంతరం తన మృతదేహాన్ని తన ప్రియమైన మలిర్‌కు పంపవలసినదని, అతనిని అర్థించింది. మరూయి, పాతివ్రత్యానికి, దేశభక్తికి మారుపేరు.

అన్ని దృక్కోణాలలోను ఆమె ఒక నాయిక. ఆమెను బలవంతంగా ఎత్తుకొని పోయిన వారిపైనగాని, తనను పొందజాలక విఫలమనోరథుడైన ఆ వ్యక్తి ఉమర్‌ను పురికొల్పి తనను బలాత్కరింపజేసిన వానిపైనగాని, ఏ విధమైన శాపనార్థాలు పెట్టలేదు. ఉమర్‌ను ఆమె స్వంతసోదరునిగా భావించి, తన శీలాన్ని కాపాడమనీ తనను తిరిగి మలిర్ పంపివేయవలసినదనీ అడిగింది. చివరకు ఉమర్ అదే చేశాడు. మరూయీ అతని పెంపుడు సోదరియనీ ఇరువురూ ఒక తల్లి పాలు త్రాగి పెరిగారనీ ఉమర్‌కు తెలిసినదనీ చెపుతారు.

మరుయీ ఉమర్ సౌధంలోని మేడపైన పిట్టగోడల చెంత చిరిగి నలిగి మురికితో నిండిన బట్టలతో చింపిరిజుట్టుతో నిలుచుండి మలిర్

దిక్కుగా దృష్టి నిలిపి, ఆమె కోరికలను, విశ్వాసాన్ని భక్తిని ఒలకబోస్తూ గీతాలను పాడుచున్న భంగిమలలో చిత్రాలు చిత్రింపబడినవి. కాలి నడకను గాని, ఒంటెపైనగాని, సందేశహారి తమ వద్దనుండి ఏల రాడాయని ఆమె ప్రశ్నించుకుంటున్నది. తనను అందరు ఏల మరచిపోయారు? ఆమెను నిరంతరం వేధించు ఉమర్‌తో ఆతడు ఇవ్వజూపిన పీతాంబరాలు, చిత్ర వస్త్రాలకంటే తనవారు తనకిచ్చిన ముదుక వస్త్రాలే విలువైనవని నిర్మొగ మాటంగా చెప్పింది. తన ప్రియుడు చలిలో వణకుచు శయనించుచుండగా ఆమె మెత్తని ఆ పరుపుపై పరుండలేదు. అంతఃపురంలోని పంచభక్ష్య పరమాన్నములకంటె తన మాతృభూమిలో కసిందచెట్లు, కందమూలములే మధురంగా తోచినవి. మరుజాతి వారు తమ జామాతలను బంగారం, ఐశ్వర్యాలకుగాను కుదువపెట్టరు. ఆమెను కోల్పోయినందుకు తన మరులు ఉపవాసాలుచేస్తూ బాధపడుతుంటారని తలచారు. ఉమర్ తనను గురిచేసిన అవమానాన్ని తలచుకొని, తన మాతృభూమికి, తనవారికి కీడెంచునది, యన్న తలపైనను కలిగించవలదని ప్రార్థించింది. ఆమె జీవించి ఉండగా మలిర్ చేరలేకపోయిన ఆమె మరణానంతరం ఆమె మృతదేహాన్ని మలిర్ చేర్చవలసినదిగాను, అట్లా చేసినట్లయితే ఆమె ఆత్మ శాంతించుననీ వేడుకొన్నది. మరుయి తాను మలిర్ నందు ప్రతిదినమూ చేసే పనులను తలచుకొనుచూ, ఆ తలపులలో కొంత ఊరట పొందుతుండేది. వానలను అహ్వానించుతూ, తమ ఎడారి థార్ వర్షాలు ఊహించుకుంటుంది. అత్యంత విషాదభరిత మనోభావాలతో ఉన్న సంధర్భాలలోనూ, ఆశ ఆమెను ఉత్తేజింపజేస్తూంది: 'నీ ఆర్తనాదమును వినువాడు ఆ భగవంతు డున్నాడు, అతడే నిన్ను మాలిర్‌కు పోనిచ్చును.'

పాతివ్రత్యం, భక్తితో నిండిన మూర్తి కంటె కూడా, ఆధునిక పాఠకునికి యీసుర్, దేశభక్తిలోని సారాంశాన్ని అందిస్తూ, రాజకుమారులు పెత్తందారు ప్రభువుల గారాబు జీవితాలకంటె సాధారణంగా జీవించే పేదవారి జీవితాలను కీర్తిస్తూ వర్ణించింది. భారతీయులుగా నున్న సింధీ శరణార్థులకు యీ సుర్ అత్యంత ప్రియమైనది.

సుర్‌కామోద్: కామంపేరున లేదా హిందూ కామదేవత పైనున్న యీ సుర్‌లో విషాదం, బాధ, ఎడబాటులను గురించి ఒక్కమాటకూడా లేక పోవడం ఒక విచిత్రమే. ఇది ఆనందదాయకమైన కలయిక గురించి మాత్రమే వ్రాయబడింది. కీంఝుర్‌సరస్సుపై అధిపత్యం వహించే ప్రభువు జామ్ తమాచీ, గాంధ్రీ అను మోటు జాలరి వనితను ప్రేమించి, పెండ్లాడి, ఆమె కులమువారైన జాలరులను అన్నిరకాల పన్నుల నుండీ విముక్తులను

చేసినాడు. గాంగ్రీ (తరువాత నూర్ లేక వెలుతురు అన్న పేరుతో పిలుబడినది) ఆమె అణకువ, మంచితనం ద్వారా జామ్‌తమాచీ భార్యగా ఉన్నతస్థానం వహించింది. ఆ ఉన్నత స్థానాన్ని జామ్ భార్యలందరిలో తన వినయవిధేయ తల వలననే నిలబెట్టుకున్నది. 'ఆ జాలరి వనిత మనసున అహంభావానికి, గర్వానికి తావులేదు. ఆమె తన అవనతమైన దృక్కులతోను, మధుర సంభాషణా చాతుర్యంతోను, ఆ రాకుమారుని ఆకట్టుకొన్నది.' ఇందలినీతి - అభగవంతుడు గాని, ప్రేమైకమూర్తి గాని అహంభావమును, గర్వమును త్యజించిన వానినే దయగా చూస్తారు.

కీంఝర్ సరస్సు, అచట హీనస్థితిలో నుండి వినయవిధేయతలు గల జాలరులు, జాలరివనితలు, వారి వికృతరూపాలు, దుర్గంధభరితమైన చేపలబుట్టలు వీటిని గురించి చక్కని వర్ణనలు ఇవ్వబడినవి.

సుర్‌ఘటో మొరిరో అనే నావికుని గురించిన కథ చెబుతుంది. తన ఆర్గురు సోదరులను, కలాచీ వద్ద పెను సుడిగుండంలో తిరుగుతున్న ఒక పెద్ద వేల్‌చేప తన పొట్టను పెట్టుకుంది. ఆ చేపను చంపి పగసాధిస్తాడు మొరిరో. మానవుని మనసులో దాగొని ఉన్న దుష్టశక్తి అహం అనే పెను రాక్షసుని చంపనుంకించిన ఒక విధమైన అన్వేషకుడు. ఘటో అనగా వేటగాడు. సుర్‌సోరట్ : ఇది కూడ సుర్‌మరూయి అంతటి ప్రచారంలో నున్న సుర్‌లలో ఒకటి. చక్కని ప్రారంభంతో, చక్కని ముగింపుతో చెప్పబడిన కథ ఇది. పిల్లలకు చాలా అద్భుతంగా పాఠశాల తరగతులకు పనికి వచ్చే సుర్ ఇది. వీధిగాయకుడు బిజల్ ప్రయాణంతో కథ ఆరంభం అవుతుంది. అతడు జునాగఢ్‌లోని రాయ్‌డయాక్ ఊరికి బయలుదేరుతాడు. తన ప్రభువు అనాయ్‌రాయ్ పగతీర్చుకోవాలన్న దురాశను తీర్చడంలో తనను కృతకృత్యుణ్ణి గావింపుమని ప్రార్థిస్తూ బయల్దేరుతాడు బిజల్. జునాగఢ్ చేరగానే అతని సంగీతాన్ని వినడానికి ప్రజలు గుమిగూడారు. రాయ్‌డయాక్ కూడా అతనిని ఆహ్వానించి కోటలో అతని సంగీతాన్ని విని ముగ్ధుడయ్యాడు. బిజాల్‌కు ఏది కోరినా ఇస్తానని వాగ్దానం చేశాడు. ప్రాపంచిక సంపదలనన్నిటిని తిరస్కరించి రాజు శిరసు ఖండించి తనకు ఇయ్యవలసిందిగా కోరాడు. రాజును పరివేష్టించి ఉన్నవారు, ముఖ్యంగా అతని భార్య సోరత్ మరి యేదేని వరం కోరుకొమ్మని అర్థించింది. కాని బిజాల్ తన పట్టుదలను విడువలేదు. రాయ్‌డయాక్ అతని సంగీతాన్ని విని తన శిరస్సును ఒకసారి కాదు, ఎన్నిసార్లు అయినా ఖండించుకొని అతనికి కానుకగా ఇవ్వడానికి సిద్ధపడినంతగా ప్రభావితుడైనాడు. ఎట్టకేలకు రాయ్ తన శిరస్సు ఖండించుకుంటాడు.

జునాగఢ్ మట్టిలో కలిసిపోయింది. బిజాల్ ఆ శిరస్సును అనాయ్‌రాయ్‌కి కానుకగా ఇవ్వడానికి తీసుకుపోయాడు. అనాయ్‌రాయ్ అతనిని ఒక పెనురాక్షసునిగా ఎంచి దేశం నుండి బహిష్కరిస్తాడు. బిజాల్ తిరిగి జునాగఢ్ చేరుసరికి సోరత్, ఇతర రాణులు తమ ప్రభువు మృతదేహంతో సహగమనం చేస్తుండడం చూసి అతను కూడా ఆ మంటలలో దూకి ప్రాణాలు వదిలాడు.

ఈ సుర్ చదివిన పాఠకులకు షాకు సంగీతంపైన ఉన్న అభిమానం గుర్తుకు వస్తుంది. బిజాల్‌కు సమాధానం చెపుతున్నప్పుడే షా స్వయంగా ఆ అనుభూతిని పొంది రాయ్‌డయాక్ రూపంలో చెప్పారా అనిపిస్తుంది. "మనస్ఫూర్తిగా నా శిరస్సును నీకు కానుకగా ఇస్తాను. నా తలను తీసుకొని అనాయ్‌రాయ్ వద్దకు పోయి నీ మాట నెగ్గించుకో. నీ సంగీతానికి గాను వందసార్లు అయినా సంతోషంగా ఖండించుకొనడం నాకు ఇష్టమే." రాయ్‌డయాక్‌ను అన్వేషకునిగాను బిజాల్‌ను ఆధ్యాత్మిక తత్త్వబోధకుని గాను వ్యాఖ్యాతలు గుర్తిస్తారు. సోరత్ (ఈ విషాదగాథ జరుగుతున్నప్పుడు తెరవెనుక) మూర్తీభవించిన విషయాసక్త చిత్తమైన అహం గానూ మానవునికీ భగవంతునికీ మధ్య నిలచిన అడ్డంకి గాను వారు ఊహించారు.

సుర్‌కేదార : కేదార అంటే సంస్కృతంలో యుద్ధభూమి. ఇది కర్బలామైదానంలో జరిగిన విషాద గాధను వర్ణిస్తుంది. ప్రవక్త మనుమడు, కర్బలామైదానంలో వీరస్వర్గం అలంకరించిన అమరవీరుడు. హుస్సేన్ యొక్క ధైర్యసాహసాలకు, ఉదారబుద్ధికి, భక్తికి హృదయాన్ని కదిలించేలాగా నివాళులర్పిస్తారు. కర్బలామైదానంపై రాబందులెట్లు వారి మృతదేహాలపై కడుపులు నిండులాగున విందు లారగించినవో వర్ణించారు. తరచు ఉదహరించబడే యీ క్రింది పంక్తులలో యీ సుర్‌లోని నీతి సుబోధకం.

"ఆ మిత్రుడు (భగవంతుడు) సంహరించును తనకు ప్రియమైన, ఇష్టమైన వారికి అందజేయు బాధలను నిర్లక్ష్యమగు మనోభావముతో మరి వారిని లక్ష్యములేని తనముతో, ఇమిడియున్నది నిగూఢ రహస్యమందులో" ఈ సుర్ షా రచన యేనా అన్న వివాదమున్నది, కాని ఆ యుద్ధభూమి, వీరయోధుల మరణం, ప్రవక్త, అలీ, వారి సంతతి వారిపై చూపు భక్తి వినమ్రతలు వర్ణించిన తీరు గొప్ప కవితా శైలిని కనబరుస్తున్నాయి. సుర్ సారంగ్ చాల ఆహ్లాదకరమైన సుర్. దీనిలో ఎండిన భూములపై వాన జల్లులు పడడం, ఆ భూములు తమ కృతజ్ఞతలు తెలియజేయడం మొదలైనవి

వర్ణింపబడినవి. ఈ సృష్టి అంతా - మానవులు, జంతువులు, పక్షులు, జలచరాలు సముద్రంలో ఉండే చేపలు సహితం వాన జల్లులకై ఎదురు చూడడం, తమ పురుషుల రాకకై ఎదురుతెన్నులు చూస్తూ ఊగిసలాడే కుటీరాలలో ఉండు వనితలు తప్ప - మేఘాలు కంటబడగా, ఉరుముల ధ్వనులు చెవుల బడగానే వారు భయభ్రాంతు లవుతారు. కాని, తమ పురుషులు, తమ మందల చెంతనే ఉన్న స్త్రీలు, వానలుపడిన వెనక సమృద్ధిగా పశుగ్రాసం, పంటలు, పాలు, వెన్న దొరకునన్న ఆశతో ఆనందభరితులవుతారు. ఈ సుర్ ముగింపు మరపురానిది. కవి వాన జల్లులను మెరుపులను కాన్‌స్టాంటినోపిల్, కాబూల్, సమర్‌ఖండ్, ఢిల్లీ, దక్కన్ భుజ్, గిర్‌నార్, జైసల్మీర్, బికనీర్, అమర్ కోట్, తన జన్మభూమి సింధులమీదుగా గొనిపోయి, వానిపై యీ విధంగా ఆశీర్వచన వాక్యాలు పలుకుతారు: 'ఓ ప్రభువా! సింధు ఎల్లప్పుడు ఫలవంతంగా నుండుగాక! సారవంతముగా నుండుగాక! ఓ మిత్రుడా! నా అనుగు ప్రేమికుడా! మానవాళి అంతా ఆనందమయులగుదురుగాక!' అంతకు ముందు మేఘాలు, మెరుపులు మదీనా చెంత ప్రవక్త పవిత్ర సమాధిపై వినమ్రములై పోవుచుండుటను గురించి ప్రత్యేక వర్ణన ఉన్నది.

సుర్ సారంగ్‌లో ఐదు ఉపమానాలు ఉన్నవి. వాటిలో ముఖ్యమైనవి ప్రేమైక మూర్తి శిరోజాలను పోలి ఉన్నవి ఆ నల్లని మేఘాలు, ఎఱ్ఱని మెరుపులాతని దుస్తులను పోలి ఉన్నాయి.

ఈ సుర్ నందు మనకు బోధించునది: ప్రత్యేమైన ఉనికిని విడిచి పెట్టి 'తన' అను దానిని నశింపజేసుకొని సత్యంలో విలీనం కమ్మ. ఉదయాన్నే ఆ ప్రేమ స్వరూపుని చూడని కన్నులు నిరుపయోగాలు. ఈ సుర్‌లోని ప్రఖ్యాతి గాంచిన పంక్తులలో ప్రియురాలు అతనినే చూచుచున్నప్పుడు ఇతరులు అతనిని చూడకుండుటకుగాను ప్రియురాలు తన ప్రియుణ్ణి తన కన్నులలోనే కూర్చుండవలసినదిగా ప్రార్థిస్తుంది. కల్మా ఉచ్చరించుటలో ముస్లిం అని గురుతుకాదు, ఆ జాతి అనీ కాదు, భగవంతుడు ఒక్కడే ఉన్నాడు అని రూఢిగా చెప్పటంలో ఉన్నది. భిన్నమతావలంబకులకు దృష్టాంతం ఒకటి కంటే తత్వాలలో నమ్మిక. 'పరమాత్మ ఒక్కడే జీవించి ఉన్నాడు' అన్న నమ్మికయే సుర్ ఆశా ద్వారా మనకు అందించబడిన పాఠం. సూఫీ విధానాలను వరుసగా మన ముందు ఉంచుతారు. అయితే పరకాత్ (విధానం, నిత్యవిధి)ని మొదట చెపుతారు తరువాత షరియాత్ (ఆచారకర్మలు), తరువాత హకీకత్ (వాస్తవం), అన్నిటికంటె చివర మార్‌ఫత్ (తనను తాను గుర్తించడం).

సుర్ రిప్ అంటే ఒక హృదయ విదారకమైన సంఘటన లేక ఒక మహా విపత్తు గురించి చెప్పిన సుర్. ప్రేమికుడు ఎప్పుడూ దుఃఖంతోనే ఉంటాడు, అని ఇందులో వర్ణిస్తారు. ఇందులోని ప్రముఖమైన పంక్తులు : ప్రేమికుని ప్రేమను ఇటుకల ఆవంతో పోలుస్తారు. ప్రేమికుడు పగలంతా విరహబాధతో మండుతూనే వుంటాడు. కాని లోపల ఆరని మంటలు రగులుతున్నట్లు బయటికి ఏమీ అగుపడదు.

సుర్ ఖహెూరి : ఖహెూరి, సన్యాసులు మానవులు సంచరించే మార్గాలను వదలి అడవులలో సంచరిస్తూ అంతరాత్మతో మాటలాడడం కోసం ధ్యానించుతూ ఉంటారు. గంబోటకర్ (కొండ) వద్ద షా సన్యాసులను, విరాగులను కలుసుకున్నారు. అందుకే సత్యాన్వేషులు, చేరుకొనే స్థానానికి సంకేతంగా ఈ సుర్‌లో గంబోటర్‌ను కేంద్రస్థానంగా తీసుకున్నారు. అందరూ సంచరించు మార్గాన్ని విడనాడి, మానవులకు తెలియని క్రొత్త నేలలపై పాదాలుమోపమనీ, ముర్షద్ లేక గురువు అక్కరలేని ఉవేసిఫకీర్ కమ్మనీ ఖహెూరీలను ప్రేరేపిస్తారు. అయ్యో! అట్టి ఖహెూరీలు అరుదైపోయారిప్పుడు. వారు తమ మూట ముల్లెతో మాయమైనట్లు తోస్తున్నది.

సుర్ బార్వోసింధి: సింధీ అన్నపేరుతో ఉన్న ఒకేఒక్క సుర్. ఇందులో ప్రభువుకు విశ్వాస పాత్రుడవుగా ఉంటూ ఆతని చంచల మనోభావాలకు తట్టుకొని ఉండవలసినదిగా ప్రేమికునికి నచ్చచెబుతారు షా. ఒక్కొక్కప్పుడు ఆతని తలుపులు పూర్తిగామూసి ఉంటాయి, తిరిగి పూర్తిగా తెరుచుకొని ఉంటాయి. ఒక్కొక్కప్పుడు లోపలికి ప్రవేశం నిషిద్ధం, తిరిగి ఆదరంతో ఆహ్వానం : అది ఒక విచిత్రమైనది. ఆతడు ఆతని మార్గాలను గురించి ప్రశ్నించే పనిలేదు. శోధించే పనిలేదు. తన ప్రేమికుడు మాత్రం విధేయుడై సత్యసంధుడై ఉండాలి. హతవిధీ! ఈ ప్రపంచంలో ఎంతటి అవిధేయత, ఎంతటి క్రూరత్వం! మంచితనం, సత్యం ; వీటి వాసనలు మాత్రమే మిగిలిఉంటాయా! ప్రాపంచిక విషయాలకై ప్రాకులాడవద్దు. ఒకే ఒకదానిని కోరుకో, అది ఆతనినే. ఒకేఒక ప్రేమమూర్తిని మనం ఎంచుకొనవలెననీ, ఆతనికే హృదయాన్ని అంకితం చెయ్యాలనీ 'భక్తి' ప్రేమ భావాలు చెదరకుండా ఉండవలెననీ మనకు సుపరిచితమైన యీ పంక్తులలో బోధచేస్తారు.

సుర్ రామకలి రెండు విధాలుగా అద్వితీయమైనదిగా సుర్‌లలో పేరొందింది. హిందూ ఋషులను, భగవదన్వేషకులను గురించి వ్రాసినది యీ సుర్. సమకాలీన సంఘటన అనగా సూఫీ అమవీరరుడు షా ఇనాయత్

వీర మరణం గురించి ప్రత్యేకించి చెప్పిన ఒకే ఒక్క సుర్ ఇది. ఈ సంఘటన జరిగిన నాటికి షాకు ముప్పై సంవత్సరాల వయసు.

షా రెండు రకాలైన హిందూ యోగులను కలుసుకున్నారు. నూరీలు (తేజశ్వులు), నారీలు (నరకాగ్నిలో మండుతున్నవారు). జోగుల సాంగత్యంలో వారు హింగ్లాజ్, ద్వారకవంటి పుణ్యక్షేత్రాలు దర్శించారు. హృదయరంజకమైన బిజాల్ రాగవరుసలను మించిన వారి సంగీతాలు విన్నారు. దివ్యతేజస్సును అన్వేషించుతూ వారెల్లప్పుడూ తూర్పుదిశగానే పయనించే వారు. ప్రాపంచిక వస్తువులుగాని, వ్యాసంగాలుగాని వారి మార్గాన్వేషణలో వారిని మరల్పజాలవు. యోగికావడానికి సూత్రం అతి సామాన్యం : అన్నిబంధాలను త్రెంచి వేయండి. ఆ జోగుల ద్వారం చెంతనే ఆచ్ఛాద రహిత శరీరంతో కంటతడితో అంటిపెట్టుకొని ఉండండి. ఈ మహాత్ములకూడలిని ఒక వరమిమ్మని అర్థించండి. అన్నీతెలిసికూడా ఏమీ తెలియనట్లుంటారు. వాంఛలనన్నిటిని చంపుకొని నిశ్శబ్దంగా ఉండండి. శిరస్సును, కాలిమణుకుల యందుంచి మనస్సును ఎల్లప్పుడూ ప్రార్థనతో నింపండి. ఈ జోగులా ప్రభువును తమ పరిశుద్ధమైన మనసుతో, తమ దిగంబరత్వంలో వశంచేసుకొనలేదు. జోగులమంత్రాలు, ఆచారకర్మలు, ఇస్లాంకు పూర్వమే ఏర్పరుపబడినవని షా సూచిస్తారు.

'ఇస్లాంకు పూర్వమున్న పిలుపును జోగులు విన్నారు. ఇతర ఆశ్రయ ములనన్నింటినీ విడిచి గురువు గోరఖ్‌నాథ్‌ను కలియవలసినదని ఆ పిలుపు' ఇనాయత్ యొక్క వీర మరణాన్ని గురించిన షా ప్రస్తావన హృదయ విదారకంగా చిత్రించబడింది. దానిని గురించి ఇదివరకే ఉదహరించబడింది. ఈ సుర్ చివర విజయోత్సాహ సూచకమైన గంభీరమైన వ్యాఖ్యానమున్నది.

'ఆకాశము, స్వర్గములేని చోట, భూమి, ఎగబ్రాకుతున్న చంద్రుడు, సూర్యుని ఛాయయైననులేని మహత్తరమైన ప్రదేశాలలో ఆదేశుల (జోగుల) వాసమున్నది. వారిజ్ఞానము అపారము. ఉనికిలేమి ద్వారా మాత్రమే వారాప్రభువును సాధించారు.'

సుర్ కపైటిలేక సాలీంద్ర గురించిన సుర్, సందేశాత్మకం. ఆధ్యాత్మిక విషయ బోధనలను సామ్యాల ద్వారా అందిస్తారు. మానవుడు ఒక నూలు వడికే వాడు, 'తాను' అన్నదే సాలెమగ్గం. ఆతని విధ్యుక్త ధర్మంనార లేక నూలును విశ్వాసపాత్రతతో శ్రద్ధగా వడకడం. హృదయ పూర్వకంగా అహంకారం లేకుండా, ఇతర ప్రతిఫలాలేవీ ఆశించకుండా తన విధ్యుక్త ధర్మం నెరవేర్చుతూ ఉన్నంతకాలమూ సరఫ్‌లు లేక నూలు కొనుగోలు

చేయు వ్యాపారి (భగవంతుడు) చాల సంతృప్తిచెంది మరే ఇతర అక్షేపణా లేక నూలు స్వీకరించుతాడు. కాని అహంభావంతో స్వలాభాపేక్షతో నూలు వడికినట్లయితే అది ఎంత సున్నితంగా వడికినదైనా, అంగీకరింపబడదు. 'ప్రేమభరిత హృదయాలతో వడకినవారి వద్ద నూలు, త్రాసు నందుంచకయే సరాఫ్‌లు అంగీకరించి కొనుగోలు చేస్తారు.' వారి యందు నమ్రత ప్రేమ, విధేయత ఉన్నట్లయితే భగవంతుడు మూర్ఖులను, మంద బుద్ధులను కూడా అంగీకరిస్తాడు. స్వాభిమానమున్నవారు, అవిధేయులు, కుతంత్రులు అయినట్లయితే ఎంత తెలివైన వారినైనా వెంటనే తిరస్కరించుతాడు.

సుర్‌పూరబ్ : ఒక విధంగా ఇది సుర్‌రామకలికి అనుబంధం. పూరబ్ లేక తూర్పుపై వివరించి చెప్పిన సుర్. ఉదాహరణగా చూపుచు తూర్పుదిక్కు యోగుల గమ్యస్థానమనీ అచటి ఆధ్యాత్మిక తేజస్సువారికి కేంద్రమనీ అచటికే వారు పయనమై కవిని ఒంటరిగా విడిచి వెళ్ళారనీ అంటారు. పూరబియా (తూర్పువాసులు) తూర్పున పూరీవైపు వెడలిరి. యీ ఉదయము. వారు నిజమునకు కస్తూరి భరితులైసువాసనలు వెదజల్లుతున్నారు. ఇంతకు పూర్వమే వాయసమును ప్రేమికుని సందేశహరునిగా కవి అభినందించాడు. ఆ వాయసమే ప్రేమైకమూర్తి వద్దనుండి శుభవర్తమానాలు తెచ్చి, ప్రేమికుని వినతులను ప్రార్థనలను ఆతనికందించేది. 'ఓ వాయసమా ! నా సందేశం ప్రియుని వద్దకుగొనిపోయి ఆతనికి చెప్పు, "కారణాంతరాలచేత్త నీవు పోయి చాలరోజులు గడిచినవి ఓప్రియా ! నీవులేక పోవుట నాకు అమితమైన బాధను కలిగించుచున్నది."

సుర్‌కరెయిల్ : నెమలిలేక హంస అయిన కరెయిల్‌ను గూర్చిన సుర్ యిది. ఇచటనిజమైన ప్రేమికుడు హంసవంటి వాడు అనిపోల్చి చెపుతూ హంస మురికి నీటిని అసహ్యించు కుంటుంది. సుదూరాలకు ఆకాశంలో ఎగిరి, పరిశుభ్రమైన నీటిని త్రాగుతుంది. కాకులు, కొంగలు అట్లాకాక దుర్గంధభూయిష్ఠమైనవన్నీ తింటూ మురికినీటిని త్రాగుతుంటాయి. పిశాచాధిపతి చురుకైన వాడు, తన దుష్కార్యాలలో చాలా బలవంతుడు. మనం కొంగలనే తరచు చూస్తూంటాము. హంసలనుకాదు. ఆధ్యాత్మిక పునరుజ్జీవనానికీ సంయోగానికీ ప్రేమయే గొప్పసాధనం : 'కమలము భూమిలోపల నున్నది, సీతాకోకచిలుక స్వర్గానికి ఎగురుచున్నది. కాని భగవంతుడు కావలసిన విధంగా ఆరెండింటి సంయోగం పరిసమాప్తి నొందించుతాడు. ప్రేమికులిరువురను కలుపు ఆ ప్రేమ శ్లాఘనీయం.' భగవంతుని వెదకునిజమైన అన్వేషకుడు హంస లేక నెమలి వలె ఉంటాడు. ఆతడు వికారాన్ని వికార

స్వరూపాన్ని, చీకటిని ప్రమాణ పూర్వకంగా విడిచిపెడతాడు. విషసర్పాలలో పైశాచికమైన పిశాచాధిపతి అనే వేటగానిని భంగపరచగలడు. జునాగఢ్‌ను తగులబెట్టగల నిజమైన యోగి పాములవాని వలె ఆ పాము (భూతము)ను మచ్చిక చేయకపోడు.

సుర్‌ప్రభాతి ; ప్రభాతము, సూర్యోదయాన్ని గురించిన సుర్, బిచ్చమెత్తుకొను వీధి గాయకుడు తన తంత్రివాద్యాన్ని మీటుచు ప్రభువును ఆనందింపజేసే విధంగా ఉదయాన్నే భగవంతుని ప్రార్థించుటతో యీ సుర్ ఆరంభం అవుతుంది. భగవంతుడు కరుణించినట్లయితే మందమతికి కూడ సంపద లిచ్చునంతటి ఉదారుడు. ఆతడు అన్నిటిని ఇచ్చువాడు. మరి యెవ్వరూ ఏదీ ఇవ్వలేరు.

సుర్‌లన్నిటిలోను అతి చిన్నది యీసుర్. ఉదాహరణలుగా ఎత్తి చూపదగిన అంశాలు ధారాళంగా ఇందులో ఉన్నాయి. వీటిలో కనీసం నాలుగు అంశాలు షా పాఠకుల పెదవులపై మెదలుతూ ఉంటాయి. మొదటిది తెలివైనవారు గుర్తించుటకు జ్ఞాపకం చేస్తూ, వారి తెలివితేటలను, పరికరాలను వదిలి పెట్టాలన్న ఆలోచన పుట్టేటట్లుగాను, వారిని సందిగ్ధావస్థలో నుంచే విధంగా మందమతులను కూడ సర్వసమర్థులను చేస్తుంది. రెండవది జన్మతో పొందదగిన గుణమునకు ఏకులమూలేదు, కావలసినది చిత్తశుద్ధితో కూడిన సేవమాత్రమే. జామ్ లేక ఆప్రభువు విక్రుతంగా సామాన్యమైన తెలివి తేటలుగలవారినైనా కృపతో చూస్తాడు. మూడవది ప్రతిదినము బహుమతులనందించే ఆ ప్రభువును వేడవలెనుగాని కృత్రిమ ప్రాపంచిక మానవులనుకాదు అని మానవుని ఉద్బోధించుతుంది. నాల్గవది ఆ ప్రభువు ఒక్కడే దాత అనీ తక్కిన వారందరూ భిక్షకులే అని ఆ ప్రభువును అభినందించుతుంది. వర్షాలు ఆ కాలమునందే కురుస్తాయి. కాని భగవంతుని కానుకల వర్షం నిరంతరమూ కురుస్తూనే ఉంటుంది.

సుర్‌దహర్ : ఒకప్పుడు నదీ పరీవాహ ప్రదేశమై తరువాత దహర్ అనగా ఎండిపోయిన లోయ, ఇప్పుడు ఎడారిగా మారిన ఆప్రదేశంగుండా పయనించినప్పుడు వింత వింత భావాలు వారికి కలిగాయి. ఒకప్పుడు జన సమ్మర్దంతో గూడిన అంగడులుండెడి ప్రదేశం ఇప్పుడు ముండ్లపొదలు మొలచు ఎడారిగా మారింది. ఇందులో కవి భగవానుని, ఆతని ప్రవక్తను యీ నిర్జనత్వంలో జ్ఞప్తికి తెచ్చుకుంటారు. ఏకాకిగానున్న పెండ్లి కుమార్తెతో పెండ్లి కుమారుని కలియవలెనన్న మేలుకొని యుండవలసినదిగాను, నిద్రపోగూడదనీ అంటున్నారు కవి. ఈ సుర్ చివర జడేబొ, సమలు

మొదలైన సింధు రాజపుత్ర తెగలను గురించి, వృత్తిరీత్యా దోపిడి దొంగ అయినా పేదలపాలిట సన్నిహితుడు, సాహసవంతుడైన యోధుడు, లఖోపు లానీ గురించి కొనియాడుతూ వ్రాశారు.

సుర్ బిలావల్ ; షా వ్రాసిన ఆఖరి సుర్. దీనిలో దోడో ఖానెసర్‌ల గాథ వర్ణితం. ఇందులో తన ప్రాణాలొడ్డి తమ స్త్రీల శీలసంపదను కాపాడిన అబ్రో ధైర్య సాహసాలు కొనియాడ బడినవి. జడమ్ జఖ్రో దాతృత్వము, ప్రవక్త అల్లుడైన అలీ ధైర్య సాహసాలను వర్ణించారు. షా దర్బార్‌లో చనవుతో మెలగు విదూషకుని పాత్ర వహించే కుక్షింభరుడు వాగండ్‌ను ఎగతాళి చేయుచు వ్రాసిన వ్యాఖ్యానంతో యీసుర్ ముగించ బడింది.

షా ధృఢమైన నాటకీయతగల గేయ కవి. వారి పద్యకథలలో తక్కినదంతా విడిచిపెట్టి ఉత్కర్ష విషయ పరిస్థితి వీటి నాటకీయతను విస్తరింప చేస్తారు. పాఠకులకు కథ బాగా తెలిసియుండునని వారెంచుతారు. వారి కార్యసాధనకు అవసరమని యెంచిన ఘట్టాలనే వర్ణించుతూ, నీతి విష యమైన, ఆధ్యాత్మిక విషయమైన దృక్పథంతో వాటికి ప్రాముఖ్యత ఉన్న సంఘటనలనే చెపుతారు. వారి పద్యాలు ఆధ్యాత్మిక ఉపదేశాలు, పవిత్ర మైన ఉపదేశాలు, వారి శ్రోతలను పాఠకులను ఆ ప్రేమైకమూర్తి వైపునకు మళ్లించుటకే వారి పద్యాలు వ్రాయబడ్డాయి అంటారు షా. వారి పద్య రచనకు అదే ప్రధానోద్దేశం. వారి పద్యాలు తార్కికంగానూ ధారా వాహి కంగాను ఉండవని విమర్శకులు అంటారు. ఒక్కొక్కప్పుడు వారు ఒక కథాంతాన్ని లేక గాథను, సంఘటన, ఘట్టం చివరిభాగాన్నే తీసుకుంటారు, తిరిగి అక్కణ్ణించి మొదటికి వస్తారు. పాత్రలు కూడా యుక్తరీతిని తీర్చిదిద్ది ఉండవు. ఆయన నాయికలు నాయకులు (ఎవరైనా వుంటే) మధ్యలో చొరబడతారు, లేకపోతే ఏదో విషయాన్ని చెబుతారు. కవి దానిని తమ వ్యాఖ్యానాలతో సమర్ధిస్తారు. అటు తరువాత తమ కథాకథనం సాగిస్తారు. పాశ్చాత్య పాఠకులకు ఇది చికాకును కలిగిస్తుంది. కాని షా పద్ధతి వారిది మాత్రమేనని తెలుసుకోవాలి. ఒకవిషయాన్ని ఉజ్జ్వలితం చేయడానికి వారు తళుకులతోను మెరుపులతోను, శలాకలతోను వెలిగిస్తారు కాని ప్రకాశాన్ని ఒకేసారి గుప్పించి తేజస్సును కలిగించరు. కాని ఈ మెరుపులు, తళుకులు అత్యద్భుతమైన రీతిని వెలుగునిస్తాయి. బాహ్య దృష్టికి అక్కడా అక్కడా వెదజల్లి ముత్యాలలాంటి పద్యాలు, హృదయాన్ని దూసుకుపోయేటంతటి మహత్వపూర్ణమైన అర్థాన్నిస్తూ ఉంటాయి. అలా పద్యాలు వ్రాయ

డానికీ వారిని అనుకరించేందుకూ చాలామంది కవులు ప్రయత్నించారు గాని ఎవరూ కృతకృత్యులు కాలేకపోయారు. షా నాటకీయత చూపగలరన్న విషయం సుప్రసిద్ధ సింధీ నాటకకారులు, రచయితలు అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు. ఈ సింధీ నాటకకారులు తమ నాటకాలు విజయవంతం కావడానికి తమ రచనలలో షా పద్యాలను మధ్య మధ్య సందర్భోచితంగా, నాటకంలోని అవిభాజ్య భాగంగా వినియోగించడం జరిగింది. అదే వారి నాటకీయతలోని సామర్థ్యానికి ప్రత్యక్ష నిరూపణ అంటారు. ఈ విధమైన అద్భుత విజయన్ని సాధించిన నాటకం 1920 ప్రాంతాలలో లాల్ చంద్ అమర్ దీనోమల్ వ్రాసిన ఉమర్ మరూయి. ఇది రంగస్థలం మీద ఘన విజయం సాధించింది. లీలా రాంఫేర్ వానీ 1930 చివరి ప్రాంతాలలో వ్రాసిన లైలా ఛానే సర్ నాటకం, మరే ఇతర సింధీ మూలనాటకాలలో లేని సాహిత్య విలువలు కలిగి ఉన్నది. రాం పంజ్వానీ 1940 ప్రాంతాలలో వ్రాసిన మాముల్ రానో నాటకం ఎల్లప్పుడూ ప్రజాదరణ పొందుతూనే వుంది. షా కావ్య కథలను ఆధారణంగా చేసుకొని రాం పంజ్వానీ విమర్శకుల, సామాన్య పాఠకుల మన్ననలందుకున్న ఏడు నాటకాలు వ్రాశారు. మరొక కాలంలోగానీ, వేరుపరిస్థితులలో గానీ అయితే షా ప్రథమశ్రేణికి చెందిన నాటకకర్తగా పేరు పొందిఉండేవారు.

ఇలాగ వారి వర్ణనాచాతుర్యం గురించి చెప్పడానికి వీలులేదు. సుర్ కేదారలోను, మరికొన్ని సందర్భాలలోను పౌరాణిక కాల వర్ణనా చాతుర్యం వారిలో ఉన్నది. కాని అది ఉన్నట్లుండి అప్పుడప్పుడు వ్యక్తం అవుతూ ఉంటుంది. ఏది ఏమైనప్పటికీ, యుద్ధభూమిలో సాహస వంతులైన వీరులను వారి కథన పద్ధతిలో వర్ణించుటలో యీనాటికి కూడా షాను మించిన వారు మనకు సింధీ సాహిత్యంలో కనబడరు. కాని షాగారు హోమర్ కాదు, ఛాసర్‌కూడా కాదు. ఒక కథలో అంతర్భూతమైన విషయాలపై తమ ధ్యానాన్నంతా కేంద్రీకరించి ఉండటం వలన అన్ని సంఘటనలు, సూక్ష్మబుద్ధితో కూడిన ఒక క్రమంలో చెప్పడానికి వారికి ఓపిక ఉండేది కాదు.

ఒకేఒక్క సుర్‌లో, అదీ ముగింపు సందర్భంగా ప్రయోగించినదితప్ప; షాలో హాస్యంలేదు. ఆ సుర్‌నైనా అది ఎగతాళి చేసే హాస్యం. కేవలం క్రియా సంబంధమైన చమత్కారం. షాని వ్యక్తిగాను, కవిగాను చక్కగా వర్ణించాలంటే వారు పరమాత్మ మైకంలో నున్న ఆత్మ అని చెబితే సరిపోతుంది.

షేక్స్‌పియర్ గురించి చెబుతూ వారికి నాయికలేగాని నాయకులు లేరు అంటారు. ఈ మాట షేక్స్‌పియర్ కంటే షాకి ఎక్కువ వర్తిస్తుంది. ఎందుకంటే రాయ్‌డయాల్ తక్క వారి రచనలలో నాయకుడు లేనేలేడు. పుర్‌హూన్, ఉమర్, మెహర్, రానో, ఖానెసర్‌లు నాయకులు కానేకారు. ప్రాపంచిక మానవులుగా తీసుకుంటే వీరిలో కొందరు తిరస్కృతులు లేదా అయోగ్యులు. అన్వేషకుని స్త్రీగానూ పరమాత్మను ప్రేమైకమూర్తిగాను ఊహించుకొని షా ఆ స్త్రీని, పరమపురుషుని లేదా వరుని, పొందుగోరు వధువుగా చిత్రించారు. ఈ భావన సతి (పవిత్ర యువతి) షా వాడినవి స్వచ్ఛంగా భారతీయమూ హిందూ సాంప్రదాయాలలో పుట్టినదీ అని చెప్పవచ్చు. హిందూ సాంప్రదాయ వివాహ పద్ధతికే షా కట్టుబడి ఉన్నారు. ఆ పద్ధతిలో మరణానంతరం కూడా ఆ పవిత్ర బంధం నిలిచి ఉంటుందని భావన. వారి నాయికలు తమప్రేమైక మూర్తులకు జన్మిం చుట ముందరే కుదవపెట్టబడిందనీ వారు మరణానంతరం కూడా అట్లే కలసి ఉందురనీ షా నొక్కివక్కాణిస్తారు. షా సూఫీతత్వంలో ప్రత్యేకించిన హిందూ అంశం, అదే వారి ప్రేమతత్వాన్నంతటినీ బలపరుస్తున్న పురుష నికి స్త్రీకి మధ్యగల శాశ్వతమైన అనుబంధం. షా నాయికలందరూ, శివుని ఇల్లాలైన పార్వతితో, మరువరాని ఆమె మాటలతో ఏకీభవిస్తారు.

జనమ్ కోటి రగర్ హమారీ
బరూన్ శంభు వహిర్ రహూన్‌కు హరి.

'నా జన్మలన్నిటను యీ సంబంధం నిలిచి ఉండు: శంభునైన, శివునైన నేను పెండ్లాడినను, అవివాహితనుగా జీవితాంతము ఉండి పోయినను.'

షా నాయికలకు ఇతర నాయికలలో లేని లక్షణాలెన్నో ఉన్నాయి. నిగూఢతతో నిండిన ముమల్, మోసకత్తె, ఆశాపరురాలు లైలాతో సహితం వారంతా సాధారణమైనవారు. వారిలో కుతర్కంలేదు, కాని ప్రియుని పొందడంలో పట్టుదల, దీక్ష, అవసరమైతే ప్రాణాలనైనా అర్పించి తమ మనుగడకు సార్థకతను సాధించుకొనే మనో సంకల్పం ఉన్నవారు. వారం దరిలో ముఖ్యమైనదీ అగోచరమైనదీ సర్వవ్యాప్తమైనదీ మరో గుణం వుంది - వారందరూ సింధీస్త్రీలు. వారి మానసిక, ఆధ్యాత్మిక వికాసంలో భాగంగా సింధు, నిర్జన ప్రదేశమైన ఆ ఎడారి, వారి రక్తంలో సింధులేక మిహ్రాన్‌లను గురించిన ఆకాంక్షలుంటాయి. వారికి సుపరిచితమైన వాహనం ఒంటె. అదే ఎడారి ఓడ.

దేశభక్తి పరంగా మరూయి వారి నాయికలందరిలో మిన్నగా నిలచిఉంటుంది. ఐశ్వర్యాలను త్యజించి ఎడారిలో సామాన్య జీవనాన్నే మిన్నగా ఎంచుకోవడం, ఆమె జీవించి ఉన్నప్పుడూ, మరణించాక కూడా జన్మభూమి ఎడారిలోని ధూళికే అంకితం కావడం ఎన్నదగినవి. షాలో వలెనే మరూయిలో కూడా ఒక ప్రత్యేకత వుంది. 'ఇంగ్లండు'కు బదులు 'సింధు' 'సముద్రము'నకు బదులు 'నది' అని మార్చితే షా వ్రాసినదీ, ఇంగ్లాండు కవి వర్డ్స్‌వర్త్ వ్రాసినదీ ఒకే పద్యం.

నే పయనించితి తెలియని జనుల మధ్య
నేలలపై ఆవలివైపు సాగరమున
లేదు ఇంగ్లాండును నేనెప్పటి దనుక తెలుసుకొనన
ఏవిధమైన మమతతో నుంటి నీపై....

ఇరవైయవ శతాబ్దపు సింధీయులు షాను సూఫీ కవిగా భావిస్తారు. ఒక్కక్షణం షా ఆధ్యాత్మిక చింతన, అనంతం వైపు సాగిన వారి అన్వేషణ లను గురించి విస్మరించినా, వారు మన కన్నుల ముందు ఆవిష్కరింప జేసిన సింధును వారి పద్యాలలో చూడవచ్చు. సింధీయుల కలలు, కోరికలు అన్నీ శకలాలుగా అవనతంచేసి, వారి కథలు గాధలలో వాటికి ఒక శాశ్వతమైన స్థానం కల్పించి ముద్రవేసి, అజరామరం చేశాయి షా పద్యాలు. పర్వతాలు, లోయలు, అడవులు, ఎడారి, జనసమ్మర్థమైన అంగడులు, సింధులోని ప్రదేశాలు, అక్కడి వృక్ష, జంతు సముదాయం, షా పాఠకుల ముందు క్రమంగా మెరిసిపోతూ ఉంటాయి. కమ్మరి దాగలి చప్పుడు, సాలీని మగ్గపు చప్పుళ్లు, నావికుల తెడ్లచప్పుళ్లు, ఇసుక నేలలపై ఒంటె పాదాల చప్పుళ్లు, వారి చెవులకు వినపడుతూ ఉంటాయి. సుహినీ నీటిలో దుమికినపడ్డు చప్పుడు, నీటిలోని పెను జలచరాలు కోపంగా పండ్లు కొరికినప్పుడు, చప్పుడు, కూడా వారి చెవులలో పడివుంటుంది. పర్షియన్ కవులకు ప్రియమైన షిరాజ్‌లోని బుల్ బుల్ పిట్టపాటలుగాని, ట్యూలిప్ పూవులుగాని షా గారి పద్యాలలో మనలను వెంటాడవు. కాకి, కొంగ, నెమలి, ఆకాశంలో విహరిస్తున్న సీతాకోక చిలుకను ఆకర్షించడానికి కమలం చాలు వారికి. షాలోని ప్రధానమైన సింధీయత, సింధి తనము ఇరువదవ శతాబ్దపు సింధీ కవులు పాశ్చాత్య ఛాయల వల్ల, దృశ్యాలవల్ల ఉత్తేజితులై వ్రాసిన కవితల సరసతను పరిశీలిస్తే మనకు విదితమవుతుంది. షా కావ్యాలలో లైలామజ్నూ, యూసఫ్ జులెయ్‌ఖా లేక షిరిహాన్ ఫర్‌హాద్, వంటివి ఏవీ మనకు కనబడవు. వారి డాంబికంలేని సింధీ నాయికలు

ఇతర నాయికలతో దీటుగా నిలబడగలరు, ఒకటి రెండు అంశాలు అధికంగా వారికి నేర్పగలరు కూడా.

ఇదివరకు ప్రస్తావించినట్లు సుర్‌సారంగ్ చివరి పంక్తులలో షాకి సింధుదేశంపై గల అభిమానం సువిదితమే! వేరొక చోట వ్యాఖ్యానించి నట్లు షా 'జానపదకవి' అని, వారి కవిత్వంలో నాజూకుదనం, సంస్కృతి లోటయిందనీ అంటారు. ఇంతకంటె సత్యదూరం మరొకటి లేదు. వివిధ రాగరసాలు, ఆలోచనలు, భావప్రకటన విధానం యివన్నీ ఎంతో ఉన్న తంగా, ఎక్కడా మోటుదనం లేకుండా, పోషించబడినవి. ప్రపంచ సాహిత్యంలోనే వారి రిసాలో కళాత్మకమూ అద్భుతమూ అయిన ఒక కళాసృష్టి.

జానపదం, గ్రామీణం అనడం షా రాజులు, కులీనులు వీరితో సంపర్కం ఎంత మాత్రమూ లేకుండా వారు ఎంత సేపూ దేశీయులైన, సాధారణ ఋజువర్తనులైన కల్లాకపటం ఎరుగని జానపదుల తోటే ఉంటారన్న భావనతోనే అయితే నిజంగా వారు గ్రామీణ కవియే. గొప్ప గొప్ప కవులు చిక్కులతో కూడిన, నాగరికమైన సంఘంలో మెలగుతున్న స్త్రీ పురుషుల గురించి మన ముందు ఉంచినట్లుగానే తమ అద్భుతమైన శిల్ప చాతుర్యంతో పేదవారి చరిత్రలలో మనకు ఉత్సుకతను కలిగించారు. వారిచే సృష్టింపబడిన నాయికలలో రజక వనిత ససూయి, ఎడారి వాసి మరూయి వంటివారు, కొందరున్నారు.

జానపదులు మాట్లాడే గ్రామీణ భాషలోనే సొంపైన భావ ప్రకటన చేయడంలోను విజయం సాధించిడం షా ప్రత్యేక గుణం. వెయ్యి సంవత్సరాల సింధు చరిత్రలో బహుశా ఎప్పుడూ రాజభాషగా గుర్తు పొందని ఒక భాషను మరింత కళాత్మకంగాను, పరిపూర్ణత్వంతోనూ, యథేచ్ఛమైనదిగానూ రూపొందించారు. ఆ కాలంలో ప్రచారంలో ఉన్న భాషను మాట్లాడే, వ్రాసే రాజభాషకన్న మిన్నదిగా చెయ్యడం షా సాధించిన ఘనకార్యాలలో ఎన్నదగినది. గమనించ తగ్గ మేరకు సంస్కృతము, పర్షియన్, లేక అరబిక్ మిశ్రమం అంతగా లేని నిఖార్సైన ఒక దేశీయ భాషను తీసుకొని వారు దానిని సంస్కృతీకరించ గలిగారు. అంటే దానికి మెరుగులు దిద్దగలిగారు. జానపదులు, అమాయకులైన గ్రామీణులు, జాలరులు మాట్లాడే భాషను తీసుకొని రాజసభలలోను, పండితులు ప్రయోజనకరంగా, ఆనందదాయకంగా ఉపయోగించే భాషగా తయారుచేసి వదిలారు అన్న కీర్తి ప్రపంచ సాహిత్య చరిత్రలో ఏ కొద్ది

మందికో దక్కుతుంది. వారి పద్యాలలో కొరాన్ గ్రంథంలోని కొన్ని వాక్యాలు యధాతథంగా వాడడం వలన ఆ భాషకు సహజమైన సూటిదనం, పరిపూర్ణత్వం లోపించడంగాని, ఆ భాషను కించపరచడం గాని ఎక్కడా జరుగలేదు. షా సింధీ శుద్ధమైన ప్రాకృతి, కాని, దానికి వారు పండితుల, పెద్దల అభిరుచులకు మలచి వింత వైవిధ్యాన్ని అందించారు. షా సుమారు 12,000 శబ్దాలు (కొందరు ఇరవైవేలు అంటారు) వాడారనీ, అందులో ఐదింట నాలుగు వంతులు శుద్ధమైన సింధీ శబ్దాలేననీ, అంటారు. షా అపార శబ్ద సంపదతో పర్షియన్, అరబిక్ శబ్దాలు అతితక్కువ ప్రమాణంలో చొచ్చుకున్నాయి. హెచ్చుగా నున్న సంస్కృతంతో కూడిన శబ్దాలు సింధు ప్రాంతాన వాడుకలో లేవు. కవితా ప్రతిభ మాట వదలిపెట్టి, షాతో పోల్చడానికి గాని, వారితో సరితూగడానికి గాని తగినంత శబ్ద సంపద శైలి మరే ఇతర సింధీ కవిలోను మనం చూడలేము. గత రెండు శతాబ్దాలలోను షా తరువాత సహజంగానే సింధీ భాష అనేక విధాలైన పరిణామాలకు గురి అయింది. కానీ ఆ మార్పులు అభివృద్ధికి మాత్రం ఎప్పుడూ జరుగలేదు. ఉన్నత సత్యాలను, క్లిష్టమైన వాద ప్రతివాదాలు, గ్రామీణ ప్రాంతాలలో సామాన్య జీవనం గడిపే పాటక జనవర్ణన, అక్కడి ప్రజలు, వారి వృత్తులు వీటిని గురించి సింధీ భాషలో వ్రాయాలనుకున్న వారందరూ శబ్దాల కోసంఇప్పటికీ షా రిసాలో గ్రంథాన్నే ప్రక్కన ఉంచుకుంటారు. షా మార్గం అవలంబించకపోతే, వారు సాధారణంగా నైపుణ్యరహితంగా, అస్పష్టంగానే మిగిలిపోతారు. కొన్ని ప్రాచీన పదాలు, ఇప్పుడు వాడుకలో లేని మరికొన్ని శబ్దాలు మినహాయిస్తే, షా సింధీ భాష పండిత పామరులందరూ ఇప్పటికీ వాడేది సింధీ భాషయే.

# 8

# బ్రిటిష్ శకానికి పూర్వమున్న ఇతర కవులు

మొఘలుల పతనానికి, బ్రిటిషువారి ఆక్రమణకు మధ్య ఒకటిన్నర శతాబ్దాల కాలం సింధు సమాజంలోని ఉన్నత వంశస్థులలో సాహిత్య సంచలనం ముమ్మరంగా ఉండేది. ఆధ్యాత్మిక భావనల ప్రభావ కారణంగా ఉత్పన్నమైన యీ సాహిత్యం అధిక శాతం ప్రయోజనాత్మకంగా లేదు.

పూజకు స్నానాదికాలు ఎప్పుడు, ఎలాగ చెయ్యాలి వంటి చికాకు పుట్టించే నిష్ప్రయోజనమైన సమస్యలను వివరించడానికి అంతులేని వాదనలతో గడిపేవారు. ప్రవక్తను స్తుతిస్తూ ఒకరితో ఒకరు పోటీపడి ఎవరు మరొక పద్యం ఎక్కువ వ్రాశారా అని చూస్తూ ఉండేవారు. మక్కా మదీనాలకు యాత్రకు పోవాలి అని నిరంతరం కోరుకుంటూ ఉండేవారు. ఐహిక విషయాలపై శ్రద్ధ చూపిస్తూ వ్రాసినవారిలో చాలమంది అల్పుల గురించి, పూర్తిగా విస్మరించిన వ్యక్తుల గురించి, పొగడుతూ పర్షియన్ భాషా గ్రంథాలు చాలా వ్రాశారు. తియ్యని షిరాజ్ భాషతో దీనిని పోల్చి బర్బర్, సింధీయులు మాట్లాడే, వ్రాసే పర్షియన్‌ను ఎగతాళి పట్టించాడు. సింధీయులు పర్షియన్ భాషలో వ్రాసిన గ్రంథాలు, సాధారణ వ్యక్తులను స్తుతిస్తూ వ్రాసిన వ్రాతలు నమ్మదగినవిగాను పట్టించుకోదగినవి గాను లేవు. పర్షియన్ భాషలో వారు వ్రాసిన పద్య వాఙ్మయం అనాలోచితంగాను యాంత్రికంగాను ఉన్నదని భావించవచ్చు.

అయినప్పటికీ, షాని గురించి చెబుతూన్న సందర్భంగానే మరి ఇద్దరు సింధీ కవులు సచల్, సమీలను గురించి చెప్పక తప్పదు. వీరు ముగ్గురూ కలసి సాటిలేని కవిత్రయంగా నిలిచి ఉంటారు. మరికొద్ది మంది ఇతర కవులు అంత ప్రసిద్ధికెక్కినవారు కాకపోయినా, యీ కవిత్రయంతో పాటు ప్రత్యేకంగా ఒక అధ్యాయంవారి గురించీ వ్రాయదగిన వారే. వారందరు కలిసి సాధించినవి, వైవిధ్యంతో కూడినవి చాల విషయాలున్నాయి. వారందరు 'వాయ్' అనే రూపాన్ని ప్రచారం లోనికి తెచ్చారు. అదో ముఖ్యమైన విషయం .... షా యీ 'వాయ్' ను తమ బెయిత్‌హారంలో ప్రతి సుర్‌లోను, ప్రతి అధ్యాయంలోను ఒక పతకంగా వాడారు. ఇదే సింధీయుల జాతీయ గేయ సరళిగా, కఫీ అన్న కొత్త పేరుతో ఆనందపారవశ్యంలో వేసిన కేక హృదయాన్ని కదిలిస్తూన్న విరహవేదనను వ్యక్తం చేసే గేయ రీతి వాయ్. సింధీ పద్య రీతులలో చాలా ప్రచారంలో నున్నదీ, ఇప్పటికీ నిలచి వున్నదీ, భావ ప్రకటనకు అనువైనదీ, మనసు కరిగించేదీ యీ కఫీ పద్య రీతి.

ఈ ఇతర కవులు సింధీ పద్య వాఙ్మయంలో "మ" వర్గానికి చెందిన నాలుపద్య రీతులను ప్రచారంలోకి తెచ్చారు. అవి మదాహ్ (స్తుతి) మౌలద్ (ప్రవక్త స్తుతి), మర్సియా (గొప్ప వ్యక్తి మరణించినప్పుడు వారిపై వ్రాసిన చరమ గీతం), మస్నవి (గొలుసు కథనం). అంతకు మున్నెన్నడూ యీ నాల్గు "మ" ల వంటి కవితా రీతులు సింధీ పద్య వాఙ్మయంలో పొడచూడలేదు.

1718–1843 మధ్యకాలంలో సింధీ పద్య వాఙ్మయంలో గుర్తించ దగిన మూడవ అంశం, సింధీ వేదాంత సాహిత్యానికి సింధీ వాఙ్మయంలో కల్పించిన స్థానం. వేదాంత భాషను సింధీయుల భాషలోనికి అనువదించిన ఘనత విపుణుడైన సమీకు దక్కుతుంది. కాని తమ సోదర భారతీయుల ఆలోచన, అభిప్రాయమూ భావ ప్రకటనలకు దగ్గరగా తీసుకు వెళ్లినవారిలో రోహల్, దల్పత్ వంటి కవులు చాలామంది ఉన్నారు.

ఈ యుగంలోనే అరబిక్ పర్షియన్ ఛందస్సులననుసరించి వ్రాసిన సింధీ పద్య, వచన వాఙ్మయం కూడా ప్రారంభం కావడం గమనించవచ్చు.

అయితే ఇతర సింధీ కవులు తమ రచనా వ్యాసంగంలో అంత ఉత్సాహం కనబరచినట్లు గోచరించదు. తమ సాటికవులు పర్షియన్ భాషలో ప్రవీణులై ఉండగా తాము ఒక అయోగ్యమైన భాషా సాధనాన్ని పట్టుకొని ప్రాకులాడుతున్నట్లు భావించారు. అందుకే ఆ యుగంలో విజయోత్సాహంతో పరవశమొందిన ఒక్క సింధీ కవి కూడా కనబడలేదు. ప్రతిభావంతులైన కవులు సాచల్, సామీనులు తప్ప తక్కినవారందరూ నిండు హృదయంతో వ్రాయలేకపోయారు.

పద్దెనిమిదవ శతాబ్దమూ, పందొమ్మిదవ శతాబ్దం తొలి అర్ధభాగమూ, షా, సచల్, సామీల ప్రాభవం వల్ల - సింధీ వాఙ్మయంలో స్వర్ణయుగంగా ఎంచవచ్చు. వారు యీనాటికీ సాటిలేని వారుగానే పరిగణింప బడు తున్నారు. వారికి పోటీగా ఎవ్వరూ నిలబడలేనంత ఖ్యాతి నార్జించారు. కల్హోరాల, తల్పూరుల పరిపాలనా కాలంలో ఆటవికులూ, సంస్కార విహీనులూ రాజ్యాధిపతులుగా ఉన్నారనీ ఆ భూస్వామ్య ప్రభువుల ఐహిక ఆధ్యాత్మిక భావాల ప్రభావం ప్రజలపై గాఢంగా పడి ఉన్నదనీ గుర్తు తెచ్చుకుంటే, ఆ అంధకారయుగంలో షికల్ గాహ్‌లు, సమాధులతో నిండిన సింధులో, అంత మధురమైన చల్లని సంగీతాన్ని వెదజల్లే గాయకులను సృష్టించ గలిగింది అన్న ఆశ్చర్యాన్ని ఇనుమడింప చేస్తుంది. సచల్, సమీలకు ప్రత్యేకించిన ఒక అధ్యాయం కేటాయించవలసిందే. అందుకు వారు తగినవారే గాని, ఇతర కవులందరిని కలిపి యీ అధ్యాయంలో పేర్కొనడమైనది. మహమ్మద్ సిద్దిక్ మెమొన్ పర్షియన్ ఛందస్సులను సింధీ పద్యాలలో వినియోగించిన ప్రథమ సింధీ కవిగా వర్ణించిన ముఖ్‌దుమ్ అబ్దుల్ రవూఫ్ భట్టి 1752 లో మరణించారు. షా కూడా అదే సంవత్సరంలో మరణించారు. కాని వారు షా కంటె వయసులో కొంచెం పెద్దవారు. వారి మౌలద్‌లకు అంటే ప్రవక్త స్తుతులకు వారు

ప్రసిద్ధికెక్కారు. ప్రవక్త పవిత్ర సమాధి ఉన్న స్థలం మదీనాలో మరణించడం ద్వారా వారు బాలా అదృష్టవంతులు. వారి మౌలద్‌లను పాడుటకు రెండు బృందాలు కావాలి, ఒక్కొక్కరు ఒక్కొక్క చరణాన్ని పాడవలసి ఉంటుంది. సాదీ రచించిన కరీమాను మూల పర్షియన్ ఛందోరీతిలోనే సింధీలోనికి అనువదించినది కూడా వీరేనని అంటారు. అదేగనుక నిజమైతే పర్షియన్ పద్ధతిలో సింధీ పద్యాలను వ్రాసే రీతి ప్రవేశపెట్టిన వారు అఖండ్‌గుల్‌మహమ్మద్‌కారనీ, వీరికే ఆ ఘనత దక్కుతుందనీ చెప్పక తప్పదు. వారి సోదరులు, వారి కంటే వయసులో ఎనిమిది సంవత్సరాలు చిన్నవారు అయిన మఖ్‌దుమ్ మహమ్మద్ ఇబ్రహిం భట్టి సదాచార ముస్లిములకు మతపరమైన బోధలు చేయడానికి గాను దోహా సరళి పద్యాలను వ్రాశారు. ఈ ఇరువురు సోదరుల రచనలలో సూఫీ తత్వం లేదనే చెప్పాలి.

కల్హోరాల కాలంలో ఉండిన మరికొందరు సాధారణులైన వివిధ కవులు వారి పేర్లు : పర్షియన్ నుండి సింధీ భాషలో ప్రవక్త కథలను సైరే చేస్తాన్ (వనములో ప్రయాణం) అన్న పేరుతో 1763 లో అనువదించిన మౌల్వీ మహమ్మద్ హుస్సేన్ పిన్న వయస్కులు, తమ తల్లిదండ్రులతో మెలగవలసిన విధానాలను బోధించిన మఖ్‌దుమ్ బయా ఉద్దీన్ (మరణం 1759) 'షుత్‌లబ్ మోమ్‌నిన్', 1763 లో రచించిన కవి మఖ్‌దుమ్ అబ్దుల్ ఖాలిక్, 1747లో రచించిన ముల్కి సింధీ గ్రంథ కర్త మఖ్‌దుమ్ మహమ్మద్ షరీప్ రాంపురి, పగారో పీర్ల పూర్వీకుడు, ప్రేమ కవిత్వంలో పద్యాలు వ్రాసిన పీర్ మహమ్మద్ బాకా (మరణం 1784) సాచల్‌కు తాత అవడంచేత మాత్రమే పేరొందిన సాహప్ దినో పకీర్ (1687-1785).

మఖ్‌దుమ్ మహమ్మద్ హాషింథాట్వీ (జననం 1693) వారి విస్తృత పాండిత్యంచేత తక్కిన ఇతర కవులందరిలో ఎన్నికగన్న వారు. కాజీకజాన్ వలెనే ఠరుకూడ తట్టలో ప్రధాన న్యాయమూర్తులుగా నియుక్తులయ్యారు. వారు మూడు భాషలలో ఎక్కువగా వ్రాసిన కవి. పర్షియన్, అరబిక్, సింధీ భాషలలో వారు దిట్ట సింధీ భాషలో వ్రాసిన కొన్ని వారి పద్యాలు అంత్యప్రాసలు ఉండి, ఉండక యాంత్రికంగా కూర్చినవి, యీ కాలంలో చదువదగినవి ఎంత మాత్రమూ కాదు. వేదాంత బోధనాలయాలలో ఇప్పటికీ వారి రచనల్ను బోధిస్తూంటారని లత్ ఫుల్లా బాద్వీ చెపుతూనే, డా॥ గురు బక్సాని వీరిని ఎక్కువగా భావించారనీ ఒప్పు కున్నారు.

కల్హోరాల కాలంలో ఒక కాంతివంతమైన వ్యక్తి మఖ్దుం అబ్దుల్ రహీం గ్రిహోరీ. (జననం 1739) వారు థార్ పర్కాలోని గ్రిహోరీ గ్రామంలో జన్మించడంచేత వారిని గ్రిహోరీ అని పిలుస్తారు. లార్వారీ గురువుల రచనల నుండి (లార్వారీ గురువు అయిన మహమ్మద్ జమాన్ ప్రఖ్యాతి వహించిన శిష్యులు వీరు) గ్రిహోరీ రచలను వేరుగా గుర్తించుట కష్టం. వారి మరణం విచిత్ర పరిస్థితులలో సంభవించింది. విగ్రహ ప్రతిష్ఠ కావింపబడిన ఒక దేవాలయంపై మతోన్మాదంతో జరిగిన దాడికి వారు నాయకత్వం వహించి అందులో మరణించారు. వారు ఆ విగ్రహాన్ని విరిచారు, ప్రాణాలు కోల్పోయారు. వారి నలుబదవయేట సంభవించిన యీ దుర్ఘటన గురించి అనేకమంది ముస్లిం రచయితలు వ్రాశారు. కాని కల్హోరాల మతోన్మాద పరిపాలనకూ, ఆటవిక జీవనరీతికీ వీటిని ఒక మచ్చుతునకగా మాత్రమే దీనిని గ్రహించవచ్చు. ఇటీవల మహమ్మద్ జమాన్ అబ్యాత్ సింధి లేక సింధీ బెయత్‌లు పరిష్కరించబడ్డాయి. అవి మత బోధక పద్యాలుగా అద్భుతంగా లేవు అనడం వ్యర్థం. అయినా వాటిలో కవితావేశం ఎక్కడా కనబడదు. ఆ రోజులలో తరచు కనబడే సూఫీ సిద్ధాంతాల కృతక అనుకరణలు మాత్రం కనబడుతాయి; దీనినే షా సంపూర్ణంగా తీర్చిదిద్దారు. అందుకే కొన్ని బెయత్‌లు వారి పద్యాలతో కలగలుపు అయ్యాయి. వీరి రచనలన్నీ ఇంచుమించు వేదాంత పరమైనవే.

గ్రిహోరీ జన్మించిన మరుసటి సంవత్సరం 1740 లో జన్మించిన సయ్యద్ సాబిత్ అలీషాకు మర్సియాలు, అంటే చనిపోయిన గొప్పవారి పై శోక గీతాలు, మొట్టమొదటిసారిగా వ్రాసిన ఘనత దక్కుతుంది. వారు ముల్తాన్‌కు చెందిన వారే అయినా సెహ్వాన్‌కు వచ్చి అక్కడ స్థిరపడిపోయారట. లాల్ షహ్‌బాద్‌కు చెందిన సెహ్వాన్ గురించి వారు అనురాగ పూరితమైన ఉదాహరణలను తమ పద్యాలలో చెప్పారు. వారు మొదట్లో పెద్ద పెద్ద వారిని స్తుతిస్తూ కసీదాలు శోకగీతాలే వ్రాస్తూ, అటు తరువాత గొప్పవారి మరణానంతరం వారిని స్మరిస్తూ శోకగీతాలు, మర్సియాలు వ్రాయడం మొదలుపెట్టారనీ అంటారు. వారి మొట్ట మొదటి మర్సియా ప్రవక్త. వారి కుటుంబ సభ్యులపైన వ్రాశారు. వారి ప్రభుభక్తి పరాయణత్వం అంత విశ్వాసపాత్రమైనది కాదు. కల్హోరాలను ఓడించి తల్పూర్‌లు రాజ్యం చేపట్టగానే, తల్పూరుల ఘన విజయాన్ని కొనియాడుతూ ఫతేనామా, జఫర్ నామాలు వ్రాయడం మొదలుపెట్టి తన పూర్వపోషకులను పూర్తిగా విస్మరించారు. వారు 1810 లో

మరణించారు. నిందాస్తుతులు కూడా వీరు వ్రాయగలరు. వారి మర్సియాలు పర్షియన్ పద్ధతులననుకరించి ఉంటాయి. చాలావరకు యీ మర్సియాలు కర్బలా విషాద ఉదంతం పైనే ఉంటాయి. మీర్జా కాలిక్ బేగ్ వీటన్నిటినీ నాలుగు సంపుటాలుగా తీసుకువచ్చారు.

కల్హోరాల కాలంలోనే మరొక 'ప్రధమ' స్థానం కల్హోరాల పరిపాలనలో ఆఖరి పాలకుడు సర్‌ఫరాజ్‌ఖాన్ కల్హోరాకు చెందుతుంది. వారు 1772 లో సింహాసనం అధిష్ఠించారు. మూడు సంవత్సరాల తరువాత పదచ్యుతులై మరణించారు. పర్షియన్ ఛందోరీతులను సింధీ సాహిత్యంలో ప్రవేశపెట్టిన ఘనత వీరిదికాకపోయినా (ఆ ఘనత పొందినవారు మఖ్‌దుం అబ్దుల్ రవూఫ్‌భట్టీ) మొట్టమొదటి మదాహ్ (స్తుతి) సింధీభాషలో వ్రాసిన ఘనత వీరిదే. దాని మధురమైన శైలి రచనను చాలా ప్రచారంలోకి తెచ్చింది. వారు చెరసాలలో మరణాన్ని ఎదురుచూస్తూ వ్రాశారని చెబుతూన్న వారి మదాహ్ ప్రవక్తను స్తుతిస్తూ వ్రాసినది, సులభమైన అంత్య ప్రాసలతో కూడినది. వీటిని స్త్రీ పురుషులందరూ ఉల్లాసంగా పాడుతూ ఉంటారు. బ్రిటిష్ చెరసాలలో మరణానికై వేచి వున్న హిందువు సర్‌ఫరాజ్ మదాహ్ పద్ధతిలో గురునానక్‌ను స్తుతిస్తూ వ్రాశారట. కాని మూలంతో పోలిస్తే అది ఛందో రహిత పద్య రచనగా ఉంది. సర్‌ఫరాజ్ మదాహ్‌కు సింధీభాషలో చాలామంది వ్రాసిన అనుకరణలు వెలువడ్డాయి. కాని, వారి రచనకు వచ్చినంతగా ప్రచారం మరి యే ఇతర రచనకూ రాలేదు.

కంద్రీజాతి కవులు, ధర్మనిష్ఠాపరులకు పూర్వీకులైన రోహల్ కల్హోరా కాలంలోని కవులలో ఒక వింతయైన ప్రతిభకు పేరు పొందారు. వారు ఛాందసులైన మత సంబంధమైన, తత్వ విచార సంబంధమైన, ముస్లిం కవులకు, ఆ కాలంలోని భారతీయ హిందీ కవులకు వారధిగా పేరు పొందారు. వారు మొదట ప్రభుత్వంలో ఉద్యోగిగా ఉండేవారు. కాని సూఫీజ్ఞాని, సుప్రసిద్ధులై వీరమరణం పొందిన షేక్‌వాసి షా ఇనాయత్ ఆశీర్వచనం ద్వారా వారు ప్రాపంచిక విషయాలను త్యజించి సూఫీ సిద్ధాంతాలలో అత్యున్నత శిఖరాలందుకున్నారు. వారి గురువు ఆదేశాను సారం ఖిర్‌పుర్ సంస్థానంలోని కంద్రికి (అచట కండస్ అను ముండ్ల చెట్లుండడంచేత ఆ ప్రదేశానికి కంద్రి అన్న పేరు వచ్చింది) పోవలసి వచ్చింది. అచట వారికి మంచి ఆశ్రమం లభించగా వారచటనే స్థిరపడి పోయారు. వారికి అక్కడే గొప్ప పేరు ప్రతిష్ఠలు లభించాయి. ఖైర్‌పుర్‌కు చెందిన తల్ పుర్‌మిర్ వారిని అంటిపెట్టుకున్న వారిలో ఒకరు.

"మేము పరమాత్మను (కల్తార్) కంద్రీలో చూచితిమి" అన్న పద్యం సింధీయులకు సుపరిచితమైనది.

రోహల్ సింధీ భాషలోనే కాక సిక్రీలోనూ ప్రాంతీయ భాషయైన హిందీలో కూడా పద్యాలను రచించారు. ఈ మూడు భాషలలోనూ వారి సందేశం ఒక్కటే: అహంకారాన్ని విడిచిపెట్టు, ఇతరులను ద్వేషింపకు, పవిత్రాత్ములైన వారి సాంగత్యాన్నే కోరుకో, ప్రేమ తత్త్వాన్నే అనుసరించు. షా, సామీ, సాచల్‌ల సుప్రసిద్ధ రచనలు పొందిన ఖ్యాతిని వీరి బెయత్‌లలో ఒకటి పొందింది. విశ్వవ్యాప్తమైన ఓర్పును గురించి గానం చేస్తుందది. 'కుఫ్ర్ (భిన్న మతావలంబన)లోను, ఇస్లాంలో కూడా, వారు తప్పుమార్గమునందే పోతున్నారు. వీరు హిందువులు, వారు ముసల్మానులు, ఆ మధ్యనున్నది ఒకరిపైనొకరికున్న ద్వేషం. నిత్యాంధకారంలో నడచే అంధులు సత్యాన్ని పొడగనలేరు. ఓ రోహల్! పరివేష్టితమైయున్న ప్రేమైకమూర్తి మార్గము చేరినంతనే, ఆ పరమాత్మ సర్వ వ్యాప్తియనీ, అతనిలో క్లిష్టతగాని, మార్పుగాని లేదనీ గుర్తింపబడుతుంది. పరమాత్మ ఇంటనే నిదురించు ఆమె అతని చెంతనుండక వేరొక చోటకు ఏల మరలుతుంది? వారిదే మరొక బెయత్ బహుళ ప్రచారం పొందింది: అన్ని వస్త్రములు విడచి దిగంబరులై నడచువారికి లజ్జ, విచారము ఎందుకు? ఈ సాములకు గంగతో గాని గిర్నార్‌తో గాని యేమి పని? వాయించుటకు పిల్లన గ్రోవి అవసరం లేదు, స్వరమండలమునకు తంత్రులక్కరలేదు. ఓ రోహల్! ఈ రాహుటీలు (త్యాగులు) వారిని మైమరపింప జేయు ఆ స్వప్న దర్శనమున పరవశులై ఉన్నారు.

తాల్పురుల అరవై ఏండ్ల పరిపాలనా కాలంలో (1783-1843) ప్రవక్తను స్తుతిస్తూ వ్రాసిన పద్యాల సంఖ్య త్వరితగతిని పెరుగుతూ వచ్చింది. పీర్‌హసముద్దీన్‌రషిది బహుళ ప్రచారంలోనున్న రెండు పద్యాలను గురించి వ్రాశారు. 'అఘాస్‌నాయా సయెదా' (ఓ సయ్యద్, కాపాడుము) జుమన్ చరన్ వ్రాసిన యాపీర్‌పిరాన్‌బాద్‌షా (ఓ ప్రభువులకు ప్రభువా! మహాప్రభో!) వారు పద్యశైలిలో మన్నవీలు అంటే సంబంధిత వ్యాఖ్యల ప్రాముఖ్యతను గురించి నొక్కి చెప్పారు. ఇదివరకటి సింధీ పద్య కావ్యాలలో కథన వ్యాఖ్యలు వేరు వేరుగా ముక్కలు ముక్కలుగా ఉండేవి. వీటికి చక్కని ఉదాహరణలు హఫీజ్ వ్రాసిన ముమల్ రానో, హాజీ అబుల్లా వ్రాసిన లైలా మజ్నూన్ (1792). అఖుండ్ అజీజ్ రచనలలో సింధీ వచన ప్రారంభం కూడా కనబడుతుంది (మరణం 1834). ఈ అరు శతాబ్దాలలోను పర్షియన్ ఛందస్సుల ప్రాభవం బాగా ముందుకు సాగింది. షా

రూపొందించిన నూతన వాయ్‌గేయ రూపం, ప్రచారంలో కఫీగా సింధీ ఇతర కవుల రచనలలో మరింత ప్రావీణ్యతను సంతరించుకోక పోయినా, బహుళ వ్యాప్తిని పొందింది. అయితే, గేయ రచనా శైలిలో సాచల్ వ్రాసిన కఫీలకు సాటి సింధీ సాహిత్యంలో మరొకటి లేదు.

ప్రథమ శ్రేణి కవులు సచల్, సామి రచనలను విడిచిపెడితే, తల్పూరుల ఆరు దశాబ్దాల పాలనాకాలంలో ఎన్నదగిన కవి 'హమల్ లఘ్రి'. (1815 - 1879). కొందరు విమర్శకులు షా తరువాత అంతటి విఖ్యాతి నొందిన కవి సింధీ సాహిత్యంలో వారే అంటారు. వారు సింధీ ప్రాంతీయ భాష అయినసిరెయికలోను, సింధీ భాషలోను కూడా వ్రాశారు. వారి హీర్ రాంఝా ప్రేమగాథ బహవల్‌పుర్ సంస్థానంలోను, ఉత్తర సింధులోను బహుళ ప్రచారాన్ని పొందింది. దాని కథనమంతా ఎక్కువ భాగం హీర్‌కి ఆమె తల్లికి మధ్య జరిగిన సంభాషణా రూపంలో సాగుతుంది. వారి పద్య శైలి అద్భుతం. ముఖ్యంగా మానవుని ఉనికి అనిశ్చితమైనదని వర్ణించేటప్పుడు 'ఏరీ ఆ రాజులు అలెగ్జాండర్, డారియస్, ఆ చక్రవర్తులేరీ ? వారి వంది మాగధులు వారి స్తోత్ర పాఠములేవి ? తూర్యారావములు, విజయ దుందుభు లేవి ? అన్నియు గతించినవి. ఏదియును మిగులలేదు. రాణులుండు రంగ మహలులు, లేవు. ఇక నీవంతు, విషయమును గ్రహించి ధర్మకార్యము లాచరించుట' సనూయి, మరూయిల కథల్లోని సంభాషణలు ఉపయోగించి ఒక నూతనమైన కరుణ రసాన్ని ప్రవేశపెట్టారు. ప్రముఖమైన వారి పద్యా లలో చుట్టూ ఉన్న వంచన, వంచకులు వీరి గురించి ఎంచి చెప్పిన పద్యం. 'వంకరలు తిరిగి యున్నవి ప్రియుని కేశములు, వంకరగానున్నవి కనుబొమలు, వారు విను మాటలు వక్రము, వక్రమైనది వారి నడక వేగము. ఈ నాలుగు వక్రములు ఎచట కలిసి ఉండునో, అట్టిచోట జరుగు సంఘట నలు కూడా తిన్ననైనవి గావు. వారి మిత్రుని, అపరిచితుని వక్రప్రవర్తనకు వారు చింతించిరి ; వారి కనుల ముందు సాగినది వక్రము, బజారునందు జరుగునది కూడ వక్రమే ! రౌతు వక్రము, నాయకుడు కూడ సరళతకు దూరముగనే ఉన్నాడు. ఆ కట్టిన తలపాగయే వంకర, ఆ పట్టా కత్తియు వంకర. చిన్న ఉద్యోగులు తమ నడవడికలో వక్రము, అదియేవిధముగ ప్రభుత్వమున్నది. ఈ తల్లక్రిందుల పరిస్థితుల మధ్య యీ నిస్సహాయుడు హమల్ ఏమి చేయ గలడు ? అతడు చేయగలిగిన దంతయు అతనిని అతని మాటలను సత్య మార్గమున తిన్నగనుంచి సత్య మార్గమున సంచ రించుట.'

వర్షముపై హామర్ వ్రాసిన పద్యాలు షా ఖ్యాతి నొందిన సుర్ సారంగ్‌ను గుర్తు చేస్తాయి. సింధీ కవులలో ఒకడైనా ఇంతటి ఘనత వహించడం చాలా శ్లాఘనీయం.

సయ్యద్ ఖైర్‌షా, వారి సమకాలీనులు సయ్యద్ సబిత్ అలీ షాకు మధ్య గలవైరం ద్వారా, హాస్యం కాకపోయినా, హాస్య పోకడలు పొడ చూపిన టోపి, తలపాగల మధ్య జరిగిన దెబ్బలాటను వర్ణిస్తూ వారు ముచ్చటగా వ్రాసిన రచనల ద్వారా గుర్తుంచుకుంటారు.

పీర్ అలీగోహర్ షా వ్రాసిన చాలా కాపీలు ఆకర్షణీయంగా ఉంటాయి గాని మధ్య మధ్య పవిత్ర గ్రంథం నుంచీ, నోవా, ఇతర వ్యక్తులను గురించీ, ప్రస్తావించడం వలన దెబ్బ తిన్నాయి.

ఫతే ఫకీర్ కఫీలు వ్రాసిన మరి యొక కవి. వీనిలో వారు పున్ హూన్‌ను వెదకుచు పోయినా ససూయీ తానేనని ఊహించుకొని వ్రాశారు.

సాదీ పర్షియన్‌లో వ్రాసిన నీతి బోధకమైన కరీమాను తమ చక్కని సింధీ అనువాదం ద్వారా పేరొందారు అరిఫ్.

ఫకీర్ మహమ్మద్ సిదికి లేక సాదిక్ షా పద్ధతిననుసరించి వ్రాశారు కొన్ని బెయిత్‌లలో షా గొప్ప శిల్పచాతుర్యాన్ని అందుకోగలిగారు వారు గాని మనసుపై వారి సుర్‌ల సంపూర్ణ ప్రభావం వారు గొప్ప కళాకారునిగా గాక శిల్పిగా మాత్రమే నిలచి ఉంటుంది.

బ్రిటిష్ వారు సింధును జయించడానికి సుమారు రెండేండ్లకు పూర్వం అనగా 1841లో దల్పత్ రాం సూఫీ మరణించారు. వారు హైదరాబాద్‌కు చెందిన ప్రఖ్యాతజ్ఞాని అసర్‌దాస్ శిష్యులు. సూఫీతత్వ వేదాంతాన్ని ప్రచారం చేయడానికి వారు అనేకమంది శిష్యులను విడిచి వెళ్లారు. వారు తమ ధర్మకార్యాలకు ప్రసిద్ధి కెక్కారు. వారు సర్వసంగ పరిత్యాగులు. ఒక్కొక్కప్పుడు వారి సమకాలికులైన సామీతో వారిని పోల్చడం కద్దు. అయినా రసజ్ఞులైన సాహిత్య ప్రియులు వీరిద్దరికీ మధ్యనున్న అంతరాన్ని గ్రహించగలరు. ససూయి, కలాల్ (మద్యవిక్రేత), వసంతము, వర్ష ఋతువు, కఫీలు, రూమీ నుండి కథలు యీ విధంగా దల్పత్ వ్రాసిన పద్యాలు ఒక కలగాపులగంగా ఉంటాయి. సామీలో ఉన్న స్పష్టత ప్రశాంతత, సంయోజనమూ వీటిలో లోపించింది. వారి నీతి కథలలో అంధులు ఏనుగును చూడబోవుట వంటివి చాలా అర్థవంతమైనవి. వారిసువి ఖ్యాతమైన బెయత్‌లలో రావి చెట్టులో ఒక దేవుడు, తుమ్మచెట్టునందొక

దేవుడు ఉన్నాడా ? నీవు అంటావు కాబాలో నివసిస్తాడు దేవుడు అని, ఆ మూర్తి మందిరాన్ని ఆతడు బ్రోడుగా చేసి వదలుతాడా! ఓ దల్పత్! మనచుట్టూ ఉన్నయీ ప్రజలలో యీ విభేదాలు ఎప్పుడు మొలకెత్తాయి ?' అంత ప్రచారంలోలేని మరొక బెయిత్‌లో వారు ఇదే విషయాన్ని మళ్లీ చెబుతారు. టర్కులకు, బనియా (హిందువులకి)లకు మధ్య యీ చీలిక రావడానికి కారణమేది ? "భగవంతుడు రావిచెట్టు నందే ఉండినచో తుమ్మచెట్టు నందెవ్వరు నిలచియుందురు ? ఆతని ఉనికి జాడలు ప్రతికొమ్మ, ప్రతిఆకు నందున కన్పట్టుచున్నవి. అంధులు, బధిరులు నేలపాటు తెలిసికొనజాలరు. మార్గమున నడచుచు ఎల్లెడల మిత్రుని గురుతులనే కనుగొను ఆ వ్యక్తి అపురూపం" అంటారు దల్పత్.

ప్రొఫెసర్ ఎం. జె. ఠాగూర్, గిడుమల్ హర్జానీ ఈ ఇద్దరు పరిశోధకులు దల్పత్ రచనలకు సంపాదకత్వం వహించారు కాని ఉత్తమాభిరుచులున్న వారికి ఇవి రెండూ సంతృప్తికరంగా లేవు.

కంద్రి కవులు : కంద్రివాసి రోహల్ సుప్రసిద్ధ కవి. వీరు కనీసం నలుగురు ఉత్తమ కవులను తమ వారికి వదలి వెళ్లారు. వారిలో ఒకరు మురాద్ ఫకీర్ వారి శిష్యులు, మిగతా ముగ్గురూ వారి కుమారులే. వారు షాహు ఫకీర్, 'ఘులాంఅలిఫకీర్' దర్యాఖాన్‌లు. వీరిలో ప్రథములు మురాద్ ఫకీర్ చివరి వారు ఆయన నాల్గవ కుమారులు ఆయన దర్యాఖాన్, ప్రత్యేకంగా పేర్కొనదగినవారు.

మురాద్ ఫకీర్ రోహల్‌ను దీక్షగా అనుసరించిన శిష్యుడు. వారి భార్య సోదరుడు. మానవుడు ఎవరితోనైనా పోరాడవలెనంటే అది ఆతనిలోనే వున్న కోరిక అనే వంచకుడితో పోరాడాలి అన్న పాఠం గురువు దగ్గర నుంచి నేర్చుకున్నారు. ప్రచారంలో ఉన్న సుహ్ని, ససూయి, మరూయి, లైలా మొదలైన కథలను తమ ఆధ్యాత్మిక సందేశాలను అందించడానికి కావలసిన విధంగా మలచుకున్నారు. రోహల్‌తో సరిసమానంగా మతపరిమైన విశాల దృక్పదాన్ని చూపించారు. "మానవుని అంతరంగంలో అన్ని పవిత్ర స్థలాలు - గంగానది, ద్వారాకా, కాశీ వంటివి ఉండగా మరి ఆతడు తూర్పు, పడమరవైపు పయనించ, తొందరపడుట ఎందుకు ? మానవుడు తన మనసును స్వాధీన పరచుకొన్నచో అన్ని తీర్థ యాత్రలను, కష్టపడి పోకుండగ ఇచటనే చేసుకొనవచ్చును."

షాహు ఫకీర్, వారి సోదరులు ఘులాం అలీ ఫకీర్‌లుకూడా చక్కని గీతాలను, కఫీలను రచించారు. దర్యాఖాన్ విస్తృతమైన విశ్శృంఖలత్వంలోను,

సాంకేతిక నైపుణ్యంలోను వీరందరిని అధిగమించిన కవి. వారి సింధీ కవితలు హిందీ కవితా సుగంధ పరిమళాలతో గుబాళిస్తూ ఉంటాయి. ఇస్లాం పవిత్ర గ్రంథంలోని ఉదాహరణలూ ఉంటాయి. పొరపాటుగా ఒక హిందువు అజాగ్రత్తగా వారి మతాన్ని గురించిగాని, ప్రవక్తను గురించిగాని, ఉచ్చరిస్తే, ముస్లిములు వారికి సున్నతి చేసి బలవంతంగా మహమ్మదీయులుగా మార్చేసే రోజులవి. ఆరోజులలో కూడా వారి తండ్రి అడుగుజాడలలో నడుస్తూ, ముస్లింలకు, హిందువులకు వారధిగా నిలిచారు. మీరాబాయ్ వంటి భక్తురాలిలాగా వారు హిందీలో కృష్ణుని గురించి వ్రాశారు. వారి కఫీలను సులభంగా పాడుకొనవచ్చు. హిందూ పాఠకులు ప్రేమపూర్వకంగా వెదకి వెదకి వెలికితీస్తున్న అతికొద్దిమంది ఇతర ముస్లిం కవులలో వీరొకరు.

# 9

# సచల్ : విప్లవ కవి

సర్‌మస్త్ (మత్తెక్కిన) అనబడే సచల్‌ను తమ ఆధ్యాత్మిక వారసుడని అతడు బాలుడుగా వున్నప్పుడే షా ప్రకటించారు. షా 1752 లో మరణించారు. అప్పటికి సచల్‌కు పదమూడేండ్ల వయసు. కాని ఇదివరకు చెప్పినట్లు షా సచల్ ఐదేండ్లవాడుగా వున్నప్పుడే కలుసుకొని, తాము తలపెట్టిన మహత్కార్యాలన్నీ సచల్ పూర్తిచేస్తారని నిశ్చయంగా చెప్పారు. 'నేను మరిగించుటకు ఆయత్తపరచిన కాగుపై మూత తీయుటకు ఇదిగో యీతడున్నాడు.' సచల్ షాకు యోగ్యుడైన వారసుడే.

షా వ్యాఖ్యానాల ద్వారా, మృదువైన సూచనల ద్వారా, గేయ రూపంలో చెప్పడానికి ప్రారంభించింది సచల్ కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్పి పూర్తిచేశారు. వారు సాటిలేని గేయకవి. ఆంగ్ల సాహిత్యంలో షెల్లీ, పర్షియన్ సాహిత్యంలో హాఫిజ్‌వలె వీరు విప్లవ రచయిత. విమర్శకులు వారిని తగిన రీతినే దరాజ్‌లోని హాఫిజ్ అంటారు. ఉత్తర సింధులో ఖైర్‌పూర్ సంస్థానంలో రానీపూర్, గంబట్‌లకు మధ్యనున్న దరాజ్‌లోవారు నివసించేవారు. ఆంగ్ల సాహిత్యంలో షెల్లీ పద్యాలు సాటిలేనివైతే, హాఫీజ్ ఘజలులు పర్షియన్ భాషలో అంతే గొప్పవి. సింధీ భాషలో అత్యున్నత స్థానాన్ని ఆక్రమించుకున్నాయి సచల్ పద్యాలు (హాఫిస్‌లు.)

షెల్లీ, హాఫిజ్‌లకంటే కూడా ఆకాలంనాటి కపటాన్ని గ్రామ్య భాషను పిచ్చినమ్మకాలను ఎక్కువగా వ్యతిరేకించారు. సచల్ - ముల్లాలను, అఖండ్‌లను, మఖ్‌దుమ్‌లను బట్టబయలు చేశారు. ఆనాటి మానవుల అంతరాత్మలకు వారు సాహిత్య, ఆధ్యాత్మిక దర్శకులు. వారెంతవరకు వచ్చారంటే : 'ముల్లాను పొట్టమీద కొట్టు' అన్నారు ఒక సందర్భంలో.

సచల్ పేరులోనే సత్యం అన్న అర్థం ఇమిడివుంది. వారు సత్యాన్ని అనుసరించడంలో కొంచమైనా వెనుదీయరు. వారు అందరినీ ప్రోత్సహించారు. "సత్యమునే వచింపుము. ఎవరి కోపమునకు అదికారణమైననూ లెక్కింపకుము !" తాత్త్విక కవి మంతిక్ గ్రంధకర్తయైన అత్తర్‌ను వారి గురువులుగా ప్రకటించి, సూఫీలలో అత్యున్నతుడు అనీ జామీ, జలాలుద్దీన్ రూమీ వారికి నీచసేవలు మాత్రము చేయనర్హులనీ చెప్పగలగడమే వారు సత్యాన్ని ఎంతో గాఢంగా ఆరాధిస్తారన్నదానికి ప్రబల నిదర్శనం. వారు ఎంతవరకూ వెళ్లారంటే 'అత్తర్ స్వయంగా ఆ పరమాత్మ తక్క వేరొకరు కాదు' అంటారు.

సాంప్రదాయకులు అతనిని కాల్చివేయ జూచినంతగా అతడు మత విరోధులను వితండవాదకులను రెచ్చగొట్టి వారి ఆగ్రహానికి గురి అయ్యారు. తాల్పూర్ పాలకులు అడ్డుపడిన కారణంగానే అతడు తొంభై ఏండ్లవరకూ జీవించారు. ఒక ముస్లిముగా బహిరంగ ధిక్కారంచేస్తూ అతడిలా అనడం ఆశ్చర్యమే !

> కల్మా (మతము) నన్ను ముస్లిమునిగా చేయలేదు
> లేడు అహ్మద్ (ప్రవక్త) తేగలడు నమ్మకము అరబీనుండి
> సచు అత్యున్నతుడు తానే
> మానవుడని పిలువబడుచున్నను.

మరొకచోట అతడిట్లా అన్నాడు.

> హల్మా పఠియించిననే భిన్నమతావలంబకుడుగ మారుడు
> యీ చిక్కులలోనే చిక్కుకొన దలచుకొనలేదు
> నేనడుగిడను ప్రవక్త మార్గమున
> ఏలనన విడుచునంత దనుక మార్గమున
> నే ప్రవేశింప లేకుందు సన్నిధికి

కొందరు హిందువులు వారిని తమలోని వారిగా భావించకుండా వారి దేవుళ్లనుగూడా తెగనాడారు :

రామ రహీము నిజముగ ఒకటైతే
ఏ కట్టుబాట్లు రావణుని సృష్టికి మూలం ?
కృష్ణుని మూర్తినే నీవేల ఆకాంక్షింతువు
కంసునిపై పగ సాధింప నేల జూతువు ?

వారి నినాదం 'హమా ఉస్త్' (అంతయు ఆతడే). మతం, కులం, ఉద్యోగం యీ భేదాలను వారు గుర్తించలేదు. వారుండవలసిన కాలానికి ఒకటి రెండు శతాబ్దాలు పూర్వమే జన్మించిన సచల్ వర్గ రహిత సమాజం కోసం నిలబడ్డారు. ఆ రోజుల్లో సచల్ వంటి ఫకీరు, మతావలంబి, గ్రామీణ ప్రాంతాలలో భూస్వామిగా నున్న ఒక వ్యక్తిని కలుసుకొని మాటలాడ నిరాకరించి, వానిని వెడల గొట్టుట చాల అరుదు. కాని సచల్ సరిగ్గా అదే చేశారు. అటు తరువాత (నానక్) యూసఫ్ అన్న పేరుతో యీ షామ్స్ వారి అత్యంత ఖ్యాతి బడసిన శిష్యులుగా మారారు.

అట్లని సచల్ గర్వికాదు. అహంకారి అంతకంటె కాదు. వారు చాల సాధు స్వభావం కలవారు, అత్యంత వినయ విధేయతలు గల వ్యక్తి. కాని ఏమాత్రం అన్యాయం జరిగినా వారు సహించేవారు కాదు. ఆ అన్యాయాన్ని సరిచేయగలిగినంత మేరకు తమ ప్రయత్నాన్ని వదలరు. తల్పుర్‌ల బందీ అయిన ఒక హిందూ అధికారిని, సింహంలాగ ధైర్యంగా (నిజంగా సింహం రూపంలోనే వెళ్లారని కథ) వారి దుర్గంలో ప్రవేశించి వారి ఆయుధాగారంలోనే ఎదిరించారట. ఆ హిందూ ఉద్యోగిని విడుదల చేశారట. షెల్లీ మహాకవిలాగ మానవాళిని ఉద్ధరించి నేలపై భూతల స్వర్గాన్ని చూసె స్వప్న జగత్తులో సచల్ విహరించలేదు. అంతర్ దృష్టి వల్ల సచల్ గ్రహించారు. ఆ స్వర్గం యిక్కడే వుంది. మానవునిలోనే ఆ పరిపూర్ణత వుంది. ఆత్మ సాక్షాత్కారం సాధించినప్పుడు. ఒక ప్రసిద్ధ కవితలో వారిలా అంటారు: 'నీ యొక్క విలువ నీవు గనుక తెలుసుకో గలిగితే, నాయకులకు నాయకుడవౌదువు, స్వయముగ సేనా నాయకుడవే అగుదువు.'

సింధీ ప్రేమికులందరికీ వారు మత్తెక్కిన సచల్‌గా తెలుసు. 'పరమాత్మ కైపు' అన్న బిరుదుతో షా, ఇతర వేదాంత కవులను గురించి వ్యవహరిస్తారు; కాని యీ బిరుదు ముఖ్యంగా సచల్‌కు వర్తిస్తుంది. సచల్ సర్వకాల సర్వావస్థలలోను ఒక వింత పారవశ్యంలో నుండి, పరివేష్టిత జనాలకు దూరంగా తొలగిపోయి, తనలో తానే వజ్రాలవంటి పాటలు పాడుతూంటే, అవి వింటూన్న శిష్యులు అనుయాయులు వెంట

వెంటనే తమ తమ పుస్తకాలలో వాటిని వ్రాసుకొనేవారు. గంజాయి, సారాయి వంటి మత్తు కలిగించే పదార్థాలను సేవించేవారిని వారు ఎగతాళి చేసేవారు. వారెప్పుడూ ఆ పదార్థాలను సేవింపలేదు. వారు ఆ మత్తు పదార్థాలను, మత్తు పానీయాలను ఎంతగా అసహ్యించుకొనే వారంటే, వారి సమక్షంలో ఎవ్వరూ గంజాయి త్రాగుటకు గాని, మత్తు పానీయాలు సేవించుటకు గాని సాహసించేవారు కాదు. సర్వకాల సర్వావస్థలలోను మత్తులో నుండిన, లేదా అర్ధధ్యాన నిమగ్నుడై ఆ పరమాత్మతో నుండు వానికి యీ కృత్రిమ మత్తు పదార్థాల ఆవశ్యకత ఏమిటి? సింధీ కవులందరిలో, ఎమర్‌సన్ 'బ్రహ్మ' భావవతో సానుభూతి వ్యక్తం చేస్తూ వారితో సులభంగా చేరగలిగింది ఒక్క సచల్ మాత్రమే :

ఆ చంపువాడు తానే చంపుతుంటి ననుకొనిన,
చంపబడిన వాడు, తానే చంపబడితి ననుకొనిన,
వారికి తెలియదు సూక్ష్మ మార్గములు
నే నుంచుదు, సంచరింతు, మరల తిరుగుదు
దూరమున నున్నను, మరచిపోయినమ, నాకు మాత్రము దగ్గరే :
నీడలు సూర్యుని వెలుతురు సమమే :
అంతర్థానమైన దైవములు నా కగుపింతురు ;
నాకు ఒకటియే సిగ్గును, ఖ్యాతియు
వారెంచుదురు కీడు నన్ను వదలి పోవువారు ;
నన్ను వారెగురవైచి నప్పుడు, నేనే రెక్క కాదు ;
నేనా సందేహించు వాడ నా సందేహము కూడ

మరి నేనే ఆ మంత్రమును బ్రాహ్మణుడు జపించునది. సచల్ గీతాలు గీతను ఉపనిషత్తులను చాలాచోట్ల గుర్తు చేస్తూ ఉంటాయి. వారిని అతి నైపుణ్యతతో వ్యాఖ్యానించిన జెఠ్‌మల్ పర్స్‌రాం కూడా ఈ విషయాన్ని గుర్తుచేశారు. వారి పద్యాలలో ఖ్యాతి గాంచినవి కొన్ని 'నే నెవ్వరికిని జనించలేదు. నే నెవ్వరి పోషణలో పెరుగలేదు.' తిరిగి 'నేను నీరు కాదు వేడియును కాదు, మేఘమును కాదు, దినకరుడను కాను, తండ్రిని కాదు, తల్లియును కాదు.' మరొక ప్రత్యేత గీతంలో వారు రూమీని గుర్తుకు తెచ్చుకుంటారు. 'కొందరిలా అంటారు, కొందరలా అంటారు. నేను నేనే. కొందరు నన్ను మోమిన్ (ముస్లిం) అంటారు. కొందరు కాఫిర్ అంటారు. కొందరు నన్ను అవివేకిగా ఎంచుతారు. మరి

కొందరు స్వవిదితునిగా భావిస్తారు. కొందరు మాంత్రికుడనంటారు. మరి కొందరు కవి నంటారు. కాని నేను నేనే. కొందరు నన్ను మానవు డంటారు, మరి కొందరు నన్ను నిజంగా దయ్యమని భావిస్తారు. కొందరు నన్ను గొప్పవానినిగా నెంతురు, మరి కొంతమంది ఉన్మాదునిగా నెంతురు, నేను నేనే.' పొగడ్తలకు తెగడ్తలకు అతీతంగానే వారు జీవించారు. వారికి ఈ ప్రపంచాన్ని ఉద్ధరించాలని గాని, సంతోష పరచాలని గాని తలంపు ఎప్పుడూలేదు. ప్రబోధకునిగా గాని, గురువుగా గాని, అన్వేషకునిగా గాని ఎంచబడవలెనని వారెన్నడూ వాంఛించలేదు. వారు సచల్, సత్యసంధుడు సాచూగానే అందరికీ ఎరుకబడవలె ననుకున్నారు. వారి అభిమానులు కొందరు సర్‌మస్త్ (మత్తెక్కిన) అను పదమును వారి పేరునకు చేర్చారు. వాస్తవంగా అది సరియైనదే. ఆ దివ్య మూర్తి రూమీతో కలసి రూఢి చేసియుండును (షామ్స్ తబ్రిజ్ వ్రాస్తూ) 'ఓ భగవంతుడా! నేను మైమరపు, తెలివి లేని తనము తప్ప ఏమియు తెలియనంతగా యీ ప్రపంచమున మత్తుగలిగి యుంటిని'.

సచల్‌గా తరువాత పేరు వహించిన అబ్దుల్ వాహబ్ 1739 లో ఖైర్‌పుర్ సంస్థానంలోని దరజాన్ గ్రామంలో జన్మించారు. వీరి తండ్రి సలాహుద్దీన్ ఫకీరు, కవి అయిన సాహిబ్ దినో (మొరాగి అనబడే) వారి పెద్ద కుమారుడు. వీరు తమ ధర్మ నిష్ఠాపరత్వానికీ దైవ చింతనకూ పేరొందారు. వారిని ప్రజలు చాలా గౌరవించేవారు. ముస్లిముల మొదటి ఖలీఫా అయిన ఉమర్ ఫరూక్ వంశం నుండి సచల్ ఉద్భవించినట్లు వంశావళి ద్వారా గుర్తిస్తారు. ఉమర్ ఫరూక్ కాలంలో ఇస్లాం మతం బహుళ ప్రచారం పొందింది.

సచల్ తండ్రి ఆతని చిన్నవయసునందే మరణించగా, ఆతని తండ్రి సోదరుడు ఫకీర్ అబ్దుల్ హక్, సచల్‌ను చేరదీసి, పెంచి పెద్దవానిగా చేశారు. వారే అతనికి మొదటి ఆధ్యాత్మిక గురువు. వారిని గురించి ప్రస్తావిస్తూ, వారు తమ హాదీ లేక గురువు అనీ, వారి పినతండ్రి హక్ (దేవుడు)కు అబ్ద్ (బానిస) కాదనీ, వారు భగవంతుని అవతారమేననీ తరచు చెబుతూ ఉండేవారు.

ఆ రోజుల్లో విద్యావంతుల భాషలైన పర్షియన్, అరబిక్ భాషలను సచల్‌కు నేర్పించడానికి అన్ని ప్రయత్నాలు అబ్దుల్ హక్ చేశారు. పర్షియన్, అరబిక్ భాషలే కాక సచల్‌కు ఉర్దూ, హిందీ, తల్‌పూర్‌ల రాజాస్థానంలో వాడుకలో నున్న సిరైకీ ప్రాంతీయ వాడుక భాషకూడా

తెలుసు. వారు తరవాత కాలంలో పర్షియన్, ఉర్దూ, సిరైకీ ప్రాంతీయ సింధీలలో కవిత్వం వ్రాశారు. పర్షియన్‌లో వారు కవిత్వం చెప్పకపోయినా ఆ భాషలోని రచనల నుండి విస్తృతంగా ఉదాహరణ లిచ్చారు. వారి పాఠ్యాలలో అత్తర్‌కు వారు ప్రత్యేక స్థానాన్ని ఆపాదిస్తూ ప్రభువు పవిత్ర దూత (పక్ విజుద్), స్వయంగా ప్రభువే అని స్తుతించారు. అత్తర్ విఖ్యాత పద్యకావ్యం మంతిక్ అల్ తైర్ ఒక నీతి కథ: ముప్పై (సి) పక్షులు (మురుఘ్) 500 సంవత్సరాల క్రిందట సృష్టిలో నశించి తిరిగి ఉద్భవించిన ఫినిక్స్ (సిముర్ఘ్)ను వెదకుకుంటూ కోహ్ కఫ్ (కారకస్ పర్వతాలు) చేరాయిట. ఎన్నో కష్టాలను ఎదుర్కొని అక్కడికి చేరిన వెనుక ఆ ఫినిక్స్ పక్షి ఎవరో కాదు, తామేనని తెలుసుకున్నాయట. లోయలను దాటి అన్ని కష్టాలను వారు అనుభవించారు. ఈ లోయలు నిజానికి 'యాత్రికుని' పయనంలో అంచెలు మాత్రమే: (అన్వేషణ, ప్రేమ, సాక్షాత్కారము పొందుట, పరిత్యాగము, సంఘీభావము, ఆశ్చర్యము దారిద్ర్యము, వినాశము) యివి ఆ అంచెలు.

షా వలె సచల్ తమ విద్యానుభవం కోసం యాత్రలను సాగించలేదు. వారు ఏ స్త్రీని ప్రేమించలేదు. వారు జీవితాంతం సౌందర్యాన్నే ప్రేమించారు కాని ఏ ప్రత్యేక సౌందర్యవతిని గాని, అందమైన వస్తువునుగాని ప్రేమించలేదు. ఒక అతి లావణ్య స్త్రీ నృత్యగానాలను తిలకిస్తూ వింటూ ండగా వారి రుగ్మత నయం అయిందని ఒక కథ ప్రచారంలో ఉంది. కాని ఏ స్త్రీని వారు ప్రేమించిన దృష్టాంతరం ఎక్కడాలేదు. వారి వివాహ మయ్యాక రెండేళ్లు మాత్రం జీవించి ఉన్నారు. ఆమె మరణానంతరం వారు తిరిగి పెళ్లి చేసుకోలేదు. ఆమెను కూడా, తన విద్యుక్త ధర్మం నెరవేర్చడానికి మాత్రమే వివాహమాడారు; అదీ అబ్దుల్ హక్ కుమార్తె గనుక, ఆమె అతని అర్ధాంగిగా నిర్ణయించ బడినది గనుక, వివాహ మాడారు. సచల్ అంతరంగ ధ్యానంలో నిమగ్నులై ఉండేవాడు. అయినా బాహ్యసౌందర్యాన్ని ప్రేమించేవాడు. ప్రకృతి సౌందర్యాన్ని తిలకించుటకు వారెప్పుడూ వారి కుటీరాన్ని వీడిపోలేదు. సంగీతం, నాట్యం, కవిత్వం, యీ మూడేవారి రస పిపాసను తృప్తిపరచేవి. అప్పు డప్పుడు వారు చక్కని నర్తకిని గాని, గాయకినిగాని చూస్తూ ఉండేవారు.

అలవాట్లలో వారొక విరాగి. రాత్రులు భుజించేవారు కాదు పగలు కూడా భోజనంలో మాంసం విసర్జించి పప్పుదినుసులు మాత్రం తినే వారు. దుస్తుల ధారణలో కూడా అతి సామాన్యంగా ఉండేవారు. అతి

తక్కువ దుస్తులలో ప్రముఖంగా కనిపించేది వారి ఆకుపచ్చని తలపాగా మాత్రమే. వారు చేత దండం ధరించి పాదరక్షలు లేకుండానే నడిచే వారు. చూచుటకు మధ్య వయస్కులుగా అంతంత మాత్రం పరిమాణం గలిగి, ఆకాలంలో స్థూలకాయులై, పుష్టిగాతింటూ బలిసి, విషయాసక్తులైన మతబోధకులని గాని, దేశ సంచారులైన సన్యాసులని గాని పొరపాటుగా నైనా అనుకోని విధంగా ఉండేవారు. తరుచుగా శ్రావ్యమైన సంగీతం వింటూ వారు కండ్లవెంట నీరు కార్చేటంతగా ప్రభావితులయ్యేవారు. అభి మానులు వారిని పరివేష్టించి ఉండడం నిజమే అయినా, వారు ఏకాంతాన్నే కాంక్షించేవారు. ఆధ్యాత్మిక పరిపూర్ణత్వంగాని, పవిత్రతగాని తనకున్నదని వారెప్పుడు ప్రకటించలేదు. అనేక రచనలలో వారు పాఠకులకు సుపరిచిత మైనట్లు, గొప్పతనాన్నిగాని, షేక్ స్థానికిగాని, మఖ్దుం స్థానానికిగాని తనకు హక్కులేదని ప్రకటించారు. వారుకాజీగాని, ముల్లాగాని, బోధకుడు గాని గాదు అంటారు వారు. తన వ్యక్తిత్వాన్ని చాటుకొనడానికి మోస కారిగా మారి ప్రజలను తప్పదారి పట్టించరు. చివరగా, తానేవిధమైన కళ (హున్రా్) నేర్వకపోయినందుకు, భగవంతునికి తన కృతజ్ఞతలు తెలియ జేశారు.

ఇతరులకు మార్గదర్శకులుగా ఉండేందుకు గాను వారు, బాహ్యంగా అనుసరించే ఇస్లాం విధులన్నిటినీ కచ్చితంగా పాటించేవారు. సాధారణ మతాన్ని వారు విడిచిపెట్టారు. వారిది ప్రేమమతం మాత్రమే! వారంటారు; నేను రుద్రాక్షమాలలోని రుద్రాక్షలను లెక్కించను. ప్రార్థనలు, దైవభక్తి వైపు పోను. మందిరాలకు, మసీదులకు పోవడం, సన్యాసిగా మార డం నాకు నచ్చదు. ప్రేమ అతనిని గుప్పిటలో నుంచుకొని సచల్‌ను అదృష్టవంతుణ్ణి గావించింది.

ప్రేమయే తన స్వంతం చేసుకున్నప్పుడు తాను ఏ మతాన్ని అవలం బించనక్కరలేదనీ, మక్కావంటి యేపుణ్యక్షేత్రాలూ దర్శించుటకు యాత్రలు చేయనక్కరలేదనీ, యే విధమైన ఆచార కర్మలు నిర్వర్తించ నక్కరలేదనీ, వేరొక చోట పేర్కొంటారు.

సోక్రెటిస్, క్రీస్తు, మన్సూర్ హల్లాజ్, గాంధీలకు సంభవించిన గతి సచల్‌కు పట్టక పోవడం నిజంగా ఆశ్చర్యకరమైన విషయమే. సాంప్రదాయానికి మూలస్తంభాలైన వారు అతనిని కాఫిర్‌గా లేదా భిన్న మతావలంబకునిగా ప్రకటించడానికి, ఉరిశిక్ష వేయించడానికీ శత విధాల ప్రయత్నించారు. వారిలోని ప్రశాంతత, ఒకవిధమైన ఆకర్షణ శక్తి

మాత్రమే ఆనాటి ప్రభువులను ఆకర్షించి వారిని సంప్రదాయికుల, అమాయక ప్రజల ఆగ్రహానికి గురికాకుండా కాపాడింది. తల్‌పుర్‌మీర్ యీఆకర్షణకు లోనయ్యారు; అందులోనూ అత్యంత ప్రభావితులైనవారు రయిస్ షామ్స్. సచల్ వారిని తిరస్కరించి వారి సమక్షం నుండి త్రిప్పి పంపి నప్పటికీ వారిచే ఆకర్షితులై నానక్ యూసఫ్ పేరున ఇచ్ఛా పూర్వకంగా వారి దూతలయ్యారు. మరణశయ్యపై నున్నపుడు మూడుసార్లు వారి ప్రియశిష్యులైన యాకూబ్‌ను పిలిచారట. కాని యాకూబ్ అప్పుడు లేరు. నిరంతరం గురువు సేవలో నిమగ్నులై అక్కడే ఉంటూన్న యూసఫ్ గురువు పిలుపు విని పలికారట. అప్పుడు పవిత్ర గ్రంథాన్నించి ఉదహరిస్తూ యాకూబ్ (జాకబ్) లేని పక్షమున వారి కుమారుడు యూసఫ్ (జోసఫ్) వారికి బదులు పలికి వస్తారని చెపుతూ తమ అంతిమ సందేశాన్నీ ఆశీర్వచనాన్నీ చెప్పి ఆధ్యాత్మికాధికారిక చిహ్నాన్ని అతనికి అందించారని చెపుతారు.

సచల్ జీవితంలో కొన్ని అద్భుత సంఘటనలు జరిగాయని చెబుతారు. కాని సాధారణ మానవునికుండే శక్తులకంటె అతీతమైన శక్తులేవీ తనలో లేవని ఖండిస్తూనే ఉండేవారు. వారు 1829లో తమ తొంభైవ ఏట పండుముదుసలిగా మరణించారు. అయినా తాము 105 ఏండ్లు బ్రతికి వుండవలసినదనీ, కాని 15 ఏండ్లు ముందుగానే తమ ప్రియమిత్రుని దర్శనార్థమై వెళ్లిపోతున్నాననీ వారన్నారు.

సచల్ మరణంపై ఆయన శిష్యుడు, సుప్రసిద్ధకవి అయిన బేదిల్ ఒక శోక గీతాన్ని వ్రాశారు.

నా ప్రియ మిత్రుడు దరాజాస్‌లో నున్న ప్రేమ ఇంద్రజాలం
చాలా అద్భుతమైనది !
సాచూ ఉన్నాడక్కడ, మత్తెక్కిన అన్వేషకుడు, అతీంద్రియ
జ్ఞానము గలవాడు
అధికమై యున్నదిచట ఆశావర్షపు జల్లులు ఆ వీరునిపై
వియోగ బాధ లచటనున్నవి, దృశ్యము, అదృశ్యములై
మత్తెక్కియుండె నాతడు, నిజముగ, ఐక్యతా పారవశతలో
నిశ్చయముగా వారు మరియొక మన్సూర్, ప్రేమ మే మూర్తీభవించినది
ఆతడు అత్తరు స్వయముగా మనస్ఫూర్తిత్వమున, భావమున....

సేనానివలె ఆతడునిలచె శ్రేణిలో ప్రేమించుటకు ప్రసాదించిన వారిలో
చేదిల్ సదా వెంటాడు దాత గుమ్మము ముంగిట ఆతని ఆవేశమును
బహుమతిగా స్వీకరించుటకు....

మరణానంతరం వారిఖ్యాతి క్రమేపీ అధికం గాజొచ్చినది ; సింధు నుండి హిందువులు వలస పోవుట చేత.

అయినప్పటికీ సచల్, వారి జీవిత చరిత్రకారుల, సంపాదకుల దృష్టిలో అంత అదృష్టవంతులు కాదు. మీర్జా అలీకులీ బేగ్‌వారి కఫీస్‌లను సేకరించి 1902లో ప్రచురించివారి జ్ఞాపకాలకు ఎనలేని సేవ చేశారు కాని వారి సోదరుడు షా అబ్దుల్ లతీఫ్ జీవిత చరిత్ర వ్రాసిన మీర్జా కాలిక్ బేగ్‌లో ఉన్న పరిశ్రమ సూక్ష్మ బుద్ధి, వీరిలో లోపించాయి. 1933లో ఆగాసూఫీ సచల్‌పై ఒక పెద్ద సంపుటాన్ని తెచ్చారు. కాని దానిని మూడవ వంతుకు కుదించి వుంటే మరింత విలువ గలిగి ఉండేది. అది దీర్ఘంగాను గుణ దోష వివేచనా రహితంగాను ఉన్నది. షా లతీఫ్‌కు ప్రొఫెసర్ గురు బక్సానీ చేసిన సేవ కన్నా మించి చేయనుంకించారు, రచయిత. కాని ప్రొఫెసర్‌కి ఉన్న పాండిత్యంగాని, వారి శిల్ప సంపద గాని ఈ రచయితలో లేవు. సచల్ కవితలలో కొన్ని రుచికరమైన మచ్చు తునకలకు, వారి సింధీ, సింధీ యేతర రచనలు కుప్పగా కల గలిపి యిచ్చినందుకు మాత్రమే ఆ గ్రంథం విలువైనదిగా ఎంచబడుతోంది. దేశ విభజన అనంతరం, సచల్ అనువర్తిని, హిందూ వనిత నిమానో ఫకీర్ అన్న పేరుతో వారిపై ఒక గ్రంథాన్ని వెలువరించారుగాని అది పాండిత్యాన్ని తెలిపే గ్రంథం మాత్రం కాదు. సచల్‌పై రెండు నిజానికి చిన్న పుస్తకాలు వచ్చాయి. జెట్ మల్ పర్స్రాం కల్యాణ్ అద్వానీ అనే యిద్దరు హిందూ ప్రొఫెసర్లు వ్రాసినవి. జేఠ్ మల్ పర్స్రాం సచల్ ఆలోచనపై భావనా శైలిపై చక్కని వ్యాఖ్యానంతో వ్రాశారు. సచల్ జీవితం గురించి, వారి రచనలను గురించీ తెలుసుకొన వలసినదంతా అద్వానీ సంగ్రహంగా చెప్పారు. పాకిస్తాన్‌లో సచల్ గ్రంథాలుగాని వాటి అనువాదాలను గాని ముద్రించడానికి ప్రయత్నాలేవైనా జరిగాయేమో ఈ గ్రంథకర్తకు తెలియదు. సచల్ కవిత్వ పక్షవాదులైన వారికి, ప్రగతి విరోధులకు, దయతో అప్పగించడానికి అవి తగినవి కావు. సచల్ రచనలన్నీ సేకరించి సరియైన రీతిలో విపుల సంపాద కీయంతో నిర్దుష్టమైన ఒక గ్రంథం రావడం ఎంతైనా అవసరం. చదువురాని సింధీయునికైనా వారిగేయాలు సుబోధకాలు, మనసుకు హత్తుకుపోయే వారి భావాలు, ప్రాచీన వాఙ్మయంలో ప్రవేశంలేని వారికైనా రంజింప జేస్తాయి.

మాత్రమే ఆనాటి ప్రభువులను ఆకర్షించి వారిని సంప్రదాయికుల, అమాయక ప్రజల ఆగ్రహానికి గురికాకుండా కాపాడింది. తల్‌పుర్‌మీర్ యీఆకర్షణకు లోనయ్యారు; అందులోనూ అత్యంత ప్రభావితులైనవారు రయిస్ షామ్స్. సచల్ వారిని తిరస్కరించి వారి సమక్షం నుండి త్రిప్పి పంపినప్పటికీ వారిచే ఆకర్షితులై నానక్ యూసఫ్ పేరున ఇచ్ఛా పూర్వకంగా వారి దూతలయ్యారు. మరణశయ్యపై నున్నపుడు మూడుసార్లు వారి ప్రియశిష్యులైన యాకూబ్‌ను పిలిచారట. కాని యాకూబ్ అప్పుడు లేరు. నిరంతరం గురువు సేవలో నిమగ్నుడై అక్కడే ఉంటూన్న యూసఫ్ గురువు పిలుపు విని పలికారట. అప్పుడు పవిత్ర గ్రంథాన్నించి ఉదహరిస్తూ యాకూబ్ (జాకబ్) లేని పక్షమున వారి కుమారుడు యూసఫ్ (జోసఫ్) వారికి బదులు పలికి వస్తారని చెపుతూ తమ అంతిమ సందేశాన్నీ ఆశీర్వచనాన్నీ చెప్పి ఆధ్యాత్మికాధికారిక చిహ్నాన్ని అతనికి అందించారని చెపుతారు.

సచల్ జీవితంలో కొన్ని అద్భుత సంఘటనలు జరిగాయని చెబుతారు. కాని సాధారణ మానవునికుండే శక్తులకంటె అతీతమైన శక్తులేవీ తనలో లేవని ఖండిస్తూనే ఉండేవారు. వారు 1829లో తమ తొంభైవ ఏట పండుముదుసలిగా మరణించారు. అయినా తాము 105 ఏండ్లు బ్రతికి వుండవలసినదనీ, కాని 15 ఏండ్లు ముందుగానే తమ ప్రియమిత్రుని దర్శనార్థమై వెళ్లిపోతున్నాననీ వారన్నారు.

సచల్ మరణంపై ఆయన శిష్యుడు, సుప్రసిద్ధకవి అయిన బేదిల్ ఒక శోక గీతాన్ని వ్రాశారు.

నా ప్రియ మిత్రుడు దరాజాస్‌లో నున్న ప్రేమ ఇంద్రజాలం
చాలా అద్భుతమైనది !
సాచూ ఉన్నాడక్కడ, మత్తెక్కిన అన్వేషకుడు, అతీంద్రియ
జ్ఞానము గలవాడు
అధికమై యున్నదిచట ఆశావర్షపు జల్లులు ఆ పీరునిపై
వియోగ బాధ లచటనున్నవి, దృశ్యము, అదృశ్యములై
మత్తెక్కియుండె నాతడు, నిజముగ, ఐక్యతా పారవశతలో
నిశ్చయముగా వారు మరియొక మన్సూర్, ప్రేమమే మూర్తీభవించినది
ఆతడు అత్తరు స్వయముగా మనస్ఫూర్తిత్వమున, భావమున....

ప్రకృతిని నిశితంగా దర్శించేవారు షా. తమ యీ పరిశీలన నుండి, అద్భుతమైన ఉపమానాలు, శబ్ద చిత్రణలు వారి పద్యాల ద్వారా మనకు అందించారు. సచల్‌లో చూపుతో నున్న చింతనాపరుడు. ఒక అంద మైన పద్యంలో సాలెవారు, పండెకోల గురించి అద్భుతంగా వర్ణించారు షా. తమ కాలంలో ప్రచలితంగా ఉన్న కథలను, గాథలను తిరిగి చెప్పారనే అనాలి. కాని సచల్ ఆ కథలలో కొన్నిటిని అక్కడక్కడ ఉదహరిస్తారే తప్ప వాటిని కథన రూపంలో తిరిగి చెప్పడానికి ఎంత మాత్రమూ అంగీకరించ లేదు.

షా సూచన, అంతరీ జ్ఞానము వైపుగా ఉంటుంది. సచల్ స్పష్టంగా విడమరచి చెప్పడం, బలంగా చెప్పడం, బలంగానే ఖండించడం చేస్తారు. ఆ ఇదరు మహాకవులూ చెప్పదలచినది ఒక్కటే కాని వారి పద్ధతి, శైలి మాత్రం వేరు వేరుగా ఉంటాయి. ససూయి తన దీనావస్థ స్వయం కృత మైనదేననీ, అది ప్రియుని ఎటబాటు వలన కలిగినదేననీ అంటారు. ఆమె ఆక్రందనతో షా పద్యాలు తారస్థాయి నందుకుంటాయి. పుర్‌హూన్ ఎవరో కాదనీ ససూయియే పున్‌హూర్ అని ఆమె గుర్తించినప్పుడు ఆమె బాధలు పటాపంచలైనవి. సచల్ సూటిగా, స్పష్టంగా మన్సూర్‌తో కలసి ఎలుగెత్తి చాటుతారు. అనల్ హక్ 'నిశ్చయంగా నేనే భగవంతుడను.' ఉపవాసాలు, ప్రార్థనలు వీటికి ప్రయోజనం ఉన్నదని, అయితే వాటి బాహ్య ప్రయోజనం వేరొకటి అనీ అదియే పరమాత్మ గోచరమనీ షా సూచనా మాత్రంగా అంటారు. సచల్ సాంప్రదాయిక మత గురువులను వారి ఉపవాశాలు, ప్రార్థనలను ఖండిస్తారు. వారు మోసగాళ్లనీ, కృత్రిమ వేషధారులనీ తెగడుతారు. షా ఉద్దేశించినదీ, సచల్ ఉద్దేశించనిదీ, ఒక్కటే! సచల్ అంటారు: నిన్ను నీవు మరచి, నీలో నున్నది గుర్తింప వెదకుము. ఆత్మసాక్షాత్కరము ద్వారానే జ్ఞానము దొరుకు తుంది; పీర్ (జ్ఞాని) కానక్కరలేదు, శిష్యుడవు కానక్కర లేదు. ఆ మత్తు లోని ఆనందమును ఆస్వాదించుము. ఓ పక్వత నొందని వ్యర్థుడా! మఖ్‌దుం షేక్‌ల జీవనమును విసర్జింపుము శాపములుగాని, పొగడ్తలుగాని భగవంతుని చేరు మార్గమున నీకు సాయపడవు. నీ తలపాగానే నీవు ధరి యించుము, నీ కార్యము సుకరమగును! షా మూర్ఖులను, వంచకులతో పాటు విజ్ఞులను, గుణవంతులను కూడా క్షమా దృష్టితో చూస్తారు. కాని సచల్‌కు మూర్ఖులతోను అవివేకులతోను, పనిలేదు. వారి ఆలోచనలలో అట్టివారికి స్థానం లేదు.

సచల్ సంపూర్ణంగా, జాతిమతాలకు అతీతుడైన ఆలోచనాపరుడు. వారు అంటారు : 'ఓ సచూ! అన్ని శంకలకూ అతీతుడు ప్రభువు, వారు ఎక్కడైననూ అనుభూతిని అనుభవించ గలరు. అన్ని అంశములలోను వారు రాజే. ఒక పరి ఆతడు హిందూ శృతులను పఠించును, మరియొక పరి కొరాన్ పఠించును. ఆతడు క్రీస్తు కావచ్చును, మహమ్మదు కావచ్చును, హనుమంతుడు (వానర దైవము) కూడా కావచ్చును. కేవలం వారి వినోదం కొరకే వారు దిగ్భ్రమను కల్గించగలరు'. వైష్ణవులు కూడా వ్రాయలేనంత బాగా సచల్ కృష్ణుని స్తుతిస్తూ కొన్ని పద్యాలు వ్రాశారు. షా అట్టి పని చేయడానికెన్నడూ తలపెట్టలేదు. వారు ఎల్లప్పుడూ నిష్ఠాపరుడైన ముస్లిముగానే జీవించారు.

సూఫీ సిద్ధాంత సత్యాలను షా దృష్టాంత గాథల ద్వారా నీతి కథల ద్వారా షా ఎరుకపరచేవారు, సచల్ వాటిని విశదంగా వర్ణించేవారు. సచల్ పద్యాలలోని సూఫీ సిద్ధాంత పరిమళాలను, ఆలోచనలను జెఠ్‌మల్ పర్సరాం తమ చిన్న పుస్తకంలో వివరించి చెప్పారు : 'ఆత్మ పరిజ్ఞానము, కాదనుట, అవుననుట (నఫీ, అస్బత్), హమా ఉస్త్ (అంతయు అతడే) హక్ మంజూద్ (సర్వ వ్యాపకుడు భగవంతుడు), చిట్ సిఫత్ (పదార్థము, గుణములు), రక్ష లేక ఆత్మపరమాత్మలొకటే యను కఠిన ప్రశ్న, మానవుడాలోచించును మొదలైనవి. సచల్ చెప్పిన పద్యాలన్నిటిలోను గీత, ఉపనిషత్తులలో చెప్పిన బోధనలే గోచరిస్తున్నాయి. తమ మమేక స్థితిలో సచల్ యీ విధమైన అనుభూతిని పొందారని చెబుతూ ముగించారు.

**వాస్తముగా అది పాపము వేరొకటి తలంచుట**
**ప్రతి ఆకారము, ప్రతి రూపము, ఆతడే సర్వేశ్వరుడే**

తాను మరగుటకై కాగబెట్టిన ఆధ్యాత్మిక సత్యాల గంగాళము, మరగు సమయముదాక తానుండి, విడచి దానిపై మూత తీయుట సచల్‌కు విడిచిపెట్టి యుంటినని షా యుక్తంగానే చెప్పారు. ఆ మూత తీసి వారు అందరికినీ పంచభక్ష్య పరమాన్నములతో విందు చేశారు. ఉపదేశం పొందినా, పొందకపోయినా సచల్ ఇల్లా అనేటప్పుడు ఎవ్వరికీ దాని అర్థం విదితం కాకపోదు. 'ఒక మానవుడు దుస్తులు ధరించినపుడు ఆ ఉడుపులే తన పేరని చెప్పడు. తన అసలు నామధేయ మాతడుంచుకొంటాడు. ఈ స్థితికి నేను దిగజారిపోతున్నందుకు చింతిస్తున్నాను. ఇక్కడ నేను సేవకుని స్థితికి పతనమయ్యాను. అక్కడ నేను సుల్తానును'. ఈ పరమ సత్యాన్ని, దాని సారాంశాన్ని నేనెలా విస్మరిస్తాను? అది నా కన్నా

భిన్నమైనదని ఎలా భావిస్తాను ? ఈ నకిలీ విగ్రహాన్ని బ్రద్దలు కొట్టి మాత్రమే నా నిజమైన సారాన్ని బయట పెట్టగలను. మత్తెక్కిన ఆ స్దితిలో మన్సూర్ వలె నేను కూడ 'నేనే సత్యాన్ని లేక పరమాత్మను' అని ప్రకటించగలను. 'వారు దీపమును వెలిగించిరి, సూర్యుని వెదకడంకోసం. సూర్యుడచటను కాన రాలేదు. వారు సూర్యుని కనుగొనగల్గినపుడు ఆ సూర్య కాంతి ఎల్లెడలను ప్రజ్వరిల్లింది. వైవిధ్య మంతయు ఏకత్వమే, వాన నుండి చినుకులు అయినట్లే'.

ఒక పర్షియన్ పద్యంలో వారిలా ఆశ్చర్యం ప్రకటిస్తారు.

**నేను వాట్యము చేసితి, వాట్యము చేసితి, నా సిగ్గుచేటు**
**ప్రతి ఒక్కరు చెప్పనుంకించిరి, ఇదిగో పిచ్చితన మిచట నున్నది**

నిజానికి సచల్ కవిత్వం జడత్వం మతి భ్రమణం దగరకు చేర్చేటంతటి ఉన్నత స్థితిలో ఉంటుంది, సాధారణ దృష్టితో గమనిస్తే. అందుకే వారికి తగిన బిరుదు 'సర్ మస్త్' (పూర్తిగా మత్తెక్కిన) అనేది. సచల్ కవిత శబ్దమయం, ఆవేశ పూరితం, అయినా ప్రాపంచిక స్థితిని, ఆమూలంగా వర్జించుతూ ఉంటుంది. అత్యున్నతమైన అమూల్యమైన భావాలతో నిండి ఉంటుంది. సచల్ కవిత్వాన్ని చదివి గాని, పాడి గాని ఆనందించడానికి కొంత ప్రయత్నం అవసరం. మంద బుద్ధి స్వభావమున్న వ్యక్తి వారి కవితలు చదివితే దాని నుండి ఏమి గ్రహించవలెనో తెలియకపోవచ్చు. అందుకు భిన్నంగా, షా కవిత్వం ప్రతి సింధీయుని అన్ని మనఃస్థితులలోను, అన్ని పరిస్థితులలోను ఆకర్షిస్తుంది.

షాలో ఉన్న ఆ సర్వజన సమ్మతత్వం, నిర్మలత్వం, మితములో నుంచు స్వభావం సచల్‌లో కొరవడ్డాయి. వారు బహుముఖ ప్రజ్ఞాశాలి యైన కవికాదు. వారు కథకులు కారు, సూచనలను క్రమంగా అందించుతూ కథను అల్లుకుంటూ ఒక్కమ్మడి పాఠకులలో ఉత్కర్ష కలిగించే నాటకీయత వారిలో లేదు. వారి కవిత్వం ఒకే విషయంపై సీమిత వరిధిలోనే ఉంటుంది. అది 'నే నెవరు ?' నిజానికి అదియే అత్యున్నతమైన విషయం మనకందరికీ అత్యంత చింతాజనకమైన విషయం కూడా.

కాని సచల్ కవిత్వమంతా ఇంద్రజాలం కాకపోయినా, ప్రాకృతిక ఇంద్రజాలానికి అవతారిక వంటి మంత్రోచ్చారణ ఉత్తేజాన్ని కలిగించి, అత్యున్నతస్థాయిలో ఆవేశాన్ని కలిగించే కవిత్వమది. ఇక గేయంలోని బలం, శక్తి చూస్తే సింధీభాషలో మరి యే ఇతరుల కవనానికీ అది ఒదిగి

ఉండదు. ఇదివరకే చెప్పినట్లు షెల్లీ, లేక హాఫిజ్‌ల కవిత్వాన్ని పోలి ఉంటుంది. సచల్ కవిత్వాన్ని ఆస్వాదించిన పాఠకులు షెల్లీ ఓడ్ టుది వెస్ట్ విండ్ (Ode to the west wind), వారిదే అయిన చిన్న గీతం ఓ వరల్డ్! ఓ లైఫ్! ఓ టైం! (Oh world! Oh life! Oh time!) రచనలలో వారు విహరించిన ఆకాశం కన్నా భిన్నమైన ఆకాశం క్రింద సచల్ వ్రాయగలరని ఊహించవచ్చు. ఇతర పరిస్థితుల క్రింద వారు మదిరను, ప్రేమైకమూర్తి సౌందర్యాన్ని వర్ణిస్తూ అత్యుత్తమమైన గేయాలను వ్రాయగలరని ఊహించగలరు. వారీ విధంగా అంటారు-

> **ఓ బెఫెయర్! ఆ అప్సర వీధిని నీవు పోవు తరి**
> **హాఫిజ్ కథతో నీవామెను అభినందించుము.**

సచల్ పద్య వాఙ్మయం అంతటిలోను వారి కఫీలు అసమానమైనవీ అత్యుత్తమమైనవీను. ఈ కఫీలను గజల్‌ల వలె గానం చెయ్యడానికి వీలు ఉండడం వల్ల కొందరు యీ కఫీలను సరియైన కఫీలు, గజల్‌లు అని విభజించారు కాని, అది సమర్థనీయమైన ఆలోచన కాదు. సచల్‌కి విస్తృత ఖ్యాతినార్జించినది వారి కఫీలు అనే ప్రేమ గీతాలు, గాని వారి సూఫీ విధానాలపై వ్రాసిన పద్యాలు కావు. ఈ కఫీలను వారి తరువాత వచ్చిన కవులందరూ కొంచెంగానైనా అనుసరించి ప్రయత్నించి నిరుత్సాహులైనవారే.

కఫీ అన్న పదం షా మొట్టమొదట వాయ్ అన్న పేరుతో వ్రాయటం ప్రారంభించిన మధుర భక్తి గీతాలకు పెట్టిన పేరు మాత్రమే. ప్రతి సుర్‌కు చివర దురదృష్టవంతురాలైన ప్రేమికురాలి విరహవేదనకు రూపకల్పన చేస్తూ, దివ్యమైన ప్రేమ పూరితమైన వేడికోలు యీ వాయ్‌లలో అందించారు. బహుశః సువిఖ్యాతమైన షా వాయ్‌లలో ఒక దానిలో 'సూర్యుడు గాని, చంద్రుడు గాని, తారకలు గాని ప్రియతముని సజీవత్వమును పొందజాలరు. అట్లే వెన్న, తేనె, కలకండ యివి ఏవియు ప్రియతముని మాధుర్యముతో పోటీపడజాలవు'. ఈ వాయ్‌నే తీర్చిదిద్ది కఫీగా పరిపూర్ణ రూపంగా అంత్య ప్రాస లేకుండా యమక ప్రాసలతో కూడా అలంకరించారు సచల్. నిజమైన గేయ రూపానికి కఫీ ఒక పరీక్ష గానూ గురుతుగానూ ఉంటుంది. దానిని పాడవచ్చు, పాడాలి కూడాను. సచల్ గతించి ఒకటిన్నర శతాబ్దాలు గడిచినా వారికి కఫీ రంగంలో ఉన్న అగ్రస్థానాన్ని సవాలు చేయడానికి ఎవ్వరూ సాహసించలేదు.

సచల్ కఫీలు ఎప్పుడూ హేతువుకు అతీతంగా ప్రేమను స్తుతిస్తూ ప్రియతముని నుండి వేరైన విరహవేదనా భరితమైన గూఢార్థంతో ఉంటాయి. సచల్ సువిఖ్యాతి నొందిన ఒక కఫీలో ప్రథమ పంక్తి ఇలా ఉంటుంది: 'ఆ హృదయము త్రాగినది పాత్ర నిండుగా (ప్రేమ మదిర) మైకమునందున్నది'. తరువాత పంక్తి 'ఎక్కడిది స్థానము, ఏదైన మతమునకు, కుఫ్ర్ (భిన్నమతావలంబన) యా, లేక ఇస్లామా ? మన్సూర్ వధ్య శిలకెక్కాడు చాటించుచు "నేనే పరమాత్మను" అని ఈ ప్రేమ నీపై అంక్షలు గొని తెచ్చు నీ తలపై, నిన్ను పూర్తిగా అవమానం పాలు చేయును'.

సచల్ హిందీ కఫీలలో చాల ప్రచారంలో వున్నదిది. ఇందులో వారు యీ విధంగా తమ విశ్వాసాన్ని వ్యక్తం చేశారు.

ఒక అవాలోచితమైన ఆ ప్రియుని స్పర్శ
నన్ను పరవశుణ్ణి చేసింది
ఇంక నే చింత నొంద ఉపవాసమునకు
మరి ప్రార్థనలు జ్ఞప్తి నుండవు
మదిరకై నాకెప్పుడు నుండు భ్రమలు
పగలు గాని మరి రాత్రి గాని
ఆపలేడాతడు నన్ను దూరముగా

సచల్ పద్యాలన్నీ నిగూఢ ఆధ్యాత్మిక సంబంధమైనవే కానక్కరలేదు. తమ స్వభావ సిద్ధమైన లౌకిక బంధాలతో గూడిన కఫీలలో ఒకటి :

ఎవరికి నా హృదయము విప్పి చెప్పకొందు ఓ సోదరీమణులారా ?
పుర్‌హూన్ పణమొడ్డినాడు అతని విశ్వాసము - విడిచిపోయినాడు.
నే నొకపరి తొంగి చూచితి ప్రేమైకమూర్తిని గవాక్షము నుండి
ప్రియుడొక్క క్షణము తిలకించె - మరి విడచి పోయె
అతని చెంత నుండె విల్లును అమ్ములను మరి పట్టా కత్తియు
అతడు నా హృదయమును చీల్చుకొని పోయె - విడిచిపోయె
ఏమి పని సచల్‌కు యిప్పుడు ప్రత్తి గింజలు, నూలువడుకుటతో ?
ప్రియుడు మెరుగు పెట్టె పంటెకోల - మరి విడిచిపోయె.

ప్రేమయను రసవాదం ద్వారా ఆత్మపరమాత్మతో ఏకమగుటను గురించిన అత్యున్నత ఆధ్యాత్మిక సత్యాన్ని చెప్పిన సువిఖ్యాతి నొందిన సచల్ కఫీ ఇది -

ఆతడు తెలిసికొనుచుండే తననే
లేదు మరి యేదియు ఆతని దృష్టిలో
దీనినే ఎరుక చేసి కొనుటకు
ఆతడు చిక్కుకొనియె ప్రేమలో
మన్సూరాయె వధ్యశిల నెక్కుటకు
ఆతని తల నరకించు కొనుటకు మాత్రమే
ఆతడుపయోగించె ఈజిప్టు విపణి వీధుల
బానిసగా అమ్ముడు పోవుటకు మాత్రమే
(జోసెఫ్‌ను గురించిన అన్వయం)
సచు పలుకును అచ్ఛమగు సత్యమును

మాటలాడుట కాతని స్వల్పకాల నివాసము భువిపైన, దైవత్వం, మానవుడు, అంటూ పెద్ద పెద్ద మాటలతో రణగొణ ధ్వని చేస్తూంటే సామాన్య మానవులు తప్పు త్రోవ పట్టే ప్రమాదం ఉన్నదన్న భావనతోనే నిష్కాపట్యంతో ఘాటుగా వ్రాసిన వారి పద్యాలను సచల్ నాశనం చేశారని రషీ అంటారు. నిజం ఏమైనప్పటికీ, సచల్ త్రిమూర్తులనదగిన గొప్ప కవులలో సాటిలేని వారనడానికి తగినంతగా సాంప్రదాయ సిద్ధమైన తమ సాహిత్యాన్ని విడిచివెళ్లారు. రషీ రెండు ఉదాహరణలతో చేర్చి పేర్కొంటారు. ఒక దానిలో ఆచారం ప్రకారం సింధులో దూతగా వ్యవహరిస్తూ వచ్చిన వాయసాన్ని ఉద్దేశించి పలుకుతూ యీ విధంగా అర్థిస్తారు సచల్: 'భగవంతుని తోడు, ఆ ప్రేమైకమూర్తి వద్దకుపోయి తన ప్రియురాలిచ్చిన సందేశాన్ని అందించుము. కాని అచటికి పోయిన వెంటనే అతని పాదములంటి శతప్రణామములు, అభినందనలు తెలుపుము. ఓ ప్రియుడా, నీవు లేని చోట, శోకము తప్ప వేరేదియు లేదని ఆతనికి చెప్పుము. తిరిగి వత్తునని ఆన చేతునని కబురంపుము.' రెండవ దానిలో మరూయీ స్వస్థలమునకు పోవ నుత్సుకతతో అంటుంది 'గతరాత్రి నాకు శుభవర్తమాన మందినది. మా తండ్రి భూములు వికసించి, పూచి ఫలిస్తున్నాయి. మెరుపులు ఢళ ఢళ మని శబ్దించుచుండులాగున మేఘములు బ్రద్దలగుచున్నవి. ఝురులు పొంగి పొరలుచున్నవి. ఉపనదు లన్నియు అంచులు దాటి ప్రవహించుచున్నవి.'

సచల్ కఫీలు, షా ఎడారి సంగీత ఝురులు, శ్రోతలను తగిన విధంగా ఆకట్టుకోవాలంటే వారి హృదయాలు, ఆ పరమాత్మ వైపుకు ఎగసి పోవాలంటే సువిశాలమైన భావనా ప్రపంచం, పైన ఆకాశం, క్రింద భూమి మధ్య విస్తరించవలసి ఉంటుంది. సినిమా సంగీతాన్ని తెగడు

తున్నట్లుగానే ఆధునిక ఆచారం ప్రకారం ఒక ఇరుకైన గదిలో జనం పోగై వారి గేయాలను వింటూంటారు. అయినప్పటికీ, అన్ని పరిస్థితులలోనూ, అన్ని అభిరుచులు గలవారినీ ఆకర్షించి తగినంత ప్రతిస్పందన కల్గిస్తాయి షా పద్యాలు; కాని స్వతంత్ర భావసంపదతో, స్వతంత్ర ఆలోచనలతో నిండి వున్న సచల్ పద్యాలు విని ఆనందించడానికి ఆ విశాల ప్రదేశాలు, విచ్చల విడిగా తిరిగే అవకాశమూ వుండాలి. డర్రాన్‌లో వారి సమాధి వద్ద నాలుగు దిక్కులా విస్తరించి వున్న విశాల ప్రదేశాల మధ్య ఫకీరు - నర్తకుల బృందం 'ఒడలు మరచి' సచల్ కఫీలను పాడుతూండగా విన్నవారు జీవితంలో మరువరాని అనుభూతిని పొందుతారు.

# 10

# సమీా, వారి శ్లోకాలు

సుప్రసిద్ధమైన ఒక దోహాలో కబీర్ ఇట్లా అంటారు: 'చంద్రుడు చల్లగా నుండక పోవచ్చును. మంచు ముద్దయే (అతడే) ఐన హిమావన్నగం కూడా చల్లగా నుండక పోవచ్చును. కాని భగవధ్యానంలో అచ్చాదితుడైన ఆ సాధువు మాత్రం ఎల్లప్పుడూ చల్లగా, నిర్మలంగా ఉంటారు' అని. సింధీ కవులలో సమీా ఆ కోవకు చెందిన వారు. వారెల్లప్పుడూ చల్లగా శాంతంగా ఉంటూ ఆత్మధ్యానంలో నిమగ్నులై, భగవంతుని స్మరిస్తూ, తన సుదీర్ఘ జీవితంలో తన విధులనన్నిటినీ సమచిత్తంతో సక్రమంగా నెరవేర్చుకుంటూ చీమ (చీటి) నుండి ఏనుగు (కంచర్) వరకు, అందరి యెడల సమభావ చిత్తులై ఉండేవారు.

వారు 107 ఏండ్లు (1743-1850) జీవించి ఉన్నారా? లేక 120 ఏండ్లు (1730-1850) వరకు జీవించి ఉన్నారా అన్నవాద మొకటి ఉన్నది. సమీా మరణించిన ముప్పై ఏండ్లకు వారిని గుర్తించి ప్రపంచానికి వారిని పరిచయం చేసిన మొదటి కవి కోరోమల్ ఖిల్ నాని. మరణించే నాటికి సమీా వయసు 107 ఏండ్లని చెప్పారు కాని వారి సాహిత్యానికి సంపాదకత్వం వహించిన ఇటీవలి వారు ప్రొఫెసర్ బి. హెచ్. నగ్రానీ, సమీా మరణించిన నాటికి వారికి 120 ఏండ్లు అని అభిప్రాయ పడినారు. నగ్రానీ అభిప్రాయానికి విరుద్ధంగా చెప్పడానికి బలీయమైన కారణమున్నది ఏ కథనం ప్రకారం చూసినా, సమీా పుత్రుడు ఘనశ్యాందాస్

తన తండ్రి మరణించేనాటికి నలభై సంవత్సరాల ప్రాయంవాడే. సమీ జనన సంవత్సరం 1730 గా భావించినట్లైతే, ఘనశ్యాందాస్ తన తండ్రి ఎనభైయవ ఏట జన్మించి ఉండాలి, అది అసంభవం. ఏది ఏమైనా సమీ పండుముదిమి వరకు జీవించి ఉన్నారనడం తథ్యం. వారి మిత జీవనం, సమభావన, నిర్మల మన స్వభావం వారి దీర్ఘాయుస్సుకు దోహదం చేశాయి.

త్రిమూర్తులైన గొప్ప సింధీ కవులలో షా అరువది నాల్గు ఏండ్లు, సచల్ తొంభైఏళ్లు, సమీశతాధిక వర్షాలు జీవించడం, కవిగా వెలుగొంద డంతో పాటు దీర్ఘకాలం జీవించవచ్చుననడానికి మంచి తార్కాణం. కాని షా వర్ణనలు, నాయికల రోదనల నుండి, అగ్ని పర్వతాలు బ్రద్దలగు సచల్ విప్లవాతక రచనలు, అటనుండి, సమీ ప్రశాంతతో గూడిన శ్లోకాలు, వారి చింతా రహితమైన స్థితి, ఇవి అన్నీ గొప్ప పరిణామాలు. వర్డ్స్‌వర్త్ గురించి విలియం వాట్సన్ అంటారు : 'నీ కున్నది, అలసిన పాదములకు విశ్రాంతి యనుకానుక' అంటూ 'వారిలో వడిగాలులు, వెలుగు మంటలు, మానవులు చూడలేరు, కాని భువిపై శాంతిని' అని జోడిస్తారు. ఇదే విధమైన ప్రశం సలు సమీకి కూడ వర్తిస్తాయి కాని వర్డ్స్‌వర్త్ కంటె అధికంగా న్యాయం చేకూర్చే విధంగా శ్లాఘించాలి. (శమీ పరమపదించిన సంవత్సరంలోనే వర్డ్స్‌వర్త్ కూడా మరణించడం కాకతాళీయమేనా ?)

వారి జన్మతిథి ఏదైనప్పటికీ సమీ కల్హోరా, తల్పుర్‌ల కాలంలో జీవించి, సింధును బ్రిటిష్ వారు ఆక్రమించడం కూడా చూశారు. కాని వారి రచనలలో ఎటువంటి పాలనా, పరిపాలనా ఒత్తిడులకు వారి జీవితం ప్రభావితం అయినట్లు సూచన మాత్రంగా కూడా కనబడదు. జీవి తాంతం వారవలంబించిన వృత్తి లేక పనిని గురించిన ప్రస్తావన, అదిన్నీ ఉపమానసయుతంగా చెప్పినది. వారి పద్యాలను పరిశీలిస్తూ 'నిజమైన వ్యాపార సరకులు', 'లాభసాటి వ్యవహారం' అన్నవి మాత్రం గోచరిస్తాయి. సింధులోని అతి పెద్ద పట్టణం, మధ్య ఆసియాలోనూ పశ్చిమ భారతం లోనూ ఖ్యాతి గడించిన విపణి కేంద్రం అయిన షికార్ పుర్, ప్రసిద్ధికెక్కిన వస్త్రాలకు ఎంపోరియం అమృత్ సర్‌ల మధ్య వ్యాపార రీత్యా తిరిగారు. వారు పశ్చిమ, మధ్య ఆసియాలలో గణుతికెక్కిన వ్యాపారి అనిగాని, సిక్కుల పవిత్ర పట్టణంలో మహారాజా రంజిత్ సింగ్ పరిపాలనలోని అత్యుత్తమ కాలాన్ని వారు ఎరుగుదురని గాని వారి కవిత్వంలో ఎక్కడా మనకు గోచరించదు. బట్టల వ్యాపారిగా, కమిషన్ ఏజెంటుగా, కార్య భారంతో ఉంటూ వారితెగ హిందువులు, ఆ రాష్ట్ర వాసులతోనే కాక పఠాన్ వర్త

కులు, సిక్కులతో కూడ తరచు కలుస్తూ ఉండేవారు. ఒక జాతి, మత ప్రజల నుండి వేరొకరిని గుర్తించడానికి వారికేమైనా ఆధారాలున్నాయా అని తెలుసుకోడానికి వారి పద్యాలలో ఎక్కడా సూచనా మాత్రంగా కూడా కనబడదు. ఏదైనా ప్రత్యేకంగా వారు పేర్కొన్నారంటే అది నిమ్న జాతులవారి గురించి, అస్పృశ్యులను గురించి మాత్రమే. అది కూడా భగవంతుని ఎదుట వారికీ, ఉన్నత జాతుల వారికీ భేధం ఏదీ లేదని ధృవీ కరించి చెప్పడానికి మాత్రమే: 'సమీ, నిజమైన గొప్పతనం భక్తునికే చెందుతుంది. వారెవరైననుసరే. స్వయం కృషి వల్లనే అతి తక్కువ కులంవారు అత్యున్నత స్థానాన్ని పొందగలిగారు. ఊడ్చువారు, చర్మ కారులు, సాలెవారు, (భగవంతునిపై) నిరంతర భక్తితో ఉన్నతులైనారు.

సమీ ఆలోచన సారాంశం బట్టల దుకాణంలోగాని, మఠంలోగాని వారికి అతిముఖ్యమైనది వారొక శ్లోకంలో శబ్దరూప మిచ్చినది.

సమీ, యీ ఇంటిలో వేరొక వాసమున్నది
ఆ వాసములో కలదు మరి యొక నివాసము
ఆ యింట నున్నాడు ఆతడు ఇల్లు లేనివాడు
అందకుండ జ్ఞానేంద్రియములకు, వాక్కునకు, మదికిని
పరిశుద్ధుడు, వర్ణనాతీతుడు, నిశ్చలుడు
ఆ గురువు ఎరుక పరచె యీనిత్యమైన శోభ.

ఈ శ్లోకానికి రకరకాల భావార్థాలు చెప్పబడ్డవి. కాని చాలా సామాన్యమైన వ్యాఖ: ఆత్మ, అదియే పరమాత్మ, అయిననూ మొత్తం దేహంకాదు, నక్షత్ర సంబంధమైనదీ కాదు, ఆకస్మికంగా సంభవించినదీ కాదు, దానిని జ్ఞానేంద్రియాల ద్వారాగాని, మనస్సుతోగాని, జ్ఞానం, వాక్కుల ద్వారా గాని చేరలేము. ఐనా, ఇతర శ్లోకాలు కొన్నిటిలో యీ ఆత్మను గుర్తించే మార్గాన్ని వివరించే విధమున్నది. ముఖ్యమైన పని, మనకన్నుల నుండి సత్యాన్ని మరుగుచేస్తూన్న మాయ అనే తెరను ఛేదించాలి. ఈ మాయ ఒక్కటియే అతిస్వల్ప మాత్రంగా సమీని చికాకు పరచడంలో విజయం పొందింది. మాయను గురించి వ్యవహరించేటప్పుడు మాత్రం వారు కొంచెం గొంతెత్తి, పైశాచీ, మాయలేడీ, వంటి పదాలను, దుష్టవర్తనురాలు అనడానికి పర్యాయ పదాలుగా వాడారు. అది తప్ప ప్రత్యేకించి కీడు తలపెట్టు ఏవ్యక్తి గాని పాలకవర్గలో తప్పుడు పనులు చేయువారుగాని, వారి కోపానికి ఆక్షేపణకు గురికారు. నలుబది ఏండ్లు వారీ మాయవలలో

చిక్కుకొని ఉన్నారు. అప్పుడు భగవాను డాతనిని విడిపించాడు. సత్యాన్వేషకుల చాలమంది జీవితంలో నలువదియవ సంవత్సరం ఒక గొప్ప గండంగా రుజువయింది.

చెయిన్‌రాయ్ బచుమల్ (లేక మురళీధర్), దత్తారమణి, తరువాతి కాలంలో సమిగా పేరొందిన వీరు షికార్‌పుర్‌కు చెందిన సుప్రసిద్ధ లుండీల సంఘానికి సంబంధించినవారు. వారు బట్టల వ్యాపారం, (కమీషన్ ఏజంట్) వృత్తి చేపట్టారు. వారు భాయ్ గంగారాం తిండిన్మలానీకీ ప్రతినిధిగాను, రావల్‌పిండి, అమృత్ సర్‌లకు చెందిన ఒక పఠాన్ వర్తకుని ప్రతినిధిగాను పనిచేశారని చెపుతారు. కాని వారు ఎవరి ప్రతినిధిగా వ్యవహరించినా, వంశానుగతంగా వస్తున్న బట్టల వ్యాపారాన్ని మాత్రం విడనాడ లేదు. అది వారి వంశీయులు, భారత దేశవిభజన జరిగే నాటివరకూ కొన సాగించారు. వారివృత్తిలో ముఖ్యకేంద్రాలు షికార్‌పుర్, అమృత్‌సర్‌లు రెండూను. వారు తరుచుగా యీ రెండు కేంద్రాలకూ ప్రయాణం చేస్తూ ఉండేవారు. వారి తొలి శ్లోకాలు షికార్‌పుర్‌లో వ్రాసినవి, తరువాతవి అమృత్‌సర్‌లో వ్రాసినవి. షికార్‌పుర్‌లో ఒక పూర్తి ప్రదేశానికే 'సమీషీర్' అని వారి జ్ఞాపకార్థం నామకరణం చేశారు, ఒకమంచినీటి బావికి వారి పేరుపెట్టారు. అయితే అమృత్‌సర్‌పైన, అక్కడి ప్రజల జీవనంపైన వారి ప్రభావం ప్రసరించినట్లు చూపడానికి లిఖిత పూర్వకమైన ప్రమాణాలేవీలేవు.

వారి జీవితంలో చెప్పుకోతగ్గ సంఘటన ఆ కాలంలో గొప్ప పండితులుగా వేదాంతులుగా ప్రసిద్ధికెక్కిన స్వామి మెంఘ్‌రాజ్ వారిని కలుసుకొనడమే. వారప్పుడు షికార్‌పుర్‌లో హాథీగేట్ వద్దనున్న హేమన్‌దాస్ మఠంలో బసచేసి ఉన్నారు. స్వామి మెంఘ్‌రాజ్ అసలు భావల్‌పుర్ సంస్థానంలోని అహ్మద్‌పుర్‌కు చెందినవారు. వారు కాశ్మీర్ పండితులని కొందరి అభిప్రాయం. వారు కాశ్మీర్ వాసియైనా, భావల్పురి వాసియైనా మనకది అప్రస్తుతం. కాని వారి ఆధ్యాత్మిక ప్రబోధాల వలన భాయి చెయిన్‌రాయ్ వారి జీవితంలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమై వేదాంతులైనారు. భాయి చెయిన్‌రాయ్ రచించిన శ్లోకాలలో ఎక్కడా తన పేరు వాడలేదు. ఎప్పుడూ గురువునే అధికాంశం సమీ (స్వామి అనుటకు బదులుగా వాడుకలోనున్న ప్రయోగం) అనీ, లేక బ్రాహ్మణుడు అనీ లేక మెంఘో అనీ వాడేవారు. ఈ విషయంలోను, మరికొన్ని ఇతర విషయాలలో కూడా, వారు సిక్కు గురువుల పేరు తరువాతనే వారిని పిలుచుకొనేవారు. ఉదా: గురునానక్, స్వామి మెంఘ్‌రాజ్ వేదాంతాన్ని తమ పద్యాల ద్వారా వివరించేవారి కర్తవ్యాన్ని చేపట్టేలాగున తమ శిష్యులను ఉత్తేజితులను

చేశారు. వేదబోధనలను వచనంలోగానీ, పద్యరూపంలోగానీ చెయ్యాలి అన్నది తమ ఆదర్శమని చాలాసార్లు సమీ ప్రకటించారు. వారు ఆకార్యాన్ని ఘనంగా నెరవేర్చి గురుదక్షిణగా అర్పించారు.

'సమీ' అన్న తమ గ్రంధంలో కల్యాణ్ అద్వానీ అలీనవాజ్ అనే ముస్లిం భక్తునిపేరు చెపుతూ, ఆధ్యాత్మిక బోధలకు, మనశ్శాంతికి, సమీ అలీనవాజ్ వైపు ఎక్కువగా ఆకర్షితులౌతూ ఉండేవారని అంటారు. మరి కొందరు బైరాగి నారాయణదాస్, మరికొన్ని ఇతర పేర్లను పేర్కొన్నారు. సమి మెంఘ్‌రాజ్ వద్ద వారు గ్రహించినది, నేర్చుకున్నది చాలా గొప్పది. వారు ఇతర ముస్లింభక్తులు, హిందూ సన్యాసులు వీరి వద్ద నేర్చిన దానిపై ధ్యానముంచుట వ్యర్థం. నాలుగు వేదాలు, షడ్విధములైన హిందూతత్వ శాస్త్రాలు, 18 పురాణాలు, భగవద్గీత మొదలైన వాటన్నిటినుండి విస్తృతంగా ఉదాహరణలు యిచ్చారు. సిక్కు పవిత్రగ్రంధాల ప్రభావం పూర్తిగా ఉన్నది. కర్మ, జ్ఞాన, భక్తి యోగాలలో గానీ, వేదాంత శాస్త్రాలలోగాని, వారు నేర్వవలసినదేదీ మిగులలేదు. వారు ఇరువది మూడు సంవత్సరాల వయసు వారై ఉన్నప్పుడే గురువుల పాదసన్నిధిని కూర్చుండి అధ్యయనం చేశారట. పదిహేడు సంవత్సరాలు వారు నేర్చుకొన్న విద్యను అవగాహన చేసుకొనుటకు పట్టింది. నలువదియవయేట వారు పరిపూర్ణతను సాధించారు.

సమీ శ్లోకాలలో కొన్ని హిందూ ముస్లిం కవుల పద్యాలు సైతం చేర్చబడ్డాయి. షా పద్యాలను కూడా కొన్నిటిని అర్థాలు విడమరచి స్పష్టంగా చెప్పినవి చేర్చారు. షా వారి సమకాలీనులు, వారికి పెద్దలు. వారిని గురించి ముందు ముందు ముచ్చటించుకుందాం. వీటివలన వారి సర్వజన సమ్మతమైన సహానుభూతి, విస్తృతమైన వారి జ్ఞానం వెల్లడి అవుతాయి.

వారు శ్లోకాలు, పద్యాలు వ్రాసిన పద్ధతిని గూర్చిన సంఘటనను వర్ణించడానికి వారి జీవిత చరిత్రకారులు ఉవ్విళ్లూరుతారు. వారికి లేఖకులు ఉండేవారుకాదు. వారే స్వయంగా కాగితపైనా, లేక కట్టెముక్కలపైనా గురుముఖి లిపిలో వ్రాసి ఒక జాడీలో వేస్తూ ఉండేవారట. వారి పుత్రులు ఘన్‌శ్యాందాస్ వాటన్నిటిని ఒకచోట చేర్చేవారట. వీరి రచనలన్నిటినీ సవరించి ప్రచురించవలసిన ఒక సాధువు ఆ ప్రతిని తీసుకొని మాయమై పోయారన్న కథలు ప్రచారంలో ఉన్నాయి. ఒకటి రెండు జాడీలు

మాత్రమే కాక వారు తమ రచనలను భద్రపరుచు స్థలములింకా ఉండ వచ్చును. సమీ బోధననల సారాంశం, దయారాం గిడుమల్ కలంనుండి ఉపోద్ఘాతంతో గూడి వ్రాయగా 2100 శ్లోకాలను, సమీ రచనలను సేక రించి, వారు మరణించిన 35 సంవత్సరాల తర్వాత ప్రచురించిన శాశ్వత కీర్తి సింధీ వచన వాఙ్మయానికి తండ్రియైన కౌరోమల్ ఖిల్‌నానికే చెందుతుంది.

కౌరోమల్ ఖిల్‌నాని ప్రచురించిన సమీ మూడు సంపుటాలు యీనాడు కూడా అమూల్యమైనవి. మొదటి ప్రచురణ 1885 - 1890, రెండవది 1898, మూడవది 1914లో సంపాదకులు జీవించి ఉండగానే అచ్చయ్యాయి. మూడు భాగాలలోను సంపాదకుల పీఠికలు, సమీ బోధనలకు దయారాం గిడుమల్ వ్రాసిన సారాంశం, అపూర్వపదముల వివరణ పట్టిక చివరఉన్నాయి. 1874లో సింధీ భాషా పాఠ్యపుస్తకాలలో వీరి శ్లోకాలు కొన్ని చేర్చడానికి ఎవరో నిష్ఫలమైన ప్రయత్నాలు చేసి ఉన్నారనీ, 800 శ్లోకాలు గురుముఖి లిపిలో లోపభూయిష్టంగా అచ్చు వేశారని పీఠికలో సంపాదకులు పేర్కొన్నారు. సంపాదకులు 2100 శ్లోకాలను సేకరించి వాటిని సాధ్యమైనంతమేరకు తప్పులు లేకుండా ఎత్తి వ్రాసి, సమీ జీవిత విశేషాలను లభ్యమైనంత మేరకు ఓపికతో చేరదీసి సింధీ పాఠకులకు అందించారు.

వేదాంత బోధలు వారు చేసినవి క్లుప్తంగా వివరించి చెప్పే ఆఖరి కొద్ది పంక్తులు సంపాదకులు వ్రాసిన ఉపోద్ఘాతంలోనివి. అత్యంత మహత్వ పూర్ణమైనవి, అంటారు. 'జీవాత్మను యీ అనిశ్చిత ప్రపంచమే సత్యమని భావించే లాగున అజ్ఞానం తప్పు త్రోవను పట్టిస్తుంది. కామక్రోధాది చెడు శక్తులు మానవుని తమ వలలో బంధించి వైచి తాను అనేది వేరు భావనలో ఆతడు మైమరచేలాగున చేస్తున్నవి. సాధువుల సాంగత్యంలో అవిద్య అనే తెర తొలగిపోతుంది. మానవుని మనసు నుండి తాను అను వేర్పాటు భావన మాయమౌతుంది. తాను భగవంతుని నుండి వేరు అనే భ్రమ తొలగిపోతుంది. కాంతి కిరణం అది జనించే స్థానంలోను, నీటి బొట్టు సముద్రంలోను ఐక్యమగునట్లే ఆత్మ పరమాత్మలో ఐక్యమైపోతుంది.'

దయారాం గిడుమల్ యీ కొలది పంక్తులలోనే విస్తరించారు. అది సింధీ సాహిత్యంలో ఆణిముత్యం. కౌరోమల్ ఖిల్‌నాని క్లుప్తంగా చెప్పినది, దయారాం గిడుమల్ సంగ్రహ పరచి సవ్యాఖ్యల సహాయంతో సమీ శ్లోకాలను పాఠకులు సులభంగా అర్థం చేసుకోవచ్చు.

దయారాం గిడుమల్ ఇలా అంటాడు: మానవుడు ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని సాధించడానికి కామ, క్రోధ, మోహ, మధ, మాత్సర్యాలనే ఐదు దుర్లక్షణాలు ముందుకు సాగకుండా ఆటంక పరుస్తాయి. ప్రవక్తలు, మహాత్ములైన గురువులు, ఇతర మత గురువులు యీ పంచ మహాభూతా లను గురించి మనలను హెచ్చరిస్తూనే ఉన్నారు. కాని మనం అడుకోలే నంతగా వాటివలలో చిక్కుకొని పోయాము. ఏదో పెద్ద విపత్తు సంభ వించినప్పుడు లేదా ప్రమాదకరమైన జబ్బు చేసినప్పుడే యీ దుష్టశక్తుల హానికరమైన చేతలు మనకు గుర్తుకు వచ్చి అప్పుడు భగవంతుని ధ్యానం మొదలవుతుంది అందుకే 'జీవితంలోని వాస్తవాలను గుర్తించేటందుకు మేలుకొలుపుగానైనా మనం ఆపదలను అనారోగ్యాన్ని ఆహ్వానిద్దాం.

ఈ పంచ మహాభూతాలను విదిలించుకొనుటకు ఒకే మార్గం ఉన్నది. అది యెల్లప్పుడు సాధువుల మహాత్ముల సాంగత్యంలో ఉండడం. వారు నిత్యమూ భగవదాచ్ఛాదితులై సమదృష్టితో మంచి చెడులను గ్రహిస్తూ అనిత్యమైన విలాసాలను త్యజిస్తారు.

అయినా సాధుసాంగత్య మొక్కటే చాలదు. తాను సాధువు అగుటకు ప్రయత్నించాలి. ఆత్మ సాక్షాత్కారము, భగవత్ సాక్షాత్కారములకై పాటుపడాలి. ప్రాపంచిక విషయాలు వదలి సన్యాసియైనంత మాత్రాన సాధువు కానక్కరలేదు. నిజానికి జీవిత సత్యాల నెదుర్కొని, వాటిని ధైర్యంగా ఎదిరించగలవాడే సాధువు. జీవితాన్ని ఒక బాధ్యతగా నెంచి ఆ బాధ్యత యొక్క విధులను విధేయతతో, నిరాపేక్షతో నిర్వర్తించువాడే సాధువు. ఐశ్వర్యాలు తన చేత చిక్కితే తాను వాటిని కూడబెట్టకుండా ధర్మకర్తగా వాటిని పదిమందికి పంచిపెట్టాలి. అతడు పండితుడైతే వారి పాండిత్యం ఇతరుల సేవకే వినియోగించాలి.

సమీ శ్లోకాలలో మానవుడు మమతను (తనయందే ప్రేమ) విడ నాడి, మానవాళిని పరమాత్మను మాత్రమే జ్ఞప్తియందుంచుకొన వలెనన్న విషయంపై నొక్కి వక్కాణించారని దయారాం గిడుమల్ అంటారు. స్త్రీ ప్రేమ కొరకై మరణించిన వారున్నారు. కాని సౌందర్యాని కంతకూ ఆధారమైన దాని కొరకై జీవించి మరణించడమే అత్యున్నతమైన కార్యం. సమీ శ్లోకాలు కుడా అబ్దుల్ లతీఫ్ పద్యాల వలెనే ఇతరుల సేవకే అంకితమై ఆత్మ త్యాగాన్ని చెయ్యాలని బోధిస్తాయి. భగవంతుడిచ్చిన అన్ని శక్తులు గుణాలు కూడా స్వప్రయోజనాలకు, తుచ్ఛమైన ఆర్జనలకు వినియోగ పరచకుండా, భగవద్భక్తి అతని సృష్టియైన జీవుల సేవకొరకు మాత్రమే

వినియోగించాలని బోధిస్తాయి. ఈ కార్యాలు నిర్వర్తించుటలో సాధువు అన్ని ఆపదలను, దుఃఖాలను ఆహ్వానిస్తాడు. విషమును అమృతముగా నెంచి త్రాగుతాడు. వివరగా దయారాం గిడుమల్ యీ విధంగా అంటారు: 'ఇతరుల క్షేమము తన క్షేమమే, ఇతరులకు సేవచేయుట తనను తాను సేవించుకొనుటయే! భగవంతునికి దాసునిగా యుండుట, చక్రవర్తు లనుభవించు సర్వం సహాధికారముల కంటె ఉత్తమమైనది.' సమీ నీతి బోధలు ఇంతకంటె బాగా సంగ్రహించి చెప్పడానికి వీలుకాదు.

కౌరుమల్ ఖిల్నాని కూర్పులో వెలువడిన గ్రంథం తరువాత, అరబిక్ సింధీ లిపిలోను, గురుముఖి లిపిలోను ఒక లాహోర్ ప్రచురణ 3,500 శ్లోకాలతో కూడినది, యిలాగే చాలా ప్రచురణలు వెలువడ్డాయి. కాని ప్రొఫెసర్ బి.హెచ్. నగ్రానీ వెలువరచిన నాలుగు సంపుటాలలో (మూడు సంపుటాలు అప్పుడే వెలికి వచ్చాయి) విస్తృతంగా వెలువరచిన గ్రంథం ఒక్కటే ముఖ్యంగా గమనించదగింది. 1955 లో యీ గ్రంథకర్త వ్రాసిన సాహిత్య పరమైన ఉపోద్ఘాతంతో వెలువడిన మొదటి సంపుటిలో వారి శ్లోకాలలోని తత్వవిచార సంబంధమైన, నీతి విషయికమైన విషయాలను చర్చించనేలేదు. నగ్రానీ ప్రచురణలో వారివనదగిన సుమారు నాలుగువేల శ్లోకాలు అచ్చవుతాయని ఆశించవచ్చు. నగ్రానీ ప్రచురణలో వేదాంతంపై సంపూర్ణమైన ఉపోద్ఘాతం, సమీ కాలంలో సింధులోని స్థితి గతులు వారి శ్లోకాలకు ఉన్న వివిధ పాఠభేదాలు ఉన్నాయి. విషయాల విధము ననుసరించి అధ్యయనం చేయదలచిన వారికి వీలుగా సమీ శ్లోకా లన్నిటినీ వివిధ శీర్షికల క్రింద - అవిద్య, మూర్ఖ్ మొ॥ విభజించి సరియైన శీర్షికలతో యిచ్చారు. వాటిలో కూడా ఒక్కొక్క శీర్షిక క్రింద వారు మొదట వ్రాసిన శ్లోకాలతో ప్రారంభించి, తరువాత వ్రాసినవి ఆ వెనుక ఇచ్చారు. ఇదంతా బహుపరిశ్రమ, జాగ్రతతో కూడిన పని అయివుండాలి.

సమీ శ్లోకాలను ఏర్చికూర్చి పలువురు వెలువరిచారు. వాటిలో వాధుమల్ మూల్ చంద్ (కౌరుమల్ సింధీ సాహిత్య మండలి) 1938 లో మంచి వ్యాఖ్యానంతో తెచ్చినది చాలా ప్రచారంలో ఉంది. ఇద్దరు సుప్రసిద్ధ సింధీ ఆచార్యులు ప్రొ : టి. ఎల్. వాస్వానీ, ప్రొ : ఎన్. ఎస్. షేర్వానీల చక్కని ఉపోద్ఘాత విషయాలతో 1937 లో సమీ శ్లోకాలను ఆంగ్లంలో అనువదించి Songs of the Spirit అన్న పేరుతో శాంతి ఎల్. షాహానీ వెలువరచిన గ్రంథ మొకటి. దేశ విభజనానంతరం భారతదేశంలో రెండు విశిష్టమైన లఘుగ్రంథాలు సమీ రచనలమీద వెలువడ్డాయి. ప్రొ : కల్యాణ్ అద్వాని సమీ రచనలపైన సంక్షిప్తంగా

వెలువరచిన చిన్న పుస్తకం ఒకటి ఉంది. ప్రొ : లేఖ్‌రాజ్ అజీజ్ సరళమైన భాషలో సమీ తత్వవిచారములను విడమరచి చెప్పడానికి ప్రయత్నించిన చిన్న పుస్తకం రెండవది.

దేశ విభజన తరువాత సమీగారిపై విస్తృత వ్యాఖ్యలతో ఏ గ్రంథమూ పాకిస్తాన్‌లో వెలువడినట్లు, ఈ గ్రంథ కర్తకు తెలియదు. దేశ విభజన తరువాత సింధీ వాఙ్మయంపై ఉర్దూలో రషీ చిన్న పుస్తకంలో సమీ గురించిన ప్రస్తావనేలేదు. అయితే దేశ విభజనకు కొంచెం ముందుగా షికార్ పురి ముస్లిం రచయిత ప్రొ : బద్వీ సమీ తన ఊరివాడేనని గర్వంగా చెప్పుకుంటూ తాను వెలువరచిన ఒక పుస్తకంలో వ్రాశారు.

ముప్పదిసంవత్సరాల క్రిందట మహమ్మద్ సిద్దిక్ మెమొన్ వ్రాస్తూ సమీ బ్రిటిష్ పాలనా కాలానికి పూర్వమున్న వారిలో చివరి వాడనీ, అట్లని ప్రాముఖ్యతలో తక్కువేమీ కాదనీ చెబుతూ ఇదివరకు ఏ రచయిత సమీ గురించి ఆలోచించని ఒక క్రొత్త విషయాన్ని చూపిస్తారు. సమీ వేదాంతి అయినప్పటికీ అది తక్కిన సూఫీకవుల సరళిలో, వారితో చక్కని పోలికలు కలిగి అతి తక్కువ అంశాలలో వారితో భేదిస్తూ ఉన్నవి - అన్న అంశమే. సమీ శ్లోకాలలోని వస్తు విషయం సూఫీ కవుల వస్తు విషయమేననీ అది 'మానవునిలోని ఆత్మ లేక జీవి, భగవంతుని లేదా పరమాత్మతో ఐక్యం చెందాలనీ, ఆ ఐక్యత చెందడానికి ప్రాపంచిక, విషయాసక్తమైన సుఖాలన్నిటినీ త్యజించాలి' అనీ మెమొన్ అంటారు. సూఫీపరమైన ఆలోచనలలో కనబడని రెండు ఆలోచనలను సమీ శ్లోకాలు విస్తరించి చెబుతాయి. (రుమీ సుప్రసిద్ధమైన గ్రంథభాగాన్ని మెమొన్ విస్మరించారు) మొదటిది ఆత్మ తిరిగి పునర్జన్మ నొందుట (మానవ జన్మకు ముందర జీవించిన 84 లక్షల పుట్టుకలు), రెండవది ఐదు భూతములు కామ, క్రోధ, లోభ, మోహ అహంకారాలు (సూఫీలు వీటన్నిటినీ కూడా కూడదీసి నఫ్స్ అమరహ్ స్వయంకృతాపరాధి అన్న పేరుతో పిలుస్తారు). కాని తక్కిన అన్ని విషయాలలోను సమీ శ్లోకాలలోను ముస్లిము సూఫీకవుల పద్యాలలోను విషయమూ, సందేశమూ అన్నీ ఒక్కటే. వాటిలో ప్రధానమైన నమ్మకాలు, సూత్రాలు యివి : 1. భగవంతుడు ఒక్కడే మరి వేరు లేదు. 2. భగవంతుని సృష్టి లోపరహితమైనది. 3. మానవుడు నిరంతర భగవధ్యానం చేస్తూ ఉండాలి. 4. బందగీ లేక భక్తిని సమర్పించడం అవసరం అంటే, దేవుని యందు భక్తి 5. హృదయపూర్వకంగా చేయని ప్రార్థనలు నిరర్థకం. సర్వము భగవంతుడే, సకలమూ అతని నుండియే సాగుచున్నది. 7.

నిజమైన మృత్యువుకు ముందరే వ్యక్తి మరణించాలి. 8. నిజమైన ప్రేమలేని జ్ఞానం నిష్ప్రయోజనం 9. నీ ప్రేమైకమూర్తి నీలోనే ఉన్నాడు. 10. నిజమైన ప్రేమికులు, భక్తులు బాధలనుభవించాలి.

సమికీ, సూఫీ విధానా లవలంబించే కవులకూ మధ్య భావాలలోను, అభిప్రాయాలను ప్రకటించడంలోను ఉన్న సామ్యాలను ఒక ముస్లిం కవి పరిశీలించడంముదావహమైన విషయం. వాస్తవానికి సమీ కూడా షా, సచల్ అంతటి సూఫీయే! కాని వారు ఉపనిషత్తులు, గీతాలోని సూత్రాలను వారి శ్లోకాలలో వేదాంత పరమైన చిక్కు ప్రశ్నలు స్వచ్ఛమైన కాంతితో విలసిల్లేలాగున చెప్పారు.

సమీ శ్లోకాలు కొన్ని ఆశ్చర్యకరంగా షా రచనల్లాగే ఉంటాయి. బహుశా వారి పద్యాలలో నుండి గ్రహించినవే కావచ్చు. లోక సహజమైన చదువులను గురించి అవి పాపం చెయ్యడానికి దోహదకారులు మాత్రమే అన్న శ్లోకం ప్రారంభంలోనూ, చివరిలోనూ ఒకటి రెండు మాటల తేడాతో అచ్చం షా పద్యంలాగే వుంటుంది. అదేవిధంగా సుహ్నీ మునిగిపోవడం గురించి ప్రస్తావనీ, తను ప్రేమించిన పరదేశీయుణ్ణి వెదకుట కొనసాగించుమని ఉద్బోధించడం మొదలైనవి సరాసరి షా నుండి తీసుకొనబడినవే! కల్యాణ్ అద్వానీ గారు ఒక పూర్తి అధ్యాయంలో సమీ, షాల గురించి వ్రాశారు.

సమీ శ్లోకాలు కూడా ఇతర సింధీ కవులు వ్రాసిన వాటి లాగే వుంటాయి. కాని మూడు పాదాలు మించి వున్నవి సాధారణంగా సింధీలో ఉన్న కఫీలుగా ఎంచవచ్చు. సమీ ఒక కవిత యిలా ప్రారంభం అవుతుంది.

ఈ అసత్యక్రీడ ఆతని యుక్తి
ఆటకాడు ఎంచుకొనును తనపాత్ర
ఇక్కడ ఆతడు పీర్, ఫకీర్, మరి ప్రభువు
అక్కడ ఆతడు షేక్, ముల్లా, మరికాజీ....

దీనిని సింధీ కఫీ సంగ్రహాలలో చేర్చారు. సింధీ కఫీల వలెనే పాడుతున్నారు. సమీ శ్లోకాలన్నిటిలోను హిందూ అలంకరణ కనబడుతూ ఉంటుంది. కాని వాటిలోని విషయం ఆధ్యాత్మిక తత్వం, అది సింధీయులందరి హృదయాలను ఆనంద పరుస్తుంది.

సమీా ప్రత్యేకతలు వారికి ఉన్నాయి. వారి భాష పూర్తిగా షికార్‌పుర్, ఎగువ సింధు భాష ; మధ్య సింధులో వలె కల్తీలేనిదై నిశ్చయంగా, శ్రావ్యంగా, సులభంగా, అంతగా భాషా ప్రవేశంలేని వారికైనా మనసుకు హత్తుకొనే విధంగా, ముఖ్యంగా స్త్రీలకు నచ్చేదిగా ఉంటుంది. షా పద్యాల తరువాత సింధీ స్త్రీలకు సుపరిచితమైన శ్లోకాలు సమీాగారివి మాత్రమే. సమీా శ్లోకాలలోని ఒకే విధమైన తాత్పర్యమూ, శ్రావ్యత, నిర్మలత్వమూ యివి సింధీయులను బాగా ఆకర్షించాయి. సమీాకాక మరే ఇతర కవి అయినా ఒకే విషయాన్ని వందలాది పద్యాలలో వ్రాసి వుంటే పాఠకులకు విసుగు పుట్టి ఉండేది. ఉదాహరణకు (నగ్రానీ సంపుటిలో) 107 శ్లోకాలకు తక్కువ కాకుండా 'మాయ' మీాద, 120 శ్లోకాలు 'అవిద్య' మీాద, 213 శ్లోకాలు 'అజ్ఞానం' మీాద, 277 శ్లోకాలు గురుముఖం (గురువుదరిజేరిన వాడు) మీాద, ఉన్నాయి. ఒకే అంశాన్ని పలుమార్లు చెపుతూ ఒకే విషయాన్ని చర్చిస్తూ పాఠకులను సమీా ఆకట్టుకున్న విధానం అత్యద్భుతం. చెప్పినదే తిరిగి చెపుతున్నప్పటికీ, ప్రతీసారీ వారి మాటలలో ఒక క్రొత్తదనం తాజాతనం గోచరిస్తూ ఉంటాయి. తమ వాక్చాతుర్యంతో పాఠకులను సమ్మోహితులను చేసే దోరణిలో ఉంటాయి. ప్రేమ మీాదే ప్రధానంగా వ్రాసిన కవులు ఆ విషయాన్నే తిరిగి తిరిగి చెబుతూ కొద్ది మార్పులతో తమ పాఠకుల ఉత్సుకతను ఆకర్షించగలిగారు. కాని ఊహా మాత్రమైన విషయాలను, ఆధ్యాత్మిక విషయాలను మాత్రమే తీసుకొని పాఠకులను తుదివరకూ ఆసక్తితో నిలబెట్టడమే కాక అమితానంద భరితులనుగా చెయ్య గలగడం సమీాకి ఒక్కరికే సాధ్యమైన ప్రత్యేకత. ఎలుగెత్తి చాటడం, మనసులో కామనలు చెలరేగే, రమ్యమైన దృశ్యాలను చిత్రించడం ఇలాటివి ఇతర కవులు చేసినవేవీ చెయ్యకపోవడం కూడా సమీా ప్రత్యేకతకు దోహదం చేకూర్చాయి. సమీా కల్పితమైన అద్భుత పద్యసాహిత్యం వ్రాయకపోవడం వారి మరొక ప్రత్యేకత. ప్రేమ, (కల్పితం) యుద్ధం యీా విషయాలు వారి శ్లోకాలలో ఎక్కడా వ్రాయకుండానే సమీా మనోహరమైన కవిగా ప్రసిద్ధికెక్కారు. ఆశ్చర్యమేమిటంటే వారు ఎప్పుడూ ప్రశాంతంగా ఉంటూనే తార్కిపద్ధతులనుకూడా అనుసరిస్తూ వుండడం. ప్రేమ, హేతువు అన్నవి ఒకే పక్షికి రెండు రెక్కల వంటివి - అని ఒకసారి వారన్నారు. వారి శ్లోకాలలో యీా రెండు ప్రధానాంశాలూ ఉన్నాయి - దివ్యమైన ప్రేమ అత్యున్నతమైన హేతువాదం యీా రెండూ కలిసి వారి కవిత్వానికి ఒక వింత, శోభను కూర్చుతాయి.

'మధురం' అన్న బిరుదును సింధీయులు సమీా కవిత్వానికి చేరుస్తారు. వైవిధ్యం లేకపోవచ్చునుకాని సమీా రచనలు ఒక విధమైన మాధుర్యాన్ని శ్రావ్యతను కలిగి ఉంటాయి. చెవికి ఇంపుగా సోకే వారి మాటలు, సంగీతం వింటూంటే వీటిలో నైపుణ్యం సాధించారా అనిపిస్తుంది. 'కాని మధురంగా ఎపోలో మురళి వలె అమృతము కలిపిన తీపి పదార్థాలలాగ' ఉంటాయి. ఇది వారు ఎట్లా సాధించారో ఎవరూ విశ్లేషించలేదు. సింధీ భాషలో సామాన్యంగా వాడుకలోనున్న పర్షియన్, అరబిక్ పదాలను సమీా వర్ణించలేదు. పాఠకుల కనులు మిరుమిట్లు గొలిపేలాగ డాంబిక విద్వద్ ప్రదర్శన ఎక్కడా లేదు. సంస్కారవంతుల చెవులకు అఘాతం కలిగించే నిందాత్మకమగు పరిభాషగాని, అసభ్యకరమైన పామరభాషగాని లేదు. సమీా కవిత్వం తీయని నిర్మల జలాలతో సాగిపోయే నదిలా ఉంటుంది. లోతుగా నిశ్చలంగా కంటికి దుప్పటి పరచిన భ్రమకలిగిస్తూ, అంతు పట్టని లోతుల్లో ఉంటుంది. మధురంగా మాత్రమే కాక, వ్యాధి నివారకమైన ఒక ఔషధంలాగ పని చేస్తూ ఉంటుంది.

సమీా కవిత్వం కమ్మదనము కలిగి ఉండకపోవచ్చుగాని, అది సరళం, నిర్మలం, మధురం. సింధీ వాఙ్మయంలో ఎక్కడైనా అద్భుతశైలి కనబడుతుందీ అంటే అది సమీా శ్లోకాలలోనే కనబడుతుంది. కాని దాని లోని విశేషం ఏమిటంటే, రాజులు, రాణులు, స్వర్గం, నరకం, యుద్ధాలు, రక్తపాతం, ఆఖరికి కల్పితమైన ప్రేమగాధలు, యివేవీ లేకుండానే అది అద్భుతంగా ఉంటుంది. వారికవిత్వంలో ఎక్కడా సాధారణమైన అలంకారిక దృష్టాంతాలేవీ కనబడవు. చెఱువులోని కమలం, విశాలమైన ఆకాశం, తనకు తెలియకుండానే నాభివద్ద కస్తూరిని మోస్తూన్న జింక, ఎడారిలోని ఎండమావులు, రజ్జుసర్పభ్రాంతి, దీపపు పురుగులు, గోపాల కృష్ణుని మురళి లాంటివి సాంప్రదాయికంగా వాడుకలోనున్న ఆలంకారిక ప్రతీకలనే సమీా ప్రయోగించారు. వీటి సహాయంతోనే ఇతర సింధీ కవులలో ఎక్కడా కానరాని కవితా జగత్తును సృష్టిస్తారు సమీా. వారి అద్భుతమైన శైలి సృష్టించిన రెండు సర్వదా నిలచి ఉండే చిత్రాలు. బహుశ - సుహాగాన్ (పతిసౌభాగ్యాన్ని పొందిన భార్య), బేగంపూర్ (దుఃఖములు లేని నగరం). ఆంగ్లభాషాపరిచితులైన పాఠకులకు సమీా కవిత్వం కలిగించే ప్రవర్ధమానమైన ప్రభావం కొన్ని సందర్భాలలో పిలిగ్రిమ్స్ ప్రొగ్రెస్ (Pilgrims Progress), ది ఇమిటేషన్ ఆఫ్ క్రైస్ట్ (The Imitation of hrist చదివిన తరువాత కలిగే భావాలతో పోల్చవచ్చు.

తాను సింధీ భాషలో వేదాలను వ్యాఖ్యానించే వాడనని సమీ వాదన. అది నిజమే! నిగర్వి గా వారు చేసినదా. హిందూ. సంస్కృతికి పట్టుకొమ్మలైన నీతి శాస్త్ర విషయాలైన త్యాగం, వైరాగ్యం, అహింస, వేదాంతం యొక్క హేతువాదం, కర్మయోగం, జ్ఞానయోగం, భక్తియోగం మొదలైనవి అత్యాశ్చర్యం గొలిపే రీతిని, సరళంగా, నైపుణ్యంగా, పరిపూర్ణంగా సమీ తమ శ్లోకాలలో విశదపరచారు. సమీ శ్లోకాలలోని నీతి శాస్త్ర విషయాలను తెలుసుకోవాలని కుతూహలపడేవారు దయరాం గిడుమల్ వ్రాసిన సారాంశాన్ని చదువవచ్చు. వారి అతి సరళ మైన పద్యాలు హిందూ తత్వ విచారాన్ని క్లిష్టమైన వేదాంత మర్మాలను వివరించి చెప్పారు; అని తెలుసుకొనగోరేవారు సగ్రానీ విస్తృతమైన ఉపోద్ఘాతాన్నీ లేఖ్‌రాజ్ అజీజ్ వ్రాసిన చిన్న పుస్తకాన్ని చదువవచ్చు. సాధారణ పాఠకులు నిగూఢములైన అనాద్ (బహుశ అనాహతం) లేక కుండలిని, లేదా వివిధ రహస్యాల జోలికి పోనక్కర లేకుండానే వారి శ్లోకాలను ఆనందించగలరు.

సమీ వేదవిజ్ఞానాన్ని సుబోధకం గావించి చెప్పిన ఎదురులేని గాయకుడు లేక కవి అయినప్పటికీ, హిందూగాని, ముస్లిముగాని ఇదివరలో చెప్పియుండని కొత్త విషయములేవీ చెప్పుటలేదనడంలో జాగ్రత వహించారు వారు స్పష్టంగా ఇలా అన్నారు: 'పర్షియన్‌లుగాని హిందీవారుగాని మహాత్ములందరూ ఒకే విషయమును గురించి చెప్పియుండిరి.' ముస్లిం సిద్ధులతో తమ తాదాత్మ్యత నెరుక పరచడానికి వారిలో ఏ ఒక్కరైనా వ్రాయగలిగినట్లుగా, పర్షియన్, సంస్కృత పదాలను ఉపయోగించి శ్లోకాలను వ్రాశారు. అందులో ఒకటి అజీబ్ అకల్ (అద్భుతమైన జ్ఞానం) అన్న పదాలతో ప్రారంభమయ్యే శ్లోకంలో ఆ సలిక్ (పారంగతుడు లేదా అన్వేషకుడు), దయచేసె (నాకు) అద్భుతమైన జ్ఞానము, దయతో ఆరుహ్ (జీవి) దానిని ప్రత్యక్షముగా ననుభవించె, అల్లకల్లోలమంతయు, మరికోపావేశము విడనాడె. ఆత్మ అధిరోహించె నూర్ మహల్ (తేజో మందిరము) నకు, మరి చేరెహక్ (భగవంతుడు లేక వాస్తవము)ను, ప్రేమయను సాధనము ద్వారా ఏకత్వములో ఐక్యము నొందెను.' ఈ శ్లోకంలో ప్రయోగించిన పరిభాష అంతా ముస్లిములు వాడునదేనని చెప్పవచ్చును. మరియొక శ్లోకంలో రెండేరెండు శబ్దాలు నిరాకార్, ఆకార్ అనునవి ముస్లిములకు వెంటనే అర్థం స్ఫురించని శబ్దాలు. ఈ శ్లోకంలోని విషయాలు సింధీయులకందరకు సమ్మతమైనవే: 'సమీ, నీవు చూచున దంతయు ఆ అద్భుతమైన వాని ప్రత్యక్ష స్వరూపమే. ఆ ప్రభువు తానే స్వయముగ ప్రత్యక్ష సాక్షియై

గమనించువాడు, పలుకువాడు, ఆలకించువాడు. ఆకార రహితుడైన అతడు యీలోకములో తానే సాకారుడైనాడు.' ('నిరాకార్' ఆకార రహితుడు, 'ఆకార్' అంటే సాకారుడు).

రెండు దశాబ్దాల వెనుక సింధు నుండి వలస పోయిన హిందువులకు సమీ శ్లోకాలు అత్యంత ప్రియమైనవి. కాని సింధీ ముస్లిములు వానిలో వారి హృదయములలో తమ సొత్తుగా భావించి భద్రపరచుకొను అమూల్య మైన సంపద కనుగొనగలరు. సింధీ కవులలో త్రిమూర్తులనదగు ప్రామాణికులైన గొప్పకవులలో ఒకరు. హిందూ భక్తకవి ఉద్యమం, సింధీ సూఫీ తత్త్వ ఆలోచన, ఉద్యమం యీ రెండింటి సమ్మేళనం యొక్క పరాకాష్ఠనందుకున్న కవులలో చివరి కవి సమీ. వీరి తరువాత బ్రిటిష్ వారి కాలంలో రంగమంతా పూర్తిగా మారిపోయింది సింధీ బెయిత్, దోహాలు వెనుకబడిపోయాయి. వాటి స్థానే పర్షియన్ ఛందోబద్ధమైన పద్య రచనలు చోటు చేసుకున్నాయి.

# 11
# ఆంగ్లేయుల కాలంలో పద్య వాఙ్మయం

1893లో బ్రిటిష్ వారు సింధును జయించిన సంఘటనకు సింధు జీవన సరళిలోను, సాహిత్య చరిత్రలోను ఒక గాఢమైన ప్రాముఖ్యత ఉంది. పదకొండు వందల సంవత్సరాలుగా ఉన్న ముస్లిం పాలన అంతమయింది. సాహిత్య రంగంలో జరిగిన గొప్ప మార్పు పర్షియన్ గణనకు రాకుండా పోయింది ; సింధీకి తన స్థానం తిరిగి ప్రాప్తించింది. మరో విదేశీ భాష ఆంగ్లం రాజ భాష అయింది. కాని సామాన్య వ్యవహారాలన్నిటికీ, దిగువ పరిపాలనా స్థాయిలలో వ్రాసే భాష, మాట్లాడే భాష సింధీయే.

సహజంగానే సింధీభాషలోనే, ఆ భాషను గురించి ఉద్రిక్తత, చైతన్యం ప్రారంభమయ్యాయి. నిఘంటువులు, వ్యాకరణాలు, భాషా శ్లోకాలు, పండితుల దృష్టిని ఆకర్షించాయి. పాఠశాలలో పాఠ్య గ్రంథాలన్ని పాఠ్యాంశాలలోనూ రూపొందించవలసి వచ్చింది - చరిత్ర, భూగోళం, వ్యవసాయం, గణితం మొదలైనవి. అటు తరువాత నలభై ఏండ్ల కాలం అంతకు పైబడి, వాస్తవానికి 1887లో దయారాం జెఠ్‌మల్ సింధు

కాలేజీ స్థాపించే వరకూ, అంటే ఉన్నత విద్య సింధులో ప్రారంభమయే వరకూ పాఠశాలలలో విద్యార్థులకు కావలసిన విధంగా సింధీ మేధావి వర్గం అంత ఆంగ్లం నుండీ, భారతీయ భాషల నుండీ అనువాదాలు చేసే పనిలో నిమగ్నులై ఉన్నారు. అది అనువాదాల యుగం.

సింధీ వచన వాఙ్మయాభివృద్ధి గురించి వేరొక అధ్యాయంలో చర్చించబడింది. ఈ అధ్యాయంలో యీ కాలంలో సింధీ పద్య వాఙ్మయాన్ని బలంగా ప్రభావితం చేసిన గొప్ప మార్పును గురించి చెప్పాలి. అది సర్‌బార్‌ట్లె ఫ్రెర్ (తరువాత 1851లో సింధు కమిషనర్‌గా నియమింపబడ్డారు) తీసుకున్న ఒక నిర్ణయం. వారు సింధీ భాషకు లిపిని రూపొందించడానికై ఒక సంఘాన్ని నియమించారు. ఆ సంఘం అరబిక్, అరబిక్‌లో లేని శబ్దాలకు కొన్ని సింధీ శబ్దాలు కలిపి రూపొందించిన కృత్రిమ లిపికి అరబిక్ సింధీ అని నామకరణం చేశారు. ఈ క్రొత్త లిపి హిందువులకు, ముస్లిములకు కూడా అంగీకార యోగ్యమే ! ముస్లిములు కొరాన్ చదువుకొనాలంటే అరబిక్ లిపి నేర్చుకో వలసి ఉంది. తరతరాలుగా పర్షియన్ లిపి, భాషలతో పరిచయం ఉన్న హిందువులకు యీ క్రొత్త అరబిక్ లిపి, పర్షియన్ లిపిలాగే వుండటం వల్ల ఇరువురికీ అంగీకారమయింది. ఈ క్రొత్త లిపిలో 52 అక్షరాలు ఉన్నాయి. అన్ని భాషలలోని శబ్దాలనూ అన్వయించడానికి వీలుగా ఉంది. నూరు సంవత్సరాల వరకూ సింధీ సాహిత్యం ఈ అరబిక్ సింధీ లిపిలోనే అచ్చయింది. ఈ లిపిని తుడిచిపెట్టి దేవనాగరి లిపిని భారతదేశంలో అనుసరించాలా, లేక నూరేళ్ల నుండీ వాడుకలో నున్న ఇదే లిపిని కొనసాగించాలా అన్న సమస్యపై భారత దేశంలో స్థిరపడిన సింధీయులలోని వివిధ వర్గాల మధ్య ఇప్పుడు చీలిక ఏర్పడింది. కాని పరిష్కారం కనుపించడం లేదు. ఈ సమస్యకు పరిష్కారం కాలమే నిర్ణయించాలి.

బ్రిటిష్ వారు సింధును ఆక్రమించిన ఫలితంగా అరబిక్ సింధీ లిపి ప్రవేశ పెట్టడం జరిగింది. అందు సింధీ పద్య వాఙ్మయం మీద సుదీర్ఘమైన చెప్పుకోదగిన ప్రభావమే పడింది. సింధీయులు పర్షియన్ భాషలో వ్యర్థమైన పద్య రచనలు చెయ్యడం మానుకున్నారు. (వారికి అది ఒక ప్రియమైన అభ్యాసంగా ఉండేవి) వారు తమ ధ్యాసనంతా సింధీ పద్య రచనలపై కేంద్రీకరించారు. అయితే ఒక పెద్ద మార్పుతో, వారు పర్షియన్ పద్య రచనారీతులైన ఘజల్, మస్నవీ, రుబాయి మొదలైన రీతులలో సింధీ రచనలను సాగించారు. అట్లని ఆంగ్లేయుల కాలానికి ముందు సింధీ

యులకు పర్షియన్ పద్యరీతులు తెలియనివి కావు. సచల్ కూడా యీ పద్ధతులలో కొన్ని పద్యరచనలు సాగించారు. సబి తలీ షా మర్సియాలు కచ్చితంగా పర్షియన్ పద్యరీతులలోనే ఉన్నాయి. సింధీ పద్యాలన్నీ పాత సంప్రదాయిక బెయిత్, దోహా రీతులలోనే ఉండేవి. వాటన్నిటినీ హిందీ పద్య కవిత్వంలాగే వ్రాసేవారు. వాటికి కూర్చవలసిన సంగీతాలు భారతీయ రాగ రాగిణులలో ఉండేవి. కాని అవన్నీ ఇప్పుడు మారిపోయాయి. పర్షియన్ కవుల అనుకరణలో కుప్పలు తెప్పలుగా గజల్‌లు, మస్నవీలు, రుబాయత్‌లు వీటితో కూడిన దివాన్‌లు పాతకాలపు రిసాలేలకు మారుగా వ్రాయడానికి హిందూ, ముస్లిం కవులు ఒకరితో మరొకరు పోటీ పడడం మొదలు పెట్టారు. ఇంత పెద్ద స్థాయిలో అనుకరణ జరుగుతూన్న కాలంలో గొప్ప సింధీ పద్య వాఙ్మయాన్ని వెదకడం నిరర్థకం. సింధీ పద్యానికి కొంతవరకూ ఆధునికత తేవడానికి ప్రయత్నించిన బేవస్ కూడా పర్షియన్ పద్యరీతుల ప్రభావం నించి బయట పడలేక విఫలులయ్యారు. బహుశా యీ శకంలో ఎన్నదగిన ఇద్దరు సచల్ అనుయాయులు తండ్రి, కొడుకులైన బేదిల్, బెకస్‌లు మాత్రమే.

(1843-1947) బ్రిటిష్ కాలాన్ని హెచ్చు తగ్గులుగా ఉన్న రెండు భాగాలుగా విభజించ వచ్చును. అవి 1843 నుండి 1907 వరకు - 1907 నుండి 1947 వరకు. ఇందులో 1843 నుండి 1907 వరకూ ఉన్న కాలం ప్రయోగాత్మకం, అనువాదకాలంగా, వచన సాహిత్య కాలంగా భావించవచ్చును. కాని దివాన్‌లు, మసద్‌లు (ఆరు పంక్తుల చరణాలున్నవి), రుబాయత్‌లు సింధీ కవితలో వెలసిన కాలం కూడా అదే! సాహిత్యంలో ఎక్కడా ఉన్నతమైన ఆలోచనలుగాని, మధురమైన స్పర్శగాని మనకు గోచరించదు. ఈ దీవాన్‌లు అన్నీ ఒకే మూసలో పోసిన ట్లుంటాయి. అల్లాస్తుతి వెంటనే ప్రవక్తస్తుతి వస్తుంది. ఆ తరువాత రెడిఫ్ లేక అంత్య నియమం అనుసరించి ఆ అక్షరంతో మొదలుబెట్టే ఛందోబద్ధమైన పద్యాలు వరుసగా ఉంటాయి. అధికాంశం దివాన్‌లను యాంత్రికంగా చేసేక సరత్తుగాను, లేదా సాంకేతిక విజయాలుగాను మాత్రమే పరిగణించవచ్చు. ఈ కాలంలో గజల్ ఒక ప్రధాన పద్య రీతిగా ఉండేది. గజల్ వ్రాయడంలో పారంగతుడైన హాఫిజ్‌తో తాము సరిసమానులుగా చాలామంది రచయితలు భావించేవారు! కాని వారు సాధించిన దల్లా, రూపకల్పనలు, వ్యంగ్యోదాహరణలు ఇష్టం వచ్చినట్లు వాడి ఘజల్ వ్రాసిన పర్షియన్ రచయితలను అనుకరించడం: శలభం, దీపం, సాకీ (మదిర అందించే వ్యక్తి) మదిర, సైప్రస్ వృక్షం, ట్యూలిప్

మొక్క, నార్సిస్సస్ (తన రూపంచూచి తానే ప్రేమించిన గ్రీకు యువకుడు), హేయ్‌సింథ్ (లిల్లీ జాతి పువ్వు లేక అపోలో చేతిలో ప్రమాదవశాత్తు మరణించిన యువకుని రక్తంనుండి పుట్టిన పుష్పం) గులాబీలు, కోయిల, వసంతం, కస్తూరి, జింక కన్నులు, ప్రేమికుని కేశపాశముల చిక్కులు, లైలా మజ్నూ, షిరీన్ ఫర్‌హాద్, యూసఫ్ జులెయ్‌ఖా.... యిలాటివి. కమలం, కసింద చెట్టు, ఒంటె, ఎడారిలో వెన్నెల రాత్రులు, మరూయి ససూయి.... యివన్నీ పంచకెక్కి మూలబడ్డాయి. అది తోక చుక్క శిరో భాగం ఆకాశంలో మాయమయ్యాక మిగిలిన తోక భాగంలాగ ఉంది. పర్షియన్ భాష పర్షియన్ వ్రాత సింధు నుంచి పూర్తిగా ఏష్యం అయిపోయాయి. కాని పర్షియన్ ఛందోరీతులు, పర్షియన్ పద్యరీతులు మాత్రం మిగిలాయి. కొరాన్ నుండి, హాదీల నుండి అరబిక్ అంశాలను చొప్పించడం మరొక అంశం. గతకాలంలో పెద్ద కవులందరూ ఈ పని ఎంతో చక్కగా చేశారు. ముస్లిం కవులు ఆ పనిని కొనసాగించవచ్చును.

పర్షియన్ పద్ధతి పద్యం సింధీ భాషలో ప్రవేశపెట్టిన ఘనత "ఖాలిద్‌గుల్ మహమ్మద్" (గుల్ అని అంటారు) కు దక్కుతుంది. రషీద్, వీరి పేరు తల్‌పూర్ కాలంలోని కవిగా చేర్చారు. కాని తక్కిన సాహిత్య చరిత్ర కారులంతా వీరిని బ్రిటిష్ కాలంలో సింధీ నూతన కవితకు ప్రథములనే అంటారు. రషీద్, వీరు 1811 నుండి 1856 వరకూ జీవించినట్లు చెబుతారు. మహమ్మద్ సిదిక్ మెమొన్ 1808 - 1855 వరకూ జీవించారని అంటారు. వారి ఘజల్‌లు అన్నిటినీ కూర్చి దీవాన్‌ను 1855 లో బొంబాయిలో ప్రచురించడం వీరు చేసిన ముఖ్యమైన పని. ఆ ముద్రణాలయంలో లితోగ్రాఫీ (ఒక విధమైన రాతిపైన కొన్ని దినుసుల సహాయం వలన తీసే అచ్చు) పద్ధతిలో అచ్చు వేసేవారు. ఈ గ్రంథం సింధీ భాషలో ఉన్నది. సింధీ భాషలో వెలువడిన తరువాతి దివాన్‌లకు ఇది నాంది. ఈ పుస్తకం అచ్చు అంత స్పష్టంగాలేదు. అందువలన సింధీ సాహిత్ సొసైటీవారు మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతున్న కాలంలో ఒక ప్రచురణ వెలువరించారు. సింధీ ముస్లిములు ఈ ప్రచురణతో సంతృప్తినొందక 1930 లో సింధీ ముస్లిం అరబి సొసైటీ స్థాపించబడిన వెనుక, అఖండ్‌గుల్ జన్మస్థానమైన హలాకు చెందిన కాజీ అబ్దుల్ గఫూర్ ఉపోద్ఘాతంతో 1933 గుల్ గ్రంథం నూతన ప్రచురణగా వెలువరించారు. వారి గ్రంథాన్ని (దివాన్) ప్రజలు ఎట్లా స్వీకరించారో చూసేందుకు కవి జీవించి ఉండలేదు. ప్రచురణ ప్రారంభమైన వెనుక మక్కామదీనా యాత్రలకు పయనమై అక్కడనే మరణించారు (1855 లేక 1856 లో).

గుల్ దివాన్‌లో 175 గజల్‌లు ఉన్నాయి. చివరి గజల్‌లో వారికి రానున్న మృత్యువును గురించి సూచన ఉండి పరమాత్ముని ప్రవక్తను, శ్లాఘించడంతో ఆ గజల్ ముగుస్తుంది. అయత్నకృతమైన మధుర ప్రవాహంలాగా వీరి గజల్‌లు ఉండవు. ఈ సత్యాన్ని పాఠకులు కూడా ఒప్పుకొనక తప్పదు. అంత్య ప్రాసల కోసం వారు కష్టపడి పరుషమైన హల్లులను ఏర్పరచేవారు. ఈ విధంగా రూపొందించి వారు తగు మాత్రం విజయం సాధించారు. అంటే వారి పరిశ్రమ సాంకేతిక ప్రాశస్త్యతల గురించి అది వేనోళ్ల చాటుతుంది. నిష్కపటంగా చెప్పాలంటే గుల్, బోధకులు అంచేత కవిగా వారికి ఏ మాత్రం కవితావేశం వచ్చినా అది వారికిఅడ్డు తగులుతూ ఉంటుంది. పర్షియన్ ఛందోశాస్త్రం వారికి క్షుణ్ణంగా తెలిసినా వారి గజల్‌లలో అక్కడా అక్కడా ఛందో నియమ భంగ దోషాలు కనబడుతాయి, అని మహమ్మద్ సిదిక్ మెమొన్ గుర్తించారు. కాని అది క్షమార్హం. కారణం ఏ మంటే ఆ రంగంలో వారు ప్రారంభకులు.

గుల్ గజల్‌లలో కొన్ని బాలా ప్రచారాన్ని పొందాయి. బహుళ ప్రచారాన్ని పొందిన ఒక గజల్‌లో యిలా అంటారు : 'ఓ హృదయమా! చాలా మంది వారి జీవిత చక్రం చుట్టి, పుట్టుట, గిట్టుట జరిగిపోయినది. వారు వివిధ సుఖాలను, భోగాలను పొంది ఆ వెనుక వెళ్ళిపోయారు. ఎంతో మంది వర్తకులు పవలురేలు కొనుట విక్రయించుటలలో గడిపారు. ప్రాపంచిక అసత్యములతో వ్యాపారము చేసిన తదుపరి వారు గతించారు. ఎన్నో దుంగలు నీటిలో మునిగి, తేలి కొట్టుకుపోయినవి. ప్రవాహము మళ్లినప్పుడు అవి పైకి తేలి ఒడ్డున ఎండినవి - తరిగిపోయినవి.... గుల్, ఈ ప్రాపంచిక జీవనము గురించి నీకేమని తెలుపుదును? దానిని గురించి నీకేమి తెలియును? ఓ హృదయమా, ఎంతో మంది వచ్చిరి, తిరిగిపోయిరి.'

గుల్ సమకాలికులు, వయసులో కొంత పెద్దవారు, హలాకు చెందిన మరొక గొప్పకవి, మరొక అఖండ్, మహమ్మద్ ఖాసిం నామధేయులు. వీరు 1806 లోనో 1809 లోనో జన్మించి 1881 లో మరణించారు. వారు ప్రభుత్వోద్యోగంలోనూ కొలది కాలం ఒక మీర్ సేవలోను ఉన్నారు. వారు సొగసైన దస్తూరీతో వ్రాసేవారు (Colligraphist). అందుచేత పెద్ద పెద్ద ప్రకటన పత్రాలు, నామఫలకాల కొరకు వారి అవసరం చాలా మందికి ఉండేది. వారి దివాన్ 1875 లో పొందుపరచి సింధ్ వెర్నాక్యులర్ సొసైటీ వారిచే 1878 లో ప్రచురించబడింది. ఆ రోజులలో ఛందస్సులలో వ్రాయనుత్సుకత ఉన్నవారు, రాజకుమారుల నుండి

గ్రామీణుల వరకు అందరూ కాసిం వద్దకు వచ్చి తమతమ రచనలను సవరించుకొనేవారు. వారు వ్రాసిన ఉల్లాసకరమైన గజల్‌లు, పద్యరచన, కవితా విమర్శకులు చాలా మంది శ్లాఘించారు. వారి గజల్‌లలోనే కొంత మంది కొత్తగా వ్రాసే వారి రచనలపై వ్యాఖ్యలను చేయ సాహసించారు. అట్టి వ్యాఖ్యలను వారు సంతోషంగా స్వీకరించారు.

అఖండ్ ఖాసిం కవిత్వం పర్షియన్, అరబిక్ పద్యాలతో మిశ్రితమై ఉంటాయి. ఆ కాలంలో అది ప్రశస్తతకు ఒక చిహ్నంగా భావించే వారేమో ; కాని ఇప్పుడు మనకు వారి పద్యాల యోగ్యతను చూడడానికి ఇవి ప్రతిబంధకాలుగా కనబడతాయి. వారి మొత్తం కవితా రచనలలో సింధీ కవిత్వం ఒక భాగం మాత్రమే, తక్కిన రచనలన్నిటితో పోలిస్తే అవి చాలా తక్కువ; (మొత్తం అన్నీ కలిపి 147 గజల్‌లు, కొన్ని కఫీలు). అయినప్పటికీ వేదాంత సంబంధమైన విషయాలు, సుదీర్ఘమైన బోధనలు, రంజకత కొరవడడం వల్ల చదువడానికి చాలా భారంగా ఉంటాయి. తక్కిన పద్య వాఙ్మయం నిండా మనకు గోచరించే, ప్రకృతి, మానవుడు, వీటి సహవాసం వారు పూర్తిగా విడిచిపెట్టినట్లు కనబడుతుంది. వారి, పద్యాలన్నిటినీ, సేకరించి వాటికి బహుళ వ్యాప్తి తెచ్చినవారు మిర్జా కాలిక్ బేగ్. ఛందస్సులలో వారికున్న నైపుణ్యం, మృదువైన వేదాంతం సూఫీ భావాలు జోడించబడి నిస్సందేహంగా ఆనాడు చాలా పేరు గడించారు వారు. కాని ఇప్పుడు గుల్ కవిత్వం చదివినంతగా వారి రచనలు చదువరు, వారు తమ కఫీలను కూడా ఒక కవాతులాగ ప్రదర్శిస్తారు.

కాసిం, వారి దివాన్‌లతో ఎల్లప్పుడూ కలిపి చెప్పవలసిన పేరు ఒకటి వుంది, అది ఫజిల్ (1836-1900) వయసులో వారు కాసిం కంటె చిన్నవారైనప్పటికీ, సమకాలీనులు, సన్నిహితమిత్రులు కావడంచేత వారిరువురినీ కలిపి ఉచ్చరించడం కద్దు. అయితే కాసిం కంటె ఫజిల్‌లో గంభీరత, శ్రమతో వ్రాయడం వంటివి తక్కువగా కనబడతాయి. భాషా పాఠ్య గ్రంథాల సంఘం ద్వారా ఇద్దరి పద్య గ్రంథాలు ఆమోదింపబడ్డాయి, ఇద్దరూ మిర్జాకాలిక్‌బేగ్ ఆమోదం పొందినవారే. విద్యార్థులు తమ పాఠ్యాంశాలలో వారి అంశాలను అధ్యయనం చేసిన తృప్తి, ఆనందం ఆ ఇరువురూ పొందారు. కాసిం అందంగా వ్రాయగలిగిన (Calligraphy) వేదాంతి. ఫజిల్ ధర్మశాస్త్ర కోవిదుడు, అందులో ఘనత సాధించినవాడు. ఫజిల్ తండ్రి సయ్యద్ హైదర్ షా కూడా కవి, లైలా మజ్నూ గాథను దోహాలలో వ్రాసినవారు.

ఫజిల్, గజల్‌లు, కఫీలు కూడా వ్రాశారు. వారి పర్షియన్, సింధీ రచనలను యీ శతాబ్దపు మూడవ దశాబ్దంలో సింధు ముస్లిం అరబి సొసైటీ వారు అచ్చువేశారు. వాటిలో చాలా రకాలైన రచనలు ఉన్నాయి. భౌతిక ప్రేమ, ఆధ్యాత్మిక ప్రేమల గురించి కూడా రచనలు ఉన్నాయి. వారు యౌవనంలో ఒక ప్రేమ వ్యవహారంలో చిక్కుపడి మజాజి అంటే విషయ వాంఛలతో గూడిన కోరికలకు లొంగిపోవడం వ్యర్థమనీ, ఆధ్యాత్మిక ప్రేమ కొరకే అంకితమైపోవాలి అన్న నిర్ణయానికి వచ్చారు. పర్షియన్ కవిత్వంలో కనబడే రూపసామ్యాలు అంటే గులాబీ, కోయిల, నర్సిస్సస్, హెయ్‌సింధ్ వగైరాలు అరుదుగా ఫజిల్ రచనలలో కనబడటం గమనార్హం. అది వారి విజ్ఞతను విదితం చేస్తాయి. ప్రస్తుతం ప్రచురించబడిన వారి దివాన్‌లలో తొంభైకి మించకుండా గజల్‌లు ఉన్నాయి.

కాసిం దివాన్‌లు, ఫజల్ దివాన్‌లు చాలావరకు ఒకే విధంగా ఉంటాయి, కాని కాసిం అంతటా ఒకే రీతిని బోధనాపద్ధతినే కనబరుస్తారు ఫజిల్. పొడిపొడిగా ఉండే ఉపదేశాలను ప్రేమ వంటి రసాలతో మిశ్రమంచేసి చెపుతారు. ఇదీ వారిద్దరిలో గల భేదం. కాసిం ప్రేమను గురించి చెపుతున్నప్పటికీ అది విద్యాబోధనలాగే ఉంటుంది. ఒక గజల్‌ను కాసిం యిలా ప్రారంభిస్తారు : 'ప్రేమలో పట్టువిడువక యుండుము, తక్కిన పనులు, విధులు అన్నిటిని విడిచిపెట్టుము', చివర ఒక బోధనతో ముగిస్తారు, 'కాసిం ప్రభువు ఆజ్ఞలను శిరసావహించుము, అతడనిన ఎల్లప్పుడును భయముతోనే యుండుము. నే చెప్పునది వినుము, నేనెప్పుడును సత్యమునే చెప్పుదును, తక్కిన పనులను, విధులను విడచిపెట్టుము.' ఫజిల్ ప్రేమను సాధారణంగా ఇలా వినియోగిస్తారు : 'జ్ఞానము పొందిన వారికి తెలుసు, యీ ప్రపంచము ఒక ఎండమావి యని అప్పుడప్పుడు వారు నిష్కపటమైన బోధనాపద్ధతిలో అంటారు', బాధలను అనుభవించుట నేరమెంచుట అనిన అది చేదు తప్ప వేరుకాదు, నిశ్శబ్దమే మధురము. నిజమునకు దారిపొడుగున నిశ్శబ్దము మధురమే. అనర్థములను గురించి నాలుకను విదిలించినచో అది సాగిపోవుట మాత్రమే జరుగును. క్షేమ మార్గము ఎల్లప్పుడును మౌనము వహించుటయే! పరీక్షార్థము చదువువారు తప్ప తీరిక సమయములలో కాసిం, ఫజల్ దివాన్‌లు మరెవ్వరూ చదువరు. అంతకంటె చదువ దగినవారు దివాన్ గుల్. వారి దృక్పథం సానుభూతి, కాసిం గాని ఫజల్ గాని వీరికంటె చాలా సమభావనతో నిండి ఉంటాయి.

సింధీ సాహిత్య చరిత్రలో ఒక అపూర్వమైన వ్యక్తి హాఫిజ్ హమీద్ టిఖ్‌రాయ్. వీరు అంధులు, 65వ ఏట కార్యకౌశలం, అద్భుతమైన అనుభవాలతో ఎప్పుడూ పనిలోనే మునిగి వుంటూ 1897లో పరమ పదించారు. వారు ఒక వస్త్రాలయంలో పనిచేశారు. కనులున్నవారు కూడా చూసి చక్కగా గుర్తించలేనంత సున్నితంగా వారు చేతితో ముట్టుకొని వివిధ రకాలైన వస్త్రాల నాణ్యతను చెబుతూ ఉండేవారు. వారు పవిత్ర గ్రంథాలు, పర్షియన్ భాష, సాహిత్యం, అధ్యయనం చేశారు. గజల్, కసీద వంటి ఇతర పద్యరీతులలో కవిత్వం చక్కగా చెప్పగలరు. వారు మసీదులలో శుక్రవారపు ప్రార్థనా సమావేశాలు ప్రారంభించేటప్పుడు చదివే ప్రార్థన ఉపన్యాసాలను ఖుతుబాలను వ్రాయడంలో పేరెన్నికగన్న వారు హాఫిజ్ అని వారి అభిమానులు అంటారు. మరూయి, ససూయీల వంటి షా నాయికల ఆక్రోశము, అభ్యర్థనల వంటి ఛందోబద్ధమైన పద్యాలను చెప్పగలరని మరొక అభిమాని అంటారు. వారు దివాన్ ఏదీ విడిచి పోలేదు గాని వివిధ రకాలైన పర్షియన్ నమూనాలలో పద్యాలను మాత్రం విడిచివెళ్లారు. అదృష్టవశాత్తు వారు పేరొందిన పాత్రికేయులు, వ్యంగ్య రచయిత, అయిన పుత్రుడు మహమ్మద్ హాషిం ముఖ్‌లాస్‌ని వదలి వెళ్లారు. వారు, తండ్రి రచించిన అరబిక్, పర్షియన్, సింధీ పద్య రచనల నన్నిటినీ సేకరించి అర్మఘన్ హమీద్ అన్న గ్రంథాన్ని ప్రచురించారు. సింధీ సాహిత్యంలో ఒక క్రొత్తపోకడ ఈ గ్రంథంలో చేర్చినది, కొన్ని వ్యంగ్య పద్య రచనలను కూడా ఇందులో ప్రవేశ పెటారు. కాని, హాఫిజ్ మేలైన పద్యాలు ఉద్రేక పూరితమైన మరూయి ఉమర్‌ను వేడుకుంటున్న వర్ణనలు 'ఓ, ఉమర్! ఈ క్రూరమైన సంకెలలు నన్ను నిస్సహాయురాలిగా చేస్తున్నాయి. వీటిని తొలగించుము, నా మరుల వద్దకు మాలిర్‌కు పోవుటకు అనుమతి నిమ్ము'.

క్రిందటి శతాబ్దపు ద్వితీయార్థంలో నుండిన దివాన్‌ల రచయితలలో చెప్పకొనదగిన వ్యక్తి షమ్స్ - ఉద్దీన్. వీరి కలం పేరు బుల్‌బుల్ (1857-1919). వారు దివాన్ బుల్‌బుల్ (1891), కరిమా నేచురల్ (దివాన్‌కు ఇది అనుబంధం) అను గ్రంథాలకు కర్త. వారు జమీందారు, పాత్రికేయులు, కవి. ఉదాసీన భావాన్ని విడనాడి తమ రాజకీయ హక్కులకై పోరాడవలసినదని సింధు ముస్లిములను మేలుకొల్పిన ప్రథములు వీరే. కరాచీకి చెందిన ఒక వనితను లేవదీసుకు పోయిన అపఖ్యాతి కూడా వీరు సంపాదించారు. వారి పద్యాలలో ఆమె పేరును కూడా తమ పేరుతో కలిపి అల్లుకున్నారు. అక్బరు అలహాబాదీ

(ఉర్దూలో) కవితలను పోలిన వ్యంగ్య రచలను కూడ వీరు రచించారు. అందులో బాగా తెలిసినది : 'ఓ మూర్ఖుడా! లండన్ నగరమునకు పోయి ఒక వనితను ప్రేమించుము. ఆమెపై మోహముచే, ఒక చర్చిలో ప్రవేశించి, క్రీస్తు మతావలంబకుడనని ప్రకటించుము'. ఈ వ్యంగ్య పద్యాలు కొన్నిటిలో ఒక పంక్తి సింధీలోను, మరియొక పంక్తి పర్షియన్‌లోను వ్రాశారు. దివాన్ బుల్‌బుల్ రచనలో కవితావేశం లోపించింది. అది ఒక పాత్రికేయుడు, సంస్కర్త, వ్యంగ్య రచయిత వ్రాసినది మాత్రమే. అయితే జాకెట్లు, పేంటలూన్లు, పొడుగాటి చుట్టలు (పొగాకు) గడ్డం తీసి వేయుట యిలాటి వాటిపై ఛలోక్తులతో కూడిన ఒక క్రొత్తదనం వారి పద్యాలలో కనబడుతుంది. కరీమా నేచురల్‌లో కూడా పాశ్చాత్య మద్యం విస్కీ మీద ఒక పంక్తి, పెంపుడు కుక్కల గురించి ఒక పంక్తి, కరీమా పర్షియన్ గ్రంథకర్త అయిన సాదీ నుండి ఒక పంక్తి ఉంటాయి. డా॥ షేక్ మహమ్మద్ ఇబ్రహీం బుల్‌బుల్ జీవితచరిత్ర వ్రాశారు.

1847లో జన్మించిన మౌల్వీ అబ్దుల్ గఫూర్ హుమయూనీ మఫుతున్ (వ్యాకులుడు) అన్న కలం పేరుతో పర్షియన్ కూటమి ననుసరించి వ్రాసిన కవితలలో అరుదుగా కనబడే ప్రవాహంలాటి నడక, తియ్యదనం ఉట్టిపడే కొన్ని పద్యాలను ఇచ్చి వెళ్లారు.

ఈ కాలంలోనే సింధీ కవితల గ్రంథం ఒకటి వెలువడింది, అది గజల్‌లతో కూడిన దివాన్ కాదు, కాని ముసద్దసు (ఆరుపదాల పద్యం)ల సంకలనం. దానినే ముసద్దస్ అబోఝో (అమాయకుని ముసద్దసులు) అంటారు. ముస్లిం పాఠకులలో ఇది మంచి ప్రచారం పొందింది. మౌల్వీ అల్లాబక్స్ అబోఝో అన్న పేరుతో దీనిని వ్రాశారు. వీరు ముస్లిం మదర్సా, కరాచిలో 1889 లో పర్షియన్ అధ్యాపకులుగా నియమితులై 1901 వరకూ ఉద్యోగం చేస్తూ మరణించారు. వారి ముసద్దస్ ఒక భాగం ఉర్దూకవి హాలి పద్యానికి అనువాదం. అదిలో వారు ముస్లిం ప్రజలకు తమ గత వైభవాన్ని గుర్తుచేస్తూ, ఉజ్వలమైన భవిష్యత్తు కొరకు పాటుపడేలాగున వారిని ఉత్తేజితులను చెయ్యడానికి 1879 వ్రాసిన పద్యం. మరొక భాగంలో సయ్యద్ అమీర్ అలీ మున్నగు వారి నాయకత్వంలో భారతదేశంలో ఇతర ప్రాంతాలలో ముస్లిముల సంక్షేమం కోసం జరుపుతున్న హసన్ అలీ ఎఫెందీని (వారి పోషకులు, సహచరుడు) పొగడుతూ వ్రాశారు. ఆ ముసద్దస్ ఆకాలానికి అనుగుణమైన రచన గనుక దానికి ఒక విధమైన ప్రచారం లభించింది. సింధీ సాహిత్య విమర్శ

వ్యాసాలు. (Sindhi Essays on Literary Criticism) అన్న తమ పుస్తకంలో ఇహ్సన్ బద్వి పూర్తిగా ఒక అధ్యాయం యీ రచన కొరకు వినియోగించారు.

తల్పురా పాలకుల కుటుంబానికి చెందిన మీర్ హసన్ అలీ ఖాన్ హసమ్, (1824 నుండి 1909 వరకూ జీవించారు). వారి మేనల్లుడు మీర్ అబ్దుల్ హుస్సేన్ ఖాన్ (సంగీగా ప్రసిద్ధికెక్కారు) లను గురించి ప్రత్యేకించి చెప్పక తప్పదు. పర్షియన్ నమూనాలో బ్రిటిష్ వారి కాలంలోని కవులందరిలోనూ ముఖ్యులైనవారు బహుశా సంగీయే.

హసన్ సింధును పాలించిన ఆఖరి మీర్, మీర్ నాసిర్ అలీఖాన్ కుమారుడు. పూనా, కలకత్తాలలో గృహనిర్బంధంలో ఇతర మీర్‌లతో గూడ ఉంచబడి, 1826 లో హైదరాబాద్ పోవుటకు విడుదల పొందారు. వారికి సింధుఫిరదౌస్ అన్న బిరుదు కొందరు విమర్శకులద్వారా సంక్రమించినది. వారి ఉత్తమ కళాఖండం సింధు బోషహ్‌నామా. సింధులో గడచిన అల్లకల్లోల పరిస్థితులను గురించి సర్ ఫ్రాబ్‌ఖాన్ దగ్గరనుండి మీర్ మురాద్ అలిఖాన్ కాలంవరకూ జరిగినవి ఉత్తేజితమైన వర్ణనలతో వ్రాశారు. కల్హోరాలకూ తల్పురులకూ మధ్య జరిగిన యుద్ధ వర్ణనఘట్టం ఈకావ్యం అంతటిలోను అత్యుత్తమ భాగం. ఈ భాగంలో వాడినవన్నీ సింధీ శబ్దావళియే. ఇతరత్రా గ్రంథంలోని భాగాలలో సుమారు సగం పర్షియన్ శబ్దాలు కనబడతాయి. అక్కడక్కడ వారి వర్ణలలో పర్షియన్ కవిసాదీనుండి నీతి వాక్యాలు ప్రవేశపెట్టారు. దీనికి కారణం, వారు గాదా (ఘులాం మహమ్మద్‌షా), కాసిం, అను కవుల సాంగత్యంలో చాలా కాలం గడిపారు. షహెన్ షానామావంటి ఇతర కావ్యాలను కూడా వ్రాశారు. కానీ సాహిత్య విలువలతో ఎన్నదగినవారి కావ్యం, షహనామా ఒక్కటే. వారి కావ్యాలలో ఎక్కడా సూఫీసిద్ధాంతాలుగానీ, విషయా సక్తసంబంధమైన అంశాలు గానీ కనబడవు.

వారి మేనల్లుడు సంగీ గురించి యీ విధంగా చెప్పలేము. సంగీ బెంగాల్‌లో ఒక ఆంగ్ల వనితను ప్రేమించి వివాహమాడి తమ మొదటి రాత్రిని పద్యరూపంలో చిత్రించాడు. తమను మరొక జామ్ తమాచీగాను, తమప్రేమ మరొక గద్రిలేక నూరీ దిగాను వర్ణించారు. ఆమె మరణించిన వెనుక మరొక యూరోపియన్ వనితవారి కంటబడేవరకూ పిచ్చివానివలె తిరిగారు. సంగీ దివాన్ రెండు సంపుటాలలో 1904లో వెలువడింది. మొదటి సంపుటిలో సుమారు 250 గజల్‌లు, కసీదాలు, రెండవ

సంపుటిలో 200ల గజల్‌లు, కసీదాలు సుమారు 130 కఫీలు, ఇతర రచనలు ఉన్నాయి. ఈ ప్రచురణ తరువాత ఇరువది సంవత్సరాలు జీవించినప్పటికీ వారి ఉత్తమ రచనలు 1904 నాటికే ముగిశాయి, వారి ప్రతిభను ఆ రచనల ఆధారంగానే నిర్ణయించాలి.

సంగీ పేరొందిన క్రీడాకారుడు, కవి, కవులను పోషించువాడు. సింధీ పద్య కావ్యాలే కాకుండా, వారు పర్షియన్‌లో పద్యాలు, వచనం ఉర్దూలోకూడా రచనలు చేశారు. సింధీలో వారు గొప్ప గజల్ రచయిత. సింధులో ప్రాచుర్యం సంపాదించిన పర్షియన్ సంప్రదాయాలను గుల్ సంప్రదాయమని, కొన్ని సందర్భాలలో సంగీ సంప్రదాయం అని కూడా పేరొందినది. సింధీ గజల్ వ్రాసే అనేక మంది కవులు వీరి అడుగు జాడలలో నడిచి వారికెంతో ఋణపడి ఉన్నారు. అది వారు అంగీ కరించకపోవచ్చును.

సంగీ గజల్‌లకు వాటి ప్రత్యేకత వాటికి ఉన్నది. చాలామంది ఇతర రచయితలు సాంప్రదాయ శైలిలో గజల్‌లు వ్రాశారు, సంగీ తమ స్వానుభవాలమ వాటిలో గుమ్మరించి, సింధీ గజల్‌లో ఒక వినూత్నమైన ఆర్ద్రతతో కూడిన ఆకర్షణ తెచ్చారు. షా వలెనే సంగీ దృశ్య సామ్యాలను, వివిధ వ్యాపారాలనుండీ, వృత్తులనుండీ గైకొని ప్రవేశ పెట్టారని మహమ్మద్ సిదిక్‌మెమొన్ గుర్తించారు. వారి ప్రేమ కవిత్వం నిష్కల్మషం గాను, విశంఖలంగానూ ఉంటుంది. ప్రేమికురాలికన్ను లను గురించి వ్రాసిన వారి కవిత సుప్రసిద్ధమైనది. అందులో ఒకచోట 'అతిసున్నితమైన ఢక్కా మజిలిను (అన్ని నేత బట్టలలోను అత్యంత పలుచ నైనది) అత్యంత సుకుమారంగా పెరిగిన తన ప్రియురాలి మేనిపై అత్యంత భారమైయున్నది!' అంటారు. వారి ఉపమానాలు, రూపకాలంకారాలు, అతి సహజంగా ఉంటాయి.

సంగీ ప్రేమ కవిత్వంలో మాత్రమే సిద్ధహస్తులు కారు. ప్రకృతి వర్ణనలలో కూడా వీరు ఔన్నత్యాన్ని సాధించారు. మాహిలోని వర్షాలను వారు వర్ణించిన తీరేకాక అది సింధీ నాయిక మరుయాకి ఒక జ్ఞాపక చిహ్నంగా కూడా ఉన్నది. వారు పర్షియన్ సాహిత్యంలోని సాంప్రదాయా లను, లక్షణాలను, నార్సిస్ససులు, హైసింధీల వంటివి ఉపయోగిస్తూనే, జాతీయమైన 'రతన్ జాట్', 'మల్లెలు' వంటి పూవులను కూడా తీసుకువస్తారు. వారి కవిత్వపు విలువలు వారికి బాగా తెలుసును. అందుకే వారంటారు : 'వారి శకంలోని జామీలవంటి వాడను నేను నా గజల్‌లలో ఎక్కడా

మోటుదనం లేదు. అనుభవ రహితమైన ప్రేమ విషయాలన్నీ వెలివేసి మేము విజయవంతంగా బయటపడాము. అన్ని పరిస్థితులలోను భగవంతుడే మాకు అండగా నిలిచాడు.' ఈ 'మేము' అన్నవదం వారికి 'హిజ్ హైనెస్' అన్న బిరుదానికి తుల్యమైన దనడంలో సందేహంలేదు.

అన్నిటికన్నా వారు హాస్యంలో చాలా చతురులు. దానిని వారు సాంప్రదాయ ముస్లింములపైన మాత్రమేకాక, తమ పట్లకూడా అప్పుడప్పుడు ప్రయోగిస్తూ ఉంటారు. పెరుగుతున్న వయసు వల్ల కలిగే ప్రభావాలను అదుపులో ఉంచడానికిగాను వారి వ్యర్థ ప్రయత్నాలను గురించి చెపుతూ జుట్టుకు రంగు వేసుకోవడం వంటి వాటిని ఉదహరిస్తారు. మొత్తం మీద వంగీ పర్షియన్ సాంప్రదాయానికి చెందిన సింధీ కవులలో చదవడానికి అత్యంత అర్హమైన వారు, వారి శైలి ఆధునికమై మధుర ప్రవాహంలాగా ఉంటుంది. వీరు కాక బేవాస్ రాకకు ముందు ఆధునిక సింధీ కవులలో గొప్పవారు బేదిల్, బేకస్ ఒక్కరే.

మరే విషయం కొరకూ కాకపోయినప్పటికీ, పూర్వం పేర్కొన్న తల్పూర్ కవులిద్దరికీ సహాధ్యాయి, బోధకుడుగానైనా సయ్యద్ హాజీ ఘులాం షా (గదా) 1826-1905 గురించి చెప్పక తప్పదు. వారి కవిత్వం రాజాస్థాన ఉద్యోగుల కవిత్వంలాగ ఉంటుంది తప్ప ప్రత్యేకంగా ఎన్న దగినదేమీలేదు.

పర్షియన్ సాంప్రదాయాను యాయులైన మరి యిద్దరు కవులు 1843-1907 మధ్యకాలంలో ఉన్నారు. జామీ కావ్యాన్ని పోలిన యూసఫ్ జులేఖా కావ్యాన్ని వ్రాసిన సయ్యద్ ముర్తుజాయ్. మూల కావ్యానికీ దీనికీ భేదం సయ్యద్ మూలకావ్యంతో సంబంధంలేని కొత్త విషయాలను తమ కావ్యంలో చేర్చారు. రెండవ వారు మౌల్వీ ఘులాం మహమ్మద్. వీరు పర్షియన్ కవి నిజామీ రచించిన సికందర్ రచనను అదే వరుసలో సికందర్ నామా పేరున 1873 లో రచించగా 1889 లో ప్రచురించబడింది. ఇందులో చారిత్రక ఆధారాలు లేని పవిత్ర గ్రంథ భాగాలు, అలెగ్జాండర్ ది గ్రేట్‌ను గురించిన అసంపూర్ణమైన కథనాలు, వాటికి తోడుగా నిరుత్సాహవంతమైన పద్యాలలో అనవసరమైన నీతి బోధనలు చేర్చబడి ఉన్నాయి.

దివాన్ సూరత్ బహార్ అన్న గ్రంథం సూరత్ సింగ్ (1832-1897) రచించినది. వారి పద్యాల సంపుటిలో వారి సన్నిహిత మిత్రులు

బహార్‌సింగ్ పేరును కూడ చేర్చారు. సూరత్‌సింగ్ పద్యాలు చాలవరకు ఉర్దూ, హిందీ, పర్షియన్ భాషలలో ఉన్నవి. అవి భక్తిరస ప్రధానమైనవి. వారి సింధీ కఫీలు భక్తిరస ప్రధానములై సరళములై భావయుక్తములై ఉన్నాయి.

బ్రిటిష్ ప్రభుత్వంలో ఉన్నత పదవులలోనున్న ఇద్దరు వ్యక్తులు ఇతర రంగాలలో ప్రధానంగా రచయితలనదగినా, వారిని పర్షియన్ సంప్రదాయిక కవులుగా ఎంచవచ్చు. వారు లీలా రాంసింగ్ (షాకి) ఒక న్యాయాధికారి, మీర్జా కాలిక్ బేగ్ ఉన్నత రెవెన్యూ అధికారి.

ఖాకీ విలాసార్థం కవిత్వం చేపట్టినట్లు తోస్తుంది. వారి గజల్‌లలో పర్షియన్, ఉర్దూ, హిందీ, పంజాబీ, సిరైకీ పదాలు ఉంటాయి, అవి సింధీ పదాలతో అల్లుకొని (మణి ప్రవాళం అని దీనిని దాక్షిణాత్య వాగ్గేయకారులు పిలిచేవారు) ప్రతి పాదంలోనూ కనిపిస్తాయి. వారి అనుప్రాస ప్రయత్న పూర్వకంగా కనిపిస్తుంది. అత్యుత్తమమైనదైన వారి గజల్ తన ప్రియురాలు బంగారు జలతారు దుస్తులు ధరించి ఒంటెల మాలతో అప్పుడే అరుదెంచుచున్నది అన్నది కూడా పట్టుబట్టి కూర్చిన పద్యంలాగా ఉంటుంది. భావచిత్రణలో వారు విద్యావంతులైన కవి కాదనీ కవితా భావన శూన్యమనీ అను ప్రాసలు సరిగా ఉండవనీ వారిని విమర్శిస్తారు.

మీర్జాకాలిక్ బేగ్‌కి సరిగ్గా (1853-1929) భిన్నులు. ఆధునిక సింధీకవులందరిలో జాగరూకతతో పాండిత్యముతో, అత్యంత విస్తృతి గలిగిన కవి అనవచ్చును. బ్రిటిష్ వారి కాలంలో సాహిత్య చరిత్ర నంతటినీ కాలిక్ శకము అని పిలువ దగినంతగా సింధీ సాహిత్యం మంతటా వారి చెరగని ముద్ర మనకు స్పష్టంగా గోచరిస్తుంది. వ్యాస కర్త, విమర్శకుడు, చరిత్రకారుడు, అనివాదకుడు, నాటక కర్త మొదలు గాగల వారిబహుముఖ ప్రజ్ఞనుగురించి మరొక అధ్యాయంలో చర్చించుదాం. ఇక్కడవారి కవిత్వం పయి దృష్టి సారించుదాం.

మీర్జాకాలిక్ బేగ్ మూలకవితలు సౌదాయ్‌ఖామ్ అన్న శీర్షికక్రింద (అపక్వ ప్రేలాపనలు) రెండు భాగాలు. ఒకభాగం జీవిత కాలంలోనే అచ్చయింది, రెండవది అముద్రితం ఉంది. వాటిలోసింధీ గజల్‌లు, వివిధరకాలైన రచనలు కలగలుపుగా ఉన్నాయి. వారు ఒమర్ ఖయ్యాం వ్రాసిన రుబాయత్‌లను అనువదించారు ; షబ్‌స్త్రీ గుల్షన్-ఇ-రాజ్‌ను అనువదించారు. దానిని కష్ఫలీ జాజ్‌గా మస్నవీ లేక కథన రూపంలో వ్రాశారు.

ఆంగ్ల కవుల రచనల నుండి కొన్ని భాగాలను పద్యరూపంలో అనువదించారు. అట్లే అరబిక్, పర్షియన్ ఉర్దూ రచనలనుకూడా అనువదించారు. అమూల్ మానెక్ (అమూల్యమైన మాణిక్యాలు), మోతియాన్-జి- దబ్బి (ముత్యాలపేటిక)లో వ్రాశారు. అటు తరువాత వారి గజల్‌లను సరియైన దివాన్‌గా సేకరించారు. మహమ్మద్ సిదిక్ మెమొన్ ప్రకారం యీ దివాన్‌లో 433 గజల్‌లు, కసీదాలు అన్నీ సింధీలోనే ఉన్నాయి. మిర్జాకాలిక్ బేగ్ ఉమర్ ఖయ్యాం అను వాదానికి అత్యుత్తమమైన గురుతు, సింధీ వచన వాఙ్మయంలో శిఖరాన్నందుకున్న దయారాం గిడుమల్ వ్రాసిన ఉపోద్ఘాతం. దీనివలన ఆ అనువాదం సింధీ సాహిత్యంలో ఒక వింతైన స్థానాన్నలంకరిస్తుంది.

మిర్జాకాలిక్ బేగ్ తమ నాటకాలలో పాటలు వ్రాశారు. ఖుర్షీద్ అనే నాటకంలో బహుళ ప్రచారాన్ని పొందిన ఒక పాటలో విషాదకరమైన అభ్యర్థన ఉంటుంది : 'నిష్కాపట్య మన్నది యీ ప్రపంచమునుండి మాయమైనది. కాలభ్రమణము విచిత్రము, వంచకులు, బొంకరులు, ఉన్నత స్థానం చేరుకొంటిరి.' గజల్‌గాను లేక కఫీగాను పాడదగినది మరొక రచన అందరకూ తెలిసినదే, 'ప్రాపక లక్ష్యమును చివరకు పొందిననేమి? అంత్యమున ఆ పరమాత్మని చేరలేనిచో, చేతిలో అన్నీ ఉండీ యేమి ప్రయోజనం ?'

సౌదాయ్ ఖామ్‌లో మిర్జాకాలిక్ బేగ్ యౌవన దశలో నున్నపుడు వ్రాసిన అన్ని రచనలు, వారి నాటకాలనుండి సేకరించిన పాటలు ఉన్నాయి. చివర వరకూ వారు పద్యాలు వ్రాస్తూనే ఉన్నారు. కాని మొదటి ఏభై సంవత్సరాల కాలంలోనూ వారి నుండి అత్యుత్తమ కవిత్వం వెలువడిందనడమే సమంజసం.

ఒమర్ ఖయ్యాం రుబాయత్ అనువాదంలో మిర్జాకాలిక్ బేగ్ అగ్రగామి. పుంఖాను పుంఖంగా యీ నాటికీ సింధీయులు రుబాయత్‌లు చతుష్పాద పద్యాలు, వ్రాస్తూనే ఉన్నారు, సింధీలో, వారందరూ మిర్జాకాలిక్ బేగ్‌కు ఋణపడి ఉన్నారు. ఈ రుబాయత్ అనువాదాలని ఎవరూ ఊహించలేరు. అవి అంత సహజంగాను, ఆనందదాయకంగాను ఉన్నాయి. చతుష్పాద పద్యాలు ఉమర్ ఖయ్యాంగారివి ఎడ్వర్డ్ ఫిజ్‌గెరాల్డు ఆంగ్లానువాదం అనుసరణ, సాధించిన విజయం, మిర్జాకాలిక్ బేగ్ ఆహ్లాదకరమైన అనువాదంతో సరితూగగలదు. వారి పద్యానువాదాలన్నీ ఇంత ఆనందదాయకంగా ఉండవు. వారొక క్లిష్టమైన రచయిత,

చింపి పారవేయవలసిన దానిని వారు అనేక పర్యాయములు అచ్చువేశారు. వారి ఉత్పత్తి అమోఘం, నాణ్యత తారతమ్యాలతో కూడినది ఒక్కొక్క సారి నిస్సారంగా ఉంటుంది.

మూల పద్యరచనలో వారు అద్భుతమైన పనితనం చూపిస్తారు. పర్షియన్ ఛందస్సు బాగా తెలుసును. ఆ నియమాలను చక్కగా పాటిస్తారు. కాని కవనంలో ఉత్తేజం కొరవడింది, అది చాలవరకూ నిస్తేజమే. వారి అకుంఠిత దీక్ష, పరిశ్రమలే వారికి వచన రచయితలలోగాని, పద్యరచయిత లలోగాని ప్రథమ స్థానాన్ని ఆర్జించి పెట్టింది. కొంచెం అతిగా నీతి బోధనలు చెయ్యటం, పిడివాదంలోకి దిగడం వైపు వారి దృష్టి మళ్లింది. జీవితాంతం వారు డాక్టర్ జాన్సన్ వలెనే సాహిత్యానికి గొప్ప స్నేహితులు. కాని వారు వ్రాసిన కొన్ని ప్రేమ పద్యాలు పర్షియన్ సాంప్రదాయంలో వ్రాసిన కవుల రచనకంటె చాలా ఉన్నతంగా ఉన్నాయి. ఇలా ప్రారంభించే ఒక గజల్‌లో : "నన్ను ముక్కలు ముక్కలుగా వధియించకు. నీ వగలాడి చేష్టలతో ఓ ప్రేమైకమూర్తీ ! నీ సముఖము నుండి నన్ను దూరదూరముగా వెలివేయకుము ఓ ప్రియా ! నేను చంపబడుటకు అంగీ కరించితిని, కాని నీవు కరుణ జూపవచ్చును. నీ చురియ దూసుకొని పోనిమ్ము ఓ హంతకుడా ! కాని మెల్లగా, అతిమెల్లగా చేయు మా పనిని" పైకి గంభీరంగా, దరి జేరరానంతటి బాహ్యరూపం ఉన్నా మీర్జాగారిలో మృదువుగా, స్పందించే మనసు ఉన్నదని యీ గజల్ మనకు నిరూపిస్తుంది.

1843-1907 మధ్యకాలంలోని కవులందరూ శుష్కమైన పర్షియన్ కవుల అనుసరణలోనే తమ్ము తాము కోల్పోలేదు. కొందరు కవులు సాంప్రదాయక పద్ధతులలో ప్రేమ మొదలైన విషయాలపై సూఫీ అంశాలతో పద్యాలు వ్రాయడం కొనసాగిస్తూనే ఉన్నారు. సింధీ ప్రాథమిక పాఠశాల తరగతులలో పాఠ్యాంశాల కొరకు సింధీ పద్య కథలను సేకరించి వాటికి తమ దోహాల రూపంలో వ్రాసిన వ్యాఖ్యానాలతో అందించిన ఘనత ఉధాం ఖాన్‌వర్‌దాస్‌కు చెందుతుంది. ఆ విధంగా అచ్చయిన మొదటి పద్య కథ రాయ్‌డయ్యాక్ కథ. కొంత పద్య భాగం, కొంత వచనంతో ఉండి 1861లో ప్రచురించబడింది. తరువాత కామ్‌సేర్, కామ్‌రూప్‌ల ప్రణయగాథ (అంధులు లాలూ భగత్ వ్రాసినది) 1809 లోను, మెహర్ మునిర్‌ల కథ 1811 లోను ముద్రింపబడ్డాయి. రాయ్‌డయ్యాక్ కథ ప్రధానంగా షా సుర్ సోరత్ పద్యాల నుండి

గ్రహించినదే. కాని రాయ్‌డయ్యక్, అతని తల్లి, భార్య (సోరత్), బిజాల్, బిజాల్ భార్యలపైన వ్రాసిన ప్రశంసా పద్యాలు అనాయ్‌రాయ్‌కి మాత్రము ప్రత్యేకించిన శాపము, పాఠకులను రాం అన్న పేరును గుర్తుంచుకోవలెనని హెచ్చరికచేస్తూ వ్రాసినది, యివన్నీ ఉధాం కవితలే.

కామ్‌సేన్, కామ్‌రూప్‌ల ప్రణయగాథ, కాంసేన్ రాజానర్ కర్‌పాల్ కుమారుడు, కామ్‌రూప్ రాజాజయసింగ్ అందాల కూతురు వీరిరువురి కథ. ఈ కథలో అస్వాభావికమైన విధానాలు, మహత్మ్యాలు వంటివి ప్రవేశ పెట్టబడ్డాయి. లాలూ భగత్ దోహాలు యీ రచనలో చక్కగా పొందుపరచబడినాయి. ఈ ప్రేమకథ హృదయ స్పందన కలిగిస్తూ మనసును ఆకట్టుకొనేటట్లు కరుణరస మయమై ఉన్నదని మహమ్మద్ సిదిక్ మెమొన్ మెచ్చుకుంటారు.

మెహర్ మునీర్, బదర్ మునీర్‌ల కథవలె గాక తక్కువ కవనపు విలువలున్నాయి యీ పద్య కథలో.

అఖండ్ అబ్దుల్ రహీం అబ్బాసీ సింధీ పద్య కథలను భద్రపరచిన ఉధారాంకి సహాయపడి వారి ఘనతలో పాలుపంచుకున్నారు. వారు 1871లో సైఫుత్ మలక్ బడీ-ఉల్-జమాల్ అను కథలను రూపొందించారు. వాటి కర్త యెవరో తెలియదు గాని పేరు మాత్రం బహార్ అని పేర్కొన్నారు. ఇందులో 356 దోహాలు ఉన్నాయి.

షా అహ్మద్ ఫకీర్ కబీర్ షా మరికొందరు ఇతర కవులు వ్రాసిన దోహాల నుండి కూర్చిన ఉమర్ మరూయీ కథను పద్య రూపంగా రూపొందించడంలో అఖండ్ అబ్దుల్ రహీం కూడా కారణభూతులయ్యారు. ససూయి, పున్‌హూన్‌ల పద్య కథ ప్రాథమికంగా అరిఫ్ కల్హోరా వ్రాసినది వెలికితెచ్చిన ఘనత కూడా వీరికే చెందుతుంది. ఇవన్నీ 1871 ప్రాంతాలలో వెలువడ్డాయి.

అఖండ్ అబ్దుల్ రహీం మరికొన్ని పద్య కథలను కూడా సంకలన పరిచారు. 1) కచ్‌కి చెందిన ఉదారుడు వాక్యో, అట్లే ఉదారుడైన సింధువాసి లాకోజాం కథ. ఇది ఎవరో కవి హాజీ అన్న పేరుతో వ్రాసినది. 2) ఎవరో కవి మీర్ అన్న పేరుతో వ్రాసిన జామ్ జామ్ సుల్తాన్ కథ. 3) ఛాటో ఖాసీ (రజకుడు) మూలకథ వ్రాసిన బహ్‌రంషా మరియు గుల్ అన్‌దామ్‌ల ప్రేమకథ. 4) చాలమంది కవులు వ్రాసిన అజయిబ్‌షా

(మరియు నూష్‌లబ్) కథ. ఈ కథలేవీ కవితా ప్రాశస్త్యాన్ని చెప్పేవి కావు. అవి వింత కథలుగా బ్రిటిష్ పాలన తొలిరోజులలో, పద్య రచనలు చేసిన సింధీ కవులందరూ పర్షియన్ ఆదర్శాలనే చేపట్టి ఉండ లేదని చూపుటకు తగినవి మాత్రమే! వారి సింధీ సాహిత్య చరిత్రలో వీటినన్నిటినీ ఉటంకించినందుకు మహమ్మద్ సిదిక్ మెమొన్ కృతజ్ఞతలకు ఎంతో తగినవారు.

1843-1907 మధ్యకాలంలో ఒక గురుతుగా నిలచి, పన్నెండు పర్యాయములకు పైగా పునర్ముద్రితమైనదీ, ముఖ్యంగా విద్యార్థులను, అధ్యాపకులను కూడా ఆకర్షించినదీ ఒక పద్య కథ. సామాన్య పాఠకులను కూడా విశేషంగా ఆకర్షించిన ఈ కథ బహుశా బ్రిటిష్ కాలంలో సింధీ భాషలో వెలువడిన అత్యుత్తమమైన పద్య కథగా ఎంచవచ్చు. అది ససూయి, పున్‌హూన్‌ల పద్య కథ. దీనిని మొర్యోఫకీర్ అను హిందువు రచించారు, వారి తండ్రి పుర్సుమల్. ఇది 1873లో ప్రచురించబడింది. ప్రవాహంలాంటి కథనం, ససూయి, పున్‌హూన్‌ల కష్టసుఖాల కలయికతో గడిచిన వారి జీవితంలోని ప్రధాన ఘట్టాలు, యథాతథంగా, నిష్పక్ష పాతంగా, భావపూరితంగా ఒక హిందూ స్త్రీ (నవూన్ కుమార్తె) ఒక ముస్లిం రాకుమారుని ప్రేమించిన గాథ, ఒక హిందూ కవి వర్ణిస్తున్న దృష్ట్యా చూస్తే అద్భుతంగా ఉన్నది. రచయిత గ్రంథ రచనను మూడు రోజులలో పూర్తిచేశారని చెప్పడం చాలా ఆశ్చర్యకరమైన విషయం.

పర్షియన్ సాంప్రదాయాలను అనుసరించి కాక, సాంప్రదాయిక సూఫీ భావనలతో సింధీలో వ్రాసిన వారి కవితా పటిమకు ప్రసిద్ధికెక్కిన హిందూ కవి హలాకు చెందిన మాస్టర్ అసూమల్. వారు 1853 లో జన్మించారు. వారి దివాన్ 1897లో ముద్రింపబడింది. దాని తరువాత రిసాలో, ప్రేమ్‌గుంఫ అనే పద్య కావ్యాలు వచ్చాయి. వారు ఝోక్ సాంప్రదాయానికి చెందిన సూఫీ అనుయాయి, దానితోబాటే యోగ, వేదాంతాలను ఆకళించుకొని వాటిని కూడా ప్రచారం చేశారు. నిగూఢమైన సంస్కృత, అరబిక్ శబ్దాలు, సమాసాలు వీటితో వింతగా కలసి ఉండటం చేత వారి సాహిత్యం ఇటు హిందువులకు, అటు ముస్లిములకు కూడా సుబోధకం కాదు. హెూలీ, వసంత ఋతువు లాంటివి వర్ణిస్తూన్న సందర్భాలలోను, అమాయకపు వినోదాలను, సహజమైన సాధారణ ఘట్టాలను వర్ణిస్తున్నప్పుడున్నూ వాటికి సులభంగా బోధపడని ఆధ్యాత్మికతను ఆపాదిస్తూ ఉంటారు. వారి గజల్‌లలో మాధుర్యం, సున్నితమైన శైలీ కొరవడ్డాయి.

అసూమల్ సమకాలీనులైన మరొక హిందూకవి వేదాంత సూఫీ భావాలతో ఉప్పొంగుతూ వ్రాసిన పద్యాలు స్వతంత్ర భారతంలో నివసించే సింధీయులలో అతి వేగంగా ప్రచారాన్ని పొందుతున్నాయి. వారు, సైన్ లేక సంత విలైత్‌రాయ్ శిష్యులు లర్కాలోని కంబర్ వద్ద 1840లో జన్మించిన జీవత్‌సింగ్ వీరు 1899లో మరణించారు. వీరికి చాలామంది అభిమానులు అనుయాయులు ఉన్నారు. వారు వయసు మళ్లిన వెనుక వైద్యవృత్తి చేపట్టారు. ఎప్పుడూరోగులు చుట్టుముట్టి ఉండేవారు. వారి కవితలు అంతగా పాండిత్య ప్రకర్షతో లేనప్పటికీ అవి చదువుటకు, పాడుటకు అనువుగా ఉన్నాయి. వారి ముఖ్య శిష్యుడు భోజ్‌రాజ్ మోట్వాని (1867-1902) వారి శైలిలోనే సూఫీ విధానాలకు అనుగుణంగా వ్రాశారు.

సమీా శ్లోకాల వరవడి ననుసరించి చాలమంది హిందూ భగత్‌లు యీా కాలంలో ఎన్నో శ్లోకాలు వ్రాశారు. కాని వారందరినీ కవులుగా పరిగణించరాదు. వారిలో ముఖ్యులు తారో భగత్, వీరి శ్లోకాలు 1895 లో ముద్రించబడ్డాయి. తరువాత అర్కానావాసి స్వామి ధరందాసు. పవిత్రత కారణంగా చాలామంది పరిజనం వారికి ఉండేవారు.

ఆ కాలంలో ఉన్న ఇద్దరు ముస్లిం సూఫీ కవులు. హిందువులలోని సూఫీ అవలంబకులను తమ జీవిత చరిత్రలను వ్రాయవలసినదిగా ఉత్తేజ పరిచారు. వారు జహానియాకు చెందిన కుత్బుషా (హైదరాబాద్ సింధు, 1813-1910), ఎగువ సింధుకు చెందిన బుధల్ (1865-1939). ఝుమన్ దాస్ భాటియా కుతుబ్ షా జీవిత చరిత్ర వ్రాశారు. ఆనంద్‌రాం రజని, బుధల్ జీవిత చరిత్ర వ్రాస్తూ వారి పద్యకవిత్వాలను కూడా సేకరించి ప్రచురించారు.

కుతుబ్ షా, బుధల్‌ల కవిత్వాలలో అట్టే తేడా లేదు. సూఫీ పరమైన ఆలోచనలు ఇద్దరిలోనూ ఒకే విధంగా ఉన్నాయి. కాని బుధల్ వచనంలో వైవిధ్యం కనబడుతుంది. వారు - సింధీ నాయికలు మరూయీా, ససూయీాలను పంజాబీ నాయిక హీర్‌ను తమ కఫీలలో విస్తృతంగా చిత్రించారు. కుతుబ్ షా, బుధల్ ఇద్దరిలో కూడా ఒకే విధమైన విశాల భావాలు, మత మౌఢ్యాలనుండి స్వేచ్ఛ, అవసరమైన కర్మకాండ ప్రకారం విధులను నిర్వహించవలసినదన్న గౌరవము మనకు కనబడతాయి. కాని కవులుగా వారిని ప్రథమ శ్రేణిలో వుంచడానికి సరిపోరు.

తండ్రి కొడుకులైన బేదిల్, బేకస్‌ల విషయమాట్లాకాదు. వారిని సింధీ కవిత్రయములనబడే షా, సచల్, సమీల తరువాత ప్రథమశ్రేణిలో, పర్షియన్ సాంప్రదాయాన్ని అవలంబించిన కవులయితేనేమి, సాంప్రదాయిక సింధీ పద్ధతి నవలంబించిన కవులయితేనేమి. వీరందరి కంటే ప్రథమ స్థానంలో వుంచదగిన కవులు. బేదిల్, బేకస్‌లు అచ్చమయిన సమీ వంటి సూఫీ కవులు. కాని కోరినప్పుడు పర్షియన్ సాంప్రదాయాల పద్ధతి అనుసరించి కూడా వారు వ్రాయగలరు. వాస్తవానికి సింధీభాషలో కవితల కంటె పర్షియన్ పద్యాలనే ఎక్కువ సంఖ్యలో వారు రచించి ఉంచారు. బేదిల్, హృదయాన్ని అర్పించిన మనిషి అని అర్థమిస్తూంటే, బేకస్, తన అనదగు వారెవ్వరూ లేరు అని అర్థమిచ్చేలాగున తమ పేర్లు పెట్టుకున్నారు. బేదిల్ అని పిలువబడే ఫకీర్ కాదిర్ బక్స్ (అబ్దుల్ కాదిర్) 1814 లో రోహ్రీ వద్ద జన్మించి 1872 లో మరణించారు. వారికి ఒక కాలు కుంటిది. అయినప్పటికీ యాన సౌకర్యాలు అతి తక్కువగా ఉన్న ఆ కాలంలోనే వారు ఎన్నో దుష్కరమైన ప్రయాణాలు చేశారు. ముఖ్యంగా, నావలో ప్రయాణించి లాల్‌షహ్‌బాజ్‌కు తమ అంజలు లర్పించడానికి సిహ్‌వాన్‌కు వెళ్లారు. వారు తమ కవితలలో పలుమార్లు సూఫీల గురువు అనదగిన వారి మందిరంలోనున్న లాల్‌షహ్‌బాజ్‌కు భక్తితో, మహోజ్వలమైన పదావళితో తమ నివాళితో అర్పించారు. షా ఇనాయత్ ఝోక్‌కు చెందిన అమర వీరుని, దరాజాన్‌లోని ఆ మహా కవి సచల్ మందిరంలోను (అది వారి నివాస స్థలము రోహ్రీకి సమీపంలో ఉన్నది) ప్రార్థనలు చేశారు. సచల్, బేదిల్‌లు ఒకరినొకరు కలుసుకున్నారన్న ఊహ ఎంతో మధురమైనది. షా తమ ఆధ్యాత్మిక వారసునిగా సచల్‌ను ఎన్నుకున్నట్లే, సచల్ కూడా బేదిల్‌కు తమ సూఫీ కవిత్వ కిరీటాన్ని అందజేసి ఉంటారు, అది మనం వాస్తవాలపై చేస్తున్న ఊహలు మాత్రమే. బేదిల్ తమ కవితావేశాన్ని సచల్ నుండి పొందారు అన్నది మాత్రం వాస్తవమే. సచల్ మరణించినప్పుడు చక్కని భాషలో ఒక శోకగీతాన్ని (సచల్‌ని గురించిన అధ్యాయంలో ఈ విషయం గురించి ప్రస్తావించబడింది) వ్రాశారు. అప్పటికి వారు పదిహేను సంవత్సరాల బాలుడు. (పన్నెండేండ్లు అని కొందరంటారు)

సింధీ కవులందరిలో బేదిల్ అపార జ్ఞానసంపన్నులు, వారి పర్షియన్, అరబిక్, హిందీ, ఉర్దూ, ప్రాంతీయ భాష అయిన సిరైకి. సింధీ భాషలు బాగా తెలుసు, సంస్కృత జ్ఞానం కుడా వారికి ఉన్నదని ప్రతీతి. కాని వారి అపార జ్ఞానసంపద, ప్రాపంచిక వస్తువులు వారిపై అంతగా ప్రభావం

చూపలేదు. వారికి ఎప్పుడైనా బహుమతులు, నివేదనలు వస్తే వాటిని వెంటనే అక్కడే తనను పరివేష్ఠించి వున్నవారికి పంచి పెటేవారట. లేదా పవిత్ర మందిరాలు నడిపేవారికి పంపించే వారట.

బేదిల్ అసాధారణమైన అద్భుతశక్తులను గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నవి. కాని వాటన్నిటినీ నమ్మనూ వచ్చు, నమ్మకపోనూ వచ్చు. వారు తమను భగవదర్పితము గావించుకొని ఉపకారములు గాని, బహుమతులనుగాని అర్థించుచు వేడుకొన లేదు. వారి జీవితంలో ముఖ్య ఘట్టాలు ఒకటి వెనుక మరియొకటి విఫలమైన ప్రణయ సంఘటనలు (వాటిని ప్రేమలు అనలేము) మొట్టమొదట వారి దుకాణమునకు ఎదు రింటిలోనుండే ఒక బ్రాహ్మణ యువతి సౌందర్యమును చూచి మోహించారు. ఆమె వెంటనే తన పెద్దలకు అతడు తన వైపే దీక్షగా చూస్తున్నాడని ఫిర్యాదు చేసింది. తరువాత వారి మోహావేశం ఒక హిందూ బాలుడు కరం చంద్ అనువానిపై ప్రసరించింది. మూడవసారి షికార్ పుర్ ఫకీర్ ఘులాం మహమ్మద్‌పై వారి దృష్టి పడింది. కాని వారి అకాలమరణం వల్ల బేదిల్ దుఃఖావేశంలో మునిగిపోయారు. చివరసారిగా అంటే నాల్గవసారి వారి దృష్టి రోహ్రీకి చెందిన కాజీపీర్ మహమ్మద్ పై వాలింది. కాని వారు బేదిల్ కంటె మూడు నాలుగు సంవత్సరాలు ముందుగా కాలం చేశారు. ఆ ఘటన వారిని దుఃఖంలో ముంచింది. వారి మరణంపై ఒక పద్యాన్ని బేదిల్ వ్రాశారు. 'ఓ స్నేహితుడా! నీ హృదయమున నన్నొంటరిగా విడిచిపో వలెనన్న ఊహ ఎట్లు తోచెను? నీవు లేక, ఓ ప్రియతమా, నా హృదయము కలత చెందినది. నా జీవితము బాధాకరమైనది, వేదనా భరితమైనది.'

అట్లని బేదిల్ అయోగ్యమైన అలవాట్లు అవలంబించారని తలచుట భావ్యంకాదు. వారు రెండు సార్లు వివాహమాడారు. ఒక భార్య పుత్రుడు బేకస్. బేదిల్ గొప్ప సూఫీకవి. ఆయన జామీ ధర్మ నియమాలను పాటి స్తారు. వారంటారు 'మొగము చాటు చేయకుము ప్రేమ నుండి, అది మజాజీ (శారీరక సంబంధమైనది) అయినను, అది హకీకత్ (నిజమునకు, ఆధ్యా త్మిక ప్రేమకు) మార్గదర్శి యగును." మజాజీ ప్రేమ, హకీకీ ప్రేమకు వంతెన వంటిదని సూఫీలు భావిస్తారు. మానవ రూపంలో నున్న సౌంద ర్యాన్ని ఆరాధించేవాడు బేదిల్. బేదిల్ జీవితం, వారి సహాధ్యాయులు, వారిని గురించిన కథలు, ముచ్చట్లు అన్నీ మనకు దొరుకుతాయి. గిడుమల్ హర్‌జానీ ఓపికతో చేసిన పరిశోధనల ఫలితంగా బేదిల్, వారి కుమారులు బేకస్ జీవిత చరిత్రలే కాకుండా, ఒక ధీవాన్‌లో వారిరువురి రచనలు

ప్రచురింపబడ్డాయి. అందుకు హర్‌జానీకి కృతజ్ఞతలు అర్పించాలి. కాని గిడుమల్ హర్‌జానీని, బేదిల్‌వి గాని బేకస్‌వి గాని పద్యాలకు వ్యాఖ్యానం వ్రాయలేదు. వారి యీ ప్రచురణలు కల్గించే ఆసక్తి వలన, ఎవరైనా యీ లోపాన్ని సరిచేస్తారని ఆశించవచ్చును. గిడుమల్ హర్‌జానీ పాకిస్తాన్‌లో ప్రచురించబడిన బేదిల్ రచనలలోని లోపాలను ఎంచి చూపారు. అదే విధంగా బూల్‌చంద్ రాజ్‌పాల్ కూడా బేదిల్ రచనల మీద కొంత పరిశ్రమ చేశారు.

సింధీ కాని, ఇతర భాషలలో బేదిల్ వ్రాసిన రచనలు చాలా సంపుటాలు అవుతాయి. వారి సింధీ కవితలు వహాదత్‌నామా, స్రూద్‌నామా, మరొక చిన్న సంకలనం ఫరెయిజ్ సూఫియా (సూఫీ యొక్క విధులు) అని మూడు సంపుటాలలో ఉన్నాయి. ఇతర పద్యాలు కూడా ఉన్నాయి. ఈ సంపుటాలలోనే గేయాలు, కఫీలు కుడా చేర్చబడ్డాయి.

బేదిల్ సచల్ సంప్రదాయాలను అనుసరించిన వారే కాని, వారిద్దరికీ ఉన్న గొప్ప భేదం, వారిలో తిరుగుబాటు భావాలు లేవు. మఖ్‌దుమ్‌లు, అఖండు, ముల్లాలు వీరిని వ్యతిరేకిస్తూ ఖండనలు గాని తీవ్రవిమర్శలు గాని వారి రచనలలో కనబడవు. అల్లాటిదేదైనా ఉంటే, బేదిల్ తన నడవడిక లోను, తన రచనలలోను, మత గురువుల మనసులను నొప్పించేందుకు అవకాశ మివ్వరు. వారి ప్రశీయ సంబంధమైన వ్యవహారాలు కొందరికి విభ్రాంతి కలుగచేయక మానవు. అందుకు వారు నిస్సహాయులు. కాని సభ్యత అంచులను దాటే ఇట్టి నడవడికలు సూఫీ కవులలో మన్న న్వాభావమే. సచల్ విశృంఖలత, తీక్షత, విచ్చల విడిగా భావప్రకటన, యివన్నీ బేదిల్‌లో లోపించినా, సచల్ పద్యరచనా సౌందర్యము, మాధుర్యము కొంతవరకూ ఆకట్టుకో గలిగారు ; తమ బెయత్‌లలో, కఫీలలో కూడా.

వారి భావన పూర్తిగా వ్యతిరేకం, అది సూఫీ భావన. తరచు ఉదహరించే వారి కఫీ సిరాయ్‌కి ప్రాంతీయ భాషలో నున్నది, వారి సూఫీ తత్వ భావాలను వ్యక్తం చేస్తుంది. 'నేను అన్న దానిని నశింపజెయు కళ నేర్చుకొనుము. అభ్యసించుట, బోధించుట అవసరం లేదు. ప్రేమైకమూర్తి వివాదముల ద్వారా కనుగొన బడడు. హేతువాదము, లేక వివేకము అతని వైపుకు దారి చూపలేవు. మరి యొక కఫీలో, బహుశా అత్యంత ప్రచారంలో నున్న కఫీలో వారు సచల్‌కు అతి సన్నిహితంగా వస్తారు ; 'నేను నేనే, వేరు వేరు దుస్తులను ధరింతును, తిరిగి వాటిని విసర్జింతును. కొన్ని సందర్భాలలో హిందువు. కొన్ని సందర్భాలలో మోమిన్ (ముస్లిం). నాకు

అనేక రంగులున్నవి ; అనేక వన్నెలు, ప్రచ్ఛన్న రూపాలు ఉన్నాయి. నేను ముమల్‌గా మారి ఆవేషమున నన్ను పెండ్లాడ వచ్చిన వేలాది మందిని చంపుదును. నా రహస్యము దానిని ఉల్లాసముగా, వల్లెవేయు ఆ త్రాగుబోతులకే తెలుసు. ఈ దృశ్య ప్రపంచమునందు నటన కొరకు మాత్రామే నే సంచరింతును, బేదిల్ అను పేరున.' బహుశా సింధీ భాష లోని అత్యుత్తమమైన ఆరు కఫీలలో ఇది ఒకటి.

వారి మరణానికి చిహ్నంగా యోగ్యుడైన వారి కుమారుడు స్మృతిగా శోక గీతాన్ని వ్రాశారు. సచల్ మరణించినప్పుడు 'బేదిల్ (తండ్రి) వ్రాసిన శోక గీతాన్ని ఇది గుర్తు చేస్తూన్నప్పటికి, తండ్రి వ్రాసిన సాటిలేని శోక గీతంతో కుమారుడు వ్రాసిన యీ శోక గీతం పోటీకి నిలువలేదు. కవిగా వీరి పేరు, తండ్రి పేరుతో విడదీయరాని విధంగా ముడివడి ఉన్నది. 1859 లో జన్మించి 1882 లో వీరు మరణించారు.

తండ్రి వీరిని పెంచి, విద్యా బుద్ధులు నేర్పించారు. వారు గతించిన పిదప అన్నివిధాలా తండ్రి అడుగుజాడలలో నడచుకున్నారు. సేహ్వాన్‌లో షాహ్ బాజ్‌కు భక్తి ప్రపత్తులతో అంకితమవడం దగ్గర నుంచీ, చర్మ మాంసాల ప్రోగైన సుందరమానవ రూపాలను చూచి మోహావేశాలను పొందే వరకూ తండ్రినే అనుకరించారు. తండ్రివలెగాక బేకస్ కూడా అందగాడే. ఆడంబరంగా వుండే దుస్తులు, ఆకర్షణీయమైన రూపం వల్ల చూపరుల దృష్టిని వెంటనే ఆకర్షిస్తారు. వారు తమ భార్యను అలక్ష్యంగా చూచారని చెప్పుకున్నారు. కాని వారి తండ్రిని గురించి అట్టిది ఎన్నడూ వినలేదు.

బేకస్, ఇరువదిమూడవ ఏటనే మరణించారు. కాని కీట్స్ మహా కవితో పోల్చదగినంత సాహిత్యాన్ని ఇచ్చివెళ్లారు. కీట్స్‌వలెనే వీరిని కూడా 'ఇంద్రియగమ్యుడు' విషయా సక్తుడు అనవచ్చును. బేకస్ కఫీలు ప్రభావితం చేసేవిగా ఉంటాయి. ఉ॥ "నీ నుండి వేరైన విరహము నన్ను చంపివైచినది. వేగముగా తిరిగి రమ్ము, తిరిగి నా ప్రాణమునిచ్చువాడా నాపైకినుక వహింపకుము, ఓ ప్రియాతి ప్రియతమా, నా హృదయమున వసించే ప్రాణస్నేహితుడవు ! మన మిద్దరము మరి యొక్కసారి ఏక మవు చుముగాక.' తానే మరూయీగా భావించి భావోత్కంఠతతో ఇలా ఎలుగెత్తి అంటారు : 'నా బంధువుల కొరకు అపేక్షించుచు దివారాత్రములు కన్నీరొలి కించితి. నేనిచట నిస్సహాయురాలనై కూరుచుంటి, బాధాతప్తనై, మరు కొరకు వారచట క్షీరమును గ్రోలు చుంటిరి. ప్రతిక్షణము నా శ్వాస

వారికై ఎగయుచున్నది.' ఇక మిగిలినది. బేకన్ భావాలు అన్నీ వారి తండ్రి భావాలతో కలిసి ఒకటిగాచే ఉంటాయి. అందుకే ఒకరి రచనలు రెండవ వారి వని పొరబడ వచ్చును. తారుమారైనను కావచ్చును.

## 1907 – 1947 మధ్యకాలం

ఈ కాలంలో సాహిత్య చైతన్యం వచన రంగంలో కనబడినంత హెచ్చుగా పద్యరంగంలో కనబడదన వచ్చు. మానవుల ఆలోచనలు ఈ కాలంలో రాజకీయాల వైపు; సాంఘిక సంస్కరణల వైపు మళ్లాయి. ప్రశాంతత, ప్రశాంత జీవనం వీటితో నిండిన వాతావరణం లుప్తమై పోవడం చేత, ఆ అనుకూల వాతావరణంలో ఉద్భవించే కవిత్వం కూడా తగ్గిపోయింది. అదీగాక, ఉద్యమాల వెంబడే యువక యోధుకాలం అది. వారికి కవిత్వం వంటి విలాసాలతో కాలం వెళ్ల బుచ్చుటకు తగిన సామగ్రి, సమయం లేవు.

అర్ధశతాబ్దంపాటు రాజకీయ చలనం లేక పడి ఉండిన సింధు ముస్లిములు ఒక్కుమ్మడిగా లాభసాటియైన అధికార పదవులలోనికి తీసుకొని వచ్చారు. వారికి 1907 తరువాత ప్రత్యేక నియోజక వర్గాలు కేటాయించబడ్డాయి. వారి అర్హతలకు సంబంధం లేకుండా ఉన్నత పదవులు వారికి ఇచ్చే వాగ్దానాలు లభించాయి కాని వారి సంఖ్యాబలానికి అనుగుణంగా ఇవి ఉండెటట్లు జరిగాయి. ముప్పై యేండ్ల తరువాత వారే పాలక వర్గంగా మారి, తమది అంటూ ప్రత్యేక రాష్ట్రంగా పొంది, నలభై ఏండ్లు గడిచిన వెనుక పాకిస్తాన్ నడి బొడ్డున రాజధాని నగరంలో గర్వించదగిన ఉన్నత స్థానంలో ఉన్నారు. అనతికాలంలోనే పాకిస్తాన్ ఇతర ప్రాంతాలలో ఉంటున్న స్వమతావలంబకులతో వారు ఉక్కిరి బిక్కిరయిపోయి, యిప్పుడు సింధు ప్రత్యేక రాష్ట్రంగా గాని, రాజ భాషగా సింధీగాని లేక శతాబ్దం క్రిందటి పరిస్థితులకు దిగజారి అప్పటి పరిస్థితులకు భిన్నంగా ఇప్పుడు వారు పర్షియనుకు బదులుగా ఉర్దూ నేర్చుకోవలసి వచ్చింది సింధులోని హిందువులు స్వాతంత్ర్య యోధులు. ఆకాలం అంతటిలో మొదట బెంగాలీ దేశభక్తులను చూసి ఉత్తేజితులై, తరువాత మహాత్మాగాంధీ, వారి అనుయాయులు జరిపిన ఉద్యమాల వల్ల ప్రభావితులయ్యారు. స్వామి వివేకానందుని వేదాంత రచనలు ప్రతి విద్యావంతుడైన సింధీ హిందువు చేతులలోనూ ఉండేవి. అప్పటి వరకూ 'పడక కుర్చీ'లలో తీరుబాటుగా కూర్చొని చర్చించే రాజకీయ నాయకుల సంఘం 1907 తరువాత, ఒక్కు

మ్మడిగా ఉద్యమంగా మారింది. ప్రథమ ప్రపంచ సంగ్రామ సమయంలో యూరోపియనుల బుద్ధికుశలత, మంచితనము, వారి ఆధిపత్యము యివన్నీ బట్టబయలై, పాశ్చాత్య నాగరికతలోని నష్టాలన్నీ తేటతెల్ల మయినాయి. హిందువులందరూ సింధు, హిందుగా ఉన్నన్నాళ్లూ పట్టుకు వ్రేలాడారు. కాని మతోన్మాదానికి పరాయి వారి జీవన విధానానికీ వారి సంస్కృతి బలియైపోనున్న ప్రమాదాన్ని గుర్తించిన హిందువులు హిందుకు దారి తీశారు. అక్కడ వారు శేష భారతంలో అవిభాజ్యమైన వారి సంస్కృతి పరిరక్షణను దృఢంగా కొన సాగిస్తున్నారు.

సహజంగానే, దివాన్‌లు, రిసాలోలు వ్రాయుకాలం, పాతకాలం లాంటిది కాదు. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే అంతకు ముందరి పర్షియన్ సంప్రదాయాలను సమర్థించే ముఖ్యులు అజీజ్ అన్న పేరు పెట్టు కొన్న లేఖ్‌రాజ్ కిషన్ చంద్ అనే హిందువు. వారు 1904లో జన్మించి, మన మధ్యనే ఇంకా ఉన్నారు. కాని విభజన అనంతరం వారి భావాలు పూర్తిగా మారిపోయాయి. విభజనకు పూర్వపు సంవత్సరాలలో వారి రచనల సంకలనాలు రెండిటిని ప్రచురించారు. ఒక దానిలో వారు ప్రావీ ణ్యత సాధించిన గజల్‌లు అన్నీ చేర్చబడ్డాయి. రెండవ దానిలో ది క్వీన్ ఆఫ్ ఈజిప్ట్ **(The Queen of Egypt)** అల్ కెమిస్ట్ **(Alche'mist)** అను వర్ణనాత్మకమైన మస్నవీలు ఉన్నాయి. ఇవి సుందర్ సాహిత్య పబ్లికేషన్స్ వారి నుండి పొందవచ్చును.

గజల్‌లు, మస్నవీలు వ్రాయడానికి తగిన అర్హతలు మరి ఏ ఇతర సింధీ హిందూ, ముస్లిం కవులకు లేనన్ని అజీజ్‌కు ఉన్నాయి. ఆయన మంచి పర్షియన్ విద్యార్థి, ఆంగ్లంలో కూడా ప్రావీణ్యత సంపాదించారు. వారు ముస్లిములు ఏర్పాటు చేసిన ముషైరా (కవి సమ్మేళనము)లలోను, బొంబాయి (ఎలిఫిన్‌స్టన్ కాలేజీ)లోని ఒక విద్యాలయం వారు ఏర్పాటు చేసిన సాంస్కృతిక సమ్మేళనంలోనూ, పాల్గొన్నారు. వారు - జమీందార్లు, గ్రామీణులు, అవిద్యావంతులు అందరితో సన్నిహితంగా ఉన్నారు. కత్తి లేని వారి సహజ భాషా సంపదను కాపాడారు. చాలా మందికి గడ్డు సమస్యగా ఉండే పర్షియన్ ఛందో శాస్త్రాన్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్న తదుపరి, పర్షియన్, అరబిక్ సంస్కృత సమ్మేళనం నుండి పుట్టిన పదజాలాన్ని తెలుసుకున్నారు.

బేవస్‌ను అభిమానించే హిందువులు (వీరు ఆధునిక పద్య సాంప్ర దాయానికి మూల పురుషుడు) వాసిఫ్ వంటి పర్షియన్ సాంప్రదాయాలను

కచ్చితంగా అనుసరించే కవులను అభిమానించే ముస్లిములు యీ రెండు కక్షలవారు ఏర్పాటు చేసిన సాహిత్య వాగ్వివాదాలలో అజీజ్ పాల్గొన్నారు.

అజీజ్ కవిత్వంలోని ప్రావీణ్యత, యథేష్టమైన వారి శైలి, అందరూ మెచ్చుకోవడం గమనించ దగ్గది. కాని వారిలో కవికి ఉండవలసిన భావ స్ఫూర్తి ఉన్నదా అన్న సందేహం కలుగక మానదు. ఆకారణంగా వారిని మౌలిక కవిగా ఎంచవచ్చునా లేక పరిణామ సిద్ధాంత కవిగా, ఎంచవలెనా అన్న ప్రశ్న ఉదయించుతుంది. వారి ప్రత్యర్థులు తరచుగా వారి పద్యాలకు పాశ్చాత్యమూలములను ఎత్తిచూపించటం కద్దు : కవి అన్నవాడు తన చేతికి అందుబాటులో నున్న ఏ కవితా సామగ్రినైనా వినియోగించే స్వేచ్ఛ వారికి ఉండాలని నమ్మేవారు అజీజ్. పాఠశాల తరగతులలో వారి చిన్న పద్యాలు కొన్ని పాఠ్యాంశాలుగా చదివేవారేమో గాని వారి గజల్‌లు, మస్నవీలు ప్రచారంలో అంతగాలేవు. అజీజ్ పద్యాలు ఉదాహరణలుగా చెప్పడానికి, సభలలో పఠించడానికి అనువుగా లేవు. వారి గజల్‌లు, ఇతర రచనలు అభినందించాలంటే అన్నిటినీ కలిపి చదవాలి.

అజీజ్ బక్స్ జటోయ్ విద్యాలయంలో చదివే రోజుల్లోనే సింధుపై వ్రాసిన ప్రసిద్ధికెక్కిన పద్యంతో అజీజ్ వ్రాసిన 'సింధు' అన్న పద్యం పోల్చడం ద్వారా వారికీ, ఇతర జనప్రియులైన కవులకూ మధ్యగల భేదం చెప్పవచ్చు. జటోయి వ్రాసిన సింధుకు లేక ఇండస్ నదికి విన్నపము ప్రతి సింధీయునీ చేరింది. దానిని అత్యుత్సాహంతో పాడుకుంటూంటారు, కాని పాండిత్య ప్రకర్షతో వ్రాసిన అజీజ్ రచన దేశ విభజనానంతరం సింధునదిని ప్రాణప్రదంగా, పూజించే సింధీయులకు కూడా చప్ప చప్పగా తోచి వారిని ఉత్తేజితులను చేయలేకపోయింది. హైదర్ బక్స్ జటోయి తమ సింధుకు వినతిని పందొమ్మిది వందల ఇరవైలలో వ్రాశారు. అటు తర్వాత వారు చక్కని బాయత్, షిక్వారులు వ్రాశారు. షిక్వా అంటే కవి ఇక్బాల్ ఉర్దూలో వ్రాసిన రీతిని ఒక అభియోగం. అందులో ఇతర విషయాలకు తోడువారు వేసవి విశ్రాంతి ప్రదేశమైన ముస్సోరీని కీర్తిస్తూ వ్రాశారు. ఈ రచనలు ఒక సంపుటిగా ప్రచురించబడాయి. వారి రచనలు దురభిమానులైన ముస్లిము ముల్లాలకు అభ్యంతరకరంగా తోచినవి. అందువలన యీ గ్రంథం ప్రచారము నుండి నిలిపి వేయబడింది. అప్పుడు జటోయి రాజకీయరంగంలోనికి దుమికి గ్రామీణులకు అండగా నిలచిన వారికి నాయకుడై 'హరీ హక్ దార్' అన్న నినాదం చేశారు. దారిద్ర్యంతో బాధపడేవారు, పీడితులైన వారి క్షేమం కొరకు ఉద్యోగాన్ని త్యాగం చెయ్యడమే

కాకుండా తమకవి జీవితాన్ని కూడా త్యాగం చేసి, కారాగార వాసాన్నికోరి తెచ్చుకున్న అపూర్వమైన వ్యక్తి. ఒకానొక కాలంలో గొప్ప సింధీ కవిగా రాణించగలడన్న ఆశను రేకెత్తించిన వ్యక్తి.

అజీజ్ సాంకేతిక ప్రాశస్త్యం, జటోయి శూరత్వం పొడచూపే లక్షణాలు లేకపోయినా, సాధువు, నిగర్వియైన జీవి, ప్రేమించదగిన వ్యక్తి. వారి కంటె అధికుల నుండి నేర్చుకొనవలె నన్న తపన ఎల్లప్పుడూ కలిగిన వ్యక్తి. ఉత్తమ ప్రజాకవిగా రూపొందే వరకూ వారి జ్ఞానాన్ని నైపుణ్యాన్ని మెరుగు పరచుకోవాలని నిరంతరం పాటుపడే వ్యక్తి. మరొక హిందూ కవి పర్సరాం హీరానంద్ జయా (వెలుగు). విభజనకు ముందరి రోజుల్లో 1943లో వారి పద్యాలను తసీవర్-ఇ-ఇహ్ సాస్ (ఇంద్రియ జ్ఞానము యొక్క చిత్రణ) అన్న శీర్షిక క్రింద ప్రచురించారు. జియాగా వారిని తరువాత ఎరిగిన వారి అభిమానులు యీ గ్రంథము వారి రచనయే నని నమ్మలేక పోయారు. కాని జాగ్రత్తగా చదివిన వారు కవిగా రూపొందు తున్న జియాను గుర్తించ గలిగారు. తస్వీర్-ఇ-ఇహ్ సాస్ తమ పాఠకులు ముస్లిములన్న విషయం దృష్టిలో నుంచుకొని వ్రాసినది. డైరెక్టర్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డా॥ దౌడ్ పోతా మన్ననలందింది. ఆ గ్రంథమునకు వారికి బహుమతి కూడా లభించింది. కవి శైలి అస్వాభావికంగా ఉంటుంది. ముస్లింకవి ఎవరైనా కాబా, ఇమాంహుసేన్, విగ్రహారాధనలు సాగే దేవా లయాలను గురించి చెబుతారు. దాని వెంబడి కృష్ణునికి వినతిగా మురళీ నాద లోలునిపై ఒక పద్యం, మరొక పద్యం ప్రవక్తపైన స్తుతి ఉంటాయి. వారు ముస్లిము కాకపోయినా వారు ప్రవక్తనే అనుసరిస్తారనీ, అంతిమతీర్పు సమయంలో వారి మధ్యవర్తిత్వాన్ని అర్థిస్తారు. వారి రుబాయత్‌లో సాంప్ర దాయికమైన రూపకల్పనలు, మదిరనందించు వారు (సాకీ), ప్రార్థనలు, సాష్టాంగపడటాలు (సిజ్ జాహ్) కాబాలు ఉంటాయి. ఈ సంపుటిలోని అత్యుత్తమమైన పద్య శీర్షిక, 'విదేశంలో వుంటూ మాతృదేశాన్ని తలచు కొనుట'. జియా పద్య రచన ముస్లిం కవి మురాద్ అలీ 'కాజిం' వద్ద నేర్చారు. వారు కూడా పర్షియన్ సాంప్రదాయాలకు చెందిన సింధీ కవులలో ఒకరు. గులార్-ఇ-కంజూర్ కొంతభాగం వ్రాసిన కవి.

ఆ కాలంలో చెప్పుకోతగ్గ పద్య రచనను, పర్షియన్ పద్ధతులలో వ్రాసిన ఇతర హిందూకవులు, రుబాయత్ (చతుష్పాద కవితలు) చదివి ఆనందించ గల కవితలను వ్రాసిన డా॥ హెచ్. ఐ. సదారంగానీ, పాఠ శాలలలో చదువుతున్న పద్యాలను వ్రాసిన ప్రఖ్యాత పర్షియన్, అరబిక్ పండి

తులు, హిందువు అయిన నిర్మల్ దాస్ ఫతేచంద్ పుత్రుడు శోభరాజ్ నిర్మల్ దాస్. ఈ శకంలో బేదిల్, బేకస్, సంగీత సరసన ఆ కవులను పేర్కొన తగినంతగా పర్షియన్ సంప్రదాయాల ననుసరించి విస్తృతంగా వ్రాసిన హిందూ కవులు లేరనే చెప్పాలి.

ఈ శకంలో ముస్లిం కవులు వ్రాసిన కవిత్వం అంత ఆకర్షణీయంగా లేదు. పాతకాలపు పద్ధతి ననుసరించి దీవాన్‌లు వ్రాయడం కూడా కొన సాగుతూనే వున్నదికాని, చెప్పుకో తగ్గదీ, ఇప్పటి దాకా నిలిచి, రెండవ ముద్రణకు కూడా నోచుకున్నదీ ఒకే ఒక్క దీవాన్. అది మహమ్మద్ బక్స్ వాసిఫ్ వ్రాసినది. అది 1922లో మొట్టమొదట ముద్రించబడి, 1955లో పునర్ముద్రితమయింది. ప్రారంభం ఒక పర్షియన్ గజల్‌తో జరిగినా, తక్కినవి అన్నీ ఉర్దూలో ఉన్నాయి. సింధీ గజల్‌లు ప్రవక్త నుద్దేశించిన రచనతో ప్రారంభం అవుతాయి. దాని వెనువెంటనే సాంప్రదాయాన్నను సరించి కరుణరసచ్ఛాయలతో నున్న ప్రేమను గురించి ప్రస్తావన ఉంటుంది . 'ఈ రోజు ప్రేమను గురించిన అనేక వస్తువులు నా హృదయము నందు జత గూడినవి. ఈ గడచుచున్న సమయమున నే నొక్కడనే కాదు ఆందోళన చెందుట, ప్రియతముని దృక్కులు కూడ అన్యమనస్కులై నట్లుండినవి.' ఏదో విధంగా ప్రేమ ప్రస్తావనను కవి తేవాలి, ప్రియ తముడు, ఉంగరాల జుటు మొదలైనది రావాలి. తక్కిన గజల్‌లు కూడా ఇంతకంటె ఏమీ మెరుగ్గా లేవు. వాటి నిండా పాతబడిన సమాసాలు, పద బంధాలు తప్ప వేరేమీ లేవు.

నవాబ్ అలీజా ఫ్రీ (నియాజ్), ఆగా వంటి ముస్లిం కవులు వ్రాసిన కఫీలు అంతకంటె మనోహరంగా వున్నాయి. కోయిల గులాబీ కథకు నవాజ్ అలీ ఒక క్రొత్త మనోహరమైన మలుపు ఇచ్చి, వివిధకవితా ప్రక్రియలను వినియోగించి పద్యాల ప్రవాహవేగానికి, శ్రావ్యతకు దోహదం స్తారు. మరొక ఆమోదయోగ్యమైన కవి దరాజన్ పవిత్ర మందిరలో భక్తుడు కోజీ (కురూపి) మహమ్మద్ బక్స్.

అత్యంత మనోహరము, లక్షణ యుతము, దోషరహితము అయిన పద్య సంకలనం పందొమ్మిది వందల నలభై ప్రాంతాలలో షికార్ పూర్‌కు చెందిన ముస్లిం కవి ఘులాం అలీ రహీంబక్స్ మస్‌రూర్ ముసద్దస్ హిసూర్ లేక 'హీర్న్-జొ-హార్' (వజ్రాల హారం) అన్న శీర్షిక క్రింద ప్రచురించినది. సూఫీలు (సిఫాతి, జాతి) వాడిన భాషా పదజాలం, వేదాంతులకు అత్యంత ప్రియమైన ఉదాహరణలు - ఖైబర్ కోట, ఆదమ్ ట్రస్ట్ వంటివి, పర్షియన్లకు

ప్రియమైన పద్యరీతులను వినియోగించారు. అయితే యీ పరస్పర విరుద్ధమైన మౌలికాంశాలన్నింటినీ ఏక స్వర సముదాయంగా మలచి, విశృంఖల, శాంత, రసాలను ఒలికిస్తూ ఒక్కొక్క సారి వాక్పటిమను కూడా చూపిస్తూ పాఠకుల మనసులను రంజింప జేస్తారు. హిందువులకూ ముస్లిములకూ కూడా అయోచమోగ్యంగా సూటిగా బోధన శైలిలో కాక వాస్తవిక నీతులను చెపుతూ ఉంటారు. ప్రధానంగా వారి గ్రంధం యువ పాఠకులకు. 'ఈ విశ్వంలో దేనికైనా పునాది సరియైన విద్యలేక పోషణ పైననే ఆధారపడి ఉంటుంది.' అని వారి నమ్మకం. ఏవయసు పాఠకులైనా వజ్రాల హారాన్ని ధరించడానికి ఇష్ట పడతారు.

ఈ కాలంలోనే జ్ఞాని, పండితుడు, వయోవృద్ధులు అయిన దయారాం గిడుమల్ కలం నుండి ఒక అసాధారణమైన గ్రంధం వెలువడింది. (వారు తమను నిమానో లేక విధేయుడు అనీ, శూన్యం అని వివిధ నామాలతో చెప్పుకుంటారు) దాని పేరు మనాజా-చాహ్-బుక్ (మనసు కొరడా వంటిది). ఆ గ్రంధం ఆధ్యాత్మిక భావాలతో, ప్రాసలతో కూడి ఛందో రీతులకు కట్టుబడని సింధీలో ప్రథమ వచన పద్య కావ్యంగా ఎంచవచ్చు. దయారాం గిడుమల్ సహజంగా సింధీయులు తెలుసుకొన దగినంత మేరకు సూఫీతత్త్వం తెలుసుకున్నారు. వేదాంతం వారికి తెలుసు. గురు నానక్ భక్తులు. వారి బోధనలను అంగీకరిస్తారు. అనుసరిస్తారు. ఈ మహత్తర విషయాల సమన్వయం చాలా అరుదుగా లభిస్తుంది; ముందు ముందు సింధీ భాషలో ఒక్క క్రొత్తయుగాన్ని ప్రారంభించిన గౌరవం ఈ గ్రంధానికి దక్కవచ్చును. ఇవన్నీ యీ గ్రంధం మనా-జా-చాహ్ బుక్ (1923-26)లో మనం గమనిస్తాం. ఇదివరలో పతంజలి యోగ శాస్త్రం, భగవద్గీతలను వచనంలో అనువదించారు. ఆ గ్రంధాలకు ప్రస్తుత గ్రంధం పరిపూర్ణ ఆమోద ముద్ర వేస్తుంది. అనేక సంస్కృతుల సంకలనంతో కూడినప్పటికీ ప్రత్యేకంగా కనబడే సింధీ సంస్కృతిని చరిత్రలను అభినందిస్తూ దయారాం గిడుమల్ వ్రాసిన చక్కని పద్యం తగిన రీతిని ఖ్యాతి నొందింది.

మరొక విశిష్టమైన సింధీ కావ్యం పూరబ్ సందేస్ (తూర్పు సందేశం). శీర్షికను వివరిస్తూ క్రింద బుద్ధ జీవన్ (బుద్ధుని జీవితం) అని సూచించ బడింది. 1937లో దెవాన్ దాస్ కిష్‌నాని వెలువరించారు. ఈ గ్రంధరచయిత పుస్తకానికి ఉపోద్ఘాతం వ్రాశారు. ఈ గ్రంధం ఆర్నాల్డ్ ఆంగ్ల పుస్తకం లైట్ ఆఫ్ ఏషియాకు అనుకరణ. రచయిత బేవాస్ సంప్ర

దాయాలను పూర్తిగా అనుసరించే వారు కాకపోయినా, వారి నుండి కొన్ని విషయాలను గ్రహించారు. పర్షియన్ సాంప్రదాయాలను అనుసరించే రచయితలు అమితోత్సాహంతో ప్రయోగించే పొడిపొడిగా ఉండే రూప కల్పనలు, అసహమైన పద ప్రయోగం, భావ ప్రకటనలు వర్జించారు. బేవస్‌లో ఉండే నవనవత్వం చొరవ తీసుకొని అజాద్ తరుణోత్సాహంతో, జీవితంలోని ఒక ఆనందాన్ని సమ్మిళితంచేసి, వినూత్న చైతన్యం, నిరతత్వ ఆకర్షణ కలిగిన ఒక పద్యకావ్యాన్ని రూపొందించారు.

పూరబ్ సందేశ్ ఆరేసి పాదాలతో ఉన్న పద్యాలు. మొదటి నాలుగు పాదాలలోనూ చివర ఒకే అక్షరం ఉంటుంది. చివర రెండు పాదాలకు మాత్రం వేరొక అక్షరం అంత్య ప్రాసగా ఉంటుంది. కథనంలోని పద్యాలకు మధ్య మధ్య విసువు కలిగించకుండా గేయరీతులతో యీ ఆరు పాదాల పద్యాలు వస్తూ ఉంటాయి. ఈ వర్ణనలలో కొన్ని సాంప్రదాయిక సూఫీ రచనల నుండి గాని ప్రేమగీతాల నుండి గాని గ్రహించినవి కావచ్చును. ఉదాహరణకు 69వ పద్యం ఇలా ఉంటుంది: 'ప్రేమ అంగడి నుండి వోలె తన ప్రియతముని వద్ద నుండి ఒక గ్రుక్క గ్రోలెను, తోడుతనే ఆ మత్తు తప్ప మరే యితర విషయముపైనను స్పృహ లేదు. ఆ వెనుక లాలనలు, విడి వడుటలు, అను ఉల్లాసమైన క్రీడలు మొదలైనవి. స్త్రీ తన పురుషునికై కోరికలతో నుప్పొంగినది. పురుషుడామె కొరకై తహ తహ లాడెను. వారి కాలమంతయు ప్రేమలోనే గడిచిపోయినది, అది ఒక అంతు లేని నృత్యగాన పారవశ్యమైనది.'

గౌతముని భార్య యశోధర సౌందర్యము, హొయలు వర్ణించుటకు పద్మిని అని పేరు పెట్టారు తన నాయికకు. బుద్ధుని జ్ఞానోదయ ఘట్టం చేరగానే ఈ విషయ లాలసత్వ ధోరణిని పూర్తిగా విడిచి గంభీరంగా మారుతారు. కాని ఈ ఘట్టంలో అతిశయము, యువ శక్తి విశృంఖలంగా వెల్లుబికింది.

ఇతర భాషల నుండి అనువదించబడిన లేదా అనుకరించ బడిన సింధీ కావ్యములలో బహుశ అజాద్ పూరబ్ సందేశ్ అత్యంత మనోహరమైన దనవచ్చును, కాని అసాధారణమైన గుణ విశేషాలున్న అనువాద పద్య సాహిత్యాలు ఇంకావున్నాయి. వాటిలో పర్షియన్ ఛందోరీతులకు కట్టుబడి చేసిన అనువాదం భగవద్గీత. ప్రొఫెసర్ ఎన్. వి. తడానీ దీనిని 1923లో చేశారు. సింధీలో పద్యానువాదాలు ఇదివరకే

ఉన్నాయి. గద్దీతకు ముల్ చంద్‌లాలా మెంఘరాజ్ కల్వానీ, చైన్‌రాయ్ బూల్ చంద్ మున్నగువారు చేసినవి ఎన్నో ఉన్నాయి. కానీ తడానీ అను వాదం వీటన్నిటికీ భిన్నంగా ఉంది. సంస్కృతం తెలియనివారికి దాని మహనీయత్వం, ఔన్నత్యం ఎటువంటిదో కొంత అవగాహన నిస్తుంది. ఎన్. వి. తడానీ గంభీరంగాను, ఉన్నతస్థాయి భావాలతోను, ఉంటే అందుకు సరిగ్గా భిన్నంగా వారి సోదరులైన ఆర్. వి. తడానీ నలభై ప్రాంతాలలో లిథోగ్రాఫ్ అచ్చులో Nonsense Rhymes for Children (పిల్లల కొరకు చక్కని ప్రాసతో కూడిన పాటలు) వ్రాశారు. ఇప్పుడా పుస్తకం లభ్యమగుట లేదు. పునర్ముద్రణ వాంఛనీయం. తన తండ్రి యైన ఛంభోర్ వాసి భగత్‌ను గురించిన ఒక అర్థరహితమైన పాట అందరినీ ఆకర్షించేదిగా ఉంది.

సాధు టి. ఎల్. వాస్వానీ వచన పద్య భగవద్గీత అనువాదం ఎన్. వి. తడానీ ఛందో బద్ధమైన, అనువాదం కంటె హెచ్చు మంది పాఠకులకు చేరింది. ఎందుకంటే దానిలో సరళమైన శబ్దాలు ఉండడం, సాధు మత బోధలను అనుసరించు వారి ద్వారా విస్తృతమై పాఠక లోకం దృష్టిని ఆకర్షించింది. సాధు ఇతర పద్య రచనలు కూడా వాటి సరళత్వము, నమ్రత, గ్రంథ కర్త భక్తి వంటి అంశాలు ద్వారా విశేష ప్రజాదరణ పొందాయి. 1947లో నానిక్ రాం ధరం దాస్ మీర్ చందానీ కాళిదాసు మేఘదూతాన్ని వ్యాఖ్యానంతో అనువదించారు. పద్యాలు సాంప్రదాయి కంగా ఉండే బెయత్ పద్ధతిలో మొదటి మూడు పంక్తుల చివర ఒకే ప్రాస ఉండి చివర పంక్తి మధ్యలోను అదే ఉన్నది. భాష సరళమైనది. సొంపైనది. భారతదేశ విభజన జరిగిన సంవత్సరమే వెలువడడం చేత ఈ గ్రంథం అంత ప్రచారంలోనికి రాలేదు. ప్రపంచ ప్రసిద్ధమైన కవి, నాటక కర్త మూలంలోని కవితా సౌందర్యం, భావౌన్నత్యపు ఛాయలు లేశ మాత్రంగానైనా అనువాదంలో కనబడవు. కావ్యరచనలో అను ప్రాస, ధ్వని సామ్యం వంటి వాని కోసం ప్రయత్నించినప్పటికీ రచన, వచన పద్యాల వలె నున్నది. అనువాదం అందంగా ఉన్నది గాని కాళిదాసుది మాత్రం కాదు. పోప్ చేసిన హోమర్ అనువాదం గురించి ఎవరో సరిగ్గా ఇలాగే అన్నారట, 'అది అందంగా ఉన్నది, హోమర్‌ది మాత్రం కాదు' అని.

ప్రొఫెసర్ ఎం. యు. మల్కానీ చేసిన టాగూర్ అనువాదాలను గురించి అట్లా చెప్పలేము. 1940లో గార్డెనర్ (Gardener)ను ప్రీత్ జగత్ అనీ, 1942లో గీతాంజలిని వీరు అనువదిస్తూ తాను 'వచనం'

మాత్రమే వ్రాస్తున్నానని తమకు తామే ప్రకటించుకున్నారు. దయరాం గిడుమల్ అడుగు జాడలలో సింధీలో పద్య వచనానికి ఈ విద్యావంతులైన ఆచార్యులు కొత్త బాట వేశారు. అన్ని హెూదాలలోనున్న సింధీయులు గీతాంజలిలోని కొన్ని అంశాలను చాల అభినందించిరి. టాగూర్ స్వయంగా చేసిన గీతాంజలి ఆంగ్లానువాదం చదవిన సింధీ పాఠకులు వీరు మూలం లోని కవితా ప్రవాహం, కవితా సౌరభం చెడకుండా గ్రహించారని వ్యాఖ్యా నించారు. ఇది మల్కానికి అనువాదకునిగా కవిగా లభించిన గొప్ప ప్రశంస. మల్కానీ గీతాంజలిలో కొన్ని అంశాలు భావయుక్తంగా పఠించడానికీ, గానం చేయడానికిఅనువుగా ఉన్నాయి.

వచన పద్య శైలిని అనుకరించి అనువాదాన్ని వచనంలో ప్రయ త్నించిన మరొక ఆచార్యులు డి. కె. మనర్మాని. వారు స్వాతంత్ర్యోద్యమ సందర్భంలో నిష్కాపట్యంగా వ్రాసిన పద్యాలు బాగీ (తిరుగుబాటు దారుడు) అన్న శీర్షిక క్రింద అనువదించారు.

పద్య కవితలో నూతన సాంప్రదాయం :

1907-1947 మధ్య కాలంలో సింధీ పద్య రచనా విధానంలోను కథా వస్తువులోను కూడా మార్పు రావడం మొదలు పెట్టింది. దానికి ప్రధానమైన కారణం ఒక సాధు జీవి, శాంత స్వభావులు, విధేయులు, కాని దృఢమనస్కులు, తన నమ్మకాలలో విడువని పట్టుదల గలవారు అయిన ఒక పాఠశాల ఉపాధ్యాయులు. బేవస్ (నిస్సహాయుడు) అన్న పేరుతో వారు పద్య కవితా ప్రేమికులకు నూతన దిఙ్మండలాన్ని తెరిచారు.

అట్టి మార్పుకు కాలం కూడా పరిపక్వమై ఉన్నది. అఖండ్ గుల్ మహమ్మద్ సాంప్రదాయాల వెంబడి అరవై ఏండ్లకు పైబడి నిస్సారమై విసుగు పుట్టించే పద్యాలు, వేదాంత పరమైన పాత బడ్డ పదబంధాలతో పాఠకులు నూతన పంథాలు, నవ్య విషయాలు వీటికి ఎదురు చూస్తున్న రోజులవి. సైప్రస్ ప్రేమికుడు, నార్సిస్సను, హెయ్ సింధ్, గులాబి ట్యులిప్, జింక కన్నులు, సాకీ, మదిర, శలభం, దీపం పగడాల పెదవులు, ముత్యాల దంతాలు, పుట్టుమచ్చ, మృదువైన చెక్కిళ్ళు మొదలైన పాత కాలపు ఉపమానాలు, దృశ్యసామ్యాలు. .. షిరీన్ ఫర్మాద్ యుసఫ్ జులెయ్ఖా, లైలా మజ్నూ మొదలైన పూర్వ వృత్తాంతాలతో అలసి పోయిన పాఠకులకు వెగటు కలిగించడం మొదలుపెట్టాయి, ఆధునిక యువతీ యువకులను. సూఫీ విధానాలు, ప్రేమ కవిత్వం సింధీయులకు

ఇంకా ఆనందాన్ని చేకూర్చుతూనే వున్నాయి. కాని అలాగని యెవరో పర్షియన్ కవికి అనుకరణంగా ఇంపుకాని కవిత్వాలు మాత్రం వారికి రుచించడం లేదు. కఫీలకు వాటి విలువ ఉండనే ఉంది. కాని అది సరళంగా మధురంగా, ఇంపుగా ఉండాలి.... అదే గుల్ అనుయాయులు వారి ప్రేక్షకులకు అందివ్వలేక విఫలులయ్యారు.

కొత్త కొత్త ఆలోచనలతో పద్య రచనలో నూతనాధ్యాయం ప్రారంభించిన మొదటి వారు ఒకే ఒకరు, బేవస్ మాత్రం కాదు. డి. జె. సింధు కళాశాల స్థాపించబడి ఇరవై ఏండ్లు గడిచింది; కళాశాల కల గూరగంప సంగ్రహాలలో అధికసంఖ్యలో ఆధునిక భావాలను పద్యాలలో ప్రయోగించడానికి నవకవులెందరో ముందుకు వచ్చారు. ఈ విధమైన రచనలకు చక్కని ఉదాహరణ భేరూమల్ మహిర్ చంద్ కళాశాల సంచిక సంగ్రహంలో 1901 లో సాంప్రదాయకమైన బెయిత్‌లలో ఉప్పు గని కార్మికులను గురించి వ్రాసి, ఒక గని కార్మికుని తల్లి నోటివెంట సూఫీ సిద్ధాంతంలోని సత్యాలను చెప్పించారు. వారే కొన్ని అంగ్లపద్యాలను కూడా అనువదించారు. అందులో బాలా బాగా చేసినది కాలం గురించి ఎలిజా కుక్ వ్రాసిన Time పద్యం. 1909 లో వియోగం గురించి 8 పంక్తుల బెయత్‌లు భవాన్‌దాస్ ఖూబే చంద్ ఈ కళాశాల సంచికలో వ్రాశారు. నాలుగేండ్ల తరువాత, రెండు పంక్తుల బెయత్‌లలో మహమ్మద్ సిదిక్ మెమొన్ స్వతంత్ర భావాలతో ఉదయం (Morning) గురించి వ్రాశారు. 1916లో అదే విధమైన స్వతంత్ర భావాలతో లీలా రాం ప్రేమ్‌చంద్ అలెగ్జాండర్ మరణ శాసనంపై వ్రాశారు.

బేవస్ అన్న పేరుతో సింధీ ప్రపంచానికి విదితులైన కిషన్ చంద్ తీరథ్‌దాస్ 1885లో జన్మించి 1947లో తమ నివాసమైన 'జషన్‌ఖానా' (ఆనంద నిలయం)లో మరణించారు. వారి యిల్లు లక్కానాలో వెలుగులోనికి వస్తూన్న సూఫీ యువతరం కవులకు కూడలి స్థానంగా ఉండేది. వారు ఒక ప్రాథమిక పాఠశాల అధ్యాపకులుగా ఉండేవారు. అదే వృత్తిలో ప్రధానోపాధ్యాయ పదవికి ఎదిగారు. ఉపాధ్యాయుల శిక్షణా పాఠశాలలో 16వ ఏటనే వారు పద్యాలు వ్రాస్తుండగా ముఖ్యాధికారి కంటబడింది. అప్పుడే వారు బేవస్ గొప్ప కవి కాబోతారని జోస్యం చెప్పారు. 1907 నాటికి వారు కవిగా రూపొందారు.

బేవస్ సంకోచిస్తూనే వ్రాయడం మొదలుపెట్టారు. మొదట పిల్లలకు పద్యాలు, తరువాత రంగస్థల నాటకాలు వ్రాశారు. 'షిరీన్ షెయిర్'

(కమ్మని పద్యాలు) అన్న పేరుతో వారు వ్రాసిన పద్యాలు సింధీ సాహిత్యంలో వెలువడిన మధురాతి మధురమైన సరళమైన బాలపద్య సంపుటం పద్యాలు. బేవస్‌లోని విశిష్టత, వారు పిల్లలకోసం ఎంతో సరళంగా వ్రాయగలరు. అదే సమయాన గంభీరమైన, విజ్ఞానదాయకమైన క్లిష్ట సాహిత్యం కూడా వ్రాయగలరు. వారి అతి విశిష్టమైన గ్రంథం ఈ కోవలోనిది సముందీ సిప్రూన్ (సముద్రపు ముత్యపు చిప్పలు) అని వారి స్నేహితులూ, వారి ప్రచురణ కర్తలు ఐన ఫతే చంద్ వాస్వాని అన్నారు. ఆధునిక భావాలతో నిండి ఉన్న యీ గ్రంథంలో మొదటి 'పుర్' అధ్యాయం ప్రారంభంలోనే కృష్ణుని ఉద్దేశించి చెపుతూ ఇలా అంటారు: 'వారు మధుర, గోకులము విడనాడిరి. వారిక జమునకు ప్రభువులు కారు. మానవసేవలో నిమగ్నులైరి. అందులోనే ఆ మురళీనాద లోలుని జాడ తెలుసుకొనుడు'. 'సముందీ సిప్రూన్' లోని పద్యాలన్నీ ఇంత సరళంగా లేవు. చాలా పద్యాలకు విస్తృతమైన వ్యాఖ్యానం కావాలి.

బేవస్ వ్రాసిన కావ్యాలలో చాలవరకు పర్షియన్ ఛందోరీతుల ననుసరించి ఉన్నప్పటికీ 'గంగా జూన్ లహరూన్,' గురునానక్ 'జీవన్ కథా' అన్న కావ్యాలు మాత్రం వారు సృష్టించిన క్రొత్త ఛందోరీతుల్లోనే వ్రాశారు. సాంప్రదాయికులైన వారు పర్షియన్ ఛందోరీతులను అయన సరిగ్గా పాటించరని అంటారు. నిజానికి వారు తీసుకు వచ్చిన క్రొత్త మార్పులను సహృదయతతో ఆహ్వానించాలి. గురునానక్ జీవన్ కథలోని ఎనిమిది పంక్తుల పద్యాలు తరువాతి కవులకు నూతన వర్ణనాత్మక పద్య రీతిని అందించింది. విశ్వామిత్రుని 'పశ్చాత్తాపము'ను ఋషి 'ఆశ్రమము'ను వర్ణించిన ఆరు పంక్తుల పద్యాలు పర్షియన్ సాంప్రదాయాలలోని పాతబడి పోయిన ముసద్దస్‌లకు ఎంతో భిన్నంగానూ, అందంగానూ ఉన్నాయి.

అయితే బేవస్ నవ్యత, వారి అభ్యుదయత, వారి ఆలోచన, భావ ప్రకటన, పదగుంభన రీతి, అలంకారిక దృష్టాంతాలలో గోచరిస్తుంది. వారి 'హారియత్' కార్మికుడు అన్న పద్య రచన సింధీ భాషలో ప్రప్రథమ రచన. కార్మికుణ్ణి ఒక వంక నీలి రక్తపు కులీన వంశజునిగా వర్ణిస్తూనే, కరుణా దృష్టితో ఇలా అంటారు: 'నీ ఘనమైన దక్షిణ హస్త మొసగు చుంటె ధాన్యము నుండి వివేకవంతుడైన కళాకారుని తీర్చిదిద్దుటలో ఘనుడు . భువినుండి బంగారమును వెలికిదీయుటకు నీవే కారకుడవు. కాని నీకాబంగారము లేదు, ఆకలి దప్పులతో నీ ఇచ్ఛతో ప్రమేయము లేకయే శ్రమియింపవలె. నీ దగునదేదియు లేదు. నీకు వసియించుటకు

ఇల్లు కూడ. వారి గరీబన్-బి-ఝూప్‌రీ (పేదవాని కుటీరము)లో మనసు కరిగించెడు పల్లవి : 'ఆహా ! పేదవాని కుటీరమ్మునకు కీడేదియు చేకూర కుండుగాక' సమసమాజ నినాదాలు మారుమ్రోగుతున్న యీనాడు కూడా మన హృదయాలలో తరచు మెదిలేదిగా ఉంటుంది : సూర్యచంద్రులు నీ గుడిసె సందుల నుండి తొంగి చూచుచుందురు, దూరాన ఉన్న తార, వృషభరాశి యందలి చిన్ని చుక్కల కిరణాలు లోనికి చొచ్చుకొని వచ్చు, నీ గుడిసె గోడలు గుసగుసలాడు గాలి తెమ్మెరలు పారిపోవుటకు తావిచ్చు, క్రింది నేల తడుపుటకా యనునట్లు వాన జల్లులు పై కప్పు నుండి కురియు చుండును. ప్రకృతి పరిపూర్ణత్వమచట కానవచ్చును. ఆరోగ్యమునకది యొక కానుక 'ఆహా! పేదవాని కుటీరమునకు ఏ కీడును చేకూరకుండు గాక !'

వారికి సూఫీ, వేదాంత సిద్ధాంతాలన్నీ తెలుసు, కాని వారు వాటికి తమదైన ఒక అందమైన మలుపు యిస్తారు. ఇస్త్రీ (స్త్రీ) అన్న పదంలో 'ఆ ఏకత్వం తానే ప్రత్యక్షమగు నిచ్ఛ జనియించునపుడు, సౌందర్యమొక వశీకరణ సాధనమగునట్లు స్త్రీ వేషము ధరియించె. పదార్థము నుండి పురుషుడు లేక ప్రకృతిని సృజించెను. అపుడు నాటక మారంభమాయె, కనులు చూచుటకు దృశ్యము'.

బేవస్ కవితాదర్శాలు షా, టాగూర్‌లు, వారిరువురికి తమ శ్రద్ధాంజలులు అర్పించారు. సత్యాన్ని ధైర్యంగా అయినా నిగర్వంగా వ్యక్తం చెయ్యడం షా నుండీ, కవి ఇతరుల జీవితాలలోనికి విషాదాన్ని తెచ్చేవాడు కాదనీ, జీవితంలో ఆనందాన్ని, అందంలో ఆహ్లాదాన్నీ అందరిలో కలిగించాలి అన్నది టాగూర్ నుండి నేర్చుకున్నారు బేవస్. తన కవితలలో బేవస్ ఆనందాన్ని అందించారు, సౌందర్యంలో నిష్కపట మైన ఆహ్లాదాన్ని చూశారు. బాధాతప్తమైన ప్రపంచాన్ని పరిశుద్ధ ఆనంద జగత్తుగా మార్చడమే తమ జీవితాశయమనీ దానిని సారవంతమూ, ఫల వంతమూ చేస్తాననీ అంటారు. బహుశ అందుకే వారి గృహానికి జషన్ ఖానా (ఆనంద నిలయం) అని పేరుపెట్టుకొని ఉండవచ్చును.

బేవస్ జాతీయ వాది. ప్రథమంగా జాతీయ గీతాలను వ్రాసింది బేవస్. స్వాతంత్ర్య పోరాట కాలంలో వారి జాతీయగీతాలు ప్రతి నోట వినబడుతూ ఉండేవి. 'మాతృదేశం మీద మక్కువ ఉన్నచోట మాత్రమే వివేకము, జ్ఞానము, స్వాతంత్ర్యము, వ్యక్తి గౌరవము, ఫలసాయము గౌరవంగా ప్రవేశించడానికి ఆరాటపడతాయి. దేశానికే పూర్తిగా అంకితం

కావడమే జీవిత పరమావధి అని తమ పసిపాపలకు జోలపాడే తల్లులు నిజంగా ఆనంద పరవశులవుతారు.'

వారు చాల ప్రేమ గీతాలు, సౌందర్య వర్ణనా గీతాలు వ్రాశారు. కాని ఆ పాత పద్ధతులలో మాత్రం కాదు. వారి 'తాజ్‌మహల్'లో కన్నీరు చలువ రాయిగా మారెను, అన్న సర్వసాధారణంగా ప్రచారంలో నున్న భావాలను చక్కగా ప్రతిధ్వనించేలాగున 'ఒంటరిగాడైన షాజహాన్ అశ్రుబిందువులు రెండు మూడు తాజ్‌మహల్ రూపంలో శాశ్వతంగా ఒక ప్రత్యేక ఉనికిని పొందాయి' అంటారు.

బేవస్ కవితా శైలిలో మలచడానికిగాను చాలా ఆధునిక భావనా రీతులను చేపట్టి సింధీ పద్య వాఙ్మయాన్ని ఇదివరకటి కంటె సుసంపన్నం చేశారు. ఒక్క ఉదాహరణ: పెద్ద మనసు 'Bigheart' అన్న పద్యంలో 'ఈ ప్రపంచంలోనీ మనసు మరింత పెద్దదిగా చేసుకో, నీవు జీవించవచ్చు, మరి నేను కూడ జీవించవచ్చు. నీ మనః ప్రవృత్తిలో పరివర్తనను తెచ్చుకో, నువ్వు జీవించేలాగున, నేనూ జీవించేలాగున' అంటూ సహజీవనం గురించి యుక్తరీతిని వ్యక్తం చేస్తారు.

భాషా శైలి లేక బేవస్ ఛాందసులు కారు, ఆవేశపరు లంతకంటే కాదు. సింధీ భాషలో సాధారణంగా వాడుకలో నున్న పదాలను సంస్కృత ప్రాకృత శబ్దాలను వాడతారు బేవస్.

రూపక సమాసాలను సింధీ సాహిత్యంలో మొట్టమొదటి సారిగా బేవస్ ప్రవేశ పెట్టారు.

బేవస్‌కు గేయ రచయితకు ఉండవలసిన సహజమైన ప్రజ్ఞ ఉంది. వారి పద్యాలు పాటలలాగే వాటంతట అవే పాడుతాయి. 'ఋషి ఆశ్రమం'లో నెమళ్లు, లేళ్ల నాట్యం చెయ్యడం, మర్కటాలు ఎగసి ఎగసి దూకడం, పక్షుల కలకలా రావాలు, అన్ని జీవరాసులు ఆనంద పారవశ్యంతో పొంగి పొరలడం, వీటిని వర్ణిస్తూ వాడిన శబ్దజాలం, ఛందస్సులు ఇవి కూడా నాట్యం చేస్తున్నట్టుగానే ఉంటాయి.

అయితే షా, సచల్, సమీానుల సొత్తైన విశాల మనస్సృష్టి, అపార మైన గంభీర గమనం, బేవస్‌లో కొరవడ్డాయి. ఈ సింధీ కవిత్రయం సరసన తనను ఉంచుటకు తానర్హుడను కానని వారే ఒప్పుకొనేవారు.

వారు తెచ్చిన విప్లవాన్ని పూర్తిచెయ్యడానికి ఒక యువ బృందాన్ని వారు ఉత్తేజితులను చేసి సరియైన మార్గాన్ని వారు నడపడం బేవస్ సింధీ సాహిత్యానికి చేసిన ప్రత్యేకమైన సేవ. హుందరాజ్ దుఖాయాల్, గందిల్‌గర్ ఆ బృందంలో తమ స్థాయిలో ఎన్నదగిన కవులుగా నిలిచారు. రాం పంజ్‌వాని, గోబింద్ భాటియా వంటి ఇతరులు, వారి గేయాల ద్వారా, బహిరంగ ఉపన్యాసాల ద్వారా పర్షియన్ సాంప్రదాయ శృంఖలాలలో బంధింపబడిన సింధీ పద్య వాఙ్మయ ధోరణులకు దాస్య విముక్తిని ప్రసాదించారు. తక్కిన యువ సింధీ కవులు 'పూరబ్ సందేశ్' రచయిత అయిన అజాద్ వంటివారు సాయ్ (గురువు) బేవస్‌కు, పైన పేర్కొన్న వారి వలె స్వయంగా శిష్యులు కాకపోయినా, వారి నైతిక స్వభావాన్ని ఆకళింపు చేసుకున్నారు. బేవస్ తరువాత సింధీ పద్య వాఙ్మయం ఆ స్థాయికి చేరుకోలేదు. 1930 తరువాత సింధీ కవులలో అగ్రగణ్యుడుగా, ఎదురులేని నాయకునిగా నిలిచిన రోజులలో ఉద్భవించిన ప్రతి కవిపైన, ఆతని రచనల పైన బేవస్ ముద్ర ఉండి తీరుతుంది. డి.జె. సింధీ విద్యాలయ పత్రిక పుటలలో (1947) అప్పుడే తమ రెక్కలు విప్పి ఎగురనుంకించుచున్న పాకిస్తాన్, భారత కవులిద్దరు అయాజ్, నారాయణ శ్యాంలు, ప్రాథమిక దశలలో బేవస్‌కు ఎంతో రుణపడి ఉన్నారు. అయితే వారు తరువాత చాలా ప్రగతిని సాధించారు. బేవస్ ఎప్పుడూ ప్రయత్నించని, ప్రయత్నించ యోచించని విధంగా వారు హిందీ గీత్ సోరఠా, ఇంగ్లీషు సానెట్‌లను కూడా అనుసరించి పద్యాలు వ్రాశారు. 1947 కు పూర్వమే కవిత్రయం వ్రాయ మొదలిడిన షానీ (ఖైల్‌దాస్) బేవస్‌కు ఏంతో రుణ పడి ఉన్నారు. గోర్ధన్ భారతి వంటి పేరొందిన కవులు ఇతర కవులలో దయాల్ ఆశావంటివారు బేవస్‌కు, వారి కవిత్వానికీ రుణపడి ఉన్నారు. అన్ని విధాలా బేవస్ రాక సింధీ కవితా ప్రపంచంలో గుల్ సాంప్రదాయానికి వారి తీసి తుద ముట్టించింది.

బేవస్ అనుయాయులలో ఇద్దరిని గురించి క్లుప్తంగా చెప్పాలంటే: హుందరాజ్ దుఖాయాల్, జాతీయోద్యమ సమయంలో ఎన్నో గీతాలను వ్రాసి, మధురంగా గానం చేసేవారు. విభజనకు ముందు వారు వ్రాసిన గీతాలన్నీ సేకరించి 'సంగీత్ ఫూల్' అన్న శీర్షిక క్రింద – 1946లో ముద్రించారు. వారు తమ 14వ ఏటనే 1924 నుండే కవిత్వం వ్రాయటం ప్రారంభించారు. సంగీత ఫూల్‌లోని గేయాలు యీ విధంగా విభజించవచ్చు 1) పరమాత్మస్తుతి, 2) కృష్ణపదాలు, 3) గురునానక్, 4) రామునిస్తుతి, 5) ప్రచారంలోనున్న పాటలు, 6) ప్రేమగీతాలు,

7) ఉమర్ మరూయి, 8)ససూయిపున్ హూన్, 9) సుహ్నీ మెహర్, 10) హీర్ రంఝో, 11) మూమల్ రానో, 12)లీలా ఛానేసర్, 13) పిల్లల పాటలు, 14)హకీకి (అధ్యాత్మిక లేకసత్య)ప్రేమ, 15) జాతీయ గీతాలు. చివరి అంశంపై పాటలే అధికంగా ఉన్నాయి. దుఖ్యాల్ రచనలు పాడుటకు సులభంగా మలచదగినవి. అన్ని కాలాలలోను చదువదగిన పుస్తకం రూపొందించితే దానిలో పైన పేర్కొన్న పాటలలో చాలా వాటిని విడిచి పెట్టవచ్చును. ఏలనంటే అవి తత్కాల పరిస్థితులకై వ్రాసిన గీతాలు గనుక. ఉమర్ మరూయిలోని పద్యాలలో జాతీయ భావాలను కవితా భావ విభావరితో మేళవించి ఒక అపురూప సృష్టిగా రూపొందించారు.

బేవస్ గురునానక్ వ్రాసిన తదుపరి దానిననుసరించి హరిదిల్‌గిర్ 'హరిశ్చంద్ర' వర్ణనాత్మక కావ్యం వ్రాశారు. అందులో బేవస్ చెప్పిన రెండు మాటలు తన శిష్యుడైన దిల్‌గిర్ చిన్నవాడైనను పరిపక్వత అతని కవితలో కనబడుతున్నదని, అతని కవిత పరిపూర్ణానుభవమైనదనీ, మాధుర్యమైనదనీ మెచ్చుకున్నారు. దిల్‌గిర్ తరువాత కావ్యం కోడ్ (అలు చిప్పలు), దానికి యీప్రస్తుత గ్రంథ కర్త ముందుమాట వ్రాశారు. దిల్‌గిర్ వృత్తి రీత్యా ఇంజనీరు. వారి కవిత్వం సహజ ప్రవాహంలాగ కనబడుతూనే చక్కని శిల్పంతో తీర్చి దిద్దినట్లుంటుంది. అతడు మంచి ఆత్మవిమర్శకుడు. దేనిని స్వీకరిస్తారని అతను గట్టిగా నమ్ముతారో దానినే పాఠకుల ముందుంచుతారు. వారిప్పుడు నూతన మార్గాలను అనుసరిస్తు న్నప్పటికీ, హరిశ్చంద్ర, కోడ్ కావ్యాలలో బేవస్ వేనని భ్రమపడేటంతగా పోలి ఉంటాయి.

కవిత్వ రచనలలో మంచినేర్పు చూపి, చిన్న వయసులోనే మరణించడంవల్ల (1921 - 44) మనకు దూరమైన ఇద్దరు కవులు తోలారం మింఘ్‌రాజ్ బలానీ, నిర్మల్ జీవటాని.

## 12
## ఆంగ్లేయుల కాలంలో సింధీ వచన, నాటక సాహిత్యం

సింధీ వచన వాఙ్మయం ఆంగ్లేయుల పరిపాలన కాలంలోనే అభివృద్ధి చెందిందని చెప్పాలి. అంతకు ముందు పుట్టిన దేదైనప్పటికీ బ్రిటిష్ వారి కాలంలోనే వచన వాఙ్మయం అన్నది నిజంగా రూపం

దాల్చింది. మొట్టమొదట అది అనువాద సాహిత్యంగాను, పాఠశాలల పుస్తకాల రూపంలోను, అరబిక్ సింధీ లిపి 1852 లో ప్రవేశ పెట్టబడిన తరువాత అభివృద్ధి చెందింది.

బ్రిటిష్ వారు సింధును ఆక్రమించడానికి పూర్వం (1843), సింధీ భాష వ్రాయడానికి ఒక క్రమమైన లిపిలేదు. ముస్లిములు, ఉన్నతో ద్యోగాలలో నున్న కులీనులైన హిందువులు అరబిక్ అక్షరాలను వాడే వారు. హిందూ వ్యాపారులు అచ్చుల సంజ్ఞలు లేని అపభ్రంశ దేవ నాగరి లిపిని వాడేవారు. అది కొన్ని సందర్భాలలో హాస్యాస్పదమైన అపార్థాలకు దారి తీస్తూ ఉండేది. హిందూ బ్రాహ్మణులు, సంస్కృతం బాగా చదువుకున్నవారు, దేవనాగరి లిపినే వాడేవారు. బ్రిటిష్ వారి రాకకు పూర్వం సెయింట్ మేథ్యూ సువార్త (1825) వంటివి కొద్ది పుస్తకాలు దేవనాగరి లిపిలో అనువాదాలుగా బెంగాల్‌లోని ముద్రణా లయంలో అచ్చయ్యాయి.

స్టేక్, ట్రంప్‌ల ప్రారంభ కృషి :

సింధీ వచన వాఙ్మయాభివృద్ధికి కొందరు దీక్షాపరులైన పాశ్చాత్యులు క్రోడీకరించిన నిఘంటువులు, వ్యాకరణాలు, వారి ప్రారంభ కృషి ఫలితాలేనని నిస్సందేహంగా చెప్పవచ్చును. వాథెన్ వ్రాసిన 'సింధీ భాషా వ్యాకరణము, మాటలు' (1843) అంత యోగ్యమైనది కాదని నిర్ణయింప బడింది. కాని 'సింధీ భాషా పదజాలం' ఈ స్టెవిక్ 1843 లో వ్రాసినది, 'ఇండస్‌కు పశ్చిమమున ఏడు దేశాలలో మాట్లాడే, ఏడు భాషల పదజాలం' (Vocubulary of Seven Languages Spoken in Seven Countries West of Indus) 1843 లో లీచ్ వ్రాసినది, ముఖ్యంగా 1849 లో స్టేక్ ప్రచురించిన నిఘంటువు, వ్యాకరణం అట్లాకాదు. కెప్టెన్ స్టేక్ ప్రచురించిన నిఘంటువుకు మరొక ప్రత్యేకత ఉన్నది. వారి వ్యాకరణానికి చివర ఇచ్చిన అనుబంధంలో ఉధారాం థావెర్ దాస్ రాయ్‌డయాక్ కథ రూపంలో మొదటి సింధీ వచనం యొక్క మచ్చుగా ఉంది.

1908 లో డి. జె. సింధ్ విద్యాలయ సంచికలో బూల్‌చంద్ దయారాం అను సింధీ పండితుడు కెప్టెన్ స్టేక్, డా॥ ట్రంప్‌లకు ఘనమైన నివాళులు అర్పించారు : 'మొట్టమొదట ఈ రాష్ట్రంలోని మాతృభాషను ప్రచారం చేసి అభివృద్ధికి తోడ్పడిన మార్గదర్శకులలో ప్రథములు, సింధీ భాషను అధ్యయనం చేసిన తొలి పాశ్చాత్యులలో ఒకరు కెప్టెన్ జార్జి స్టేక్.

వారు చాలా కాలం హైదరాబాద్ డెప్యూటీ కలెక్టరుగా ఉన్నారు. 1849 నాటికే వారు ఇంగ్లీషు - సింధీ నిఘంటువును ప్రచురించారు. అందులోని మొత్తం శబ్దాలు పన్నెండు వేలు, వాడిన లిపి దేవనాగరి. కెప్టెన్ స్టేక్ సింధీ - ఆంగ్ల నిఘంటువును కూడా సమకూర్చారు. దానికి బొంబాయి సివిల్ సర్వీసులో ఉండే ఎల్లిస్ సంపాదకత్వం వహించారు. అది 1854లో అచ్చయింది. ఈ మహోపయోగకరమైన సంకలనాలకు తోడుగా వారు ఒక సింధీ వ్యాకరణాన్ని కూడా వ్రాశారు. అది ఇప్పటికీ ప్రమాణ గ్రంథంగానే ఎంచబడుతూంది. ఈ సంకలనాలు కూర్చడంలో వారు సేకరించిన వాటికి అత్యధికంగా సహాయం హైదరాబాద్‌కు చెందిన పండిత్ బ్రహ్మదేవ్ సత్ చిత్ ఆనంద్, పండిత్ బెటూరాంల నుండి లభించింది.

జన్మతః జర్మన్ అయిన ట్రంప్, 1858లో సింధీ వాచకమును వ్రాయ ప్రయత్నించారు. అప్పటికి సింధీ లిపిని గురించిన వివాదం పరిష్కారం కాలేదు. అందుచేత ఆ వాచకం హిందువులకు దేవనాగరి లిపిలోను ముస్లిములకు అరబిక్ లిపిలోను ముద్రింపబడింది. ఈ పాఠ్య గ్రంథం ఒక వింతైన, ఆసక్తిదాయకమైన సంకలనం. మోసెస్ చెప్పిన ఆజ్ఞాదశకం (Ten Commandments) అనువాదంతో ఇది ప్రారంభం అవుతుంది. తరువాత ఈసప్ కథల వంటి కొన్ని కథలు ఉంటాయి. అటు తరువాత లైలా మజ్నూల ప్రణయ గాథ. మెంఘోభగత్ శ్లోకాలు కొన్ని ఉంటాయి. షా లతీఫ్ వ్రాసిన 'రిసాలో' ప్రథమంగా అచ్చులోనికి తెచ్చింది. 1866లో ఆ విరామమెరుగని పండితుడు ట్రంప్ కృషి ఫలితమే. అటు తరువాత పదేండ్లకు ముందుగానే సంకలన పరిచినప్పటికీ 1872 నాటికి వారే సంపూర్ణమైన బృహత్ సింధీ వ్యాకరణాన్ని ప్రచురించారు. 'ఏర్చి కూర్చిన సింధీ కథలు, గేయాలు' అన్న వారి గ్రంథం వెలుపరిద్దా మనుకున్నప్పటికీ, అచ్చుకాకుండానే మిగిలిపోయింది. ఇది ప్రారంభించిన కొద్ది కాలానికే వారు 'సిఖ్ గ్రంథ్'కు తనను తాను అంకితం చేసుకున్నారు. 1857–1907 సింధీ వచనం, నాటకం, విద్యాబోధన గ్రంథాలు : సర్‌బార్ట్‌లె్ఫ్రెరే ఆ దేశాల మేరకు 1852లో రూపొందించబడిన అరబి - సింధీ లిపి, తరువాత ఆరేండ్లవరకూ తబ్బిబ్బు పరిస్థితులలోనే వున్నది. ఇదివరకే చెప్పినట్లు డా॥ ట్రంప్ వ్రాసిన సింధీ వాచకం రెండు లిపులలో అచ్చువేయడం జరిగింది. 1857, 1858 నరికి ప్రభుత్వ విధానం ఫలోన్ముఖ మయింది. విద్యార్థులు, ప్రజలు కూడా క్రొత్త అరబిక్ - సింధీ లిపిని అనుసరించడం మొదలుపెట్టారు.

తరువాత పాఠశాల విద్యార్థులకు, సింధీ భాషలో పరీక్షలు ఉత్తీర్ణులు కావలసిన వారికి, యూరోపియన్ అధికారులకు పనికివచ్చే లాగున పాఠ్య పుస్తకాలు కుప్పలు తెప్పలుగా వెలువడడం మొదలు పెట్టాయి. ఇవన్నీ సాహిత్య గ్రంథాలుగా ఎంచదగినవి కాకపోయినా, కొన్నిటిని మాత్రం సింధీ వచన ఖండికలకు ప్రారంభ కృషిగా ఎన్నవచ్చును.

నందీరాం మెరానీ, ఉధారాం థావెర్ దాస్, దీక్షాపరులైన యీ ఇరువురు సింధీయుల సేవ ఫలితంగా అతి ముఖ్యమైన విద్యాబోధనా సంకలనాలు, ఇతర సంబంధిత పుస్తకాలు వెలువడ్డాయి. ప్రభుత్వ అనువాదకుడిగా, ఒక పరీక్షకు కూర్చొని నందీరాం మెరానీ, ఎంపిక చేయబడి, 1854 నుంచే బాబ్‌నామో అన్న చిన్న పుస్తకంతో తమ పని మొదలుపెట్టారు. వారు బహుమతి నందుకున్న అనువాద గ్రంథం తారీఖ్ మౌసమీ 1854లో ముద్రితం. అదే సంవత్సరం పోషకులైన ఎల్లిస్‌తో కలసి ఈసప్ కథలను అనువదించారు. తరువాత, వరుసగా చిత్రలేఖనం గణితం, భూగోళం, బీజగణితం, అన్న అంశాల మీద 1854, 1855, 1856, 1861లలో వెలువడ్డాయి. వీరిరువురిలో ఉధారాం నైపుణ్యం గలవారు, వారికి శైలి కూడా ఉన్నది. ప్రథమ, ద్వితీయ తరగతుల పుస్తకాలు, సింధీ వ్యాకరణం (అది చాలా పునర్ముద్రణలు చూసింది) ప్రపంచ చరిత్ర (History of the World) (ఉర్దూ నుండి) 1869లో రాయ్‌డయక్ (వచనం, పద్యం కూడా), మఫిద్-అల్-తాల్బిన్ (విద్యార్థులకు ఉపయుక్తమైన గైడ్) ఈ పుస్తకాలన్నిటికీ వీరే బాధ్యులు. నవల్‌రాజ్‌తో కలసి జాన్సన్ 'రస్సెలాస్' 1868లో అనువదించారు. కామ్‌సేన్, కామ్‌రూప్, మాహిర్ మునీర్ వంటి జానపద గాథలను సవరించి 1869 లోను 1871 లోను ప్రచురించారు. ఉధారాం సింధీ శైలి వింతగా ఉన్నప్పటికీ స్వచ్ఛంగా ఉంటుంది. వారి క్లిష్టమైన భాష యీనాడు కూడా చదివి ఆనందింప దగినగా ఉంటుంది.

పాఠ్య గ్రంథాలను ఇతర అనుబంధ గ్రంథాలను కూర్చినవారు ఫ్రిజ్ దాస్ ఆనంద్‌రాం, దేవుమల్, గులాం అలీ, మిరన్ మహ్మద్ షా, మియా మహమ్మద్, ఆలూమల్, త్రికాం దాస్, కౌరుమల్, చందర్ మల్ (కొలంబస్ చరిత్రను 1862లో వ్రాశారు) ప్రీతం దాస్, కృష్ణశాస్త్రి అందరికంటే ముఖ్యులు జానపద గాథలను సేకరించిన అఖండ్ అబ్దుల్

రహీం. కౌరుమల్ సేవను గురించి వేరొక శీర్షిక క్రింద చర్చించడం జరుగుతుంది.

నిఘంటువులను కూర్చిన వారు ఎల్.వి. పరంజ్ పే: ఇంగ్లీషు – సింధీ నిఘంటువు 1868లోను, అబ్దుల్ రహీం: జవహర్-అల్-లఘత్ (సింధీ - పర్షియన్) 1871లోను, అఖండ్ ఫతే మహమ్మద్: కాషిప్ (వ్యుత్పత్తులు, షర్ట్, ఖావేదాస్, మీర్జాసాదిక్ అలీ: సింధీ - ఇంగ్లీషు నిఘంటువు 1875లోను ప్రచురించారు. ఎంతో కృతజ్ఞతా పూర్వకంగా సింధీయులు గుర్తుంచుకొనవలసిన సంకలనకర్త 1886లో వియుత్పత్తి కోశ్‌లో చాలా సింధీ పదాలు సంస్కృతం మూలం నుండే పుట్టాయని వారు నిస్సంశయంగా ఋజువు చేసి చూపించారు. తరువాతి కవులకు అత్యంత ఉపయోగపడే పనిని చేసిన మరొక కవి రోచిరాం గాజుమల్. వీరు 500కు పైగా సింధీ సామెతలు, వాటికి సమానమైన ఆంగ్ల సామెతలు, అట్లా లేని వాటికి వారే ఆంగ్లానువాదం చేసిన్నీ అందించారు. ఈ గ్రంథం సుమారు నాలుగుసార్లు పునర్ముద్రణ చూసింది. 1905లో మీర్జా కాలిక్ బేగ్ 'లఘత్ లతీఫ్' షా రచనలలో వచ్చే పదములకు అకారాది నిఘంటువు అందించారు.

మెట్రిక్యులేషన్ విద్యార్థులకు చాలా కాలం పాఠ్యగ్రంథంగా ఉండిన 1868లోనో 1870లోనో నవల్‌రాజ్, ఉధారాంల సాటిలేని అనువాద గ్రంథం రస్సెలాస్‌ను గురించి ప్రత్యేకంగా ప్రస్తావించక తప్పదు. ఆ అనువాదం ఎంత సరసమైనదిగా ఉన్నదో, మూలానికి అంత న్యాయం చేకూర్చినదిగాను రూపొంది సింధీ వచన వాఙ్మయంలో ఒక మహాకావ్యంగా నిలిచిపోయింది. బూల్‌చంద్ కోడూమల్ (1892) 'ఇంగ్లాండు చరిత్ర' [History of England] సులభశైలిలో నున్నది. కౌరుమల్ చందన్ మల్ విద్యాబోధన సంకలనాలను గురించి వేరొకచోట ప్రస్తావించడం జరిగింది.

1866లో ట్రంప్ ప్రచురించిన షా-జొ-రిసాలో వెలువడిన పిదప కాజీహాజీ అహ్మద్ ఉత్సాహవంతులై 1973లో ముంతకబ్-షా-జొ-రిసాలో అన్న పేరిట షా పద్యాలను కొన్ని ఎంపిక చేసి ప్రచురించాడు. అది చాలా కాలం పాఠ్య గ్రంథంగా నిలిచింది. డా॥ సోర్లే ఆంగ్లానువాదానికి మూలంగా ఖ్యాతి నార్జించింది.

ప్రభుత్వ అనువాదకులుగా పనిచేసిన తారాచంద్ షౌకిరాం 1900లో ఉపోద్ఘాతం గాని, వ్యాఖ్యానం గాని లేకుండా షా పై ఒక సంపుటాన్ని తెచ్చారు. గురు బక్సానీ 1923లో తెచ్చిన సంపుటిలో నుండి కొన్ని పద్యాలను షావి కావని విడిచిపెట్టి ఒక సంపుటిని వెలువరించారు.

సింధీ వచనం రాసాగిన ఏభైఏండ్లకు 1908లో పైన ఇదివరకే పేర్కొన్న బూల్‌చంద్ దయారాం, సింధులోని విద్యాశాఖకు యీ విధంగా ప్రశంసా వాక్యాలు పలికారు: 'సింధు విద్యాశాఖ సింధీ భాష, సింధీ సాహిత్యం అభివృద్ధికి, వ్యాప్తికి ప్రముఖపాత్ర వహించిందని ఇక్కడ మరొక సారి చెప్పక తప్పదు. వారిలో (విద్యాశాఖాధి కారులు) ఎల్లిస్, మూర్, ఫుల్‌టన్ ప్రత్యేకంగా పేర్కొన దగిన వారు. సింధీ పాండిత్యానికీ, పోషకులుగా, స్వయంగా సింధీ పండితులుగా మేజర్ గోల్డ్‌స్మిత్ సేవ కీర్తి మందిరంలో ప్రత్యేక స్థానాన్ని అలంకరిస్తుంది. స్వయంగా వారు సింధీ పండితులు కాకపోయినా నారాయణ్ జగన్నాథ్ సింధీ భాష అభివృద్ధికి సరియైన మార్గాలు రూపొందించారు. అటువంటి మరొక ఉన్నతాధికారి ఉథారాం తావెర్‌దాస్. వారు సింధీ వాచకాలను, విద్యార్థులు చదువుకొనడానికి అనువైన పుస్తక మాలలను, సింధీ వ్యాకరణాన్ని, విద్యార్థుల ఉపయోగార్థం కొన్నిచిన్న పుస్తకాలను (manuals) వ్రాశారు. తరువాత వచ్చిన విద్యాశాఖాధికారులలో కౌరుమల్ చాలా సేవ చేశారు. నవల్‌రాయ్ అత్యుత్తమమైన రచన జాన్సన్ రస్సెలాస్‌కు అనువాదం. తక్కిన సింధీ పండితులలో రివరెండ్ షర్ట్, రైలాండ్, సెయ్‌మొర్, మీర్జాకాలిక్ బేగ్, లీలారాం వత్యుమల్‌ల పేర్లు చెప్పడం మరువలేము. నాగరికత అభివృద్ధి చెందిన కాలంలో విశేషమైన విజయాలను సాధించిన మరొక సింధీ రచయిత దివాన్ దయారాం గిడుమల్, వారిది మనోహరమైన ఒక గొప్పశైలి' (పొందు పరచినది)

ఈ రచయితల సేవ ప్రధానంగా అనువాదాలలోనే ఉన్నది. ఈ కాలంలో (1857 - 1907) వెలువడిన విద్యాబోధనా ప్రచురణలలో చాల వరకు నాణ్యత, ప్రాశస్త్యం తక్కువ స్థాయిలో నున్నవి. 'ఈ రచయితలు సింధీ సాహిత్యంలో అత్యుత్తమ శ్రేణి వనదగు రచనలు చేశారు అనలేము' అంటారు బూల్ చంద్ దయారాం. 'అయినప్పటికీ వారు ఉత్తమ సాహిత్య సృష్టికి బాట వేశారు.' అని వారు అంగీకరించారు. వారు చెప్పిన యీ విషయాన్ని మనం అంగీకరించాలి. సింధీ

వచనం గురించిన అధ్యాయంలో కొన్నిపుటలైనా, సింధీ వచనం, సింధీ భాష అనే ద్రాక్ష తోటలో శ్రమించిన యీ ప్రారంభకుల పేర్లు కృతజ్ఞతా పూర్వకంగా స్మరించడం సముచితమే. బూల్ చంద్ దయరాం జాన్‌జాకబ్ పేరు విడిచి పెట్టారు. సింధీయుల ప్రేమ పాత్రులైన వీరు 1890లో సహృదయతతో సింధీయులు దేవనాగరి లిపినే తిరిగి వాడాలని చేసిన ప్రయత్నాలు విఫలమవడమే బహుశ దీనికి కారణం కావచ్చు. వారి ప్రయత్నాలలో జాకబ్ గనుక ఫలోన్ముఖులై ఉంటే సింధీయుల సాహిత్యం లోనే కాక, సింధీ జీవనంలోని ఇతర రంగాలలో కూడా, దాని ఫలితాలు చెప్పనలవిగానివిగా ఉండేవి.

ఇతర అనువాదాలు, కాల్పనిక సాహిత్యం :

1857-1907 మధ్యకాలంలో వెలువడిన సింధీ వచన, నాటక సాహిత్యం ప్రధానంగా అంగ్లం, పర్షియన్, హిందీ, గుజరాతీ, ఉర్దు భాషల నుండి వెలువడిన అనువాదాలు మాత్రమే. వాటిలో మౌలిక సృజనాత్మక సాహిత్యం కొరకు వెదకడం శుష్క ప్రయాస మాత్రమే అవుతుంది. ప్రముఖులైన కౌరుమల్ చందర్‌మల్, మిార్జాకాలిక్ బేగ్‌ల రచనలను గురించి వేరొకచోట ప్రస్తావించడం జరిగింది. ఇక్కడ విద్యాబోధనా సాహిత్యం అనువాదకులను గురించిన శీర్షిక విడిచి పెట్టిన మరికొందరు అనువాదకులను గురించి ముచ్చటించడం సముచితం.

బైబిల్ నుండి సెయింట్ జాన్ సువార్తను 1853లో సింధీలోకి అనువాదం చేసిన క్రీస్తు మత బోధకులను విడిచి పెడితే, ప్రథమ సింధీ అనువాద గ్రంథాలు హిందీ నుండి పండిట్ బన్సీధర్ చిరంజీలాల్ రచనలు. అవి 1854లో ఘులాం హుసేన్ కురేషీ భంభో జమిాందారు కథ, 1855లో మిారన్ మహమ్మద్ షా సుధాతురో, ఖుదాతురోల కథ. భంభో కథ పాఠ్య గ్రంథం కొరకై వ్రాయబడినది కాకపోయినప్పటికీ పాఠ్య గ్రంథంగా ఎంచబడింది. అనువాదకులు సింధీ దృశ్యాలను (ఉచీల్‌రో గ్రామాలు) సింధీ ప్రాంతాలను ప్రవేశపెట్టి తమ అనువాదానికి మూలగ్రంథ రూపాన్ని సంతరింప చేయడానికి ప్రయత్నించారు. భంభోను సత్యవాదిగాను, నిజవర్తనునిగాను, శాంతికాముకుని గాను, యుక్తిపరునిగాను చిత్రీకరించారు. అనాథ బాలుడైన బచల్ యొక్క సంరక్షణను చేపట్టి తన సంతానము వలెనే చూచుకుంటూ వారి అకుంఠిత గుణాలను నిరూపించు కుంటారు.

శుద్ధతారో, కుద్ధతారోల కథ కూడా పాఠ్య గ్రంథంగా ఎంచ బడింది. ఇందులో ఇద్దరు బాలురను ఒకరితో ఒకరిని పోల్చుకొంటూ కథ జరుగుతుంది. శుద్ధతారో మంచి బాలునిగా పెరిగి గొప్ప వాడవుతాడు, కుద్ధతారో చెడునడతలలో పడి చివరకు కారాగారం పాలవుతాడు.

ఈ కథలలోని శైలి ఆధునిక పాఠకులకు కొంచెం తికమకగా ఉంటుంది కాని జాతీయత మాత్రం కొరవడ లేదు.

హిందువులు శృతి స్మృతులను అనువదించే ప్రయత్నాలు కొన సాగించారు. మిసిర్ బైకిషన్ (రాజస్థాన్ వాసి) మహా భారతంలోని కొన్ని పర్వాలను అనువదించారు; ఈ శతాబ్దపు ప్రథమ దశాబ్దంలో వీటిని లితో గ్రాఫు విధానంలో అచ్చు వేశారు. వసుమల్ జె రాందాస్ తులసీ దాస కృత రామాయణాన్ని సింధీ వచనంలోనికి అనువదించారు.

కరాచీలోని సనాతన ధర్మసభ వారు గుజరాతీ హిందీ భాషా గ్రంథా లను కొన్నిటిని అనువదించారు. కాని ఇంచు మించుగా అన్నిటిలోనూ ప్రధానాంశాలు రెండే కనబడతాయి. 1. విదేశీయాత్రల వల్ల, విదేశీ చదువుల వల్ల మన పిల్లలపై పడే ప్రభావాలు, 2. నిర్మలమైన, పవిత్రమైన హిందూ వనితలకు, విదేశీ విధానాలను అనుకరించే పాఠశాలలలో చదివిన చంచల స్వభావులైన హిందూ వనితలకు మధ్యగల గొప్ప అంతరం. వీటిలో ఏ పుస్తకమూ పట్టికలలో చేర్చడానికి గాని, ప్రత్యేకించి చెప్పడానికి గాని తగినదిగా లేదు. ఈ సభవారు శ్రీమత్ భాగవతాన్ని సామాన్య మైన వచన శైలిలో అనువదింప చేశారు.

పోకర్‌దాస్ హరి సింగ్ ప్రచురణ కర్తలు ఉర్దూ నుంచి అరేబియన్ రాత్రుల అనుకరణలో ప్రేమ సాహిత్యం రోమాంచం కలిగించే మాంత్రి కుల, భూతాల, గంధర్వుల యొక్క కథలు అచ్చువేశారు. ఈ రకం సాహిత్యం ముసుగుతో వెలువడిన పుస్తకాలలో అంతంత మాత్రంగా ఎన్న దగినది నిహార్ చంద్ 1890లో వెలువడిన పుస్తకాలలో సింధీలోనికి అనువదించిన అహ్మద్‌గాన్ జల్‌బానీ ఉర్దూ పుస్తకం గుల్‌బకావళి. ఇందులో వినియోగించిన వచనం అనుప్రాసంతో గూడి చెవికి ఇంపుగా ఉంటుంది. బహుశః కొంత భాగం పద్యాలు, కొంత భాగం వచనంగా రచించే ఉద్దేశంతో అట్లా వ్రాయబడి ఉండ వచ్చును. ఇంద్ర జాలం, నాయిక యొక్క హద్దు మీరిన శృంగార చేష్టల వర్ణనలు, నాయకుడు తాజల్‌మటాక్ యొక్క ధైర్య సాహసాలను వీరోచితంగా వర్ణించడం

లాంటివి చాలా ఉన్నాయి. ఇటువంటి భయానక వీరగాధల కోవకు చెందిన ఇతర అనువాద రచనలు 1890లో ఛాహర్ డెర్విష్ (నలుగురు భిక్షువులు) ఉర్దు నుండి, 1894లో హాజీ ఇమాంబక్స్ చేసిన హాతింతాయ్ (ఉర్దూ నుండి), వీరే 1899లో ఉర్దూ నుండి సరాసరి అరేబియన్ రాత్రులు 'అరిఫ్‌లెయిూ' అన్న పేరుతో అనువదించారు. హాతింతాయ్ దాతృత్వము, వారు ఆరేడుసార్లు బాధలకు గురియైన ప్రశ్నలకు సమాధానం వెదకుట, వాటిలో అతిముఖ్యమైనది కోహ్-ఇ-నాడా (పిలుపు పర్వతం) గురించిన ప్రశ్న, అచటికి పిలువబడిన వారు వెంటనే పరుగిడి పోవాలి, కాని, పోయిన వారెవ్వరూ తిరిగి రాలేదు. ఈ కధన విధానం అనేకమంది పాఠకులను ఆకర్షించింది. 1909లో హాస్యాస్పదమైన మాంత్రికుడు బోకుల్ మూన్ అంతకంటె హాస్యాస్పదమై పెద్ద పెద్ద ఇస్మ్ అజమ్‌ల (బిరుదులు)తో నున్న నాయకుడు ఉన్న ముమ్‌తాజ్ దమ్ సాబ్ వెలువడు నాటికి పాఠకుల అభిరుచులు ఈ అభూత కల్పనలు, వీర గాధలు నుండి మరలిపోయినవి. 1908 నాటికి మాంత్రికులు, అప్సరసల యుగం అంతమై, నిజమైన చమత్కారాలు చూపే అయ్యార్‌ల (దొంగలు, నకిలీ వ్యక్తులు) వైపుకు దృష్టి మరలింది.

ఆంగ్ల విద్యాబోధన వ్యాపించిన ఆ రోజులలో విద్యాబోధనా సంస్థలు, ఆంగ్ల కాల్పనిక సాహిత్యాన్ని అనువాదాల రూపంలో వెలువరించక పోవడం నిజంగా ఆశ్చర్యకరమే. హీరానంద్ షాకీరాం ఒక్కరే ఆంగ్లం నుండి అనువాదం మొదలుపెట్టినవారు. వారు కూడ స్కాట్ కవి టాలిస్ మన్ 1891లో మొదలుపెట్టి అసంపూర్తిగా విడిచిపెడితే దానిని భేరుమల్ మహీర్ చంద్ పూర్తి చేయవలసి వచ్చింది. 1894 లో శోభ్‌రాజ్ హస్సారాం సభా-జో-సింగార్ (సభకు అలంకరణ)ను వ్రాశారు. ఈ గ్రంథంలోని కొన్ని అంశాలు పాఠ్య గ్రంధాలలో చేర్చబడినవి. ఇందులోని భాష సరళం, శైలి ఉల్లాస భరితం. వీరు ఈ కథలు కాక మరికొన్ని హిందీ పంచతంత్రం నుండి సేకరించి అనువదించారు.

ఈ కాలంలో వెలువడిన మరొక వీరగాధ, ఇప్పటికీ విద్యార్థులు, సామాన్య పాఠకులు కూడా చదువుతూ వుండే లత్‌ఫుల్లా అఖండ్ 1892 లో వ్రాసిన జాన్ అలమ్, అంజుమన్ ఆరాలగాధ 'గుల్ ఖందమ్' (నవ్వే పువ్వు) ఒకటి. మధ్య మధ్య పద్యాలతో చక్కని కవితాశైలి ప్రదర్శిస్తూ వచనంలో లక్షణంగా మనోహరంగా సాగిపోవడం ఈ పుస్తకంలోని ప్రత్యేకత. సంఘటనలు ఒకేవిధంగా ఉంటూ పాతకాలం

పద్ధతిలోని ఇంద్రజాలం, దేవకన్యలు, పాచికలాడడం, వినోదక్రీడలు సలిపడానికి అందమైన అమ్మాయిలు, యివన్నీ ఉన్నప్పటికీ, మానవ సహజమైన భావాలు కూడా ఉంటాయి. శృంగార రసధ్వనితో వర్ణనలు సుసంపన్నమై ఒక్కొక్క చోట సున్నితమైన రసగ్రహీతలకు వెగటు పుట్టించేలాగున ఉంటాయి; యీ పుస్తకంలో. ఆ కాలం పాఠకుల అభిరుచులకు నిదర్శనంగానైనా ఈ పుస్తకం గుల్‌ఖాన్‌దాన్ నిలచి ఉంటుంది.

1892 లో ప్రీతమ్ దాస్ హకుమత్‌రాయ్ వ్రాసిన అజబ్ భేరిట్ (వింతసామ్యం) అన్న పుస్తకంలో ఉన్నత ఉద్యోగ వర్గం వారి గృహ జీవనం, భాయిబంద్ అంటే హిందువులలోని వర్తక వర్గం వారి గృహ జీవనం చక్కగా వర్ణించబడింది. ఇందులో 'ఒక వినమ్రుడై సంస్కరణలు అర్థించువాడు' అని సాంఘిక సంస్కరణలు కోరుతూ వ్రాసిన యీ పుస్తకం కళాత్మక గ్రంథంగా పాఠకులను ఆకర్షించలేదు. రెండవ ముద్రణ 1910లో రావడానికి పట్టిన రెండు దశాబ్దాల కాలంలోను వారు కోరిన సంస్కరణలను సాధించ గలగడం తమకెంతో తృప్తిని అందిస్తున్నదని గ్రంథకర్త రెండవ ముద్రణలో పేర్కొన్నారు.

1857-1907 కాలంలో పత్రికా రచనలు క్రమంగా అభివృద్ధి పొందసాగాయి. ఆ రచనల ప్రభావం సింధీ వచనం మీద ప్రసరించింది. 1885లో స్థాపింపబడిన సింద్ మదరెస్సా వారి పత్రికలలో, కవిగా పేరొందిన అఖోఝో కలం ద్వారా విశిష్టమైన వ్యాసాలు వెలువడ్డాయి. షమ్స్-ఉద్దీన్ బుల్ బుల్‌కుగా యీ పత్రికలో ఒక విశిష్టమైన స్థానాన్ని పొందారు. వారు షకూర్ ద్వారా స్థాపించబడిన 'అఫ్తాబ్' పత్రికలో కూడా వ్రాసేవారు, ఆ పత్రికకు వారు చాలాకాలం సంపాదకులుగా ఉండేవారు. షకూర్‌దే మరొక పత్రిక అల్‌హక్‌లో కూడా ముస్లిములకు ఆసక్తిదాయకమైన వ్యాసాలు వెలువడేవి. కాని అఫ్తాబ్, అల్‌హక్‌లలోని సింధీ వచనం పర్షియన్, అరబిక్ పదాలతో హిందువులకు సులభ గ్రాహ్యం కాని భాషలో ఉండేవి.

హిందువుల పత్రికా వ్యాసంగం 1870లో సింద్ సుధార్, సరస్వతి పత్రికలు హీరానంద్ షౌకీరాం స్థాపించడంతో ప్రారంభమయింది. సరస్వతి ప్రప్రథమ సింధీ పత్రిక అనవచ్చును. ఈ పత్రికలో హీరానంద్ ప్రచురించిన చాలా అంశాలు, వాస్తవ చిత్రణలు సేకరించి భీరుమల్ మహీర్

చంద్ హీరాన్‌జో కన్సూర్ (వజ్రాల మూటలు) అన్న పేరున ప్రచురించారు. ప్రస్తావించ బోయే దయారాం గిడుమల్ యీ పత్రికలలో హీరానంద్‌కు సహాయకులుగా వ్యవహరించినప్పటికీ తెరవెనుక నుండి మాత్రమే పని చేశారు.

క్రిందటి శతాబ్దం చివరి దశాబ్దపు రోజులలో 1891లో ప్రభాత్ అనే పత్రిక లేఖ్‌రాజ్ తిలోక్‌చంద్ సంపాదకత్వంలో వెలువడింది. ఈ పత్రిక ద్వారా మొట్టమొదట 'ప్రజాభిప్రాయం' అంటే యేమిటో సింధులో రూపొందించడం జరిగి, యీ శతాబ్దపు మొదటి దశాబ్దంనాటికి గుర్తింప దగిన ఒక శక్తివంతమైన సాధనంగా నిలిచింది. దీనితో సరిసమానమైన స్థానాన్నే ఆక్రమించుకున్నది సుకుమార్ సింధీ వారపత్రిక. ఈ పత్రిక వీరూమల్ బేగ్‌రాజ్ సంపాదకత్వంలో ఈ శతాబ్దపు తొలి సంవత్సరాలలో ప్రారంభించ బడింది. ఈ పత్రికలలోని సింధీ వచనం అంత సుప్రసిద్ధమైనదిగా, ఎంచకపోయినా శాబ్దాడంబరాలు లేక సూటిగా ఉండేది.

నిజమైన సాహిత్య విలువలతో వెలువడిన పత్రిక 'జోట్', నెలకు రెండుసార్లు ఒకే పత్రంగా వెలువడేది 1896లో. బయటికి మాత్రం అది కేథలిక్ పత్రికగా ఉండేది. దాని మొదటి సంపాదకులు క్రీస్తు మతం అవలంబించిన బ్రహ్మ బాంధవ్ అనే బంగాలీ యువకుడు, ఖేమ్ చంద్ అనే సింధీ యువకుడు. ఖేమ్ చంద్ తరువాత 'సింధ్ జర్నల్' అనే ఆంగ్ల పత్రికకు సంపాదకత్వం వహించారు, అయితే యీ పత్రికను సింధులో శక్తివంతమైనదిగాను సాహిత్య సంచికగాను తీర్చి దిద్దిన వారు పరమానంద్ మేవారాం. వీరు ఈ పత్రికకు 1899 లేక 1900 నుండి జీవితాంతం సంపాదకులుగా వ్యవహరించారు ఈ 'జోట్' పత్రికలో వెలువడిన సాహిత్య అంశాలను ఎంచి దిల్‌బహార్ అన్న శీర్షిక క్రింద మొదటి సంపుటిలోను, గుల్‌ఫూల్ అన్న శీర్షిక క్రింద మరొక సంపుటి ద్వారాను ప్రచురించారు. పరమానంద్ మేవారాం గురించిన ఇతర వివరాలు మరొక శీర్షిక క్రింద ఉన్నాయి. రాజకీయాలు యీ పత్రిక నుండి తీసివేయబడినప్పటికీ బ్రిటిష్ వారి పరిపాలన కాలంలో సింధీయుల మనోభిప్రాయాలను తీర్చిదిద్దడంలో జోట్ పత్రిక ప్రముఖ స్థానాన్ని అలంకరించింది.

డి. జె. కాలేజి సంచిక గురించి విడిగా చర్చించడం జరుగుతుంది. పాత్రికేయునిగా గాని, ప్రముఖ వచన రచయితగా గాని, విద్యావేత్తగా

గాని లేదా మరే ఇతర సాహిత్య ప్రక్రియలోనూ చేర్చడానికి వీలులేక పోయినా, సింధీ వచన సాహిత్యంపై తమ ప్రక్రియలోనూ చేర్చడానికి వీలులేకపోయినా సింధీ వచన సాహిత్యంపై తమ ప్రభావాన్ని వదలిపోయిన వ్యక్తి కెవల్‌రాం సలామత్‌రాయ్. గుల్ (పుష్పం), గుల్‌షకర్ (సుగంధ భరితమైన కలకండ), సూక్రి (బహుమానం) యివి వీరి రచనలు. ఈ గ్రంధాలు 1864–1871 మధ్య కాలంలో వ్రాత ప్రతులుగానే నిలచి పోయి, 1905 లో ముద్రింపబడ్డాయి. మంచి శైలి గల రచయిత పేరు చెప్పవలసి వస్తే కేవల్‌రాం పేరు ముందుగా చెప్పాలి. ఈ రోజుల్లో వారి సింధీ వచనం పాతకాలపు వింతలకు చెందినదిగా తోచవచ్చు : కాని సాదీ గులిస్తాన్ వంటి పర్షియన్ రచనల వల్ల ప్రభావితులై వ్రాశారు. వారి బోధనా పదతి విసుగు కలిగించదు. చెప్పే నీతిబోధను ఎప్పుడూ ఇతి హాసానికి గాని, నీతి కధకుగానీ జోడించి మరీ చెప్పేవారు. వారి గుల్ షకర్ నిండా వందలకొలది సామెతలు, క్లిష్టమైన లోకోక్తులు సూటిగా మనసుకు హత్తుకొనే ఉదాహరణలూ ఉంటాయి. వారు పర్షియన్ నుంచీ భారతీయ భాషల నుంచీ విస్తృతంగా ఉదహరించగలరు. కేవల్‌రాం రచనలను సింధీ ముస్లిములు కూడా సహృదయతతో స్వీకరించారు, వారి శైలిలో వారికి లోపాలేవీ కనబడలేదు.

సింధీయుల ఉన్నత విద్యకు, సింధీ వచన, సాహిత్యం నాటకం అభివృద్ధి చెందడానికీ కరాచీలోని డి.జె. సింద్ విద్యాలయం ప్రధాన పాత్ర వహించింది. 1887 లో ఆ విద్యాలయం స్థాపించిన నాటినుండి 1921 వరకూ ఆ రాష్ట్రంలో అది ఒక్కటే ఉన్నత విద్యా బోధనా సంస్థగాను, 1947 నాటికి కూడా, తక్కిన విద్యాలయాలన్నిటిలోను చదువుతున్న విద్యార్థుల సంఖ్యకంటె అధికంగా యీ విద్యాలయంలో ఎక్కువ మంది చదివే సంస్థగాను నిలచింది.

ఇరవైయవ శతాబ్దంలో సింధులోని పట్టభద్రులంతా ఇంచుమించు ఆ సంస్థలో చదివిన వారే కావడంచేత, సింధీ వచన సాహిత్యం నాటక సాహిత్యం అభివృద్ధి చెందడానికి, వ్యాపించడానికీ డి. జె. సింధు విద్యాలయం ప్రధాన భూమిక వహించింది. కాని ఆ విద్యాలయం స్థాపింపబడిన మొదట ఇరవై సంవత్సరాలలోను అనగా 1887 నుండి 1907 వరకు వచన, నాటక సాహిత్యాలు అభివృద్ధి చెందడానికి ఆ విద్యాలయం ఎంత గానో తోడ్పడింది. డి. జె. సింద్ విద్యాలయ స్థాపనకు పూర్వం పది పన్నెండు మంది సింధీయులు మాత్రమే పట్ట భద్రులయ్యారు. వారిలో

చాలామంది బొంబాయిలోని ఎలిఫిన్‌స్టన్ కాలేజీ నుండి ఉత్తీర్ణులైనవారే. 1887 తరువాత ఉన్నత విద్యాభ్యాసం కోసం క్రమంగా సింధీ విద్యార్థులు యీ విద్యాలయం వైపుకు మళ్లారు. ఈ గ్రంథకర్త సంపాదకత్వంలో 1939లో వెలువడిన స్వర్ణోత్సవ సంచికలో ఈ విద్యాలయం నుండి బయటికి వచ్చిన పట్టభద్రుల పేర్లు, వారిని గురించిన వివరాలు లభిస్తాయి. డి. జె. సింద్ విద్యాలయానికి పూర్వం సింధీ పట్టభద్రులలో ప్రముఖులు విద్వాంసులు, ఋషితుల్యులు దయారాం గిడుమల్.

వీరి కృషి ఫలితంగా తమ విద్యార్థులూ, అధ్యాపకులూ వీరి ద్వారా సింధీ వచన నాటక వికాసానికి అంచనా కట్ట శక్యం కానంతగా తమ ప్రభావాన్ని చూపడమే కాకుండా డి.జె. సింద్ విద్యాలయం వారు 1887-1907 కాలంలో సింధీ వచనం, నాటకం పెంపొందించడానికి రెండు మార్గాలను అవలంబించారు. 1901 నుండి డి.జె. విద్యాలయం ప్రతి సంవత్సరాంతాన ఒక సాహిత్య సంచిక ప్రచురించడం ప్రారంభించింది. మొదటి సంచికకు, బావి ప్రతిభావంతులైన ఆచార్యులు సాధు టి.ఎల్. వాస్వానీ సంపాదకులు. ఈ సంచికలోని సింధీ భాగంలోని ప్రతి వ్యాసం ఒక వజ్రపు తునక. ఈ సంచికలోని విశిష్టమైన వ్యాసాల సంకలనం, నలభై ఏళ్లుగా యీ సంచిక చేసిన సాహిత్య సేవను క్రోడీకరించి యీ గ్రంథకర్త 1940లో 'విచార్' అన్న ఒక సంకలనాన్ని వెలువరించారు. ఈ గ్రంథం చదివితే పై సంచిక సింధీ సాహిత్యానికి చేసిన అకుంఠిత సేవను గురించిన ఒక అభిప్రాయం మనకు దొరుకుతుంది. తరువాతి కాలంలో అంత మెచ్చదగిన వ్యాసాలకు ఈ సంచికలో చోటు దొరికినప్పటికీ, ప్రారంభదశలో చాలాకాలం వరకూ, అత్యున్నత స్థాయికి చెందిన వచన, పద్య సాహిత్యాలకే ఇందులో ప్రచురణార్హత ఉండేది. ఇక నాటకం గురించి : డి.జె. విద్యాలయ ఔత్సాహిక నాటక సమాజం 1894లో బి.జె. పద్‌షా నేతృత్వంలో స్థాపించబడింది, సింధీ నాటక రంగస్థల ప్రదర్శన కొరకే ప్రధానంగా స్థాపింపబడినా, నాటక రచనను కూడా చాలా ప్రోత్సహించేవారు. రెండవ ప్రపంచ యుద్ధ ఛాయలలో పడి యీ నాటక సమాజం విచ్ఛిన్నమయ్యేనాటికి, 1894-1914 యీ మధ్య కాలంలో యీ విద్యాలయ సమాజం వారు కనీసం పదిహేను నాటకాలను ప్రదర్శించారు, వాటిని ప్రచురించారు కూడా.

ఈ సమాజం వారు ప్రదర్శించిన మొదటి నాటకం మహాభారతం ఆధారంగా మాస్టర్ జెరానంద్ వ్రాసిన నలదమయంతి (1894) అని యీ

సంఘం చివరి కార్యదర్శిగా వ్యవహరించిన ఎ.యు. మల్కానీ వ్రాసిన వ్యాసంలో పేర్కొన్నారు. రామాయణ, మహాభారతాలు మొదటి నాటక కారులకు కథాంశాలను అందజేశాయి. తరువాత షేక్స్పియర్ నాటకాలు. లీలారాం సింగ్ వ్రాసిన హరిశ్చంద్ర 1895-1896లో ప్రదర్శింపబడింది. వీరే రచించిన రామాయణం 1898లో ప్రదర్శింపబడింది. రామాయణంలో కొంత భాగాన్ని 'రామ వనవాసం' అన్న శీర్షిక క్రింద దేవుమల్ వ్రాసినది 1891లో ప్రదర్శింపబడినది. వీరు తరువాత సన్యాసం పుచ్చుకున్నారు. సామాజిక కథావస్తువులతో 1895లో ప్రదర్శింపబడిన మోహన్ తర్కాసుర్జాన్ రాధాలు లీలాసింగ్ వ్రాశారు. మొట్టమొదటి నాటకంలో తప్ప తరువాతి నాటకాలలో పాటలు కూడా ప్రవేశపెట్టబడ్డాయి. ప్రధాన నాటకం అయిపోయాక, హాస్యభరిత ఘట్టాలను విరామసమయాలలో ప్రదర్శించేవారు. ఇవి చాలావరకు మిర్జాకాలిక్ బేగ్‌వే. వీటిలో ప్రసిద్ధి కెక్కినదీ, సాహిత్య విలువలతో నున్నదీ ఇంక్వయిరీ ఆఫీసర్ (సుప్రసిద్ధ రష్యన్ నాటకం ఇన్‌స్పెక్టర్ జనరల్ నుండి గ్రహింపబడినది), నీమ్ తబీబ్, నీమ్ ముల్లా (సగం వైద్యుడు, సగం పూజారి). తరువాత కాలంలో సింధీ ప్రహసనాలకు ఇవి మార్గదర్శకాలయ్యాయి. డి.జె. సింధ్ విద్యాలయ ఔత్సాహిక నాటక సమాజానికి విరివిగా నాటకాలు వ్రాసినవారు మిర్జాకాలిక్ బేగ్. వీరిని గురించి వేరొకచోట ప్రస్తావించడం జరిగింది. కాళిదాసు శాకుంతలం (1896)తో ప్రారంభించి షేక్స్పియర్ నాటకాలను అనుసరించి మర్చెంట్ ఆఫ్ వెనీస్ (హస్‌నాదిల్ దార్) 1897లో, కింగ్‌లియర్ (షా విరియా) 1900లో, సింబెలీన్ (షం షాద్ మార్జియానా) 1908లోను, మరికొన్ని ఇతర నాటకాలు, చివరిగా హేమ్‌లెట్ (బహారం రాకుమారి) 1914లో వారు వ్రాశారు. తరువాతి వాటికంటె తొలినాటి నాటకాలు చాలా విజయవంత మయ్యాయి. షా ఎలియా అన్నిటిలో అత్యుత్తమ సాహిత్య విలువలకోసం ప్రయత్నించిన నాటకం. దానిలోని పాటలు అద్భుతంగా ఉంటాయి. రోమియో జూలియట్ (గుల్‌జార్, గుల్నార్) 1909లోని విషాదాంతాన్ని తప్పించడానికి ప్రయత్నం జరిగింది గాని షేక్స్పియర్ నాటకాలతో తమాషాలాడడం అంత ఫలవంతం కాలేదు. వాస్తవానికి ఆ నాటకం ప్రదర్శింపబడలేదు. హిస్నా దిల్ దార్ నాటకంలో షైలాక్ పాత్రనూ హిందూ వ్యాపారిగా చిత్రించి హిందువుల మనసులు నొప్పించారు. మొత్తంమీద 1902లో షెరిడన్ పిజార్రోను షేవాసింగ్ అజ్వానీ కనిష్టగా అనువదించగా దానిని ప్రదర్శించి, ప్రచురించడం యీ సమాజం వారు ఆ రంగంలో సాధించిన ఘన విజయానికి నిదర్శనం. మూలంలో లేని సాహిత్య సౌరభాలను, పాత్రలలో వాస్తవికతను అనువాద

రచయిత గూర్ఖాలను, రాజపుత్రులను ఇరు పక్షాల యోధులుగా ప్రవేశ పెట్టి నాటకానికి వన్నెతెచ్చారు.

సింధీ వచన, నాటక వాఙ్మయాభివృద్ధికి డి.జె. సింద్ విద్యాలయం ప్రముఖ పాత్ర వహించింది. నాటక రంగంలో వారు మార్గ దర్శకులు, ప్రప్రథములు. నాటక రచనలోను, నాటక ప్రదర్శనలోను తరువాతి వారికి ఆ సంస్థ ఆదర్శంగా నిలిచింది. సింధీ వచనాన్ని ప్రజా భాషగాను, భావ ప్రకటనకు ఒక సాధనంగాను రూపొందించడంలో విజయం సాధించారు. ఈ సమాజంవారు నాటకాలు ప్రచురించడానికి ముందు, సింధీ వచనం, మామూలుగా వ్యావహరించే సంభాషణలకు దూరంగా ఉండేది. వారు ప్రచురించిన నాటకాల ద్వారా వ్యావహారిక భాష ఎంత సరళంగా ఉంటుందో తెలిసింది. సింధీ వచన, నాటక రంగంలో నలుగురు స్థిర చిత్తులు, నాలుగు స్తంభాలు :

సింధీ వచన, నాటకరంగాలకు నాలుగు మూల స్తంభాలనీ, లేదా సింధీ వచన నాటక సాహిత్య శకటానికి నాలుగు చక్రాలు అయి, దానిని ముందుకు సాగి పోయేందుకు కృషి సల్పినవారనీ యీ రచయిత పలుమార్లు కలిపి చెపుతూ వచ్చిన వారి గురించీ, ఆ కాలం గురించీ ప్రత్యేకించి చెప్పడం సమంజసం. వారి జీవితాలు గాని, వారి సేవలుగాని 1907 నాటితో ముగియలేదు. వారి అత్యుత్తమైన రచనలు, ఆయారంగాలలో విశిష్టమైన సేవలు 1907 నాటికి జరిగిపోయాయి. 1857 – 1907 మధ్య కాలంలో సింధీ వచన, నాటక సాహిత్యాలకు వారు స్థిరమైన పునాదులు వేశారు.

1908 నాటి బూల్ చంద్ దయారాం వ్యాసంలో చాలా అంశాలను ఇదివరకే ఉదహరించడం జరిగింది. వారు ఆ వ్యాసం చివర సింధీ సాహిత్యంలో వెలువడుతున్న గ్రంథాలలో తక్కువ స్థాయి కనబడు తుందనీ, అవి అన్నీ తత్కాలం మాత్రమే నిలచి ఉండునవనీ 'కీడునేశంకించు మాటలతో ముగించారు. వారు ఇలా అంటారు : స్థానిక పండితుల దృష్టిని విరివిగా సాహిత్యసృష్టి చేయడం కంటె సాహిత్య విలువలపై దృష్టిని ఉంచి రచనలను సృష్టించవలసిన అవసరం వైపు మరల్చడం ఇప్పుడు చాలా అవసరం. ఆ సాహిత్య సేవకూడా ఇప్పుడు జరుగుతున్నట్లు రెండు మూడు రంగాలకే పరిమితం కాకుండా అన్ని రంగాలలోనూ జరగాలి. ఉదాహరణకు సింధీ వచన సాహిత్యంలో కాల్పనిక సాహిత్యం, సాహిత్య విలువలతో నున్న వచనం, నీతి శాస్త్ర సంబంధమైన రచనలు కొరవడడం మనకు కనబడుతూనే ఉన్నది.

గుజరాతీ నవల 'కారవాన్‌ఘెలో' వంటి ప్రశస్తమైన ఒక్క నవల కూడా సింధీ సాహిత్యంలో దొరుకుతుందనుకోవడం సందేహాస్పదమే" ఈనాడు మనకున్న చిత్రణాశక్తి బహుశా బూల్‌చంద్ దయారాంలో కొరవడి ఉంటుంది. లేకపోతే వారు కౌరుమల్ వ్రాసిన పాకోపాహ్, దయారాం గిడుమల్ వ్రాసిన గీతా చో సార్ వంటి నీతి దాయకమైన రచనలు, పరమానంద్ మేవారాం వ్రాసిన దిల్‌బహర్, మీర్జాకాలిక్ బేగ్ 'జీనత్'లను ప్రశంసించి ఉండేవారు. కనీసం వారి తరువాత వచ్చిన మనమైనా యీ నలుగురూ సింధీ వచన నాటక సాహిత్యానికి నాలుగు స్తంభాల వంటి వారని గుర్తించాలి. వారికి న్యాయం చేకూర్చాలి.

సింధీ వచన సాహిత్యానికి తండ్రి వంటి వారైన కౌరుమల్ చందన్ మల్ ఖిల్ నానీ 1844లో సింధులోని ఒక కుగ్రామంలో జన్మించారు. అక్కడికి ఒక మైలు దూరంలోనున్న అఖండ్ పాఠశాలకు నడచి పోయేవాడు. రాత్రులలో వీధి దీపాలవద్ద పాఠాలను చదువుకొనేవాడు. అటు తరువాత సెకండరీ విద్యాభ్యాసానికని కరాచీ వెళ్లారు. కాని మెట్రిక్యులేషన్ పూర్తికాకుండగనే విద్యాభ్యాసం విడిచి పెట్టవలసి వచ్చింది. రెవిన్యూశాఖలో చేరి అటు పిమ్మట విద్యాశాఖ వైపుకు ఆకర్షితులయ్యారు. అప్పటినుండి సింధీ పాఠశాలలకు పుస్తకాలను విస్తృతంగా సంకలనం చేశారు. వారి పాఠ్యపుస్తకాలు 1873 మొదలుకొని యీ శతాబ్దపు తొలి దశాబ్దం వరకూ వాచకాలుగా ఉన్నాయి. చాలాకాలం వరకూ ఉపాధ్యాయులకు శిక్షణనిచ్చు విద్యాలయానికి ప్రధానాధ్యాపకులుగాను, ప్రభుత్వ అనువాదకులుగాను పని చేశారు. వారు వన్నెకెక్కిన సంఘ సంస్కర్తలు, పంచాయతులను వ్యవస్థీకరించటలో పని చేశారు. స్త్రీజనోద్ధరణకు పాటుపడి స్త్రీ విద్య కొరకు ఆందోళన చేశారు. వారు 1916లో మరణించారు.

అయితే కౌరుమల్‌ను పాఠ్యగ్రంధాలు రచించిన వారి గాను, వాచకాల కర్తగాను మాత్రమే సింధీయులు జ్ఞాపకముంచుకోరు. వారు సింధీ సాహిత్యానికి చేసిన ఘనమైన సేవల కారణంగా వారి పేరు చిరస్థాయిగా నిలిచి ఉంటుంది. ప్రత్యేకంగా వారు సింధీ సాహిత్యానికి చేసిన ప్రముఖమైన సేవ 1885లో గొప్పకవి అయిన సమీని కనుగొని వారిని ప్రచారం లోనికి తేవడం.

స్త్రీవిద్యను గురించి నిష్పాక్షికమైన వాదాన్ని ప్రతిపాదిస్తూ రచించిన పాకోపాహ్ (1862) వారి మొదటి మూలగ్రంధం. ఈ గ్రంధస్థ

వ్యాసాన్ని మిల్‌గారి 'లిబర్టీతో'ను మోర్లీ 'కాంప్రొమైస్' అన్న వ్యాసాల తోనూ పోల్చవచ్చును. వారు ఉదార స్వభావులు. వారి పుస్తకంలోని ప్రధానమైన వాదం: 'స్త్రీవిద్యవలన చేకూరు ప్రయోజనమేమిటి? స్త్రీలు వంట యింటికి, ఇంటిపనులు చేయుటకు మాత్రమే అర్హులు, లేదా స్త్రీలు పత్రికారంగంలోను, ప్రభుత్వకార్యాలయాలలోను పనిచేయ తగుదురా అని ప్రశ్నించువారు పునాది వేయుటలో శ్రద్ధచూపక సౌధమును నిర్మించు వారితో సములు, ప్రతిదేశము యొక్క ఔన్నత్యముగాని, పతితనముగాని, అభివృద్ధి చెందుటలేక వినాశన మగుటగాని ఆదేశంలోని స్త్రీలజ్ఞానాభివృద్ధి పైననే ఆధారపడి ఉంటుంది.'

కౌరుమల్ ఇతర రంగాలలో కూడా మార్గదర్శకులే! 1888లో వారు హర్షదేవుని సంస్కృతనాటకం 'రత్నావళి'ని అనువదించారు. అది సింధీలోనికి అనువదింపబడిన మొదటి సంస్కృత నాటకం. నిజానికది ఆహ్లాదకరమైన అనువాదంగా చెప్పకోదగ్గదికాదు. ఆ పుస్తకంలో కొన్ని మోటుగాను, బాహాటంగాను కామోద్రేకాన్ని కలిగించే వర్ణనాంశాలున్నాయి. వీటి దృష్ట్యా కౌరుమల్ సంస్కృతంనుండి సింధీ భాషలోనికి అనువదించ డానికి అంత సమర్థులు కారు అని మాత్రం చెప్పగలం.

1905లో కౌరుమల్ ఒక బెంగాలీ కవి ఆంగ్లంలో వ్రాసిన 'ఉత్తమ నారీమణులు' అన్న పుస్తకాన్ని ఆర్యనారీ చరిత్రగా ఇంతకంటే విజయ వంతంగా అనువదించారు. నిజానికి మూల గంధ్రం కంటె కౌరుమల్ అనువాదం చదువదగినదిగాను, భాషా సంప్రదాయాను సారంగాను ఉన్నది. చిన్నచిన్న జీవిత చరిత చిత్రణలలో 'కృష్ణకుమారి', 'అఘోర కామిని' వంటి నాయికల కథనములో శైలి అనర్గళంగా సాగింది.

వారు శుద్ధ సింధీలో అనేక వ్యాసాలు వ్రాశారు. అందులో చాలా ప్రసిద్ధి కెక్కినది 'పంచాయితీలు ఎందుకు క్షీణిస్తున్నాయి?' అన్నది. వారు ఆరోగ్యం, వ్యవసాయం, జానపద గేయాలు, జానపదగాథలవంటి అనేక గ్రంథాలను సంకలన పరిచారు. సాహిత్య అకాడమీవారు కౌరుమల్ కొన్ని ఎన్నికైన రచనలు 1907 వరకు (సాహితిక్ పుష్ప) అన్న గ్రంథంలో 44 శీర్షికలు ఇవ్వబడినవి పాకోపాహ్ (1862)తో ప్రారంభించి తరువాత కొలంబస్ చరిత్ర (1862) ఇవ్వబడింది. అందులో భక్తుడు రాబావిస్రియా, జయదేవ, రామమోహన్ రాయ్ వంటి ప్రముఖుల చరిత్రలు, తేలిక సాహిత్యం, హాస్యోక్తులు కూడా ఉన్నాయి. 1907 తరువాత కౌరుమల్ మరి తొమ్మిదేండ్లు జీవించారు. కాని సింధీ వచన

సాహిత్యానికి పితగా వారి గౌరవాన్ని ఇనుమడింపచేసే రచన లేపీ ఆ కాలంలో వెయ్యలేదు. తరువాత కాలంలో వెలువడిన గ్రంథాలలో చాలా ప్రచారంలో నున్నది బెంగాలీ నవలాకారుడు బంకించంద్రుని కథలకు అను వాదాలు (రాధారాణి, రెండు ఉంగరాలు, ఇందిర)

కౌరుమల్ సింధీలో వ్యాసాలను వ్రాసిన మొదటి రచయిత. ప్రారంభకులకు వ్యాసంలో వాదనలు సమర్ధవంతంగా వ్రాతలో ఎలా ప్రతి పాదించాలి అన్న విషయం తెలియ బరుస్తాయి. మరొక విశేషం కౌరుమల్ సింధీ రచయితగా హిందువుల, ముస్లిముల మన్ననలను అందు కున్నారు. కాని తరువాతి కాలంలో వారు హిందీ శబ్దాలు, సమాసాలు హెచ్చుగా వాడడం మొదలు పెట్టారు. వారు సింధీ భాషలోని క్షేత్ర గణితంలో త్రిభుజం, చతుర్భుజం మొదలైన వాటికి వాడిన పదాలు పర్షియన్ మూలం ఆధారంగా వారు స్వయంగా సృష్టించినవేనని మహమ్మద్ సిదిక్ మెమొన్ అంటారు.

నిజ జీవితంలోను, వారి రచనా ప్రపంచంలోను కౌరుమల్ సాధారణంగా, నిరాడంబరంగా, భేష రహితంగా ఉంటూనే రీవిగా ఉండేవారు. సరళమై సహజమై ఉంటూనే హుందా అయిన సింధీ శైలిలో వ్రాయాలనుకునే వారెవరైనాసరే కౌరుమల్ పాకోపాహ్, ఆర్యనారీ చరిత్ర, సాహిత్య అకాడమీ వారి సాహిత్య పుష్పక్ ప్రచురణలో కొన్ని ఎన్నికైన వ్యాసాలు తప్పక చదవాలి.

సింధీ వచనానికి మూలపురుషులైన నలుగురిలో రెండవవారు మిర్జాకాలిక్ బేగ్ (1853-1929). అభిమానులు వీరిని సింధీ సాహి త్యానికి సూర్యుని వంటివారు 'అఫ్‌తాబీ అదబ్' అంటారు. సింధీ వచన సాహిత్యంలో స్వయంగా సుప్రసిద్ధ రచయిత అయిన ఫతే మహ్మద్ సేహ్వానీ బేగ్‌ని పొగడుతూ ఒక పద్యం వ్రాశారు. అందులో తక్కిన సింధీ రచయితలందరూ (వెలుతురులో పేలవంగా కనబడే) నక్షత్రాలనీ, సింధీ సాహిత్యాకాశంలో మిర్జా సూర్యుడు, చంద్రుడూ అనీ అంటారు.

సింధులో జన్మించిన రచయితలలో అత్యధికంగానూ, అతశ్రమకు బీర్చి, అన్ని రంగాలలోను విస్తృతంగా వ్రాసినవారు మిర్జా కాలిక్ బేగ్ వారు సింధీ సాహిత్యంలో వచన, పద్య, నాటకరంగాలలో ప్రసిద్ధిపొందిన వారు. వారు జార్జియన్ సంతతికి చెందిన వారు. వారి తండ్రి క్రైస్తవ మతాన్ని వదిలి ఇస్లాం మతం పుచ్చుకున్నారు. తల్లిదండ్రుల కాలంలో

సింధుకు వచ్చారు. నిరాశాపూరితులై ఉన్న ఒకానొక సమయంలో నాలుగు పాదాల పద్యం ఒకటి వ్రాసి అందులో తాను సింధులో జన్మించడం తన దురదృష్టమనీ, అచటి ప్రజలు అనాగరికులై తన ప్రతిభను గుర్తించ లేకున్నారనీ వాపోయారు. తాను ఇరాన్‌లోగాని, ఈజిప్టులోగాని, గ్రీసులోగాని జన్మించి ఉండవలసినదని కూడా వాపోయారు. నిజానికి వారు తమ జీవిత కాలంలోనే గొప్ప సింధీ విద్యా వేత్తగా గుర్తింపబడ్డారు. యువతరం కవులందరూ ఎల్లప్పుడూ వారిని పరివేష్టించి ఉండేవారు. వారు ఎల్లప్పుడూ నిండుమనసుతో వ్యవహస్తూ ఉండే వారు. నిరర్ధకమైన విషయాలను ఎక్కడా, ఏరూపంలోనూ సహించేవారు కాదు. డి. జె. సింద్ విద్యాలయంలో ఒకసారి విద్యార్ధులను సంబోధించి వారు ఈ విధంగా అన్నారు. 'మీరు నవ్వులకు అలవాటు పడి ఉన్నారు, మరి నేను కన్నీళ్లకు అలవాటు పడి ఉన్నాను' అని.

మీర్జాకాలిక్ బేగ్ బొంబాయిలోని ఎలిఫిన్‌స్టన్ విద్యాలయ విద్యార్ధి కాని వారు అనారోగ్య కారణాల వల్ల పట్టం పుచ్చుకోలేదు. విద్యార్థిగా ఉంటూన్న సమయంలోనే పర్షియన్ ఛందోరీతులను గురించి, కొత్త వారందరూ నేర్చుకొనేందుకు ఆతురతచెందే ఒక పుస్తకాన్ని వ్రాశారు. మీర్జా వారి మాతృభాషలోనే కాక పర్షియన్, ఇంగ్లీషు, హిందీ మొదలైన భారతీయ భాషలలో కూడా పండితులు. వారి తొలి రోజులలోనిది, అత్యంత ప్రచారం పొందిన నాటకం ఖుర్షిద్ (1885) గుజరాతీ నాటకానికి అనుసరణ.

మీర్జాకాలిక్ బేగ్ రెవిన్యూశాఖలో ఉన్నతోద్యోగిగా ప్రవేశించి 1910లో ఉద్యోగ విరమణ చేశారు. పదికాలాలు నిలిచి ఉండే అత్యుత్తమమైన వారి రచనలలో అత్యధిక భాగం పదవీ విరమణకు ముందు కాలంలో వ్రాసినవే. వారి జీవిత చరిత్ర 'ముసాఫిర్ కుర్చ్‌కాలిక్' అన్న పేరున వ్రాశారు. కాని దానిలో సాహిత్య పరమైన, కళాత్మక విలువలు తక్కువ, భావ ప్రకటన హెచ్చుగాను ఉన్నది.

ఉద్యోగంలో ఉన్నప్పుడు గాని, విశ్రాంతి సమయాలలో గాని మీర్జాకాలిక్ బేగ్‌కు ఒక వింత అలవాటు ఉండేది. ఉదయం కొన్ని గంటలసేపు రచనా వ్యాసంగానికి కేటాయించేవారు. వారు స్వయంగా రచించినవి, సంకలన పరచినవి అన్నీ కలిపి 350 గ్రంథాలు ఉంటాయి అనీ, అందులో వారి జీవితకాలంలోనే సగం అచ్చయినవనీ అంటారు. బహుసంఖ్యలో ఇన్ని పుస్తకాలను అందించి సింధీయుల విద్యావ్యాప్తి కోసం

మరి యే ఇతర రచయిత చేయనంతటి సేవను వారు చేశారు. కాని వారి పేరు మీద అచ్చయిన కొన్ని పుస్తకాలు వారు వ్రాశారంటే నమ్మదగినవిగా ఉండవు. చాలామంది రచయితలు తమ రచనలను, ధనార్జన దృష్టితోనో లేక గుర్తింపుపొందే దృష్టితోనో మీర్జా వద్దకు సరిదిద్దడానికి వారి సహాయం అర్థించి తెస్తూవుండే వారని చెపుతారు. మీర్జాకాలిక్ బేగ్ రచనలలో ఏవిధమైన పొరపాట్లను గాని లోపాలను గాని క్షమించే వారు కాదు. (ఆ విషయాలలో వారు నిష్కర్షగా ఉండేవారు. వారి రచనలు ఈ విషయంలో దోష రహితాలు) పొరపాట్లు, సవరింపులు దిద్దిన పిదప తమ పేరు ఆ పుస్తకానికి ఉంచితే ఆ రచనలకు గౌరవం వస్తుందని రచయితలను ప్రోత్సహించే వారట. సాధారణంగా ఏ రచయిత పేరనో వచ్చిన గ్రంథాలను కన్నెత్తి చూడని విద్యాశాఖవారు ముఖపత్రం మీద మీర్జా పేరు చూడగానే, వెంటనే వాటిని ఆమోదించేవారట.

మీర్జా యీ అపారమైన రచనా సంపత్తి ధాన్యాన్ని, పొట్టును వేరు పరచి అసలైన అమూల్యమైన వచన, పద్య, నాటక రచనలను మాత్రం ప్రచారంలో ఉండేలాగున గొప్పసేవ చేస్తే చాలా బాగుండేది. ఉదాహరణకు వారి అసంఖ్యాకమైన మూలగ్రంథాల, సంకలనాల పట్టికలో 'అజీబ్ గరీబ్' (వింతలు, విశేషాలు) విజ్ఞాన శాస్త్ర వింతలు, విశేషాల సంకలన గ్రంథం 1924లో కూర్చారు. అది ఈ నాటి పాఠకులకు ఎంత మాత్రమూ రుచించదు.

తమ నిరంతర సాహిత్య రచనా వ్యాసంగోత్సాహంలో ఎంత చిన్నదైనా సరే, చేతికి దొరికిన పుస్తకాన్ని వారు అనువదించడం మొదలు పెడతారు. వారు ఆంగ్లం నుండి బేస్కెట్ ఆఫ్ ఫ్లవర్స్ (Basket of Flowers) సార్ఫర్డ్ అండ్ మార్టన్ (Stanford and Marton), త్రీ హోంస్ (Three Homes), షెర్లాక్ హెూమ్స్ స్టోరీస్ (Sherlock Holmes Stories), ఫ్రం పావర్టీ టు పవర్ (From Poverty to Power) వంటి పుస్తకాలను అనువదించడానికి ఎంత శ్రద్ధ చూపుతారో, ఆంగ్ల చారిత్రాత్మక గ్రంథాలుగా నిలిచిన గల్లీవర్స్ ట్రావెల్స్ (Culliver's Travels), రాబిన్సన్ క్రూసో (Robinson Cruso) మొదలైనవి అనువదించడానికీ, ల్యాంబ్స్ స్టోరీస్ ఫ్రం షేక్స్పియర్ (Lamb's Tale from Shakspere 1890), బేకన్స్ ఎస్సేస్ (Bacons Essays in 1877), అల్‌గజాలీ కిమియైయ్ సాదత్‌లను సింధీలో అనుసరణ గ్రంథాలుగా వ్రాయడానికి కూడా అంతశ్రద్ధా చూపేవారు. మంచి

చెడుల భేదం లేకుండా, ప్రామాణిక గ్రంథాలతో పాటే, శాశ్వత విలువలు లేని బుద్బుదప్రాయమైన రచనలను కూడా ఏకమొత్తంగా అనువదించిన మీర్జాకాలిక్‌బేగ్ అనువాదాలను గురించి ఒకే ఒక్క మాట వారి పక్షాన చెప్పదగినది. వారు చదవడానికి సాహిత్యంలేక అలమటించి పోతున్న ప్రజల చేతికి దొరికిన దాన్ని దొరికినట్లుగా అందించారు.

మీర్జాకాలిక్ బేగ్ పద్య కవిత్వం గురించి క్రిందటి అధ్యాయంలో చెప్పిన విషయాలు విడిచిపెడితే, వారు ప్రప్రథమంగా సింధీయుల దృష్టిని ఆకర్షించినది బేకర్ ఆంగ్ల వ్యాసాలను సింధీలోనికి మకాలత్ - అల్ హిక్ మత్ (జ్ఞానంపై వ్యాసాలు) అన్న శీర్షిక క్రింద 1877లో అనువదించినప్పుడు. మీర్జాకాలిక్ బేగ్ తన అనువాదంలో మూల రచయిత చూపిన సంక్షిప్తత, ప్రాపంచిక జ్ఞానము, శైలిలోని ఔచిత్యం యివన్నీ చక్కగా చూపిస్తూ వాడుకలో లేని పదాలేవీ వాడకుండా, విస్తరించకుండా తెలియని మాటలు, సమాసాలు వాడకుండా తరువాత వచ్చిన రచయితలకు మత సంబంధం కాని నిగూఢ విషయాలలో ఎటువంటి పదజాలం ఉపయోగించదలెనన్న విషయాని తెలియ చేస్తూ చక్కగా వ్రాశారు.

నాటక రచనలో వారికి గుజరాతీ నాటకానికి అనుకరణగా వ్రాసిన ఖుర్షీద్ అను నాటకం 1885లో వ్రాయడంతో గొప్ప విజయం సాధించారు. ఆ నాటకం కొంత ప్రాసబద్ధంగా కొంత సరళ వచనంగా ఉంటూ నిరాడంబరంగా, వాస్తవంగా ఉన్నది. ఆ కాలంలో ప్రేక్షకులు, రాజులు, ఉన్నత వంశానికి చెందినవారు రంగస్థలం మీదికి నడచిరావడం చూడ ముచ్చటపడేవారు. ఖుర్షీద్ నాటకంలో యిలాటి ప్రజాదరణ పొందిన ఘట్టాలతో, వారికి నచ్చిన పాత్రలతో, వారి సరసనే సామాన్య ప్రజలు కూడా వారి సహజ మనోభావ ప్రకటనలతో ప్రవేశించేవారు. ఈ నాటకంలోని గేయాలు ఆకర్షణీయంగా ఉండేవి.

1890లో 'జీనత్' మొట్టమొదటి మూల సింధీ నవల రచన ద్వారా వచన రచయితగా వారికి విజయం ప్రాప్తించింది ; అయినప్పటికీ కొందరు రచయితలు దీనికి కూడా మూలం ఎక్కడో ఉన్నదంటారు. జీనత్ వ్రాయడానికి ముందు సంవత్సరమే మీర్జాకాలిక్ బేగ్ దిలారాం అనే ఇంకొక నవల వ్రాశారు. కాని అది మూల రచనకాదు. జీనత్ సింధీ సాహిత్యంలో ఒక కొత్త రచన. రచయిత స్వయంగానే అన్నారు : కాలవశమున వచ్చు అవస్థాంతరములను ప్రస్తుత కాలమాన పరిస్థితులను,

సహజమైన భాషలో ఉంచి వ్రాసిన కల్పిత కథ. ఇందులో భూతాలు, దేవకన్యలు, రాక్షసులు, మంత్రగత్తెల వంటి నాయిక, ఇంతకు ముందు రచయితల రచనలలో వలె కనబడవు. ఈ పుస్తకంలోని సంఘటనలన్నీ సహజంగా సంభవించినవి. ఏ మానవుని జీవితంలోనైనా సంభవించ గలిగినవి ఇందులో జీనత్ తన సద్గుణాలు, సౌశీల్యతల వల్ల గొప్పస్థితికి ఎదుగుతుంది. నవల ముందుభాగంలో ఒక మర్యాదస్థులైన ముస్లిము కుటుంబం, తల్పూరుల పాలనాంతిమ దశలో, బ్రిటిష్ వారి పరిపాలన తొలి రోజులలో, వారి జీవితాన్ని వర్ణిస్తుంది. ఈ నవల చదివిన వారు ఇది తప్పకుండా ఆత్మకథా వర్ణన అని ప్రకటించారు. ఫతేఖాన్ సెరాయ్, అలీనవాబ్ మొగల్ కుటుంబాలను వర్ణించడంలో మీర్జాకాలిక్ బేగ్ తన కుటుంబం యొక్క తనయొక్క తొలినాటి జీవితం లోనికి మనసు తొంగిచూసేలా చేశారు. పుస్తకంలోని ప్రధాన కథాంశం కౌరుమల్ పుస్తకం పాకోపాహ్‌లో వలెనే మన సమాజం పై అంతస్తుకు వచ్చి ఔన్నత్యాన్ని సాధించాలంటే స్త్రీల అంతస్తు కూడా పెంచి వారిని విద్యావంతులుగా చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది - అని ఆ కాలంలోని ప్రజలను దిగ్భ్రాంతులను చేయడానికి సాహసించక స్త్రీలకు ఘోషా పద్ధతి మాత్రం కొనసాగాలని మీర్జా కాలిక్ బేగ్ తన అభిప్రాయాన్ని విశదీకరించారు. ఈ నవలలో భావోద్రేకాన్ని కలిగించే రెండు సంఘటనలు లోపాలుగా కనిపిస్తాయి. ప్రశాంతమైన గృహజీవనం తొలిదశలో వర్ణించిన దానికి, తరువాత నాయిక నీటిలో మునిగిపోయేటంతటి పరిస్థితికి రావడం, యీ రెంటికీ పొంతన కుదరలేదు. రెండవది, సాంప్రదాయకంగా వచ్చే పాత్రల గురించి, ఆ పాత్రలు అయితే దేవతా మూర్తుల స్వభావంతో లేకపోతే దానవ మూర్తుల స్వభావంతో ఉంటాయి. జీనత్ చాలా ఆసక్తిదాయకమైన పాత్రే కాని ఆమె పాత్ర చిత్రణలో ఒక క్రమానుగతమైన అభివృద్ధిలేదు. ప్రతి సందర్భంలోను ఆమె ఆదర్శవంతమైన బాలిక, ఆదర్శవంతమైన మహిళ, అంతే. ప్రతీ ఘటనా సంగమంలోను ఆమె ఆదర్శవంతమైన మచ్చలేని నడవడిక రచయితకు తన నీతి బోధలకు అనువైన విషయంగా మాత్రమే ఉపకరించింది. ఈ లోపాలున్నప్పటికీ, గృహ వాతావరణంలో, ఒకానొక సమయంలో సింధులో నివసించే సామాన్య కుటుంబ జీవన విధానాన్ని వర్ణిస్తూ, సహజమైన నానుడి, ఉపమానాలు వాడి వ్రాసిన మొట్టమొదటి మూల సింధీ నవలగా 'జీనత్'ను పేర్కొన వచ్చును.

మీర్జాకాలిక్ బేగ్ మరొక నవల రుస్తుం పహల్వాన్ (1905) అది మూల రచనకాదు, అనువాదం అంతకంటే కాదు. దానిలోని కథా వస్తువు ఫిరదౌస్ షహనామా నుండి గ్రహించి, నైపుణ్యవంతంగా దానిని వచన వర్ణనాత్మక నవలగా రూపొందించారు. రుస్తుం సాహస కృత్యాలు, అతని కుమారుని చేతులలోనే అతని విషాదాంతమైన అపజయం అతని జీవితంలో విషాదకరమైన ఇతర సంఘటనలు వీటన్నిటినీ గుదిగుచ్చి ఒక చక్కని కథగా రూపొందేలాగున రాక్షసులు, మంత్రగాళ్లు, మాయలతో నిండిన కథలు మెచ్చే పాఠకులకూ, అటువంటి కథలంటే అసహ్యించుకొనే వారి అభిరుచులకూ నచ్చే విధంగా వ్రాశారు.

సింధీ భాషలో విమర్శను ప్రప్రథమంగా ప్రారంభించినది మీర్జా కాలిక్ బేగ్. సింధులో వారి మొట్టమొదటి జీవిత చరిత్ర షా అబ్దుల్ లతీఫ్ ; విమర్శన. (1885) అట్లే చాల సంవత్సరాల తరువాత వారే ప్రచురించిన షా నిఘంటువు. మీర్జాకాలిక్ బేగ్ షా అబ్దుల్ కరీం సబిత్ అలీ షా, కాసిం, ఫజిల్ వంటి ఎంతోమంది కవులను సింధీయులకు పరిచయం చేశారు, సింధీభాషా చరిత్ర గ్రంథాన్ని కూడా వ్రాశారు. మీర్జా గ్రంధాలలో ప్రత్యేకంగా ఎన్నదగినవి, సింధీ సాహితీ సంఘం వారు ప్రచురించిన సింధీ పద్య వాఙ్మయం అన్న చిన్న సాహిత్య గ్రంథం (1915), అట్లే ప్రాచీన సింధును గురించి 1925లో వ్రాసిన గ్రంథం. జలాలుద్దీన్ రూమివంటి పర్షియన్ కవులను గురించి కూడా వ్రాశారు. ఆధ్యాత్మిక విషయాలను గురించి వారు వ్రాసిన గ్రంథాలు డజన్లకొద్దీ ఉన్నాయి. అబ్దుల్ బహా ప్రచారం చేసిన నూతన మతాన్ని గురించి వారు వ్రాశారు.

నిజానికి మీర్జాకాలిక్ బేగ్ ఆసక్తిదాయక విషయాలు, విస్తృతము, వైవిధ్యముతో కూడినవి. వచన రచయితగా వారి ప్రత్యేకత, గౌరవ ప్రదంగా వ్రాయడం, అదీ పండితునిగా వ్రాయడం ; వారి వచనం కొత్త వారికి వ్యాకరణం, నానుడి బోధించడమే కాకుండా, యువతరం వారికీ, విద్యావంతులకూ చదవడానికి ఆసక్తిదాయకంగా ఉంటుంది. వారు సహజంగా గంభీర ప్రకృతి గలవారే అయినా పిల్లలకు కథలు, హాస్యం వ్రాసేటప్పుడు ఉల్లాసం, చిలిపితనం ఉట్టిపడేలాగున వ్రాయగలరు. వారు ఆరోగ్య పాఠాలలో సరళము, సుబోధకము అయిన భాషను వ్రాయ గలిగి, సేమ్యూల్స్మైల్ 'సెల్ఫ్ హెల్ఫ్' వంటి అనువాదంలో సామాన్యమైన వాడుక భాషను అంత సులభంగానూ వ్రాయడం మీర్జాకాలిక్ బేగ్ పాఠకులకు ఆశ్చర్యం కలిగిస్తుంది. మీర్జా విభిన్నస్థాయిలలో వ్రాసే

రచయిత, వారు ఎప్పుడు గొప్పగా వ్రాస్తారో, ఎప్పుడు అనుభవంలేని ప్రారంభకుడిలాగా వ్రాస్తారో వారికే తెలియదు.

మీర్జాకాలిక్ బేగ్ సింధీ నాటక సాహిత్యానికి ప్రారంభకులు మాత్రమే కాక డి. జె. సింద్ విద్యాలయ ఔత్సాహిక నాటక సమాజం వారు వెలువరచిన నాటకాలలో అధికాంశం వారే రూపొందించారు. ఖుర్షీద్ నాటకం తరువాత 1896లో కాళిదాస శాకుంతల నాటకం అనువదించారు. ఇదివరకు పుటలలో చెప్పినట్లు షేక్స్‌పియర్ నాటకాలను ప్రచురణకు, ప్రదర్శనకు వీలుగా అనువదించారు. లిట్టన్ నైట్ ఎండ్ మార్నింగ్‌కు అనువాదం ఫిరోజ్ దిల్ ఆఫ్ రోజ్. వారి 'నేకీబడీ' కూడా చాలా ఆకర్షణీయమైన నాటకమే. సింధీనాటక రంగానికి మీర్జాకాలిక్ బేగ్ సేవలలో ప్రహసనాలు, హాస్య రచనలు ప్రవేశ పెట్టడం ఒకటి. మీర్జా నాటక రచనలు చదివి ఆనందించదలచే శ్రోతలు, వారి తొలి రచనలకు ఉదాహరణగా ఖుర్షీద్‌ను, వారి శైలికి, బరువైన పరిపక్వత చెందిన రచనలకు ఉదాహరణగా షావిలిసా, హాస్యరస ప్రధానమైన ప్రహసన శైలికి ఉదాహరణగా 'ఇంక్వయిరీ ఆఫీసర్' చదివి తీరాలి. మీర్జాకాలిక్ బేగ్ నాటకాలలో ఎన్నదగిన గ్రంధ భాగం ఇంక్వయిరీ ఆఫీసర్ అనబడే వ్యక్తి వ్రాసిన ఉత్తరం పోస్టులో ఉండగా పోస్టుమాస్టరు దానిని విడిగా తీసివేస్తారు. ఆ వుత్తరంలో గ్రామాదికారులను నిజమైన రంగులలో వర్ణించారు. మీర్జాకాలిక్ బేగ్ అన్నివేళలా అంత అప్రయత్నంగాను, సహజంగాను వ్రాయగలిగి వుంటే సింధీ సాహిత్యంలో వారికి సాటి యెవరూ ఉండేవారు కారు.

మహమ్మద్ సిదిక్ మెమొన్ 1936 లో కుర్బ్ కాలిక్ (కాలిక్ అనురాగ భరిత శ్రద్ధాంజలి) నుండి మీర్జాకాలిక్ బేగ్ పద్య కావ్యాలు, వచన గ్రంధాలు, నాటకాల నుండి కొన్ని సేర్లను మాత్రమే తీసుకున్నారు. అది మాత్రమే నాలుగు పుటలకు మించి ఉన్నాయి!

ఆధునిక సింధు నిర్మాత, ప్రాచీన సింధీ వచన నిర్మాతల నలుగురిలో మూడవవారైన దయారాం గిడుమల్ 1857లో ధనికులైన జమిందారుల ఇంట జన్మించారు. వారు 1927లో బొంబాయి (బాంద్రా)లో మరణించారు. వారి తరం విద్యార్థులలో వీరు అతి మేధావంతులైన విద్యార్థి. 1877లో బొంబాయి విశ్వవిద్యాలయంలో ఎల్లిస్ స్కాలర్ (బి. ఏ లో ఇంగ్లీషునందు ప్రధములు). వారు శాసన ప్రకారం సివిల్

సర్వీసులో చేరి సింధుకు జ్యుడిషియల్ కమిషనర్ పదవిని అలంకరించారు. హైకోర్టు న్యాయమూర్తి పదవిని తిరస్కరించి వారు 1911లో పదవీ విరమణ చేశారు.

1877 నుండి 1911 వరకూ సింధులో విద్యాసంస్థలు, సంఘాలు, విద్యావ్యాప్తికి, సామాజిక సంస్కరణలు, సేవలు చెయ్యడానికి వారు స్వయంగా తెరిచారు, సహాయ పడ్డారు. ప్రత్యక్షంగా బయట పడితేనే గాని వీలుపడని సందర్భాలలో తప్ప, వారు చేసే మంచి కార్యాలన్నీ గుప్తంగానే చేసేవారు. మలాబరీతో కలసి బొంబాయిలో వారు సేవా సదన్ ప్రారంభించారు. ప్రత్యక్షంగా వారు రాజకీయాలలోను పత్రికా వ్యాసంగంలోను పాల్గొనకూడదు గాని పరోక్షంగా అనేక కార్య చరణ రంగాలలో వారు నిలిచి ఉండేవారు. న్యాయమూర్తిగా వారు పాండిత్యానికి, నిష్పక్ష పాతబుద్ధికి ప్రసిద్ధి కెక్కారు. అహ్మదాబాద్‌లో ఒక మసీదును దాని హక్కుదారులైన వారికి అప్పగించడంతో, ఆ మసీదుకు చెందిన ఇమామ్ వారికి ఒక ముస్లిము ఇవ్వగలిగిన అత్యుత్తమమైన స్తుతివాక్యాలు పలికారు. వారు 'వారి విద్య, ఇస్లాం చట్టాలలో వారికి ఉన్నవి జ్ఞానం వారి విజ్ఞత, నిష్పక్ష పాత బుద్ధి చూస్తూంటే అప్రవక్తయే స్వయంగా మా విషయంలో న్యాయ నిర్ణేతగా దిగి వచ్చారా అని మేము భావించేలాగున చేస్తున్నాయి' అన్నారు.

బ్రిటీష్ వారి పరిపాలనా కాలం అంతటిలోనూ, దయారాం గిడుమల్ బహుశ ; ఒక్కరే సింధులో వుండిన అత్యంత మేధా సంపన్నులు, అత్యధిక విద్యావంతులు అయిన నిస్వార్థ సంఘసేవకులు. ఇప్పటికీ సింధీ సాహిత్యంలో అనర్గళమైన వచన సాహిత్యాన్ని వ్రాసి తన ముద్ర వేసిన గొప్ప రచయిత వారే. సమీ శ్లోకాల సారాంశం (1885), మీర్జా కాలిక్ బేగ్ ఒమర్ ఖయ్యాం చతుష్పాద పద్యాలకు గావించిన సింధీ అనువాద గ్రంథానికి వారు వ్రాసిన ఉపోద్ఘాతం (1904), యీ రచనలలో దయారాం గిడుమల్ చూపిన పటిమను యీనాటికీ యెవ్వరూ దగ్గర చేర లేనంత అద్భుతంగా ఉంటాయి. వారి జప్ సాహెబ్‌కు అనువాదం లేదా వ్యాఖ్యానం (1894), భగవద్గీత సారాంశం (1893), పతంజలి యోగ దర్శనానికి సింధీ సేత (1903) సింధీ వచనములో ప్రామాణిక గ్రంథాలు. తరువాత వచ్చిన రచయిత లందరూ అతి సూక్ష్మమైన వేదాంత విషయాలపై గిడుమల్ రచనలనుండి, ఏదోకొంత విషయ సంగ్రహణ, పారిభాషిక పదజాలం, శక్తివంతమైన శైలి, తప్పకుండా గ్రహించిన వారే. సింధీ

పద్యవాఙ్మయం అన్న అధ్యాయంలో దయారాం గిడుమల్ అత్యుత్తమ కావ్యం 'మనసునకు దైవదండన లేక కొరడా దెబ్బ గురించి' చర్చించడం జరిగింది. ఏది వ్రాసినా, వారు భాషాపద జాలంలోగాని, శైలిలోగాని ప్రప్రథమ శ్రేణిలో వ్రాస్తారు - అని దయారాం గిడుమల్ గురించి చెప్పక తప్పదు. స్త్రీ విద్య, ఏడుగురు సఖుల సంభాషణ, కట్నముల సమస్య, ఇతర గృహ సమస్యలమీద వారు వెలువరచిన కర పత్రాలు జాగ్రత్తగా చదివితే ఎంతో లాభదాయకం. ఆ కరపత్రాలకు వారు పెట్టిన శీర్షికలే పాఠకుల దృష్టిని ఆకర్షించి వారి హృదయాలలో సంస్కరణ భావాలను రేకెత్తిస్తాయి.

సందర్భవశంగా మరొక విషయం చెప్పాలి. వారి ఆంగ్ల గ్రంథాలు హీరానంద్ (ఒక వినమ్రుడైన జీవి చరిత్ర), సంస్కర్త మలబారీల జీవిత చరిత్రలు, సిగ్మా అన్న కలం పేరుతో షా లతీఫ్ గురించి వారు వ్రాసిన ఆంగ్లవ్యాసం జీరో, బిజాల్ అన్న కలం పేర్లతో వారు వ్రాసిన ఆధ్యాత్మిక వ్యాసాలు (East and West లో), వాచ్‌నామాకు వారు వ్రాసిన ఉపోద్ఘాతం వీటి ద్వారా వారి తరం ఆంగ్ల రచయితలలో శ్రద్ధగాను, మన్ననతోను చదువదగిన వారు దయారాం గిడుమల్ ఒక్కరే.

1938లో ఎస్. ఎన్. షెర్ వానీ, దయారాం గిడుమల్ సంక్షిప్త జీవిత చరిత్ర వ్రాసి ప్రచురించారు.

సింధీ వచన వాఙ్మయానికి వెలసిన నాలుగు స్తంభాలలోను వయస్సులో అతి చిన్నవారు, ప్రభుత్వోద్యోగులలో రెండు మూడేండ్లు పనిచేసి తరువాత రాజీనామా చేసి ఉపాధ్యాయ వృత్తిని చేపట్టారు, వారే నవల్‌రాయ్. హీరానంద్ అకాడమిగా తరువాత ప్రసిద్ధికెక్కిన హైదరాబాదులోని యూనియన్ అకాడమీ వ్యవస్థాపకులలో ఒకరు.

చిన్నతనమునుండే వారు క్రైస్తవ మత ప్రచారకులు, క్రైస్తవ మతావలంబకుల ప్రభావానికి గురి అయ్యారు. జన్మతః సిక్కు హిందూ మతావలంబకులైనప్పటికి ఆ మత ఆచార్యులు కొందరి నడవడిక వారికి వెగటు కలిగించుటచేత క్రైస్తవ మతంలోకే కాథలిక్ పద్ధతికి చెందిన క్రైస్తవునిగా తనను ప్రకటించుకొని, చక్కని అధ్యాపకులు, మంచి క్రమ శిక్షణా పరుడు అని పేరు గడించినప్పటికీ, అకాడమీ నుంచి రాజీనామా చేసి వైదొలగారు.

సింధులో కేథలిక్ మత ప్రచారానికే వారి జీవితం అంకితం చేశారు. వారు బోట్ (లక్స్) అనే కేథలిక్ పక్షపత్రిక సంపాదక వర్గంలో చేరారు. ఆ పత్రిక ఆదర్శం 'ఏడ్ మెడోరం డెయ్ గ్లోరియం'

1896లో ప్రారంభింప బడింది. ఖేంచంద్ అంబిర్తరాయ్, బ్రహ్మ బాంధవ్ ఉపాధ్యాయ, ఆంగ్లంలో వ్రాసేవారు. పరమానంద మేవారాం, రేవాచంద్ (స్వామి అణిమానందగా తరువాత పిలువబడేవారు) సింధీలో వ్రాసేవారు. 1900 నుండీ లేక కొంచెం ముందునుండీ, పరమానంద్ మేవారాం సంపాదకులు అయి, ఆవిధంగా వారు మరణించేవరకూ అంటే సుమారు నాలుగు దశాబ్దాల పాటు కొనసాగారు.

'జోట్' పత్రిక మొదట ఒక పైసకు అమ్మేవారు, ఆరోజుల్లో దానికి విస్తృత ప్రచారం ఉండేది. రమా రమి ప్రతి సింధీ కుటుంబానికీ ఈ పత్రిక చేరేది. ఆనాటి సింధీయుల భావాలను శక్తివంతంగా తీర్చి దిద్దేది యీ పత్రిక. రాజకీయాలను ఈ పత్రిక పూర్తిగా విసర్జించింది. కేథలిక్ అంగంగానే దృఢంగా వ్యవహరిస్తూ, సాంఘిక సంస్కరణలపైన, ఋజు వర్తన, విద్యావిషయాలపైన విస్తృతంగా అభిమానం చూపే పత్రికగా నిల దొక్కుకొనుటలో సాఫల్యము పొందిన పత్రిక. పరమానంద్ మేవారాం 'కేథలిక్' హిందువుగానే ఉండిపోయారు. దానిలో ప్రచురింపబడే రచనలు తేట తెల్లంగా, శక్తివంతంగా ఉండి, చవకబారు భాష, దుర్భాషలు లేకుండా ఉండడం 'జోట్' పత్రిక ప్రత్యేకత. ఈ పత్రిక ధోరణి ఎల్లప్పుడూ అత్యున్నత భావాలలో గూడి, పెద్దవారు ఆత్రంగా చదువనుంకించే పత్రిక, దానితోపాటే స్త్రీలు, చిన్నవారు చదువుదగిన పరిపూర్ణమైన హాస్యరస భరితమైన రచనలతో వెలువడే ఏకైక పత్రికగా నిలచింది. పరమానంద్ మేవారాం సింధులో 'ఎడిసన్'గా ప్రసిద్ధి కెక్కారు. వారు నీతి విషయాలు, హాస్యం ఒకేవిధమైన, పరిశుద్ధమైన సింధీ శైలిలో మేళవించి వ్రాయగల ఏకైక సింధీ రచయిత అవడమే దీనికి కారణం.

ఈ పత్రిక అత్యున్నత పరిమాణాలకు తగిన విధంగా, పాఠకులకు బోధనాత్మకంగాను వినోదం కలిగించే విధంగాను వ్రాయగలిగిన ఇతర రచయితలను కూడా 'జోట్' పత్రిక ప్రోత్సహించేది. ఈ విధమైన ఇతర రచయితలలో యీ పత్రికలో వ్రాసి ప్రసిద్ధికెక్కిన వారు వ్యాసకర్త. నైతిక విషయాలపై వ్రాసే వారు వాధూమల్ గంగారాం.

1904లో పరమానంద్ మేవారాం జోట్ పత్రికలోని రచనలను సేకరించి 'దిల్ బహార్' (హృదయ వసంతం) అన్న శీర్షిక క్రింద నాలుగు సంపుటాలలో అచ్చువేశారు. జోట్ పత్రికలో ప్రచురింపబడిన అత్యుత్తమ రచనలు నాలుగు దశాబ్దాలలో వెలువడినవి సేకరింపబడిన 1925 లోను, 1936 లో గుల్ ఫూల్ అన్న శీర్షిక క్రింద రెండు సంపుటాలు వెలువడ్డాయి. అత్యుత్తమస్థాయి రచనలు సరళము, తేట తెల్లము, చమత్కారముతో ఉట్టిపడే సింధీ భాషలో చదువదలచిన వారు గుల్ ఫూల్ (పువ్వులు) చదవడం కంటె మరో మంచిపని చెయ్యలేరు.

సింధీ భాషకు, సింధీ సాహిత్యానికి పరమానంద్ మేవారాం చేసిన అత్యుత్తమమైన సేవ ఆరేండ్లు పట్టు విడువకుండా శ్రమించి, యీ నాటికీ సింధీయులకు ప్రామాణికంగా నిలచిన సింధీ - ఆంగ్ల నిఘంటువు 1910లో సమకూర్చడం. పొలాలలోనికి వెళ్ళి, సరస్సులు, మారుమూల ప్రాంతాలలో నున్న గ్రామాలు వెళ్ళి, అక్కడ వివిధ వృత్తుల వారితో స్వయంగా మాట్లాడి, హైదరాబాద్‌లోని ఆసుపత్రికి వెళ్ళి అక్కడ గుమిగూడి ఉన్న రోగులతో మాట్లాడి ఇదివరకు సింధీ నిఘంటువులలోనికి ఎక్కని అనేక పదాలను వారు సేకరించారు. అనారోగ్యంగా ఉన్న ఒక జాలరి మన్‌చార్ సరస్సు దగ్గర; వారికి, విద్యావంతులైన సింధీయులకు కూడ తెలియని పక్షుల పేర్లు, చేపల పేర్లు ఇచ్చాడట. వారు ఆంగ్ల – సింధీ నిఘంటువుపై సుమారు ముప్ఫై సంవత్సరాల కాలం పరిశ్రమ చేశారు. అది 1933 లో వెలుగు చూసింది. ఈ నిఘంటువులు పునః పరిశీలించి ముద్రించవలసిన అవసరం ఎంతైనా ఉన్నప్పటికీ, పరమానంద్ మేవారాం పరిశ్రమకు, వారి అపార జ్ఞానానికి జ్ఞాపక చిహ్నాలు అవి.

పరమానంద్ సింద్‌బాద్, హీరోగులూ (సుబోధకమైన కథ) లేడీ అఫ్‌లోర్డ్స్ వంటి గ్రంథాలు వ్రాశారు కాని వారి వచన గ్రంథం 'ఇమిటేషన్ ఆఫ్ క్రైస్ట్' థామస్-ఎ-కెంపస్ రచనకు సింధీ అనువాదం 1923లో వారు చేసినది. ఒక్క దయారాం గిడుమల్ తప్ప పరమానంద్ మేవారాంవలె యీ అనువాద గ్రంథంలో వ్రాసినంత సరళమైన, వైభవోపేతమైన వచనం ఏ సింధీ రచయిత వ్రాయలేదు. ఈ గ్రంథాన్ని అత్యుత్తమమైన ఆరు గ్రంథాలలో ఒకటిగా సింధీయులు భద్రపరచుకుంటారు.

**సింధీ వచనం, నాటకం 1907 నుండి 1947 వరకు :**

1907-1947 మధ్య సింధీ వచన, నాటక రంగాలలో గొప్ప సంచలనం, చురుకుగా రచనా వ్యాసంగం జరిగిన కాలం. వందలాది

సింధీ భాషలో మూలరచనలు చేసిన రచయితలు, అనువాదకులు ఉన్నారు. వారి పేర్లు వారు వ్రాసిన గ్రంథాలు అన్నీ క్రోడీకరించి ఇవ్వాలంటే ఒక పుస్తకం చాలదు. వారిలో ప్రముఖులైన రచయితలు, వారి ప్రముఖ గ్రంథాలను మాత్రమే ఇక్కడ గుర్తించడం జరిగింది.

1907 ప్రాంతంలో సింధు సహితం భారతదేశమంతా ఒక క్రొత్త జీవన విధానంలో అడుగు పెట్టింది. బెంగాల్ లార్డ్ కర్జన్ విభజించ డంతో దేశం మొత్తం గొప్పసంచలనానికి గురియై, రాజకీయంగా ప్రజలు జాగృతు లయ్యారు మోర్లే మింటో సంస్కరణలు దీనిని ఇనుమడింప చేశాయి. స్వామి వివేకానంద, స్వామి రామతీర్థ, అరొబిందో ఘోష్, మొదలైన వారు హిందూమతాన్ని పునరుద్ధరించాలనీ, నూతన చైతన్యం కలుగజేయడానికి పాటుపడ్డారు. ముస్లిములు తమకు ప్రత్యేక నియోజక వర్గాలు కావాలన్న వాదాన్ని పట్టుకొని, వేర్పాటు ధోరణులతోనే ఉంటూ చివరికి దేశ విభజనకు దారి తీశారు. సింధీ రచయితలు ఈ కాలంలో విద్యాశాఖ వైపుగాని, పాతకాలపు ప్రేమగాధల వంకగాని తమ రచనా స్ఫూర్తికి, ఆదర్శానికి చూడడం మానుకున్నారు.

పాఠకుల అభిరుచులు కూడా మారిపోయాయి. పాఠకలోకం రాజ కీయరంగంలో 'స్వదేశీయత' కోసం సాహిత్యంలో కూడా స్వదేశీయత, ఆ పైన విజ్ఞాన శాస్త్ర సంబంధిత విషయాలు కావాలని కోరుతూ ఉండే వారు. సింధీ అనువాదాల ద్వారా సింధీయులకు ప్రియమైన హిందీ, ఉర్దూ రచయితలు, భారత నారీమణుల విశిష్ఠత, రాజపుత్రుల ధైర్య సాహసాలు, మన శ్రుతిస్మృతుల గొప్పతనం గురించి హిందీ, ఉర్దూలలో వ్రాసిన శివ బరత్ లాల్, పాతకాలపు మంత్రగాళ్లను, రాక్షసులను వదలి సింధీ పాఠకులను అయ్యర్‌ల (వంచకులు, నకిలీ మనుషులు) వైపునకు, చంద్రకాంత నవల ద్వారా దేవకీ నందన్ ఖత్రి పాఠకుల ఉత్సుకతను మరలించారు. ఈ అయ్యర్‌లు తమ రూపాలను క్షణంలో ఇచ్ఛాను సారం మార్చుకోగలరు. మందుల సహాయంతో ఎవరినైనా తెలివి తప్పించగలరు. లఖ్ లఖో సహాయంతో తిరిగి వారికి తెలివి తెప్పించ గలరు వారి మొల పట్టీలలో భయంకరమైన యంత్ర సాధనాలు, భూగర్భ నిక్షేపాలను ఛేదించే వస్తు సామగ్రి అంతా ఉంటుంది ప్రజలందరినీ ఉత్తేజపరచిన 'వందేమాతరం' నినాదాన్ని అందించిన ఆనంద్ మఠ్ రచయిత బంకించంద్ర ఛటర్జీ సింధీయుల దృష్టిని ఆకర్షించిన బంగాలీ రచయిత. మరికొద్ది సంవత్సరాలకే, అంటే 1913లో నోబెల్ బహుమతిని

అందుకున్న తరువాత రవీంద్రుని సాహిత్యంపై అభిరుచి పెరిగింది. ఈ శతాబ్దపు మూడవ, నాల్గవ దశాబ్దాలలో ప్రేమ్ చంద్, శరత్ చంద్ర బాలా ప్రచారంలోకి వచ్చారు.

శివ భారత్ లాల్ రచనలు, మాస్టర్ హరిసింగ్ 'సత్యవతి' వంటి పత్రికలలోను, చిన్న చిన్న పుస్తకాలుగాను వెలువడేవి కాని వీటిలో ఏవీ సింధీ వచన సాహిత్యంగా మెప్పు పొందదగినవి కావు. ముఖి సిరుమల్ 1908 తరువాతి సంవత్సరాలలో ప్రచురించిన చంద్రకాంత, భూత్‌నాథ్ వంటి అనువాదాలు కూడా సాహిత్యపరంగా ఎన్నదగినవి కాకపోయినా, ఇదివరకు అసలే తెలియని, తక్కువ ప్రచారంలో ఉన్నవి, సింధీ మాటలు, మాటల కూర్పు యీ నవలల ద్వారా వాడుకలో బాగా అలవాటులోనికి వచ్చి సింధీ పదజాలం అభివృద్ధి చెందింది. 1914 నాటికి అంటే రెండవ ప్రపంచ సంగ్రామం నాటికి అయ్యర్‌లు, రహస్య సంఘాలు, విజ్ఞాన పరికరాలు, పేటికలో అస్థిపంజరాలు, పాఠకలోకానికి కుప్పలు తిప్పలుగా చేరి వారు నూతన కాల్పనిక సాహిత్యాన్ని అందుకోడానికి సిద్ధంగా ఉన్నారు.

బంగాలీ అనువాదాలైన బంకించందర్, గోర్ధన్ శర్మ అనువదించిన 'స్వదేశీ' పై లోకమాన్య తిలక్ చేసిన రచన (ఈ రచన చేసినందుకే వారికి మరియిద్దరికీ 1908లో కారాగారశిక్ష విధించారు) అలాంటి పుస్తకాల కోసం మరింత ఎదురు చూసే లాగున వారి ఆసక్తిని ఇనుమడింప జేశాయి. కాని స్వయంగా తాను ఒక గొప్పరచయిత అయిన కౌరుమల్ చందన్ మల్ అనువదించిన బంకించంద్ర రచనల గొప్పదనం అనువాదంలో అంతగా ప్రకాశించ లేదు. ఆనంద మఠం, కృష్ణకాంతుని మరణ శాసనం వంటి రచనలు అనువదించడానికి సరియైన అనువాదకులను వెదుకవలసి ఉన్నది.

సింధీ జీవన ప్రవాహానికి దూరంగా బయట ఉంటూన్న పాతకాలపు ప్రధాన రచయితలు ఇద్దరు సింధీ వచన రచయితలు హకీం ఫత్‌హ మహమ్మద్ సేవ్ హానీ, నిర్మల్ దాస్ ఫతేచంద్. హకీం ఫతే మహమ్మద్ సేవ్ హానీ మీర్‌ల పరిపాలన కాలాన్ని అద్భుతంగా స్తుతిస్తూ వ్రాసిన దానికి పరమానంద్ మేవారాం నుండి ప్రధానంగా "మీర్‌లు మళ్లీ ప్రభుత్వాధికారంలోకి రావాలని కోరుకుంటున్నారా?" అన్న ప్రశ్న వచ్చింది. హకీం ఫతే మహమ్మద్ 1914లో ప్రవక్త జీవితాన్ని వ్రాశారు. అది ఇప్పటికీ వారి జీవితం గురించి, వారి బోధనలను గురించి సింధీలో

ప్రామాణిక గ్రంథం. వారు కొన్ని కథల పుస్తకాలు, సాహిత్య విమర్శనా గ్రంథాలు వ్రాశారు. కాని సింధీలో వారి ప్రథమశ్రేణి రచయితల కోవకు చేర్చిన సుప్రసిద్ధ రచన అక్బరు దర్బారులో అతినైపుణ్యవంతులైన ఇద్దరు మంత్రులు, సోదరులు ఫైజీ, అబులల్ ఫజీ-వీరి జీవిత చరిత్ర ఆ సోదరు లిరువురు హకీం ఫతే మహమ్మద్ స్వస్థలమైన సేహ్ వాన్‌కు చెందినవారు. అందుకే వారి జీవిత విశేషాలను సేకరించి వారి జీవిత చరిత్ర సింధీ వచనంలో వ్రాయడం ఎంతో గర్వకారణంగా భావించారు. వారి రచన పర్షియన్ సువాసనా భరితమై ఘనత కెక్కి దివ్యంగా సాగి పోతుంది. ఫైజీను రాజదూతగా వర్ణించడం, వారి సోదరుని మరణం, అక్బరుపై దాని ప్రభావం యీ రచనాంశాలు వజ్రాలలాంటి ఉదాహరణలు. పర్షియన్ - అరబిక్ పాండిత్యంలోని సమ్మేళనం, దానికి తోడుగా జీవిత విధానంపై ఆధునిక దృష్టి కోణం వీటి సమన్వయం సింధీ వచనం చదివే విద్యార్థి విడిచి పెట్టరానిది. ఒక నిజమైన సూఫీ, హిందూ ముస్లిం సఖ్యతను ప్రేమించే ఒక రచయిత వ్రాసిన గ్రంథం కావడం యీ జీవిత చరిత్రలోని ప్రత్యేకత. 'పాలు చక్కెర' వలె కలసి మెలసి, తమ విభేదాలను చక్కదిద్దుకొని హిందూ ముస్లిములు కలసి ఉంటారన్న ఆశా భావంతో యీ గ్రంథం ముగిస్తారు. సింధీ వచన సాహిత్యంలో ప్రముఖమైన ఈ రచన 1936లో ప్రచురింపబడింది.

నిర్మల్‌దాస్ ఫతే చంద్ కూడా సూఫీయే; పర్షియన్ అరబిక్ అభిమాని. నిర్మల్‌దాస్ మహమ్మద్ ప్రవక్తకు, అతని అల్లుడైన అలీకి ఈ హిందూ సూఫీ అంత గొప్పగా నివాళు లర్పించిన ముస్లిము రచయిత లేడు. పవక్త తరువాత వారసుడైన అలీను 'జగద్గురువు' అంటారు నిర్మల్‌దాస్. అట్లే పర్షియన్ అరబిక్ మాటలను వీరు వాడినంత ధారాళంగా, చాకచక్యంగా వాడిన హిందూ రచయితలు లేరు. హిందీ, సంస్కృత భాషల లోనూ వీరు పండితులై, సింధు రాష్ట్రంలో శ్రేష్ఠమైన బహు భాషాజ్ఞాని కావడంచేత ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో వారిని 'సెన్సార్' పనికై ప్రభుత్వం ఎంపిక చేసింది. ఫిరదౌసీ షానామా'లోని భాగాలను అనువదించి వారి పత్రిక 'ఐనా'లో ప్రచురించారు. ఇరవైయవ శతాబ్దం తొలిదశాబ్దంలో కొద్దిమంది ఎన్నిక గన్నవారు మాత్రం ఆ పత్రికను చదివేవారు. అయితే నిర్మల్‌దాస్ వచనం చదవాలంటే పాఠకులు నిఘంటువును ప్రక్కన ఉంచుకోవాలి. డి. జె. సింధ్ విద్యాలయ సంచిక వంటి పత్రికలో వారు పద్యాలను ప్రచురించేవారు. కనీసం రెండు రచనలు వారు వదిలి వెళ్లిన వాటివలన సింధీ వచన రచయితలలో ప్రధానమైన రచయితగా వారి కీర్తి నిలదొక్కు

కుంటుంది. మొదటిది 1914 ప్రాంతాలలోనే సింధీ సాహితీ సమాజం వారికి వ్రాసిన కథ 'సరోజిని'. వారి మరణానంతరం 1944లో అచ్చయిన దాలురాయ్-జి-నగరీ, రెండవది. దాలురాయ్-జి-నగరీ అంతా కలిపి 84 పుటల చిన్న పుస్తకం, చివర మూడు పుటలలో ఇతరుల వాక్యాలు, ఉదహరించినవి, పదిహేను పుటల పదాల పట్టిక వుంటుంది. సింధులోని హిందూ క్షత్రియలు, క్షీణస్థితికి దిగజారి పోవటం, వారి రాజు దాలురాయ్ సోదరుడు సస్సోర్రాయ్, ప్రతి పెండ్లి అయిన వధువు భర్తను చేరుటకు ముందు అతనితో ఒకరాత్రి గడప వలెననే దాలురాయ్ క్రూర శాసనం ఇవన్నీ ఈ కథలో చెప్పబడ్డాయి. ఈ దుర్నడతలవల్ల దేవుని ఆగ్రహానికి గురియై, దాలురాయ్ నగరమంతా దగ్ధమై పోతుంది. చాల వరకు యీ కథ లేదా నవలలో వర్ణించిన సంఘటనలు ప్రాచీన గాథలలోనివే, కాని కొన్ని మాత్రం రచయిత కల్పించినవే. వర్ణనలు స్పష్టంగాను, అమోఘంగాను ఉంటాయి. కొన్ని మాటల అర్థాల కోసం పుస్తకం చివర ఇచ్చిన పదముల పట్టికను పాఠకులు చూడవలసి వస్తుంది. ముస్లిములు సింధును ఆక్రమించిన తొలిరోజులలో సింధులోని పాలక వర్గ హిందువులు ఎంత హీనస్థితికి దిగజారి పోయారో వాస్తవంగా చిత్రించిన ఒకే ఒక పుస్తకం దాలురాయ్ - జి - నగరీ. ఆ విధంగా అది ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది. నిర్మల్ దాస్ వచనం చదువుతుంటే లాటిన్ భాషా భరితమైన ఆంగ్లవచనం పాఠకులకు జ్ఞప్తికి వస్తుంది.

హకీంఫతే మహ్మద్, నిర్మల్ దాస్ ఫతే చంద్‌లు కాక, పాత సంప్రదాయానికి చెందిన మరి యిద్దరు కవులు ; వారిని పర్షియన్ సాంప్రదాయానికి చెందినవారు అనలేముగాని, వారి వచనం ఎంచదగిన సాహిత్యం. వారిరువురు విద్యావేత్తలే. బూల్ చంద్ దయారాం (మరణం 1923), లీలారాం ప్రేమ్‌చంద్ వీరిరువురు విద్యాశాఖవారు నడిపే అంతశ్శాఖ పత్రికను, మరికొన్ని పత్రికలను వారి రచనలతో సుసంపన్నం చేశారు. బూల్ చంద్ తాజ్ మహల్ వర్ణన, నూర్జహాన్ కథ (1914) వారి పాండిత్యాన్ని సంస్కారాన్ని తెలియ జేస్తాయి. లీలారాం రచనలు నిజమైన సూఫీ భావాలతో ఉట్టి పడుతూ ఉంటాయి. సింధీ వచనం మొలకెత్తుతున్న దశలో లీలారాం ప్రేంచంద్, దయారాం వాసన్ మల్ సహాయంతో మొట్టమొదటి సింధీ వచన సంకలనం 'గుల్దస్తా' (1917) లో తెచ్చారు.

**వచన రచనలో నలుగురు సిద్ధ హస్తులు :**

1857-1907 మధ్యకాలంలో సింధి వచన సౌధానికి నాలుగు స్తంభాలవంటి వారు వెలసినట్లే, తరువాతి కాలంలో కుడా సింధీ వచన వాఙ్మయ వికాసానికి నలుగురు సిద్ధహస్తులు కృషి చేశారు. వారిని రెండు జతలుగా విడదీయవచ్చు. ఈ రెండు జతలవారు ఒకేవిధమైన సంబంధ బాంధవ్యాలు కలవారు. ఒకరి కుమార్తెను మరొకరి కుమారుడు వివాహ మాడాడు. కొద్ది సంవత్సరాల వ్యవధిలోనే యీ నలుగురూ మరణించారు.

హెచ్. ఎం. గురుబక్షానీ కుమార్తెను భేరుమల్ మహిర్ చంద్ కుమారుడు వివాహ మాడాడు. బెర్మల్ పర్స్రాం కుమారుడు, లాల్ చంద్ అమర్ దినో మల్ కుమార్తెను వివాహ మాడాడు. గురుబక్షానీ 1947లోను, జేర్మల్ పర్స్రాం 1948లోను, భేరుమల్ మహిర్ చంద్ 1950లోను, లాల్‌చంద్ అమర్ దినోమల్ 1954లోను మరణించారు. ఈ నలుగురూ సింధీ సాహిత్యంపై చెరగని ముద్రవేశారు.

ఈ నలుగురిలో ప్రముఖులు గురుబక్షానీ. వారు 1915లో సర్దార్ జోగేందర్ సింగ్ ఆంగ్లంలో వ్రాసిన నూర్జహాన్ అన్న నవలను అదే పేరుతో సింధీ అనువాదం వెలువరించడం ద్వారా, సింధీ సాహిత్యరంగంలో అడుగుపెట్టారు. సిక్కు రచయిత మూలంలో లేని అలంకార యుక్తమైన అంశాలు మేలి భాగాలు అనువాదంలో ఉన్నాయి. సింధీ వచన వాఙ్మయంలో అత్యుత్యమమైన అంశాలుగా ఎన్నబడే వాటిలో గురు బక్షానీ జహంగీర్ పట్టాభిషేకవర్ణన, జహంగీర్ న్యాయ విచారణ, తప్పకుండా కనబడి తీరుతాయి. అక్బర్ మరణం పట్ల శోకం, వంటి అంచాలు మూల ఆంగ్ల గ్రంధంనించి గ్రహించినవే. ఈ కాలంలో గురుబక్షానీ శైలి తీర్చి దిద్దినట్లు అలంకృతమై ఉండేది, కాని పాఠకులు చాలా ఆనందించేవారు. ఎనిమిదేళ్ల తరువాత 1923లో ఢంకా కొట్టినట్లు సింధీ సాహిత్యాకాశంలో మిలమిల మెరుస్తూ షా రిసాలో మొదటి భాగం ఘనంగా వెలువరించారు. ఇందులో వారు వ్రాసిన ఉపోద్ఘాతం చివర, పదముల పట్టిక మున్నెన్నడూ సింధీ సాహిత్యంలో చూడనిదిగా యూరోపియన్ ప్రామాణిక పురాతన గ్రంధాలలో మాత్రమే కన్పట్టు రీతిగా ఉంది. మొత్తానికి, 1923లో వెలువడిన యీ బృహత్ గ్రంధం, యీ శతాబ్దంలో సింధీ వాఙ్మయంలో జరిగిన గొప్ప సంఘటన. ఈ రచయిత స్మృతి పథంలో చిరస్థాయిగా నిలచిఉండే మధుర క్షణాలు - వారు యీ బృహత్ గ్రంధం పై రెండు విమర్శలు వ్రాయమనగా, ఒకటి డి. జె. సింద్ విద్యాలయ సంచికలోను

మరొకటి సింధీ దిన పత్రికలోను ప్రచురించారు. అయితే యీ మహాత్కార్యాన్ని గురించి తేలికగా మాట్లాడేవారు ఉన్నారు. షా ఇతర ముద్రణలలోని అసలు రచనలు, వారి పేరు మీద చలామణి అవుతున్న కృత్రిమ రచనలను కొన్నిటిని మాత్రమే పట్టుకొని ప్రాకులాడుతూ ఉండిన వారు, షా సూఫీ విధానం. వారు పట్టుకు ప్రాకులాడే ఇస్లాం పరమైన సూఫీ సిద్ధాంతమేనని వాదించేవారు, షా పద్యాలను వారికి తోచినట్లు చదివేవారు, ఈ కువిమర్శలు చేసేవారిలో ఎక్కువమంది ఉన్నారు. మిర్జా కాలిక్ బేగ్ 1885లో వెలువరచిన పూర్వపు ముద్రణలలోని షా వి కానివీ, వారి పేరుమీద చలామణి అవుతున్నవీ ఇతర విషయాలు నిష్కర్షగా తొలగించి గురుబక్సానీ యీ ప్రచురణ తయారు చెయ్యడమే వీరి కినుకకు మరొక కారణం. తారాచంద్ క్షాకీరాం (1900) వృత్తి రీత్యా సూఫీ భావించే విధంగాకాక, షా పద్యాలకు అర్థాలు, వ్యాఖ్యానాలు ఒక పండితుడిగా చేశారు. మూలంలోని (లార్), షా పంక్తులలోని ఉచ్చారణను పునరుద్ధరించారు. క్రమంగా దోషా రోపణల వెల్లువ అణిగి పోయింది. పాఠకులు గురుబక్సానీ గారి చక్కని వచనం అత్యుత్తమమైన ఘట్టం మరూయి సౌశీల్య వర్ణనకు సంబంధించినది ; 'మరూయి సాధారణమైన వినయ శీలియైన గ్రామీణ వనిత. ఉమర్ రాజ సౌధంలోని భోగ భాగ్యాలకంటే ఆమెకు తన గ్రామంలోని గంజినీళ్లేమిన్న-' వంటివి ఎంతో ఆనందంతో చదువుకుంటూ ఉండేవారు. సంపూర్ణ జ్ఞానంతో కృత్రిమతలేని వచనం, అంతకు పూర్వం అటువంటి వచనం వ్రాసిన కవిలేరు. చాలాకాలం తరువాత, గురు బక్సానీ మరణానంతరం వారు గురుబక్సానీకి సహాయకుడు మాత్రమే కాదనీ (ఈ విషయం గురు బక్సానియే కృతజ్ఞతా పూర్వకంగా అంగీకరించారు) తానే వ్యాఖ్యానం, ఉపోద్ఘాతం వ్రాసియుంటిననీ దౌడ్‌పోతా ప్రకటించినప్పుడు, వారు స్వయంగా వ్రాసినవే అని చెప్పుకొను రచనలలో ఇట్టి అద్భుతమైన శైలితో వ్రాసిన భాగాలు ఎక్కడా కనుపింపవేమని, వారి వాదన అసత్యమని నిరూపించడం జరిగింది. మూడవ సంపుటం గురుబక్సానీ 1930లో వెలువరించారు గాని దురదృష్టవశాత్తు నాల్గవది, చివరది అయిన సంపుటి వెలికిరాలేదు. గురుబక్సానీ విడిచిపెట్టిన సుర్ షాహ్ హసీ, కల్యాణ్ అద్వానీల సంపుటిలో చేర్చబడింది గాని వారి రచన వేరు. బహుశః తనపై వస్తూన్న విమర్శలను ఎదురించుటకేనేమో గురుబక్సానీ 1934లో లావరీ - జా - లాల్ (రావరీలోని గొప్ప వ్యక్తులు) వ్రాశారు కాని దేశంలో ఎవరూ దీనిని మెచ్చలేదు. షా - జొ - రిసాలో, అందులోని ఉపోద్ఘాతం, దీనినే తిరిగి ప్రత్యేకంగా పుస్తకరూపంలో ప్రచురించటం జరిగింది. ఇవి

వాలు గురుబక్సానీ సింధీ సాహిత్యంలో చిరస్థాయిగా నిలచి ఉండడానికి. విశ్వవిద్యాలయ ప్రణాళికలో సింధీని విద్యాలయ బోధనాంశంగా చేర్చడానికి గురుబక్సానీ 1921 లో బొంబాయి విశ్వవిద్యాలయానికి సమర్పించిన నివేదికయే ప్రధాన కారణం. అందుచేత సింధీ విద్యార్థిలోకం వారికి ఎల్లప్పుడూ కృతజ్ఞతాబద్ధమై ఉంటుంది.

గురుబక్సానీ కంటె పూర్వపు వారు, అధ్యాపకులు, డి. జె. సింధ్ కళాశాల మొదటి ప్రధానోపాధ్యాయులు సాహిబ్ సింగ్‌షాహ్నీ పేరు గుర్తుకు వస్తుంది. వారు చక్కని వ్యాసాలు, సింధులోని వివిధ రకాలైన పక్షికల గురించి, బాందూల్ (తీతువుపిట్ట) గురించి, మూర్ఖుడైన మేజిస్ట్రేట్ గురించి డి. జె. సింధ్ కళాశాల పత్రికలో వ్రాశారు. 1927 లో పదవీ విరమణ గావించిన తదుపరి వారు హార్డీ నవలలు మేయర్ ఆఫ్ కేష్టర్‌బ్రిడ్జ్, టూ ఆన్ ఎ టవర్ లను అనుసరించి బిలుఖోకర్ తరన్‌బో అభియాన్ (నక్షత్రముల అధ్యయనం) అన్న పేర్లతో రెండు, పుస్తకాలను వ్రాశారు. ఇతర సింధీ నవలలలో దుర్లభమైన పాత ప్రపంచపు వాసనలు, గ్రామీణ వాతావరణపు పరిమళాలు ఈ నవలలో గుబాళిస్తూ ఉంటాయి.

నలుగురిలోను రెండవ వారైన భేరుమల్ మహీర్‌చంద్ వచన, పద్య రచనలు రెండిటిలోను ప్రజ్ఞను చూపించారు. వారు డి. జె. సింధ్ కళాశాల పత్రికలో సాంప్రదాయిక శైలిలో చక్కని పద్యాలు వ్రాసినప్పటికీ, తాను వచన సాహిత్యంలో వన్నెకెక్కుదుననీ పద్యకవిత్వంలో కాదనీ ముందుగానే గ్రహించారు. వారు మొట్టమొదటి సింధీ పద్య సంకలిత గ్రంథాన్ని 'జోహార్‌నజ్మ్' అన్న శీర్షిక క్రింద మీర్జాకాలిక్ బేగ్ ఉపోద్ఘాతంతో వెలువరించారు. వారి వచన సంకలిత గ్రంథం 1929లో గుల్జార్-ఇ-నస్ర్ (వచన ఉద్యానవనం) యీ ప్రస్తుత గ్రంథకర్త ఉపోద్ఘాతంతో వెలువడింది. భేరుమల్ మహీర్‌చంద్ కాల్పనిక సాహిత్యంలోనూ చెయ్యి పెట్టారు. (ఆనందసుంద్రిక 1910) కాని నాయక పురాతనకాలపు ఉపన్యాస ధోరణిలో ఆదర్శపత్ని విధులను గురించి చెప్పడం తప్ప నవల అని చెప్పబడే ఆ పుస్తకంలో చెప్పుకోతగ్గ దేమీలేదు. అయినప్పటికీ, వారు హీరానంద్ ఖాకీరాం అనువాదం చేస్తూ వదలిన స్కాట్ టేలీస్‌మన్‌ను పూర్తిచేశారు. వారిదే హీరాయ్ జాన్‌కన్ యూన్ (వజ్రాలమూట) సేకరించారు. భేరుమల్ అనువదించిన అంకుల్‌టామ్స్‌కేబిన్ (దొలన్ - జి - సూందర్ 1928) ను పాఠకులు ఆత్రంగా చదువుతారు. నాటకరంగంలో సైతం వారు ప్రయత్నాలు చేశారు. కాని అవి ఫలించలేదు. బిట్టలచిల్లరవ్యాపారి మొదలైన సామాజిక సమస్యలపై వారు వ్రాసిన చిన్న

నాటకాలు పాత్రికేయుని ప్రాథమిక రచనలలాగున సంభాషణల రూపంలో మలచబడ్డాయి వారి బృహత్తర ప్రయత్నం షేక్స్పియర్ నాటకం కింగ్ జాన్ సింధీ అనువాదం, ప్రదర్శింపబడనే లేదు.

సింధీ సాహిత్యంలో, పర్యాటనలను గురించి, సామాజిక సమస్యలు, సింధీ భాషవంటి విషయాలపై వ్యాస రచయితగా భేరుమల్ సాహిత్యంలో ప్రత్యేక స్థానాన్ని అలంకరిస్తారు. వారి శైలిలో ఎక్కడా చమత్కృతులు ఉండవు అలంకారాలతో కూడిన భాగాలేవీ కనబడవు. ఎత్తు పల్లాలు లేకుండా, సుస్పష్టంగా, హుందాగా, అలంకృతపదజాలం లేకపోవడం చేత అనుకరించడానికి అతికష్టమై ఉంటుంది వారి శైలి. అల్లాహ్‌బచాయో వ్రాసిన సైర్. ఇ. కొహిస్తాన్ మినహాయిస్తే పర్యటనలు, యాత్రలు గురించి వ్రాసిన రచయితగా భేరుమల్ 1923లో వ్రాసిన సింధ్ - జో - సైలానీ (సింధుయాత్ర) 1926లో వ్రాసిన లతీఫీసైర్ (షా అబ్దుల్ లతీఫ్ యాత్రలు) సింధీ వచన వాఙ్మయంలోని యాత్రా గ్రంథాలలో అత్యుత్తమ గ్రంథాలు. షాను అధ్యయనం చేసే ఏ విద్యార్థీ లతీఫీసైర్ చూడకుండా గడవదు. అసంఖ్యాకాలైన వారి వ్యాసాలలో అంఖ్ (కన్ను) గురించి, ప్రేమ్ (ప్రేమ)ను గురించి, భేరుమల్ వ్రాసిన వ్యాసాలు అద్భుతమైనవిగా ఎంచవచ్చు. సింధీ సాహిత్ మండలి కొరకు వారు వ్రాసిన ఘరూ కిఫాయత్ (ఇంట్లో పొదుపు) వారు వ్రాసిన పుస్తకాలలో అత్యుత్తమమైనది అనవచ్చు. భేరుమల్ (1919) ఎంతో కష్టపడి పరిశోధన గావించి సింధీ హిందువుల ఆచార వ్యవహారాలు, కుటుంబ పుట్టుపూర్వోత్తరాలు సేకరించి దేశ విభజన జరిగేముందు అవి రెండు సంపుటాలుగా విడుదల చేశారు. 1925లో సింధీ భాషా సంకలనంతో ప్రారంభించి, సింధీ భాషా సాహిత్య చరిత్రను 1941 నాటికి పూర్తిచేయగలిగారు. అది పాకిస్తాన్, భారతదేశాలు రెండిటిలోను ప్రామాణిక గ్రంథంగా ఎంచబడింది.

భేరుమల్ కుమారుడు ప్రిభ్‌దాస్ (హర్ నాం సింగ్) కొన్ని మత సంబంధమైన ఉపన్యాసాలు, చిన్న చిన్న పుస్తకాలు వ్రాశారు గాని అవి ఎప్పుడో మరుగున పడిపోయాయి. వారు సింధీ వచన సాహిత్యంలో అత్యుత్తమ గ్రంథాన్ని బనియన్స్ 'పిలిగ్రిమ్స్ ప్రోగ్రెస్' అనువాదం. సలీక్-జో - సఫర్ (1943) పేరున అందించారు. అనువాదం మక్కికి మక్కీ కాదు. షా, సమీ, సచల్ ఇంకా ఇతరుల నుండీ విస్తృతంగా ఉదాహరణలు ఇవ్వబడ్డాయి. అయినా ఆ వచనం దోష రహితమై ప్రకాశవంతమైన

ప్రవాహం లాగా సరళంగా సాగిపోతుంది. దాన్ని హిందువులు, ముసల్మానులు కూడా చదివి ఆనందించగలరు. అనువాదంలాగా కనబడదు. పరమానంద్ మేవారాం ఇమిటేషన్ ఆఫ్ క్రైస్ట్‌తో పాటు ఈ రెండు గ్రంథాలు ఆ కాలంలో రెండు విశిష్టమైన భక్తి గ్రంథాలు. అనువాద గ్రంథాలే అయినప్పటికీ మూలగ్రంథాలవలె సింధీ వచన సాహిత్యానికి ఆదర్శ గ్రంథాలుగా నిలిచి ఉన్నాయి.

మూడవ వారైన జెఠ్‌మల్ పర్సారాం 1885లో జన్మించారు. 1902 నుండి 1911 వరకూ వారు ఉపాధ్యాయులుగా పనిచేశారు. బడి పిల్లలకు మశూచి నివారణకు బలవంతంగా టీకాలువేసే పద్ధతికి నిరసనగా వారు ఉద్యోగానికి రాజీనామా యిచ్చారు. చనిపోయే వరకూ ఒక ఆందోళనకారునిగానే గడిపారు. సింధులో వారొక గొప్పవక్తగాను, ప్రచారకునిగాను, కార్యకర్తగాను ప్రసిద్ధికెక్కారు. దివ్యజ్ఞాన సమాజమన్నా, అనిబిసెంట్ అన్నా భక్తి ఎక్కువ. వారు సింధులో మొట్టమొదటి సామ్యవాది. రౌలత్ చట్టం కారణంగా జరిగిన హింసాకాండపై బ్రిటిషు వారిని నిందిస్తూ వారు వ్రాసిన ఒక వ్యాసం కారణంగా కారాగార శిక్ష అనుభవించారు. కాని వారు ఖిలాఫత్ సహాయ నిరాకరణోద్యమంలో గాంధీని అనుసరించలేదు. జెఠ్‌మల్ పర్సారాం ఎప్పుడు ఏకాకిగానే పోరాడారు. వారి ఆదర్శాలు, నమ్మకాలు స్వతంత్రమైనవే. ఎప్పుడూ పీడితుల పక్షానే నిలచేవారు. వారు అనేక పత్రికలను స్థాపించారు. ది న్యూసింధీ లైబ్రరీ ఆఫ్ పబ్లికేషన్స్ స్థాపించారు. సింధీ సాహిత్య పరిషత్ స్థాపనకు తోడ్పడ్డారు. నిజమైన సూఫీ ఎవరైనా ఉంటే అది జెఠ్‌మల్ పర్సారాం. వారికి షేక్స్‌పియర్ సానెట్‌లలోనూ సూఫీతత్వమే గోచరిస్తుంది. షా సచల్‌లను ప్రచారంలోనికి తేవడానికీ, సామాన్య ప్రజానీకానికి వారి గురించి చెప్పడానికీ ఏ సింధీ రచయిత చేయనంత సేవ చేశారు. 1931లో షికార్‌పుర్‌లో జరిగిన మొట్టమొదటి సింధీ సాహిత్య సభలకు వారిని అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. 1933 నుండి 1940 వరకూ వారు హైదరాబాద్ సింద్ జాతీయ కళాశాలకు సింధీ ఆర్యునిగా పని చేశారు. వారు ముస్లిము పక్షపాతియని తెలిసినా, సింధీ అచ్చుల గురుతుతో సింధీ అక్షరమాలను అరబిక్ అక్షరమాలగా మార్చకుండా, సింధీ అక్షరమాలను కాపాడడానికి దౌడ్‌పోతా-తో హెూరా హెూరి పోరాడారు. వారు ప్రజల మనిషి, అట్లని ప్రజలను రెచ్చగొట్టే నాయకుడు కాదు.

బెర్‌మల్ పర్సరాం బహుముఖ ప్రజ్ఞాశాలియైన రచయిత. సింధీ సూఫీలు, సన్యాసులు గురించి మొట్టమొదట ఆంగ్లంలో పుస్తకం వ్రాసింది వారే. సింధీలో షా గురించి (1915) షా కథలు (1922) షాభితాయ్ (1923), సచల్ సర్‌మస్త్ (1922), సూఫీలను గురించి (1921) వారు వ్రాశారు. సచల్ గురించి వారు వ్రాసిన గ్రంథం సర్వోత్తమమైన విమర్శనాత్మకమైన గ్రంథం. సచల్ విశృంఖల భావనా పటిమను, సిద్ధాంతాలను బెర్‌మల్ పర్సరాం విశదీకరించిన విధంగా మరి యే ఇతర రచయిత చేయలేదు. ఫాస్టు, హేమ్‌లెట్ (1923) యీ రచనలకు వారి అనువాదాలు సాధారణంగా ఉన్నాయి. కాని సింధీ సాహిత్ సొసైటీ వారి భాయి కాలాచంద్ (సాంఘిక సంస్కర్త) పైన, అటువంటి ఇతర విషయాలపైన వారు వ్రాసిన చిన్న పుస్తకాలు చాలామెప్పు పొందాయి. ఎడ్విన్ ఆర్నాల్డ్ వ్రాసిన లైట్ ఆఫ్ ఏషియాకు 1923 లో పూరబ్ జూతి పేర వారు అనుసరించి వ్రాసిన గ్రంథం సింధీ వచన సాహిత్యంలో ఒక గొప్ప గ్రంథం. దైవ చింతన, ఆధ్యాత్మిక భావన, జీవితంలోని ఆనందం, వీటియొక్క సమ్మేళనం, వచన రూపంలో పద్యకావ్య మనదగినది ఈ గ్రంథం. రాజకీయాలలో మూఢ విశ్వాసాలు ప్రబలి పోతూన్న సింధులో సూఫీ జ్యోతిని కొనసాగించే ఉద్దేశంతో 1947 ప్రాంతాలలో రూహ్‌రిహాన్‌ను జెర్‌మల్ పర్సరాం స్థాపించారు. వీరు సింధీలో చిన్నకథలు వ్రాసిన ప్రథమ రచయితలలో ఒకరు. ధనికుల బలవంతుల విషయ లాలసత్వం, దురాశలను, వారికథలు బయలుపెట్టేవి. వారు సూఘో (అపరాధ పరిశోధకుడు), చమాప్రోష్ (ఛద్మవేషి) అన్న కలం పేర్లతో వ్రాసేవారు.

బెర్‌మల్ పర్సరాం ఎక్కువగా వ్రాసేవారు. సింధీ పత్రికలలోను, సంచికలలోను అదేపనిగా వ్రాసేవారు. స్వయం కృషి ద్వారా సింధీ పత్రికా రచనలను సాహిత్య స్థాయికి పెంచారు. వారి వచనం, ఉపన్యాసాల ధోరణిలో అలంకారలేవీ లేకుండా, సాగుతుంది. అనర్గళమైన ప్రవాహం లాగా సాగుతుంది. వారికి సింధీ సాహిత్య చరిత్రలో చక్కని స్థానం కల్పించడానికి వారి సచల్ సర్‌మస్తక్, పూరబ్ జోతి గ్రంథాలే చాలు.

బెర్‌మల్ పర్సరాం సదా రాజకీయ, సాంఘిక సేవకులను తన చుట్టూ చేర్చుకొని ఉండేవారు. కాని తన సందేశాన్ని ప్రజలలో ప్రచారం చేయడానికి వారి 'సాంప్రదాయం' అంటూ దేనినీ వదిలిపోలేదు. నవ యువకుడైన వారి సహచరుడు అమర్‌లాల్ హింగోరానీ 1930లో 'ఫుల్ వారీ' అనే పత్రిక ప్రారంభించారు. వారి చిన్న కథలు ; ముఖ్యంగా

అదో అబ్దుల్ రహమాన్ (సోదరుడు అబ్దుల్ రహమాన్) అన్న కథ వారి అంతర్జాతీయ ఖ్యాతి నార్జించి పెట్టింది. సింధీలో మొట్టమొదటి ప్రసిద్ధమై కథగా గుర్తింపబడింది. అదో అబ్దుల్ రహమాన్ నిజమైన సింధీ సూఫీ సచల్ వలెనే తాను హిందువును కాను, ముస్లిమును కాను అంటారు వారినిఅ నాగరికంగానూ మోటుగాను ప్రశ్నలు వేస్తున్న మేజిస్ట్రేటును అమర్యాద ప్రవర్తనకు, అనాగరిక ప్రవర్తనకు గాను నిన్నెందుకు విచారణ జరపకూడదని ఎదురు ప్రశ్న వేశారు. అట్లే తన గౌరవ మర్యాదల గురించి తన స్త్రీల గౌరవం గురించి గొప్పలు చెప్పుకొనే ఒక శ్రేష్ఠిని "డబ్బు ఖర్చుకు వెనుదీసి నీ ముప్పైఐదేండ్ల సోదరికి వివాహం జరపకుండా ఎందుకు ఉంచేశావు?" అని ప్రశ్నించారట.

లాల్‌చంద్ అమర్ దినోమల్ యీ నలుగురిలోనూ చివరివారు 1954 లో మరణించే నాటికి వీరు 'సింధీ సాహిత్య పితామహు'డని భారత్ పాకిస్తానులలో పేరు పొందారు. వారి చితాభస్మాన్ని వారి శిష్యులు సహచరులు అయిన ఒస్మార్ అలీ అన్సారీ మొదలైన ముస్లిము సోదరుల ద్వారా వారికి ప్రియమైన సింధునది జలాలలో అతి వినమ్రతతో నిమజ్జనం చేశారు. వారు చాలా దయనీయమైన పరిస్థితులలో మరణించారు. కాని వారి దృఢమైన, స్వతంత్రమైన వ్యక్తిత్వాన్ని చివరివరకూ నిలబెట్టుకున్నారు. వారు చాలాకాలం కార్వేస్థాపించిన మహిళా విశ్వవిద్యాలయంలో సింధీ ఆచార్యునిగా పనిచేశారు. ఎం. ఏ. డిగ్రీని సింధీ భాషకు ఆ విశ్వ విద్యాలయం వారు ఆమోదం తెలియజేయడానికి, దానికి సరియైన పాఠ్యాంశ ప్రణాళిక రూపొందించడానికి వీరే ప్రధాన కారకులు. అంతకు పూర్వం మరే ఇతర విశ్వవిద్యాలయంలోను ఇదిలేదు.

ఒక అర్థశతాబ్దం పైగా ఎవ్వరూ ప్రయత్నించని ఒక ప్రత్యేక శైలిలో లాల్‌చంద్ అమర్ దినోమల్ వ్రాస్తూ వచ్చారు. అన్య దేశీయ పదజాలాన్ని, సమాసాలను, ధ్వని చిత్రణలను పూర్తిగా విసర్జించి సింధీ మాటలతో మాత్రమే, స్త్రీలకు, గ్రామీణులకు బోధ పడులాగున వ్రాసేవారు. చాలా వరకూ వారి పదజాలం, నానుడి, షా, సచల్‌ల నుండి పొందినవే. వారి శైలి సరళంగా, శుద్ధంగా, హుందాగా ఉంటుంది. ప్రతి ఖండంలోను వారి రచనలలో ఇదివరకు తెలియని కొత్త సామెతలు, నానుడులు పాఠకునికి కనబడుతాయి. పరిపూర్ణ కౌశలంతో కూడిన క్రీడాకారునిగా డి. జె. సింద్ కళాశాల సంచికలో 'హర్ మఖిజా' (మఖిలోని హర్‌లు) అన్న వ్యాసంతో సింధీ సాహిత్య రంగంలోనికి ప్రవేశించారు. ఈ వ్యాసం తరువాత సింధీ సాహితీ ప్రచురణల ద్వారా వెలువడింది. ఆ రాష్ట్ర ప్రజలందరికీ

తెలిసిన, అందరినీ భయభ్రాంతులను చేసిన మఖి సరస్సు దగ్గర ఉండే పేరు మోసిన దోపిడి దొంగలను గురించిన యీ కథ చాలా ఉత్తమమైనది. ఈ అంశంపై తరువాత కాలంలో చాలా నవలలు కూడా వెలువడాయి గాని ఇప్పటికీ లాల్‌చంద్ హర్‌ల గురించిన కథనమే ఆ విషయాన్ని గురించిన తుది వాక్యంగా నిలచి ఉన్నది. 'ఛోత్ జో చాంద్' (శుక్ల చవితి) కాల్పనిక సాహిత్యంలో నవల వ్రాయడం వారి ప్రథమ ప్రయత్నం. భాదో లేక భాధర్ మాసంలో చవితి చంద్రుణ్ణి చూసిన వారు అపార్ధాలకు, అపనిందలకు గురి అవుతారన్న నమ్మకం మీద ఆధారపడి యీ నవల వ్రాయబడింది. ఈ నవల నలభై సంవత్సరాలు అసంపూర్తిగా విడిచి పెట్టబడి 1947లో పూర్తిచేయబడింది. రెండవ భాగానికీ, మొదటి భాగానికీ పొందిక కుదరలేదు. ఛోత్ జో చాంద్ మొదటి భాగం అంతా ఉరకలు వేస్తూ, విస్తరించి ఇద్దరు మిత్రులు బాల్య స్నేహితుల గురించి చెబుతుంది. వారి తరువాతి నవలా ప్రయత్నం 1917 లో ఖిష్న-జో-కష్ట-అవత్‌రాయ్, రూప్‌చంద్ మాన్‌చందియా అన్న కర్తృత్వంలో వెలువడింది. ఇది చాలావరకూ విజయవంతమైన ప్రయత్నం. కాని తెలిసో తెలియకనో యీ నవల శ్రీమతి హెన్రీఉడ్ నవల 'హెల్లీబర్టన్స్ ట్రబుల్స్'కు అనుకరణ కాదు అనడాన్ని నమశక్యం కాకుండా చేసింది. కాని తాము పాత్రలను గాని, కథాసరళిని గాని అంగ్ల నవల నుండి గ్రహించలేదని గ్రంథకర్త అన్నారు. 1910 లో మహమ్మద్ రసూల్ అల్లా (ప్రభువు. ప్రవక్త మహమ్మద్) అన్న పుస్తకం వ్రాశారు. దానిపై భిన్నాభిప్రాయాలు వెలువడ్డాయి. తమ ప్రవక్త మహమ్మదును అనవసరంగా సమర్థిస్తున్నారని ముస్లిములు, వారి మత సమాజం నుండి దూరం అవుతున్నారని హిందువులు భావించారు. రామతీర్థ మరణం సింధు పంజాబ్‌లలో గొప్ప సంచలనం రేపింది. రామతీర్థ పై వారు రాంబాద్ షా అన్న గ్రంథం 1912 లో వ్రాశారు. సింధీ కవుల పై వారు వెలువరచిన గ్రంథాలకు అగ్రగామిగా 1914 లో సింధీ సాహితీ సమాజం వారికి షహానో షా అన్న గ్రంథం 1914 లో వ్రాశారు. దాని తరువాత సూన్ హారో సచల్ (సుందరమైన సచల్) అన్న గ్రంథం సచల్ పై వ్రాశారు. గుల్ మీద వ్యాఖ్యానం 1916 లో వ్రాశారు.

లాల్‌చంద్ అమర్ దినోమల్ చాలా సంకలన గ్రంథాలను వెలువరించారు. అనువాదకులుగా రూపొందారు. 'పాలియోలా' ను సింధీకి అనువదించారు. సచ్-తన్-సద్‌కే అన్న శీర్షిక క్రింద 1940 లో టాగూర్ గార్డెనర్‌కు వారు గావించిన అనువాదం లేక అనుకరణ పదికాలాలపాటు

నిలిచి ఉండే రచన. సింధీ వచనంలో సదా గులాబ్ (నిత్య గులాబీ) అన్నది ఒక కొత్త ప్రయోగం. అందులో టాగూర్ పరిమళాలు కొంతవరకూ గోచరిస్తూ వివేకం, నాజూకుతనంతో కూడిన, రచయిత వ్యక్తిత్వంతో నిండి ఉంటుంది. విద్యాశాఖలోని ముస్లిములతో సహకరించి ఒక నూతన సింధీ నిఘంటువు సమకూర్చడానికి అమర్ దినోమల్ పనిచేశారు. కాని భారత దేశానికి తరలిపోవడంలో ఆ పని మధ్యలోనే విడిచి పెట్టవలసి వచ్చింది. 'సింధీ సాహిత్ జో నిఛోర్' (సింధీ సాహిత్య సారాంశం) అన్న గ్రంథం అసంపూర్తి వ్రాత ప్రతిని కూడా వారు వదలి వెళ్లారు. వారి అమర్ మరూయి (1925) నాటకం యొక్క విజయం గురించి ముందు మరొక శీర్షిక క్రింద చర్చించడం జరుగుతుంది. లాల్‌చంద్ అమర్ దినో మల్‌ని వ్యాసకర్తగా చక్కని శైలి గల వచన రచయితగా వారి రచనలు చదివి ఆనందిద్దామనుకొనే వారు, వారి ఒకే ఒక పుస్తకం ఫూలన్ ముత్ (1927 - పిడికెడు పేలాలు) చదివి తీరాలి.

బెర్‌మల్ పర్స్‌రాంతో కలసి 1914 లో సింధీ సాహితీ సమితి స్థాపించడం, వారి మత విషయ పరమైన, చక్కని గ్రంథాలు, మత విధాన గ్రంథాలు ప్రచురించడం ద్వారా లాల్‌చంద్ అమర్ దినోమల్ విశిష్టమైన సేవ చేశారు ప్రామాణికమైన సాహిత్య శైలిని స్థిరీకరించడంలో ముఖ్యముగా తొలిదశలో శరన్ ఆనంద్ ధడానీ, సింధీ సాహిత్ సమితి సంపాదకుడుగా ఉన్నకాలంలో ఆ సమితి ప్రముఖ పాత్ర వహించింది. వారు చిన్నవయసులోనే మరణించడం ఆ సంస్థకు గొడ్డలి పెట్టు. తొలి ఆరు సంవత్సరాల కాలంలో ఈ సంస్థవారు మీర్జా కాలిక్ బేగ్ (సింధీ షాయర్), బూల్‌చంద్ దయారాం, బెర్‌మల్ పర్స్‌రాం (భాయి కలాచంద్), లాల్‌చంద్ అమర్ దినోమల్ మొదలైన వారినందరినీ ఒకే వేదికపైకి తెచ్చుటలో విజయం సాధించి తరువాత రాబోయే యువ కవులందరికీ ఆదర్శ రూపాలను అందించారు ప్రథమ ప్రపంచ సంగ్రామపు రోజులలో సింధీ సాహితీ సమితితో సింధీ వచన సాహిత్యం ఉచ్ఛస్థాయిని చేరుకుంది అని చెప్పవచ్చు. లాల్‌చంద్ అమర్ దినోమల్ సంపాదకత్వం నుండి వైదొలగిన వెనక సింధీ సాహిత్ సమితి వాడి పోయింది. ఈ శతాబ్దపు మూడవ దశాబ్దంలో ఒక పుస్తక విక్రేత చేతులలో బడి అంతరించి పోయింది.

లాల్‌చంద్ మర్ దినోమల్ వచన శైలి మిక్కిలి స్వాతంత్ర్య భావాలతో, సులభంగా నుకరించడానికి వీలులేని ఆవిధంగా వింత వైవిధ్యాలతో నిండి ఉంటుంది. కాని వారి జీవితం, వారి రచనల వలన,

ప్రభావితుడైన వారి శిష్యుడు సహయోగి అయిన అస్సానంద్ మమ్‌తోరా వాలావరకు సాధించ గలిగారు. వారి అభిమానియైన అస్సానంద్ మమ్ తోరా చక్కని వ్యాసకర్తగాను, విమర్శకునిగాను, కథా రచయిత గాను పేరు సంపాదించారు. సింధీ సాహిత్యంలో వారికి గాను ఒక ప్రత్యేక స్థానాన్ని కేటాయించాలి. ప్రజలను దిగ్భ్రాంతులను చేసిన వారి షాయర్ (కవి) అన్న నవల (1941) ద్వారా ఎంతో కీర్తి సంపాదించారు. ఆశా మండలిద్వారా వెలువడిన యీ నవలకు లాల్‌చంద్ అమర్ దినోమల్ ఉపోద్ఘాతం వ్రాశారు. షాయర్ సింధీ సాహిత్యంలో రచయిత వ్యక్తిత్వాన్ని ప్రతిబింబింప జేసేది. అతి కొద్ది మూల గ్రంథాలలో ఒకటి అనీ, రచయిత సౌందర్యాన్వేషణా ప్రయత్నాల ఫలితమే యీ 'షాయర్' అయి ఉండవచ్చుననీ సూచన మాత్రంగా అంటారు తమ ఉపోద్ఘాతంలో లాల్‌చంద్ అమర్ దినోమల్. కాశ్మీర్ చందన్ వారీలోని మంచు వంతెన వద్ద వెన్నెలలో నిలుచొని ఉన్నట్లు, అప్పుడు తనకు కలలో కనిపించిన సౌందర్యాన్ని వర్ణించే యీ నవలలోని రెండవ భాగపు చివరి ఘట్టం అత్యంత మనోహరం. అది నిజానికి సింధీ వచన సాహిత్యంలో అత్యుత్తమమైన అంశాలలో ఒకటి. భావోద్రేకంలో వ్రాసిన అసంబద్ధ వర్ణనగా తప్పులెన్నువారు ఎంచినప్పటికీ, అది నిజమైన ఆణిముత్యం వంటి వచన భాగం. ప్రతి సింధీయుడు చదవవలసినది. వారి చిన్న రచన గాన్‌వరాన్ (పశుల కాపరిణి) ఆంగ్లంలోనికి అనువదింపబడింది. సెక్స్‌కు సంబంధించిన కథలు అనబడేవి సింధులో మొట్టమొదటిసారిగా అస్సానంద్ మమ్‌తోరా వ్రాసినవే.

**బాల్‌కన్‌జీ బారీ - బాలల సాహిత్యం :**

1920 ప్రాంతాలలో సింధీయుల జీవనంలో వారి విద్యా విషయాలలో ఒక గొప్ప ప్రగతి సేవక్ భోజ్‌రాజ్ బాల్‌కన్ - జి - బారి (బాలల గిల్డ్) స్థాపించడం. అది తరువాత విస్తరించబడి 'అఖిల భారత బాలల సంస్థ'గా మారింది. బాల్‌కన్ - జి - బారి అన్న ఒక్కపదం భారత దేశంలోని అన్ని భాషలలోను చోటు చేసుకున్న సింధీ పదం అని తరచు అంటూ ఉంటారు. సేవక్ భోజ్‌రాజ్ బాల్‌కన్ - జి - బారి స్థాపించు నాటికి లర్కానాలో అధ్యాపక వృత్తిలో ఉన్నారు. తరువాత పాత్రికేయునిగా మారి భారతదేశంలో ప్రముఖ సాంఘిక సేవకులుగా గుర్తింపు పొందారు. ప్రస్తుతం ప్రశాంతంగా ఒక గ్రామంలో ఆదివాసుల ప్రగతికి పాటుపడుతూ ఉన్నారు. ఇతర రంగాలలో వారి ప్రతిభ, అర్హతలు విడిచిపెడితే, సేవక్ భోజ్‌రాజ్‌కు సింధీ వచన చరిత్రలో

ప్రముఖ స్థానం ఉంది. సింధీలో బాలల సాహిత్యానికి వారు మార్గ దర్శకులు. అదీకాక రచయితగా వారి ఆత్మకథా సదృశములైన రెండు నవలలు ఆశీర్వాద్ (1933), దాదాశ్యాం (1924) ద్వారా వారికి ఒక స్థానం ఉన్నది. బాలలకు, తల్లి దండ్రులకు సేవక్ భోజ్‌రాజ్ దాదాగానే తెలుసు. గులిస్థాన్ అనే సంచిక, అటువంటివే ఇతర పత్రికలు బాలల కొరకై బాల్‌కన్ - జి - బారి అధ్వర్యంలో స్థాపించడం ద్వారా, బాలలు వారంతట వారే స్వయంగా బోధనాత్మకమైన, ఆనంద దాయకమైన వ్యాసాలు, హాస్యగుళికలు, కథలు చదువుకొనడానికి అవకాశం కలిగింది. వారి నవలలలో ఒక అధ్యాపకుని జీవితాన్ని వర్ణిస్తూ ఒక భావనాత్మకమైన మలుపు యిస్తారు. సేవక్ భోజ్‌రాజ్ వచన శైలి పిల్లలకు అర్థమయ్యే విధంగా ఉంటుంది. లర్కానాలో పద్యరచనలో వారికి ప్రతి రూపమైన బేవస్ వలెనే పాఠకులకు (వారి విషయంలో బాలలు) సాహిత్యం ఆనందాన్ని సౌందర్యారాధనను అందింపజేసేదిగా ఉండాలి, కాని వారిని విషాదాలతో ముంచెత్తి యీ ప్రపంచం అంటేనే వారికి వెగటు కలిగించేదిగా ఉండకూడదు. ఎన్నో ఎదురుదెబ్బలు దుర్ఘటనలు తట్టుకున్న తరువాత వారు యీ వేదాంతానికి కట్టుబడ్డారు : ఏది జరిగినా మనమంచికే జరుగుతుంది. వారి వచనంలో చమత్కృతులేవీ వుండవు, వింతలసలే ఉండవు.

సేవక్ భోజ్‌రాజ్ ఉద్యమానికి బలం చేకూర్చేందుకు 1924 - 25 ప్రాంతాలలో సుందర్ సాహిత్య ప్రచురణ సంస్థవారు పరిపూర్ణంగా బాలల కొరకే సాహిత్యాన్ని అందించేందుకు దోహదం చేశారు. ఆ సంస్థకు పట్టుకొమ్మ ఒక రెవిన్యూ అధికారి అయిన ఫతేచంద్ వాస్వాని. వారు ప్రభుత్వ ఉద్యోగంలో ఉన్నన్నినాళ్లూ వారి సోదరులు మొల్లారాం వాస్వానీ పేర వ్రాసేవారు. ఈ పని కాకుండా ఫతేచంద్ వాస్వానీ రాజపుత్రుల వీర శౌర్యాలు, నైపుణ్యం చాటడంలో నిమగ్నులయ్యారు. ఈ దిశలో వారు రాణాప్రతాప్ (1926) అన్న గ్రంథం వ్రాశారు.

**ముస్లిము రచయితల సింధీ వచనం :**

మీర్జాకాలిక్ బేగ్, హాకీం ఫతేచంద్ వంటి సుప్రసిద్ధ రచయితలు తప్ప, ఇరవైయవ శతాబ్దపు తొలిరెండు దశాబ్దాలలోను వచన రచనా రంగంలో ముస్లిం రచయితలు లేకపోవడం కొట్టివచ్చినట్టు కనబడేది. తరువాత దశాబ్దాలలో వారు ఒక దండుగా పొడచూపారు. ప్రధానంగా 1931 లో ముస్లిం అరబి సొసైటీ స్థాపన ద్వారా, సింధును బొంబాయి

రాష్ట్రం నుండి వేరుచేసిన పిదప యు. ఎం. దౌడ్ పోతాని డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్స్‌గా నియమించిన వెనుక యీ మార్పు సంభవించింది.

ముస్లిం అరబి సొసైటీని అత్యంత సమర్థవంతంగా నడిపినవారు మహమ్మద్ సిదిక్ మెమొన్. ఈ సొసైటీ వారి మొట్టమొదటి ప్రచురణ 'గుల్' కావ్యం. మహమ్మద్ సిదిక్ మెమొర్ స్వయంగా పండితులు, రచయిత. స్వతంత్ర గ్రంథాలతో పాటు తారీఖ్ - ఇ - తహ్‌రీకి సింధీ అనువాదం కుడా వారు చేశారు. జలున్ - జో - తహ్‌ఫో (స్త్రీలకు కానుక) అనే నవల, ది సైకిల్ ఆఫ్ లైఫ్, కమిల్ రహ్‌నమా (అత్యుత్తమ మార్గదర్శి), అన్నిటి కంటె ముఖ్యమైనది రెండు సంపుటాలలో (మొదటిది 1937 లో వ్రాశారు) సింధీ సాహిత్య చరిత్ర, వారి గ్రంథాలు. ఈ చరిత్ర గ్రంథం సింధీలో మార్గదర్శకమైన ప్రథమ ప్రయత్నం. అయితే యీ గ్రంథం, ఎన్నికగన్న వారిని మాత్రమే చేర్చబడినదిగా కాక ఏ మాత్రం ప్రతిభ చూపిన ముస్లిం రచయితలైన వారందరినీ స్తుతిస్తూ వ్రాసిన గ్రంథంలాగున ఉన్నది. అయితే చాలా పరిశ్రమతో, బాగా చదివి కూర్చిన గ్రంథంలాగానూ తోస్తుంది. తరువాత వచ్చిన రచయితలకు ఆ విషయంపై ఎంతో సహాయకారిగా ఉంటుంది. విద్యాశాఖ వారి ప్రోత్సాహం మీద వెలువడిన వచన గ్రంథాలను గురించి వరుసక్రమంలో చెప్పడం తప్ప సింధీ వచన సాహిత్య చరిత్రను గురించి యీ గ్రంథంలో ఏమీలేదు. ఉపాధ్యాయుల శిక్షణా కళాశాల ప్రధానోపాధ్యాయులుగా వారి చేతి క్రింద చక్కని గ్రంథాలయం కూడా అందుబాటులోనున్నది. దానిని వారు చక్కగా వినియోగించుకున్నారు. సిదిక్ మెమొన్‌కు చక్కని పర్షియన్ ఛందోరీతులతో పరిచయం విజ్ఞానం ఉన్నది, కాని వారి వచనంలో అందం, శైలి లోపించాయి.

తరువాత ఇద్దరు రజాక్‌లు ఉన్నారు. కాజీ అబ్దుల్ రజాక్ పర్షియన్ గ్రంథాల నుండి ఎత్తితీసిన విషయాలతో దానాయ్ - జ - సబక్ (విజ్ఞాన, పాఠం) అన్న పుస్తకం వ్రాశారు. అబ్దుల్ రజాక్, మెమొన్ జహాన్ ఆరా (1931) అను విషాదాంత నాటకాన్ని వ్రాశారు. జహాన్ ఆరా ఆదర్శ ప్రేమికురాలు. ఆమె ప్రియుడు జహాన్ ఖాన్ రాజవంశపు రాకుమారిని పెండ్లాడిన నాటి రాత్రి ఆమె చనిపోతుంది. ఆ నవలనిండా చక్కని వచన భాగాలు ఉన్నాయి. గురుబక్సానీ నూర్జహాన్‌ను గుర్తుచేస్తూ ఉంటుంది. అంతేకాకుండా నూర్జహాన్ పుస్తకంలో లేని ఉత్తేజకరమైన వర్ణనలు జహాన్ ఆరాలో కనబడతాయి. ఉదాహరణకు ఆరవ అధ్యాయంలో ఒక చోట పురుషులను పుష్పాలతో పోల్చి చెపుతూ అందుకు అనువైన నీతిని అందిస్తూ

వ్రాసిన భాగం చక్కగా ఉంది. మెమొన్ పుస్తకం జాగ్రత్తగా పరిశీలించి చదువదగినది, పాతకాలపు వాతావరణం, పరిస్థితుల సుగంధాన్ని వెదజల్లే గ్రంథం.

సింధీ సాహిత్యంపై చెరగని ముద్ర వేయదగిన వారు, కాని అటు జరుపనివారు ఆగాగులాం నబి అన్న రచయిత. వీరు 1933 లో సచల్ రిసాలోను సరిచూసి తమ ఉపోద్ఘాతంతో ప్రచురించారు. కాని అది శబ్దాడంబరమయమై మూడవ వంతునకు కుదించదగినదిగా ఉన్నది. అంతకు ముందర కాలంలో వారు వ్రాసిన 'కుర్బ్‌కాలిక్' (కాలిక్‌కు అభిమానంతో కూడిన నివాళి) కూడ అంతరసవత్తరంగా లేదు. అయినప్పటికీ కాలిక్ రచనల వివరణ పట్టిక అందులో చేర్చడం చేత అది విలువైన పుస్తకం అయింది.

ఈ కాలంలో అల్లా బచాయో 1942 లో వ్రాసిన సైర్‌కొహిస్తాన్ (కొహిస్తాన్ యాత్ర) ఒక ముస్లిం రచయిత కలం నుండి వెలువడిన ఉత్తమ గ్రంథంగా ఎంచవచ్చు. సింధీ భాషలో అత్యుత్తమమైన యాత్రా, గ్రంథమే కాకుండా, వచన రచనకు కూడా ఆదర్శవంతమైనది. ఏ ఇతర సింధీ భాషా గ్రంథంలోనూ కానరాని గ్రామీణ వాతావరణంలో వ్యావహారికంగా ఉపయోగించే సరళమైన భాష ఇందులో కనబడుతుంది. కొహిస్తాన్‌లోని అమాయకులైన కొండప్రజల సామాన్యమైన, వినమ్రమైన ఆతిధ్యం, ఆప్యాయత హృదయాన్ని కదిలించే విధంగా ఇందులో వర్ణించబడాయి. ఇందలి కొన్నిభాగాలు చాలా అందంగా చిత్రించబడి కింగ్‌లేక 'ఇవోథేన్' పుస్తకంలో ఎడారిని వర్ణిస్తూ వ్రాసిన అధ్యాయంతో పోల్చదగినవిగా ఉంటాయి.

మిర్జాకాలిక్ బేగ్ కుమారుడు నబీబక్స్ మిర్జా కూడా రచనా వ్యాసంగం కొనసాగించినట్లయితే తన తండ్రి అంతటి గొప్ప రచయిత కాదగినవారు. 'సింధు' పుటలలోని వారి కథలు చాలా పొగడ్తల నందినవి. ఆ కథలలో అందరకూ బాగా తెలిసినది 'మిస్ రుస్తోంజీ.'

ఇప్పుడు గొప్ప ముస్లిం పండితులు యు. ఎం. దౌడ్ పోతాని గురించి చెప్పుకొందాం. వారు ఖ్యాతి బడసినది తమ గొప్ప జ్ఞానం వల్లను, పరిశోధనవలనను మాత్రమే కాదు. వారెల్లప్పుడు పండితులు, పరిశోధకుల బృందంతో పరివేష్టింపబడి వుంటూ ఉండేవారు. వారు ఇప్పటికీ తమ సత్కార్యాలను పాకిస్తాన్‌లోను, భారతదేశంలోను కొనసాగిస్తూనే ఉన్నారు.

సాదీ వ్రాసిన గులిస్తాను 'గుల్ల బహార్' ర్అన్న శీర్షిక క్రింద ర్అనువదించిన, షా రచనలను సేకరించి సంకలన గ్రంథంగా వెలువరించిన గులాం మహమ్మద్ షాహ్‌వాని, పంజ్ (ఐదు లఘుకథలు) 1937 లోను మరికొన్ని వ్యాసాలను వ్రాసిన బస్మార్ అలీ అన్సార్, పరిశోధకులు అరిఫ్ షాజిలానీ, బెకస్, బేదిల్‌లపై వ్రాసిన ఎ. డబ్ల్యు మునావీ తజ్‌కీ రాహ్ లతీఫ్ (1943) అంత విమర్శనాత్మకమైనది కాకపోయినా, సింధీ కవులను గురించి గ్రంథం వ్రాసిన లతీఫ్ ఉల్లా బద్వీ, కొంతకాలం తరువాత, పాకిస్తాన్‌లోనూ, విఖ్యాత పాకిస్తాన్ రివ్యూ మిహ్‌రాన్‌కు సంపాదకుడైన జోయో, సింధీ సాహిత్యంపై విస్తృత పరిశోధనలు గావించిన నబిచిక్స్ బలోక్, సాదీ బస్తాన్‌ను అనువదించి, స్వతంత్రంగా కొన్ని వ్యాసాలు, పుస్తకాలు షా పై వ్రాసిన తాజ్ మహమ్మద్ ఆగా, చారిత్రాత్మక కథలు, షా పై వ్యాఖ్యాత దిన్ మహమ్మద్ వఫాయ్ (1950 లో మరణం) ఇంకను ర్నేకులు ఇప్పుడు పేరొందిన ముస్లిం రచయితలు, హెచ్. ఎల్. సదారంగ్ వంటి హిందూ పరిశోధకులు భారతదేశంలోను ప్రత్యక్షంగాను లేక పరోక్షంగాను యు. ఎం. దౌడ్ పోతా ప్రోత్సాహాన్ని పొందినవారే.

దౌడ్ పోతా (1896 - 1958) అరబిక్ పర్షియన్, సింధీ భాషలలో గొప్ప పండితులు. గురువులు గురుబక్సానీకి, చిరస్థాయిగా నిలచినవారి 'షా' పైన గ్రంథం తయారు చేసేటప్పుడు తోడ్పడిన సమయంలోనే వారికి పేరు ప్రతిష్టలు వచ్చాయి. 1937 లో వారు స్వయంగా షా అబ్దుల్ కరీంపై కవిగా కాక దివ్య పురుషులుగా భావించి, తమ పాండిత్యాన్ని ప్రకటించే గ్రంధాన్ని వ్రాశారు. వారి అనువాద గ్రంథం మిన్‌హాఫ్ - ఉల్ - అష్కిన్ 1934 లోనే వెలువడింది. మహమ్మద్ జమన్ అభియాత్ సిందిపై వారి ప్రచురణ 1939 లో వెలువడింది. సింధీ అచ్చుల పద్ధతిని 1905 లో ప్రేమ్‌చంద్ మార్గనిర్దేశాన్ని అనుసరించి పూర్తిగా మార్చివేసి హిందువుల భావావేశానికి గురియైనారు. సింధీలోనికి అనువదించి సంపాదకత్వం వహించి 1938 లో తారీఖ్ - ఇ - మౌసుమీ, 1939 లో తారీఖ్ - ఇ - బాచ్ నామాలు వెలువరించారు. కాని 1932 లో వారు సంకలిత పరచిన సారాగుల్ (ఆనందకరమగు పుష్పములు) కు వ్రాసిన ఉపోద్ఘాతంలో వారిది అనదగు ప్రత్యేక శైలిలోని వచనం మనకు కనబడుతుంది. అటు తరువాత వారు ఉన్నత పదవికి ఎన్నిక అయ్యారు. షా తప్ప సింధీలో చెప్పదగిన సాహిత్యం లేదని దౌడ్‌పోతా అభిప్రాయం. ఉర్దూ, పర్షియన్ భాషలతో సహా మరే ఇతర భాషా అరబిక్ భాషకు సాటిరాదనీ, సింధీ భాషను అరబిక్ భాషామయం

చెయ్యాలి అన్నంత తీవ్రంగా వారు అరబిక్ భాష గొప్పదనాన్ని విశ్వసిస్తారు. వారు చనిపోయిన పిమ్మట సింధీలో వెలువడిన వారి ఆత్మ కథలో జ్ఞాపక శక్తి కొరవడి రసజ్ఞత తక్కువైనట్లు కనబడుతుంది.

**1907-1957 కాలంలో హిందూ వచన రచయితలు :**

1907 - 1957 మధ్యకాలంలో సింధీలో వచనం వ్రాసిన హిందూ రచయితలు కోకొల్లలు, కాని కొంతమంది ప్రముఖ రచయితలు, శైలి శీలుర పేర్లుమాత్రము ఇచ్చట ప్రస్తావించడానికి వీలవుతుంది.

1932 లో బూల్‌చంద్ రాజ్‌పాల్ సంపాదకత్వంలో సింధు మాస పత్రిక వెలువడడం మొదలుపెట్టాక, రచయితలకు ఒకచక్కని వేదిక దొరికింది. 'సింధు' వంటిది సింధీ జీవనంలో గాని, విద్యారంగంలో గాని మరొకటి కానరాదు. డి. జె. సింద్ కళాశాల పత్రిక సహజంగా కొద్ది మంది విద్యార్థులు, అధ్యాపకులకే పరిమితమయింది. జోట్ పత్రిక ఏక వ్యక్తి ప్రదర్శిని, అట్లే గులిస్తాన్ కూడా. కాని 'సింధు' అలా కాక తగిన స్థాయిలో రచనలు సాగించే రచయితలందరికీ అందుబాటులోనున్న పత్రిక. సుందర సాహిత్య ప్రచురణలు ప్రధానంగా అనువాద సాహిత్యానికి లేదా బాలల సాహిత్యానికి చెందింది. రతన్, ఆశాప్రచురణాలయం, లేక కహానీ, అనువాదాలు మినహా వ్యాసాలు గాని, పుస్తకాలుగాని వారి ప్రచురణలలో లేవు. నిజానికి యీ కలగూరగంపగా ఉన్న పత్రికలు, సంఘాలు, అన్నీ కలిపి మొత్తంమీద ప్రామాణిక విలువలతో వెలువరచిన ఒకే ఒక్క గ్రంథం ఆశాప్రచురణల ఆధ్వర్యములో వెలువడిన మమ్‌తోరా వ్రాసిన షాయర్.

1940లో యీ గ్రంథ రచయిత తన నాలుగు వ్యాసాలు జీవితానికి మూలస్తంభం (The Pillar of Life) జీవితానికి అభిలాష (Zest for Life) వింత ఆనందం పుస్తకాలు (A strange Delight-Books), వచన రచనకు ఆవశ్యకతలు (Essentials of Prose)తో కలిపి, పి డి. జె. సింద్ కళాశాల సంచికలలోని ఎంపిక చేసిన వ్యాసాల సంకలనం 'విచార్' విడుదల చేయడం వలన ఆ కళాశాల వ్యాసాలు పదికాలాల కొత్త రచయితల రచనలు కూడా చేర్చబడినవి. ఈ సంకలనంలో పాత రచయితలతో పాటు కొత్త రచయితల రచనలు కూడా చేర్చబడినవి.

పందొమ్మిది వందల ముప్పై పూర్వం 'సింధు' పత్రిక స్థాపనకు సింధీ వచన సాహిత్యంలో ఎన్నదగిన రచనలు యీ క్రింద పేర్కొన్నవి

'సిఖ్యాసాగర్' (1910) గ్రంథం, అట్లే వారి మరణానంతరం ప్రచురించ బడిన వారి వ్యాసాలు సైట్ ఆఫ్ వాటర్స్ (1918), లవ్ ఆఫ్ వన్స్‌లేండ్ (1914)లు. వారి అకాల మరణం సింధీ వచన సాహిత్యానికి తీరనిలోటు. కేశవ్ చంద్రసేన్ బోధనలకు వ్యాఖ్యానంతో జీవన్‌వేద్ (1921) అన్న పేర ప్రీతమ్ దాస్ ధారనీ వ్రాసిన గ్రంథం 1925లో హిందూ వేదాంతం మీద విశృంఖలంగా 'ది పాత్ ఆఫ్ ది సీకర్' అన్న శీర్షికతో వైన్‌రాయ్ బూల్‌చంద్ వ్రాసిన గ్రంథం, 1923 లో పాఠ్యాంశాలు బోధించే పద్ధతిలో చక్కని వచన శైలిలో 'ఇన్‌సాన్ ఎండ్ ఇన్‌సానియత్' (మానవుడు, మానవత) అన్న గ్రంథం రోచిరాం సదాని వ్రాసినది. టి.కె. సహానీ ఆంగ్లంలో వ్రాసిన లైఫ్ ఆఫ్ గోఖలే (Life of Gokhale)కి వారే 1926లో వేసిన సింధీ అనువాద గ్రంథం, 1927లో సింధులో స్మరణీయులైన వ్యక్తుల గురించిన 'సింధీ వర్దీస్' సాధారణమైన వచన శైలిలో నున్నా సింధీయులలో చిరస్మరణీయులైన వ్యక్తుల గురించిన అమూల్యమైన సమాచారం ఇస్తూ తాహిల్‌రాం అస్సుదోమల్ వ్రాసిన పుస్తకం ఇది.

పందొమ్మిది వందల ముప్పైలు, నలభైల మధ్య వెలువడిన కాల్పనిక సాహిత్యం కాని ప్రధాన వచన రచనలు; ఎన్. ఆర్. మల్కానీ హాస్య ధోరణిలో వ్రాయడం, గ్రామీణ వాతావరణాన్ని, గ్రామీణులను సింధు, గుజరాత్‌లలో అవగాహన చేసుకోవడానికి ప్రయత్నించి 1942లో వ్రాసిన 'అనార్ దానా' (దానిమ్మగింజలు) అన్న స్వీయ వ్యాసాలు సింధీలో ప్రధానమైన మూల గ్రంథాలలో ఒకటి (ఈ గ్రంథ కర్త ఉపోద్ఘాతంతో), అంతకు పూర్వం ప్రచురించబడిన, వారి అత్యుత్తమ రచన 'గోధాని బాహర్' (గ్రామీణ రుచులు) వంటివి అనార్ దానాలో చేర్చబడినవి. సింధీ పాఠకులకు గుజరాతీ గర్బా, కాశ్మీర్‌యాత్ర, బలూచ్ తుపాకులు వంటి అధ్యాయాలు కనువిప్పు కలిగించే వినూత్న విషయాలు పరమానంద్ మేవారాం శైలిని జ్ఞప్తికి తెచ్చు శుద్ధ సింధీ శైలిలో వాధుమల్ గంగారాం 1940లో వ్రాసిన 'పంగటి ఇన్‌క్విలాబ్' (సాంఘిక విప్లవం) గ్రంథం. ఇందులోని చాలా వ్యాసాలు జోత్ పత్రికలో ముందుగా ప్రచురించబడినవే. అదే సమయంలో (1940) గోవింద్ భాటియా వ్రాసిన 'వర్క్' (ఆకులు) వ్యాసాలు కూడా ప్రచురితమయ్యాయి (ఈ గ్రంథకర్త ఉపోద్ఘాతంతో). ఈ వ్యాసాలలో అప్పటికి యువవయస్కుడైన రచయిత, గంభీరమైన సమస్యలను సున్నితంగా స్పృశిస్తూ చక్కని శైలిలో వ్రాశారు. పందొమ్మిది వందల నలభైల తొలి సంవత్సరాలు సింధీ వ్యాసాలకూ, వ్యాస రచయితలకూ, మంచి సమయంలాగా కనబడుతుంది. ఆ కాలంలో వ్యాస సంపుటాలు

అరుదాకా చక్కని సింధీ వచనంతో వెలువడినవి. కవి హైదర్ బక్ష్ బిటోయి ఉపోద్ఘాతంతో తీర్థవసంత్ 1941లో వ్రాసిన చిన్‌గన్ (నిప్పు రవ్వలు) చక్కని గ్రంథం. షా సందేశం అన్న మొదటి వ్యాసంతో ప్రారంభమైన యీ వ్యాసాలు 'నానో' మాతామహులు అన్న వ్యాసంతో సమాప్తమవుతూ సింధీ సాహిత్యంలో ప్రామాణికంగా నిలిచి ఉంటాయి. తీర్థవసంత్‌కు భవిష్యద్దర్శన శక్తి, దానితో పాటు చమత్కారమూ ఉన్నది. ఈ రెంటి సమ్మేళనం సాధారణంగా మనకు కనబడదు. వారు స్వతంత్రంగా ఆలోచించ గలిగిన శక్తి గలవారు. తాను అనుకున్న పద్ధతిలో శక్తివంతంగా వ్రాయగలరు. కవిలేఖ్‌రాజ్ అజీజ్ కూడ తమ వ్యాసాలనన్నిటినీ సేకరించి అదబి అయినా (సాహిత్యం యొక్క అద్దం) అన్న శీర్షిక క్రింద ప్రచురించారు 1941లో. ఈ పుస్తకంలో మానవులు, ఇతర విషయాలపై తమ పద్యరచనలలో కంటే భావయుక్తంగా వారి ఆలోచనలను వ్యక్తీకరించారు అనిపిస్తుంది. రాం పంజ్వానీ, నారాయణ్ దాస్ భంభానీ ఇద్దరూ ఆచార్యులు, 'అదబీ గుంఘూ' (సాహిత్య వికాసం) అన్న పేరుతో వ్యాసాలను విడుదల చేశారు. రాం పంజ్వానీ విశాల దృక్పథాన్ని చూపగా, వారి సహచరుడు భవిష్యద్దర్శనం యొక్క తీవ్రతను చూపుతారు. ఈ వ్యాసాలు చక్కగా వ్రాయబడ్డాయి. నారాయణదాస్ భంభానీ షా నాయికలపై నిశితమైన పరిశీలన (సుర్మియూన్) 1944లో ఒక గ్రంథం వెలువరించారు. లోకుమల్ కేశ్వానీ మరొక ఆచార్యులు. 1946లో 'కసోటీ' అంటే సాహిత్యం యొక్క విలువను నిర్ణయించే గీటురాయి వ్రాసి సంచలనాత్మకమైన వివాదాన్ని లేవనెత్తారు. సి.ఎల్. మారి వాలా మరొక ఆచార్యులు 1946లో చారిత్రాత్మక విషయాలపై వ్యాసాలను వ్రాశారు. రఘుమల్ మొట్వానీ వ్రాసిన గులాబి గుల్ (గులాబీ పువ్వులు) పువ్వులను గురించి కాదు, పద్యాలను గురించీ కాదు, ఆధ్యాత్మిక తత్వం మీద చక్కని వాదంతో కూర్చిన గ్రంథం. ప్రాచీన సింధు, ప్రాచీన భారతంపై వ్రాసిన ఇరువురు రచయితలు ద్వారకాదాస్ శర్మ (1943), గంగారాం సామ్రాట్. వీరు తమ పాండిత్య ప్రకర్షను చూపిస్తూ 'ఆర్యావర్త' అను తమ ప్రథమ భాగాన్ని విడుదల చేశారు. హెూటచంద్ ధృడానీ, వారి సోదరులు ఉత్తంచంద్ 1896లో ఇచ్చిన ఉపన్యాసాన్ని సేకరించి, తల్‌పూర్‌ల పైనున్న కొన్ని వ్యాసాలతో కలిపి 'మీర్స్ ఆఫ్ సింద్' అన్న గ్రంథం 1938లో విడుదల చేశారు.

ఇక కాల్పనిక సాహిత్యంలో షాందాస్ దులానీ 1942లో రాణి పద్మావతి అనే నవల వ్రాశారు. అందులో వారు ఆ కాలంలో వెలువడిన చాలా రచనలలో రాజపుత్రుల శౌర్య పరాక్రమాలను పొగడుతూ అక్బర్

చక్రవర్తి దుర్మార్గంగా కొల్లగొట్టడం, వారికామోద్రేకం వీటిని తెగడుతూ వ్రాసినవి అన్నీ అబద్ధాలు అనిపించే లాగున ఇటు అక్బరును, అటు తమ రాజపుత్ర నాయకుడైన రాణా ప్రతాప్‌ను కూడా కీర్తిస్తూ వ్రాశారు. అంతకు క్రితం సంవత్సరంలో అంటే 1941లో గులి సదారంగానీ నవల ఇత్‌హాద్ (సఖ్యత) పెద్ద వివాదం లేవనెత్తింది. ఈ నవలలో హిందూ నాయిక ఒక ముస్లిమును వివాహం చేసుకుంటుంది. హిందూ ముస్లిముల సఖ్యత సాధించడానికి ఇది సరియైన మార్గం కాదని ప్రజలు ఆమెను నిందించారు. గులి సదారంగాని టాగూర్ 'గోరా' ను అనువదించుటలో 1938లో సాహిత్య రంగప్రవేశం చేశారు. చక్కని నవలాకారునిగా వికసించిన చందూలాల్ జయసింఘానీ ప్రేమ్-జి-షాదీ (ప్రేమ వివాహం) అన్న నవల వ్రాశారు కాని ప్రేమ, వివాహాల అనుభవాలను రచయిత కొంచెం అతిగా వర్ణించాడేమోనని పాఠకులు భావించారు. రాం పంజ్వానీ 'ఖైదీ' 1943లో, 'షర్మిలా' 1944లోను, 'లతీఫా' 1945లోను వ్రాశారు. మొదటిది ఒక కుగ్రామంలోని ముస్లిం కుటుంబానికి చెందినది. ఇవి తీర్చి దిద్దిన నవలల కంటె వ్యాసాలు అనదగినవిగా, మొదటి ప్రయత్నాల లోనివిగా అనిపిస్తాయి. 1943లో నారాయణ్ దాస్ భంభానీ వ్రాసిన 'విధ్వా' నవల ఆదర్శభావాలు గల సింధీయులకు వైధవ్యం ప్రాప్తించిన మహిళలు పునర్వివాహమాడ వలెనన్న ఆలోచన నచ్చింది. కాని వారి అత్యుత్తమ నవల 1942లో వ్రాసిన మాల్హిన్ (తోటమాలిని), హార్డీ నవల 'డెస్'కు వారి పాప్ అయిన్ పకిజ (పాపము పవిత్రత) పాఠకులలో మూలం అంత స్పందన కలిగించలేదు. తక్కిన నవలలు జెఠానంద్ లాల్ వానీ వ్రాసిన భారత్ - జీవన్, వారిదే స్వయంగా వ్రాసిన 'మ్యునిసిపల్ కౌన్సిలర్ (1944),' నానిక్ రాం ధరందాస్ వ్రాసిన 'ఆరాం మహల్' (ఆనంద మందిరం), 1947 దేశ విభజన సమయంలో జె. డి. అహూజా వ్రాసిన క్వీన్ (రాణి).

కథానిక స్వతంత్ర భారతంలో వికసించినప్పటికీ సింధులో చాలా ముందుగానే అంటే 1923లో జెఠ్‌మల్ పర్స్‌రాం వ్రాసిన ఖ్రమాపోష్‌తో ప్రారంభమై నాదిర్ బెగ్ మిర్జా కథలు సింధు : అఛూత్, మిస్ రొస్తుంజీ లతో రమారమి పరిపక్వ దశకు చేరుకున్నది అనవచ్చును. అమర్‌లాల్ హింగోరానీ విఖ్యాతి నొందిన కథ అదో అబ్దుర్‌రహ్మాన్ గురించి ఇంతకు ముందే చెప్పబడింది. దేశ విభజనకు పూర్వముండిన ఇద్దరు ఉత్తమకథా రచయితలు గోబింద్‌లు. గోబింద్ పంజాబీ కథల సంపుటి (1941), సర్ద్ అహూన్‌లో అఖో (ఆశ్రమం), లాటో (దుస్తులు), అటో (నేల), చోర్

(దొంగ) చాలా మంచి కథలు. విభజనానంతర భారతదేశంలోని ప్రముఖ కాల్పనిక రచయిత గోబింద్ మాల్హీ 1944లో అందించిన కథా సంపుటి 'రేనిస్థానీ ఫూల్' (ఎడారి పూలు) లో వారి కథలతో పాటు భగవాన్ లాల్ వానీ రచించిన 'సారీ' (బట్టల కరువు గురించి), రామ్ అమర్ లాల్, సోభోగియన్ చందానీ వంటి అభ్యుదయ రచయితల ఉత్తమ కథలను కూడా చేర్చారు. గోబింద్ మాల్హి వ్రాసిన హరి హక్ దార్ (రైతే హక్కు దారుడు) అన్న నిష్కర్షగా వ్రాసిన కథ 1945లో వెలువడింది, అట్లే వారి 'శాంత' అను మరొక కథ ఇతర కథా రచయితలు కృషిన్‌ఖత్వానీ, ఆనంద్ గొలానీ హెచ్. ఐ. సదారంగానీ, డి.కె. మాన్ షర్మానీ (ఘోటీ రాజా - ది బ్రైడ్ గ్రూం, దిలార్డ్), సుగన్ అహూజా, లేఖూ తుల్సియానీ, (మంత్రి కొల్హిన్ - నిమ్న జాతిస్త్రీ), లఖ్‌మన్ రాజ్‌పాల్.

నవలలకు, కథలకు అనువాదాలు యీ కాలంలో వందలాది వచ్చాయి. బంకిం, టాగూర్, ప్రేమ్‌చంద్, శరత్‌చంద్ర వంటి నవలా కారులు, కథా రచయితల అనువాదాలకు మంచి ఆదరణ లభించింది. గాని యే ఒక్క అనువాదమూ సాహిత్యపరంగా తృప్తిగా లేదు. గిద్వానీలు కొన్ని ప్రామాణిక గ్రంథాలను అనువదించారు. వాటిలోని వచన రచనా విధానం చెప్పుకో తగ్గదిగా ఉన్నది. విక్టర్ హ్యూగో లే మిసరబుల్స్‌కు ఎం.ఎం. గిద్వాని అనువాదం 'దుఖి ఇన్‌సాన్', కాళిదాసు విక్రమోర్వ శీయం, కుమార సంభవం అనువదించినవి. టి. గిద్వానీ, టాల్‌స్టాయ్ కథ లను మూడు సంపుటాలలో అనువదించిన సేవారాం లాలా అనువాదం - వీటిలోని వచనం పాఠకులను ఆనంద పరవశులను చేసింది.

### సింధీ నాటకం 1907 - 1957

1907 - 1957 మధ్యకాలంలో అనేక నాటక సమాజాలు స్థాపించ బడ్డాయి కాని. డి జె. సింద్ కళాశాల ఔత్సాహిక నాటక సమాజం వారి ఉన్నత విజయాలతో పోల్చి చూస్తే ఒక్క సమాజం తప్ప మరెవ్వరూ ఆ స్థాయికి చేరుకోలేదు. ఆ ఒక్కటీ రవీంద్రనాథ్ సాహిత్య, నాటక క్లబ్. దీని గురించి వివర ప్రస్తావింప బడుతుంది.

1897లోనే షికార్ పుర్‌లో ధరమ్ ఉపకర్క్ నాటక సమాజం వెల సి ది ఠాకూర్ దాస్ నగ్రానీ దీనిని చురుకుగా నడిపేవారు. కాని వారిది అ చెప్పబడే ఒక మూల నాటకాన్ని వ్రాయించడం గాని, రంగంపై ప్రద ర్శించడం గాని జరుగలేదు. చంద్కా ఔత్సాహిక నాటక సమాజం వారికి

గొప్పకవిగా పేరొందిన బేవస్ సలహా సంప్రదింపులు, నాయకత్వమూ ఉండేవి. అయితే వారి నలదమయంతి నాటకం యీ సమాజం కార్య కలాపాల ఫలస్వరూపంగా ఉదయించింది అని చెప్పుకోడానికి తప్ప మరి యే ఇతర నాటకమూ ఈ సమాజం ప్రదర్శించలేదు. ఈ నాటకమైనా, బేవస్ సాంప్రదాయానికి చెందినదని గాని మరి యే ఇతర సాంప్రదాయానికి చెందినదనీ గానీ కొనియాడడానికి తగినదిగా లేదు. వారి ఇతర గ్రంథాలతో కలిపి ముద్రించడానికీ వీలుగా లేదు. 'ఖూబ్ సూరత్ నాగిన్' (అందమైన సర్పం) వంటి ఇతర నాటకాలు, కవి చూపించిన కవితా సౌరభాలుఉన్నా నాటకీయత కొరవడింది. కరాచీ సారస్వత్ బ్రాహ్మణ్ నాటక సమాజం (1917) వారు ప్రదర్శించిన చందుమల్ ఖత్రీ 'మనోహర్ మోహిని' వంటి నాటకాలు సాహిత్య పరంగా బాగోలేవు. అట్లే హైదరాబాద్ నాటక సమాజం వంటి వారి సమాజాలు ప్రదర్శించిన లీలారాం ఖారూమల్ నానిక్ రాం ధరందాస్ వంటి రచయితల నాటకాలు రంగస్థలం మీద ప్రజాదరణ పొందదగినవిగా గాని, గ్రంథాలయాలలో ఉంచ దగినవిగా గాని ఎంత మాత్రమూ లేవు. నానిక్‌రాం వ్రాసిన 'ఫ్రైబిఫిత్నా' (మేరీకారెల్లీ వెండెట్టాకు అనుసరణ) గాని, లీలారాం వ్రాసిన 'బేఫావ కాతిల్' (కృతఘ్నుడైన హంతకుడు) గాని, ఉద్రిక్తపరిచే కథావిధానం ఉన్నదని మాత్రమే చెప్పదగినవి. జెఠానంద్ నగ్రానీ 'ఘంటూ' నాటకాలు, హాస్య ప్రహసనాలుతప్ప వాటిలో సాహిత్య విలువలు లేవు.

ఇతర రంగాలలో సుప్రసిద్ధులైన కొందరు రచయితలు ఆంగ్లం నుండి 'షా' ఆధారంగా నాటకాలు వ్రాయడానికి ప్రయత్నించి విఫలులవడం ఆశ్చర్యకరం. ఒకరిద్దరు మాత్రం విజయం సాధించారు. జెఠ్‌మల్ పర్సరాం హేమ్లెట్ అనువాదం, ఒక దుర్బలమైన ప్రయత్నం. అట్లే ఖీరుమల్ మహీర్‌చంద్ కింగ్ జాన్ అనువాదం విఫలమయింది. లాల్‌చంద్ అమర్ దినోమల్ షా ససూయి పున్‌హూన్, సుహ్నిమెహర్‌లలో వారి వచన రచనా స్థాయికి చేరుకోలేకపోయారు. తీర్థ వసంత్ చేసిన రవీంద్రుని 'చిత్ర'లో గాని, షేక్స్పియర్ 'ఆంటోనీ క్లియోపాట్రా'లో గాని నాటక వాసనలు లేవు. కళ్యాణ్ అద్వానీ శకుంతల (1943) అనువాదం కాళిదాసు ఔన్నత్యాన్ని కొంచెమైనా గుర్తుచేయదు. ఉస్మాన్ అన్సారీ షేక్స్పియర్ వ్రాసిన 'సింబెలైన్'కి అనువాదం 'జుర్మ్ బేవఫా' గాని, గుమ్‌రాహ్ దోస్త్ (టూ జెంటిల్‌మన్ ఆఫ్ వెరోనా (Two Gentlemen of Verona) గాని అంత విజయవంతం కాలేదు.

సింధీ నాటక రంగంలోని విశిష్ట రచయితలు కె.ఎస్. దర్యానీ, ఎం.యు. మల్కానీ నాటకాలు కాక ఇతర విజయవంతమైన నాటకాలు లాల్‌చంద్ అమర్ డినోమల్ వ్రాసిన (1) ఉమర్ మరూయీ (1925) ఇది టాగూర్ క్లబ్ వారి అధ్వర్యంలో ప్రదర్శింపబడి, సింధీలో మరే ఇతర నాటకమూ పొందనంతగా ప్రజాదరణ పొందింది. దానికి మరొక కారణం ఈ నాటకంలో షా పద్యాలు కూడా చేర్చబడడం. (2) హిక్‌రాత్ (ఒకరాత్రి) షా, లైలా ఖానెసర్‌కు 1936 లో చేసిన అనుసరణ లీలారాం ఫేర్‌వానీ చేసినది. అమూల్యమైన కంఠహారం తెచ్చిన కౌన్ రూ పాత్రచిత్రణలో ఒక వింత మలుపు తెచ్చారు. పాపం! హేమిల్‌టన్ ఒకే ఒక్క ప్రసంగం ప్రదర్శన లాగున ఫేర్‌వానీ నాటకం ఇది ఒక్కటే, వారుమరి వ్రాయలేదు. (3) రామ్ పంజ్వానీ వ్రాసిన ముమల్ రానో రంగస్థలం మీద, గ్రంథాలయాలలోనూ తగు మాత్రమైన విజయం పొందినది. (4) మహమ్మద్ ఇస్మాయిల్ ఉర్సానీ వ్రాసిన పటిష్టమైన నాటకం 'బద్‌నసీబ్ థారీ' (1941) ఈ నాటకం విద్యాశాఖాధికారులను రంజింప చేయడానికి ఉద్దేశించి వ్రాయబడినప్పటికీ, చాలా విస్తృతమైన ప్రజాదరణ పొందింది. ఇందులో భ్రష్టులై, జాప్యం చేసే అధికారుల చేతులలోపడి నిరుపేద 'థారీ' ఎట్లా ఇక్కట్ల పాలైనాడో వర్ణించిన చిత్రణ, మనోజ్ఞమైన 'థారీ' జానపద శైలి, మాటలూ ఉన్నాయి.

చివరగా ఆర్. ఐ. డి. సి. అంటే టాగూర్ క్లబ్‌ను సర్వసామాన్యంగా వ్యవహరించే నామం, దాని వ్యవస్థాపకులు కె. ఎస్. దర్యానీ, వి. యు. మల్కానీ. దాని అతి తక్కువ జీవిత కాలం (1923-31)లో సఫలవంతమైన నాటకాలు ప్రదర్శించుటలో ఈ క్లబ్బు నిర్వహించిన పాత్ర విశిష్టమైనది. వారు కూర్చినవన్నీ విలువైనవీ; నైతికంగా ఉన్నతమైనవీ కాకపోవచ్చును. ఉదా॥ మతిహీన్ నారీ (నీచమైన ఆలోచనలు గల స్త్రీ) గుజరాతీ నాటకం ఏక్ భూల్ నుండి తీసుకున్నది. తులసి తన భర్తను చంపిన శంభాజీని, పగతీర్చుకొనే ఉద్దేశంతో, అతనిని ప్రేమించి ఉంపుడుగత్తెగా ఉంటుంది ఈ నాటక కథలో. కాని ఆర్.ఐ.డి.సి. వారు ప్రదర్శించే నాటకాలు విధిగా అత్యుత్తమమైనవిగానే ఉంటాయి

సింధీ నాటక చరిత్రలోను, చలన చిత్ర పరిశ్రమలోను ప్రముఖ పాత్ర వహించిన కె. ఎస్. దర్యానీ 1923లో రెండు నాటకాలద్వారా ప్రాముఖ్యత సంపాదించారు. ఈ రెండు నాటకాలూ సామాజిక సమస్యల ఆధారంగా వ్రాసినవి. 'దేతీలేతీ' వరకట్న సమస్య వంటిది: మోతీయాన్

జి-ముఖరీ (మోతియా మొగ్గలు), గులాబ్ బోగుల్ (గులాబి పువ్వు) వారిదే అంతకు పూర్వం వ్రాసిన నాటకం గలత్ ఫహమీ (అపార్థము) 1921లో హెన్రీవుడ్ వ్రాసిన ఈస్ట్‌లిన్ ఆధారంగా వ్రాసినది. ఆర్.ఐ.డి.సి. వారి ఆధ్వర్యంలో విజయవంతంగా వారు ప్రదర్శించిన నాటకం ఇబ్సెన్ వ్రాసిన పిల్లర్స్ ఆఫ్ సొసైటీకి అనువాదం. 'ముల్క్-జ-ముదబర్' మోరిస్ మెటర్లింక్ వ్రాసిన మొన్నావన్నా నుండి గ్రహించి వ్రాసినది 'దేశ్ తన్ సర్కే' (దేశం కొరకు వధ్య శిలపై త్యాగం) అన్నది. ఇవి గ్రుడ్డిగా మూలానికి కట్టుబడి అనువదించిన నాటకాలు కావు. వాటిలో దర్యానీ చాలవరకూ మనకు కనబడుతారు. 'దేశ్ తన్ సద్‌కే' పుస్తకం ముందు మాటలో రాజ పుత్రులనూ, వారి ఆచార వ్యవహారాలు దేశానికి ఎంత హానికరంగా ఉన్నాయో చెపుతూ 'ఈ దురాచారాలు రాజపుటానాకు తక్కువ హాని కలిగించలేదు' అంటారు. దర్యానీ డజన్ల కొద్దీ నాటకాలు వ్రాశారు. అన్నీ ముఖ్యమైనవేకావు. మతిహీన్ నారీ (1929) గురించి ఇదివరకే ముచ్చటించడం జరిగింది. లాల్‌చంద్ అమర్ దినోమల్ వ్రాసిన ఉమర్ మరూయీకి వచ్చినంత ప్రజాదరణ దర్యానీ నాటకాలలో దేనికీరాలేదు. కాని ఆర్.ఎల్.డి.సి. సంస్థ వ్యాపకాలకు వారు యంత్రంలాగా పనిచేసి సింధీయులకు నాటకం యొక్క విలువను గురించీ, ఆ రాష్ట్ర జీవనానికి, సాహిత్యానికి నాటకం యొక్క మహత్వపూర్ణమైన ప్రాముఖ్యతను గురించి తెలియ జెప్పిన మొదటివారు.

ఇబ్సెన్‌ను సింధీ నాటక రంగానికి అనుసరణీయంగా మలచిన మరి యొక నాటక కర్త అహమద్ చాగ్లా. వారు భూత్ (దయ్యాలు), దేశ్ జో దుష్మన్ (ప్రజలకు శత్రువు), ఆర్. ఎల్. డి. సి. వారు వివరగా ప్రదర్శించిన 'ఖూనీ' (1913లో) వ్రాశారు.

ప్రాముఖ్యతలో అధికులైనా, ప్రస్తావనలో వివరగా చెప్పుకొన దగిన వారు ఎం. యు. మల్కానీ. వీరు కె. ఎస్. మల్కానీకి సమర్థులైన అను చరులే కాక, ఏకాంకికలను సింధీలో ప్రవేశ పెట్టినవారుకూడా. అర్థ శతాబ్దం పాటు నిర్విరామంగా సింధీ నాటక రంగానికి సేవచేసిన వారు. ఈ సంవత్సరం కూడా (1967) వారు నాటకాల పుస్తకాన్ని అందించారు. వారి మొదటి నాటకాలు ఆంగ్ల నాటకాలను అనుసరించి వ్రాసినవే. కిస్మత్ (నోబ్లాక్ వ్రాసిన అదే పేరుతో నున్న నాటకం నుండి) 1923లో వ్రాసినది, ఏక్ తా - జో - అలాప్ (ఏకత్వము యొక్క ఆలాపన) జాంగ్ విల్ వ్రాసిన మెల్టింగ్ పాట్ (Melting Pot) కి అనుసరణ. కాని వారు

